1

# స్వభావము

అమెరికా యునైటెడ్ స్టేట్సుకు అధ్యక్షుడుగా నాలుగు వరసలు ఎన్నుకోబడి, 1933 నుంచి 1945 వరకు అమెరికా రాజ్యాంగ నిర్వాహకుడుగానూ, రెండవ ప్రపంచయుద్ధ విజయానికి కర్ణధారిగానూ ప్రపంచ విఖ్యాతిపొందిన మహాపురుషుడు ఫ్రాంక్లిన్ డిలానో రూజ్వెల్టు. 1882 లో న్యూయార్కులో జన్మించి, ప్రపంచం కనివిని యెరుగని ఆర్థిక మాంద్య పరిస్థితులలోను, ప్రపంచం కనివిని యెరుగని ఘోర యుద్ధకాలంలోను అమెరికా అధ్యక్షుడుగా ఉండటం రూజ్వెల్టుకే దక్కింది. తన పదవిని సార్థకంచేసి, ప్రపంచంలో అనేక కోట్లమందిచేత ప్రేమింపబడి, అనేక మంది ద్వేషానికికూడా గురి అయి యీ మహావ్యక్తి అస్తమించాడు.

రూజ్వెల్టు మహాపురుషులలో ఒకడా? సందేహంలేదు. ఆయన గొప్పవాడవడానికి కారణాలు ఏమిటి? ఈ కాలపు మానవజీవితాలను బట్టి చూస్తే, రూజ్వెల్టు జీవితం అసాధారణమైనది. దానికి కారణాలు ఏమిటి? యువకదశలో ఏమంత ప్రజ్ఞావిశేషాలు చూపని యీ వ్యక్తి ప్రపంచ మహావ్యక్తులలో ఒకడెలా అయాడు?

పధ్నాలుగుకోట్ల అమెరికన్ ప్రజల శక్తిని అతడు ప్రపంచపు నలుదెసలకూ ప్రవర్తింప జేశాడు. ఈ మహాశక్తి తనకున్నదని ఆయన గ్రహించడమే కాక, దానిని తన దేశంకోసమూ, తను నమ్మిన లక్ష్యాలను ప్రపంచంలో వ్యాపింప చెయ్యడానికీ ఉపయోగించాడు.

రూజ్వెల్టుకుగల గొప్ప గుణాలన్నిటిలోను ప్రధానమైనది అతని మానవత్వము. అతడు ఏ పనిచేసినా దానివల్ల ఎంతమంది మానవులకు ప్రయోజనం కలుగుతుందో ఆలోచించేవాడు.

అయినప్పటికీ, అతనిని ద్వేషించేవారు చాలామంది దేశంలో ఉన్నారు. అతనిపేరు చెపితే ఇప్పటికీ దుమ్మెత్తి పోసేవారున్నారు. ఎంచేత! కలిగినవారి కలిమిని కొంత లేనివారికి ఉపయోగించేటట్లు చెయ్యడమూ, తాను చనిపోయినా తన కృషి నశించకుండా చెయ్యడమూ

ఆయన గొప్పతనానికి పునాదులు. అవే ఆయనను చాలమందికి కిట్టని వాడుగా చేసిన దోషాలు.

వెన్నెలవలె చల్లదనాన్ని గలిగించే ఆయన చిరునవ్వు, ఒకొక్కప్పుడు తెచ్చిపెట్టుకున్నదయినా, ప్రజలకు ఆశనూ, భవిష్యత్తుపట్ల విశ్వాసాన్నీ కలిగించేది. సాధారణంగా ఉపన్యాసం ఇచ్చేటప్పుడు ప్రజలను ఉద్దేశించి అతడు "మిత్రులారా" అని సంబోధించేవాడు. ప్రజలు అలాగే ప్రవర్తించేవారు. అనుచరులుగా కాక, ఆప్తులుగా అతని ప్రక్కన నిలబడేవారు.

స్వతహాగా తను సామాన్యుడు కాకపోయినా, రూజ్వెల్టు సామాన్య ప్రజలకోసం పనిచేశాడు. మాంత్రికుడు తనచేతి దండంతో పక్షులను సమ్మోహితులను చేసినట్లుగా, అమెరికా ప్రజలను రూజ్వెల్టు తనవారిగా చేసికొని, తనతోపాటు నడిపించాడు. హోరున వాన కురుస్తూవుంటే, నడవలేని యీ మనిషిని (రూజ్వెల్టుకు పక్షవాతం వచ్చి, కాళ్ళు అవిటి పడ్డాయి) ఒక్కసారి స్పృశించి తమ జన్మను పునీతం చేసుకొందామని వేలకొలది స్త్రీ-పురుషులు త్రొక్కిడిలో ఉక్కిరిబిక్కిరి అయేవారు.

రాజనీతిజ్ఞులలో ప్రథమశ్రేణిలో నిలబడడానికి రూజ్వెల్టుకు ఆరు ప్రత్యేక అర్హతులు ఉన్నాయి. అవేమిటంటే: "ధైర్యము; ఓరిమి; సమయజ్ఞత; అతిస్వల్ప విషయాలు మహాకార్యాలకు ఎలా ఉపయోగిస్తాయో గ్రహించడం; ఉన్నతాశయాలు; ఆదర్శసిద్ధికి కృషి చెయ్యడంలో స్థిర సంకల్పము; ఇతరులకు స్థిర సంకల్పాలను కలిగించడం."

రూజ్వెల్టుకు కొన్ని లోపాలు లేకపోలేదు. అవి ఇవి: తాత్సారము, మొగమోటము; కొంతమంది వ్యక్తులపట్ల ఉదార శూన్యత; ఎవరికీ స్పష్టంగా "నాస్తి" అని చెప్పక ఆశపెట్టడం; అతి వాగుడు.

ఏమయినా, రూజ్వెల్టు ఒక చారిత్రిక బాధ్యతను నిర్వహించాడు. అతడు సాధించిన విజయాన్ని చరిత్ర తలక్రిందులైనా ప్రపంచం మరిచిపోదు. అమెరికాలోనే గాక, ప్రపంచం అంతటా కొన్ని కోట్లమంది

ప్రజలు అతనిని ప్రేమించారు. అతని సుగుణాలంతోనే అతని స్మృతిని గౌరవిస్తున్నారు.

రూజ్వెల్టు తన జీవిత కృషినంతటినీ దేనికోసం ధారపోశాడు. అంటే స్పష్టంగా నిర్దేశించి చెప్పడానికి ఏమీ కనపడదు. కాని, అతని కృషి ఫలితంగా, ప్రపంచంలో అవసరమైన కొన్ని ధర్మాలు అంత మొండిగుండా నిలచాయి. అతనికి పూర్వం లేనిదానిని క్రొత్తగా అతను దేనీ సృష్టించలేదు. అతడు విశేష మేధావి కాదు. అయితే, రూజ్వెల్టు చేసిన పనులు. అతడు సాధించిన ఫలితాలు మాత్రం అతనికి ప్రపంచ-మహాపురుషులలో ఒకస్థానాన్ని చేకూర్చాయి.

ఫలాని ఫలితాలను పొందడం ఎలాగ అనే ఆలోచనలు తప్ప ఫలితాల తత్త్వము. కృషి తత్త్వము ఎలా ఉండాలనే మీమాంసలో రూజ్వెల్టు బాధపడేవాడు కాదు.

## తియొడోర్ - ఫ్రాంక్లిన్

1901 నుంచి 1909 వరకు అమెరికా అధ్యక్షుడుగా ఉన్న తియొడోర్ రూజ్వెల్టుకు, ఆ రోజులలో ఎవరైనా అతని అయిదు వేళ్ళ విడిచిన జ్ఞాతి ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు అమెరికా అధ్యక్షుడుగా నాలుగుసార్లు ఎన్నుకోబడుతాడని చెప్పివుంటే, బహుశా అతడు చీదరించుకొని ఉండేవాడు. అయినా, రూజ్వెల్టుపట్ల తియొడోర్కు ప్రత్యేక అభిమానం. తియొడోర్ పట్ల రూజ్వెల్టుకు చాలా గౌరవమూ, ప్రశంసాభావమూ ఉండేవి.

ఈ ఇద్దరు రూజ్వెల్టుల జీవితాలకూ చాలా పోలికలు ఉన్నాయి. ఇద్దరూ అమెరికా వచ్చి ఐశ్వర్యంపొందిన డచ్చి కుటుంబంవారే. ఇద్దరూ న్యూయార్కు రాష్ట్రంలో జన్మించినవారే. ఇద్దరూ హార్వర్డ్ యూనివర్శిటీలో చదువుకున్నవారే. ఇద్దరూ తమ రాజకీయ జీవితాలను న్యూయార్కు-రాష్ట్ర శాసన సభలోనే ప్రారంభించారు. ఇద్దరూ అమెరికా ప్రభుత్వ నౌకాశాఖలో అసిస్టెంటు శెక్రటరీలుగా పనిచేశారు. ఇద్దరూ

న్యూయార్క్ గవర్నర్లుగా ఉన్నారు. ఇద్దరూ చివరకు అమెరికా అధ్యక్షులయారు. వారి రాజ్యాంగ విధానాలుకూడా చాలావరకూ ఒకే ధోరణిలో ఉండేవి.

ఆస్తులను పెంచుకొని, సామాన్య ప్రజలను అణగ ద్రొక్కడానికి ప్రయత్నించేవారిని అణగ గొడతానని తియొడోర్ స్పష్టంగా చెప్పేవాడు. రూజ్వెల్టు అంత ఎక్కువ తీవ్రధోరణిలో మాట్లాడేవాడు కాదు. కాని అతని ధ్యానాలుకూడా సామాన్య ప్రజల మేలునే కోరేవి.

ఇద్దరూ భాగ్యవంతులే. ఇద్దరూ తీవ్రమైన జబ్బులతో బాధపడినవారే. తియొడోర్ ఉబ్బసంతో ఉక్కిరి బిక్కిరి అయ్యేవాడు; రూజ్వెల్టు పక్షవాతంతో నడవలేని అవిటివాడయాడు. ఉభయులకూ నౌకాదళం పట్ల అత్యంత అభిమానం ఉండేది. ఇద్దరూ కుటుంబంపట్ల అపేక్ష, పిల్లల మీద ప్రేమ కలిగినవారే. ఉభయులూ గట్టిగా పైకి చదవడం అంటేనూ, భోజనం చేసేటప్పుడు ఇతరులతో బేరాలను ముగించుకోవడం అంటేనూ, వనభోజనాలకు వెళ్ళడం అంటేనూ సరదా పడేవారు. ఇద్దరికీ దుక్కలను పెంచడం మీద మోజు ఉండేది.

అయితే, ఇద్దరిలోనూ తేడాలు లేకపోలేదు. తియొడోర్ ది దబాయింపు తత్వం; రూజ్వెల్టులో మెత్తదనం ఎక్కువ. తియొడోర్ చాలా కష్టపడి పనిచెయ్యగలడు; అధ్యక్షుడుగా ఉన్న ఏడు సంవత్సరాలలోనూ అతడు లక్ష ఉత్తరాలను వ్రాశాడు; ఒక రాత్రిలో మూడు నాలుగు పుస్తకాలను చదవ గలిగేవాడు. తియొడోర్ కి రోజుకి ఆరు గంటల నిద్ర చాలేది. రూజ్వెల్టు ఎనిమిది గంటలసేపు పడుకొనేవాడు. ఆటంకాలు ఏవైనా తన దారిలోవుంటే వాటిని ఎదుర్కొని గెలవడంలో తియొడోర్ కు ఉత్సాహం ఉండేది. ఆటంకాలు రాకుండా, ఎలాగైనా తన దారిని ఇబ్బందిలేకుండా చూసుకోవాలని రూజ్వెల్టు జాగ్రత్త పడేవాడు.

రూజ్వెల్టు తియొడోర్ ల స్నేహసంబంధాలు చిరకాలం ఏ పొరపొచ్చెమూ లేకుండా నిలిచాయి. తల్లిదండ్రులు ఇద్దరూ లేని ఎలియనార్ ను

రూజ్వెల్టు పెళ్ళి చేసుకున్నప్పుడు, కన్యాదాతగా ఉన్నవాడు ఆ నాటి అమెరికా అధ్యక్షుడు థియొడోర్.

1917 సంవత్సరం తరవాత రూజ్వెల్టు, థియొడోర్‌ల స్నేహం క్రమక్రమంగా సన్నగిల నారంభించింది. అయినా, థియొడోర్‌తో గల సంబంధబాంధవ్యాలవల్ల అతని లక్షణాలు, భావాలు చాలావరకు రూజ్వెల్టుకు పట్టుబడ్డాయి.

# విల్సన్ - రూజ్వెల్టు

అలాగే ప్రెసిడెంటు విల్సన్ ముద్రకూడా రూజ్వెల్టు మీద చాలా పడింది. విల్సన్ రూజ్వెల్టులకు ముద్రకూడా చాలా పోలికలు ఉన్నాయి. ఈ ఉభయులూ కూడా మోతుబరి కుటుంబాలలోని వారే; ఉభయులూ ప్రజాసామాన్యంకోసం పాటుపడిన వారే. అంతేకాదు. ఉభయుల జీవితాలలోనూ, ఉభయుల ప్రెసిడెంటుగిరీలోనూ, ఉభయులు అనుసరించిన పద్ధతులలోనూ, అవలంబించిన ఆశయాలలోనూ చాలా పోలికలు ఉన్నాయి.

ఇద్దరూ తమ పదవులను, దేశీయ వ్యవహారాల చిక్కులను విడదియ్యడంతోనే ప్రారంభించారు. ఇద్దరి పదవీ కాలంలోనూ విదేశ సమస్యలు, ప్రపంచ యుద్ధం సంభవించాయి. ఇద్దరూ యుద్ధాన్ని గెలవడం విషయంలోనే కాక, యుద్ధానంతరం శాశ్వత శాంతి స్థాపనకోసమని పునాదులు వేసిన వారే.

రూజ్వెల్టుకంటె విల్సన్ ఎక్కువ మేధావి. తన మేధను అతడు చిత్రవిచిత్ర గతులలో వినియోగించాడు. ఒక ఉపన్యాసాన్ని తయారు చెయ్యాలంటే రూజ్వెల్టు అధమం అరడజనుమంది వ్యక్తులకు పనికల్పించే వాడు. అలా చెయ్యవలసిన అవసరం విల్సనుకు ఎప్పుడూ ఉండేదికాదు. అయితే, యీ యిద్దరిలోనూ రూజ్వెల్టు ఉత్తమ రాజకీయవేత్త. తన సమీప బంధువర్గంలోనివాళ్ళని తప్ప తక్కినవారి నెవరినీ విల్సన్ ఎక్కువ చనువుగా పలకరించేవాడు కాదు. ఎంత కొత్తమనిషి వచ్చినా, మొదటి

సంభాషణలోనే అతనిని యింటిపేరు వదలివేసి అసలు పేరుతో పిలిచేవాడు రూజ్వెల్టు.

విల్సన్‌కు ప్రజలంటే అపరుగా ఉండేది. రూజ్వెల్టు ప్రజలంటే చాలా మోజుపడేవాడు. విల్సన్‌కు రాజకీయాలు కిక్కేవి కావు. రూజ్వెల్టుకు రాజకీయాలు పంచప్రాణాలలో ఒకటిగా ఉండేవి.

విల్సన్ తన అనుచరులను ఆజ్ఞాపించి పనులు చేయించుకొనేవాడు. రూజ్వెల్టు బుజ్జగింపులతో తన పనులన్నిటినీ జరుపుకొనేవాడు.

అధ్యక్ష పదవికి రాకపూర్వం రూజ్వెల్టు పక్షవాతంతో, అవిటివాడయితే, అధ్యక్షుడుగా ఉండగా, 1919 లో విల్సన్‌కు పక్షవాతం వచ్చి మంచ మెక్కాడు.

రూజ్వెల్టు అనేక క్లబ్బులలో సభ్యుడుగా ఉండేవాడు. క్లబ్బులను మూయించడానికి పట్టుపట్టేవాడు విల్సన్.

ఏ తేడాలు ఉన్నా; రూజ్వెల్టుకు థియొడోర్ పట్ల ఎంత గౌరవభావం ఉండేదో, విల్సన్ పట్ల అంత ఉండేది.

మొదటి ప్రపంచయుద్ధం (1914 - 18) ప్రారంభమైనప్పుడు, విల్సన్ అలాటి సంఘటన జరుగుతుందని అనుకోలేదు. "ఈ యుద్ధంలో తటస్థులుగా ఉండ" మని అమెరికన్ ప్రజలను హెచ్చరిస్తూ అతడు యుద్ధం ప్రారంభమైన వెంటనే ఒక ప్రకటనకూడా చేశాడు. రూజ్వెల్టు ఎంత మాత్రమూ అలా చేసేవాడు కాడు. తగినంత కారణం లేకనే ఆ యుద్ధం ప్రారంభమైనదనీ, అటు మిత్రమండలికీ, ఇటు జర్మనీకీ మధ్య ప్రత్యేకం అభిమానించి సహాయం చేయవలసినవారు అమెరికా కెవరూ లేరనీ విల్సన్ అనుకొనేవాడు. రూజ్వెల్టుమాత్రం, మొదటినుంచీ మిత్రమండలిపట్ల స్పష్టంగా అభిమానం చూపేవాడు.

దేశీయ వ్యవహారాలలో రూజ్వెల్టు అవలంబించిన నూతన ఆర్థిక విధానానికి ముందుదారి చూపినవాడు విల్సన్. ఏమంటే, ఫెడరల్ రిజర్వు బ్యాంక్ పద్ధతి, పెద్దపెద్ద వ్యాపారులంతా కూడలిగా ఏర్పడి

వ్యాపారాన్ని పూర్తిగా తమ కైవశం చేసుకోవడాన్ని ప్రతిఘటించడం, రైతులకు ప్రభుత్వం అప్పులు ఇవ్వడం, రైల్వే పనివారల పని రోజుకు ఎనిమిది గంటలకంటె ఎక్కువ ఉండకూడదని నియమించడం, అన్నిటికంటె ముఖ్యమైనది ఇన్‌కంటాక్సు విధించడం - ఇవన్నీ కూడా విల్సన్ ప్రెసిడెంటుగా ఉండగానే ప్రారంభమయాయి.

విల్సన్ అంతర్జాతిసమితిని సృష్టించాడు; రూజ్వెల్టు సంయుక్తరాజ్య సమితిని సృష్టించాడు. విల్సన్ ఒక గొప్ప పొరపాటు చేశాడు. అంతర్జాతిసమితి సృష్టికోసం కృషిచెయ్యడంలో, విల్సన్ యునైటెడ్ స్టేట్సును మరచిపోయాడు. ఈ పొరపాటును రూజ్వెల్టు చెయ్యలేదు. అంచేతనే, అంతర్జాతిసమితి ప్రతిపాదనను అమెరికా సెనెట్ నిరాకరించింది; సంయుక్త రాజ్యసమితిని సెనెట్ బలపరచింది. అమెరికా శాసనసభలు తన ప్రతిపాదనలను బలపరుస్తాయనే విశ్వాసం గట్టిగా కుదిరిన తరువాతనే, అమెరికాను అంతర్జాతీయ రంగంలోకి తీసుకువచ్చాడు రూజ్వెల్టు.

# రూజ్వెల్టు - చర్చిల్

రూజ్వెల్టుకీ చర్చిల్‌కీ చాలా పోలికలు వున్నాయి. కాని, చర్చిల్ రూజ్వెల్టు కంటె ఎక్కువ తెంపుగలవాడు; సాహసించి పనులు చేసేవాడు. అంచేత, లాభంకూడా ఎక్కువగానే పొందేవాడు. 1913లో యుద్ధంలో చేరకపోతే డార్డెనెల్సును రష్యాకు ఇచ్చివేస్తానని టర్కీని బెదరించి, మిత్రమండలి తరఫున టర్కీని యుద్ధంలోకి దింపాడు చర్చిల్. ఇలాటి బుకాయింపును రూజ్వెల్టు ఎంతమాత్రం ఉపయోగించేవాడు కాదు.

చర్చిల్ చాలా చక్కని భాషను, ఊహలతో బిగించి వ్రాశేవాడు. చారిత్రిక సంఘటనలను చర్చిల్ బాగా అవగతం చేసుకొనేవాడు. వాగ్వాదాలలో జొరబడటమంటే చర్చిల్‌కు సరదా.

శాస్త్రజ్ఞులంటే రూజ్వెల్టుకి ఎక్కువ అభిమానం ఉండేదికాదు. ఏటంబాంబును తయారు చేయించడంలోనూ, దానిని ప్రయోగించడం లోనూ

రూజ్వెల్టు వహించినంత బాధ్యత ప్రపంచంలోని ఏ ఒక వ్యక్తీ వహించలేదు. అయినా అతనికి శాస్త్రజ్ఞులంటే ఎక్కువ ఇష్టం ఉండేదికాదు. శాస్త్రజ్ఞులెవరినీ ఎక్కువగా తన సమీపంలో ఉంచుకొనేవాడు కాదు. చర్చిల్‌కు శాస్త్రజ్ఞులంటే అపరిమితమైన ఇష్టం. శాస్త్రంలో అతని సలహాదారు షెర్వెల్ ప్రభువు. వీరిద్దరూ శరీరాలు వేరుగాని, ఒకేమనిషి అనేటంత స్నేహంతో ఉండేవారు.

చాలమందికి తెలియదు గాని, రూజ్వెల్టుకీ చర్చిల్‌కీ బంధుత్వం ఉంది. ఈ బంధుత్వం ఎనిమిది తరాల నాటిది. చర్చిల్ తల్లి అమ్మమ్మకి అమ్మమ్మ అమ్మమ్మా, రూజ్వెల్టు తల్లి అమ్మమ్మకి అమ్మమ్మా, ఒకతల్లి బిడ్డలట! చర్చిల్ తల్లి అమెరికా స్త్రీ.

మొట్టమొదటిసారి రూజ్వెల్టు చర్చిల్‌లు యిద్దరూ ఎప్పుడు కలుసుకున్నారనే సంగతి ఎవరికీ స్పష్టంగా తెలియదు. మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతూ ఉండగా, రూజ్వెల్టు ఇంగ్లండు వెళ్ళినప్పుడు, ఒక విందులో రూజ్వెల్టును తాను చూశానని చర్చిల్ అంటాడు. పైగా "అద్భుతమైన అతని రూపం నన్ను ఆకర్షించింది" అనికూడా అంటాడు. అయితే, రెండవ యుద్ధకాలంలో యీ యిరువురూ మొట్టమొదటిసారి కలుసుకున్నప్పుడు, చర్చిల్‌కు పాతసంగతి ఏమీ జ్ఞాపకం ఉన్నట్లు లేదు. ఇది రూజ్వెల్టుకి కొంత బాధకలిగించిందట కూడాను!

అయితే, వీరిద్దరూ స్వయంగా కలుసుకోడానికి పూర్వం, వీరిద్దరికీ మధ్య దాదాపు 1,700 టెలిగ్రాములు, ఉత్తరాలు, సందేశాలు నడిచాయి. వీరిద్దరికి మధ్య నడిచిన మొట్టమొదటి ఉత్తరం రూజ్వెల్టు 1939 లో నౌకాశాఖ మంత్రిగా ఉన్నప్పుడు చర్చిల్‌కు వ్రాసినది. అప్పటినుంచీ అమెరికాకూడా యుద్ధంలో దిగేవరకూ (1941 డిసెంబరు) చర్చిల్, రూజ్వెల్టుకు వ్రాసిన ఉత్తరాలన్నీ రాజకీయ వాదాలతో నిండివున్నాయి. అన్ని ఉత్తరాలలోనూ అమెరికాను యుద్ధంలో దిగమని ప్రోత్సహిస్తూ, అందుకు గల కారణా లన్నింటినీ సహేతుకంగా వివరించేవాడు చర్చిల్. 1940 డిసెంబరులో వ్రాసిన ఉత్తరంలో మిత్రమండలికి అప్పు - కౌలు

పడవమీద అమెరికా సహాయం చెయ్యవలసిన ఆవశ్యకతను నిరూపిస్తూ 19 కాగితాలు పూరించాడు చర్చిల్.

అయితే, చర్చిల్ బుజ్జగింపులకు రూజ్వెల్టు లొంగిపోయాడని ఎవరైనా అనుకుంటే, వారు పొరపాటు పడతారు. చర్చిల్ చాలా తెలివైనవాడే కాని, ప్రధాన ఆశయాలలో తాను అంగీకరించకపోతే ఏ సూచన కయినా రూజ్వెల్టు ఒప్పుకొనేవాడు కాదు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రూజ్వెల్టు, చర్చిలు సుమారు ఒక డజనుసార్లు కలుసుకున్నారు. ఇన్ని సమావేశాలలోను మొత్తంమీద వీరిద్దరూ 120 రోజులు కలిసివున్నారు. ఈ ఇద్దరు వ్యక్తుల సమావేశాలు ప్రపంచచరిత్రను మార్చినంతగా మరే యితర వ్యక్తుల సమావేశాలు ఇంతవరకూ జరగలేదు.

అట్లాంటిక్ ప్రణాళికను ప్రకటించడానికి వీరిద్దరూ సమావేశమైనప్పుడు, సమావేశం అయిన తరువాత ఎవరి బసకు వారు వెళ్ళి తమ ఆప్త అనుచరులను "అతను నన్నుగురించి ఏమనుకున్నాడు" అని ప్రశ్నించారట.

అట్లాంటిక్ ప్రణాళిక అనేది ఒక ప్రత్యేక ఒడంబడికగా సంతకాలు పెట్టిన ప్రతి ఇప్పటికి లేదు. ఆనాడు సమావేశంలో ఇద్దరూ కలిసి పత్రికా ప్రకటనకోసం తయారుచేసిన చిత్తుప్రతిమీద ఉభయులూ పొడి అక్షరాలతో చేవ్రాలు పెట్టారు, అంతే.

తరువాత కొంతకాలానికి యీ ప్రణాళికను గురించి పత్రికా విలేఖరులు ప్రశ్న వేస్తే, రూజ్వెల్టు చెప్పిన జవాబు ఇది: "ఆ ప్రణాళికకు నకలు నాదగ్గర లేదు; బ్రిటిషువారి దగ్గరా లేదు; ఇంకెక్కడకూడా ఉందని నేను అనుకోను."

ఉభయులూ కలిసి యుద్ధాన్ని నిర్వహిస్తూవున్న రోజులలో, ఒకరితో ఒకరు విపరీతంగా వాదించుకొనేవారు; పోట్లాడేవారు.

ఇండియాకు స్వాతంత్ర్యాన్ని ఇవ్వమని పట్టు పట్టడంలోను వలస రాజ్యాలలోని ప్రజలకు స్వపరిపాలన, స్వసంరక్షణ హక్కులను ఇమ్మని కోరడంలోను రూజ్వెల్టు, చర్చిల్ ప్రాణాలను విసిగించేవాడు.

యుద్ధం ముగియవస్తున్న రోజులలో చర్చిల్‌ను గురించి మాట్లాడుతూ, బ్రిటిషు సామ్రాజ్యం విషయంలో చర్చిల్ చాలా పాతకాలపు పద్ధతులు అవలంబిస్తున్నాడనీ, ఎంత చెప్పినా ఏమి చేయ్యకోడనీ రూజ్వెల్టు అన్నాడు.

"బ్రిటిషు సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చెయ్యడానికి అమెరికా పన్నుగడ వేసిందని చర్చిల్ అనుకొనేవాడు" అని హారీ హాప్కిన్సు ఒకచోట వ్రాశాడు.

"వలస రాజ్యాలలోని ప్రజల జీవితాన్ని బాగుచెయ్యడంలో బ్రిటిషువారు సరిగా పనిచెయ్యలేదని రూజ్వెల్టు స్పష్టంగా చర్చిల్‌కు చెప్పేవాడు" అని ఎలియనార్ రూజ్వెల్టు వ్రాసింది.

చర్చిల్, రూజ్వెల్టుల సమావేశాలలో ఒక పెద్ద ఇబ్బంది ఉండేది. మధ్యాహ్నం భోజనం అయిన తరువాత, రెండు మూడు గంటలు తప్పని సరిగా నిద్రపోవడం చర్చిల్‌కు అలవాటు. పగలు నిద్రపోయి, రాత్రి అంతా కూడా నిద్రలేకుండా పని చెయ్యగలడు చర్చిల్. రూజ్వెల్టు పగలంతా పనిచేసి, రాత్రి పన్నెండు లోపల పడుకోకపోతే తాళలేక పోయేవాడు.

వయసులో రూజ్వెల్టుకన్న చర్చిల్ పెద్దవాడు. అయినా రూజ్వెల్టును గౌరవంతో "మిస్టర్ ప్రెసిడెంట్" అని సంబోధించేవాడు. రూజ్వెల్టు, చర్చిల్‌ను కలుసుకున్న మొదటి క్షణంనుంచీ "విన్‌స్టన్" అని మొదటి పేరుపెట్టి పిలిచేవాడు. విమర్శించేటప్పుడు, చర్చిల్ చాలా మృదువైన భాషతో, మనస్సుకు కష్టం కలగకుండా చెప్పేవాడు. రూజ్వెల్టు చాలా నిశితంగా, త్రెంచివేసినట్లు మాట్లాడేవాడు.

రూజ్వెల్టు ఆరోగ్యం నానాటికీ సన్నగిలుతూవుంటే, చర్చిల్ ఆందోళన పడేవాడు. 1944 ఎన్నికల ప్రచారంలో మంచు కురుస్తూ ఉండగా నగరంలో కప్పులేని కారులో ఉపన్యాసాలు యిస్తూ రూజ్వెల్టు తిరుగుతూ ఉంటే, ఆరోగ్యాన్ని గురించి జాగ్రత్త తీసుకోమని రూజ్వెల్టును హెచ్చరిస్తూ చర్చిల్ టెలిగ్రాం పంపించాడు.

రూజ్వెల్టును గురించి మాట్లాడేటప్పుడు, చర్చిల్ చక్కని పొగడ్తలను విసిరేవాడు. చర్చిల్‌ను ఎగతాళి చేసేటప్పుడు రూజ్వెల్టు చాలా కటువుగా మాట్లాడేవాడు.

సంభాషణలలో ఉపన్యాసం ఆరంభించి దాదాపు అరగంటసేపు చెప్పడం చర్చిల్‌కు అలవాటు. ఒకసారి, యాల్టా సమావేశంలో, ఏదో విషయంమీద చర్చిల్ మాట్లాడడం ఆరంభించేసరికి, రూజ్వెల్టు "ఇదొక అరగంట తోముడు," అని ఒక చిన్న కాగితంమీద వ్రాసి, తన అనుచరులలో ఒకనికి చూపించాడు.

అయితే, ఎంత తీవ్ర వాదోపవాదాలు జరిగినా చివరకు చర్చిల్‌ను ఒప్పించడంలో అత్యంతమైన ప్రతిభ చూపేవాడు రూజ్వెల్టు.

రూజ్వెల్టు మరణవార్త చర్చిల్‌కు పెద్ద కలవరపాటును కలిగించలేదు. ఏమంటే, నానాటికీ చెడిపోతూఉన్న రూజ్వెల్టు ఆరోగ్యం ఎటు ముంచుకుంటుందో అని చర్చిల్ భయపడుతూనే ఉండేవాడు. అయితే, 1945 లో జరిగిన ఎన్నికలలో చర్చిల్ ఓడిపోవడానికి ఒక కారణం, రూజ్వెల్టు లేకపోవడమే. రూజ్వెల్టు బ్రతికి ఉన్నట్లయితే, చర్చిల్-రూజ్వెల్టుల సహకారం వల్లనే యుద్ధంలో గెలుపువచ్చిందనీ, శాంతి స్థాపనకుకూడా వీరిద్దరి సహకారమూ అవసరమనీ బ్రిటీషుప్రజలు చర్చిల్‌ను ఎన్నుకొనేవారు.

కొన్ని సందర్భాలలో చర్చిల్‌ను రూజ్వెల్టు కించపరచి ఉండవచ్చును; బ్రిటిషు సామ్రాజ్యంలో చాలాభాగం స్వాతంత్ర్యం పొందడానికి రూజ్వెల్టు చాలా దోహదం ఇచ్చి ఉండవచ్చును. కాని,

యుద్ధంలో బ్రిటన్ నామరూపాలు లేకుండా పోయే పరిస్థితిలో దానిని పునర్జీవనం కలదానిగా చెయ్యడంలో చర్చిల్ ఎంత కృషి చేశాడో, రూజ్వెల్టుకూడా అంత సహాయపడ్డా డనడంలో అతిశయోక్తి లేదు.

## రూజ్వెల్టు - హిట్లర్

ఒకే ఒక నాటకంలో ఒకదాని కొకటి విరుద్ధమైన రెండు ప్రధాన పాత్రలను నిర్వహించిన ఇద్దరు వ్యక్తులు రూజ్వెల్టు, హిట్లరు. ఈ ఇద్దరికీ ఏ విషయంలోనూ పోలిక లేకపోగా, ఒకరికీ మరొకరికీ భేదాలు చాలా ఉన్నాయి. అయినా, రూజ్వెల్టు గాథలో హిట్లరు ప్రశక్తి అవసరమైంది. ఏమంటే, హిట్లరు పదవిలోకి రావడానికి ఏశక్తులు కారణమో, అలాటి శక్తులే రూజ్వెల్టు పదవిలోకి రావడానికి కూడా కారణమయాయి. విపరీతమైన ఆర్థికమాంద్య పరిస్థితులలో భీతిలిపోయిన ప్రజల భయాతిరేకము, పరిస్థితులు మారాలనే ప్రజల ప్రబలకాంక్ష, తమను ఎలాగైనా రక్షించే నాయకుడు ఎవడినో ఒకడిని వెతుక్కోవడంలో ప్రజలుచూపిన ఆత్రత - ఇవే ఆకారణాలు.

1932 లో రూజ్వెల్టు అధ్యక్షపదవిని గెలవడానికి కారణం, అప్పుడు అధ్యక్షుడుగావున్న హూవర్ ప్రజల అభిమానాన్ని పోగొట్టుకోవడమే. అలాగే, జర్మనీలో కూడా ప్రజలు హిట్లరును గెలిపించడానికి కారణం, అతడు వారికిచేసిన వాగ్దానాలు మాత్రమే కాదు. అప్పటివరకూ జర్మనీని పరిపాలిస్తున్న ప్రభుత్వం చూపుతున్న బలహీనత మీద వారికి అసహ్యంపుట్టి, బలవంతుడెవడైనాసరే అని హిట్లరును గెలిపించారు.

కాని, రూజ్వెల్టు నియంతగా పరిణమించలేదు. అతడంటే కిట్టని వాళ్ళు, అతడుచేసిన కృషిని అర్థం చేసుకోలేని వాళ్ళు, అతనిని నియంత అని నిందించినా, అతడుమాత్రం నియంత కాలేదు; నియంతృత్వం సాగిద్దామని వాంఛించలేదు.

పన్నెండు సంవత్సరాలు ప్రెసిడెంటుగా ఉండి కూడా మళ్ళీ నాల్గోసారి అధ్యక్షపదవికి పోటీచేసినప్పుడు, 1944 లో న్యాయమైన, సహజమైన పద్ధతిలో ఎన్నిక జరిపించి, అతడు గెలిచాడు.

నిజానికి నియంత అవాలనే కోరిక ఉన్నట్లయితే, అతి సులభంగా రూజ్వెల్టు నియంత అయివుండవచ్చును. ప్రజలు ఎన్నుకోగా పదవిలోకి వచ్చాడు. పదవిలో ఉండగా సంపూర్ణాధికారం అతనిచేతిలో ఉంది. దానిని ఉపయోగించి నియంత కావడానికి అతనికి ఆటంకం ఏమీ ఉండేదికాదు. కాని, తన అధికారాన్ని పూర్తిగా వినియోగించడానికే అతడు ఎప్పుడూ యిష్టపడలేదు. రూజ్వెల్టు మొట్టమొదటిసారి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినప్పుడు అమెరికా శాసనసభలు యిష్టపడి రూజ్వెల్టుకు చాలా అధికారాలు యిచ్చాయి. హిట్లరు అధికారంలోకి వచ్చినప్పుడు, జర్మనీ పార్లమెంటు హిట్లరుకు అంత అధికారాన్ని యివ్వలేదు.

అయినా, రూజ్వెల్టు ప్రజాస్వామ్య పరిపాలననే సాగించాడు.

# కొన్ని ముఖ్యగుణాలు

రూజ్వెల్టుకు ఉన్న మంచిగుణాలు ఎక్కువ. అతడికి కొన్ని లోపాలూ లేకపోలేదు. కాని, వాటన్నిటినీ మంచిగుణాలు కప్పివేశాయి.

అతని ప్రధాన సుగుణం, అతనికి ఉన్న ముఖ్యబలం ఏమిటంటే అతని ధైర్యం. చాలా దారుణమైన రోగాన్ని జయించి, ప్రాణాలతో బయటపడడంగాని, తనను ఎవరేమి చేస్తారో అనే ప్రాణభయం లేకపోవడంగాని అతని ధైర్యానికి ప్రధాన తార్కాణాలు కావు. 1933 లో మియామిలో రూజ్వెల్టును హత్యచెయ్యడానికి ప్రయత్నం జరిగింది. ఆ ప్రయత్నంలో చికాగో మేయరు హత్య చేయబడినాడు. అయినా, అక్కడఉన్న గుంపులో ఏ మాత్రం కలవరపాటు లేకుండా ఉన్న వ్యక్తి రూజ్వెల్టు ఒకడే.

తనను ప్రమాదంనుంచి రక్షించడానికి పోలీసులు చేసే ఏర్పాట్లూ, తన కార్యక్రమాలలో వచ్చే నిర్బంధాలూ అతనికి చిరాకు కలిగించేవి. తమవంటికి ఏ ప్రమాదం కలుగుతుందో, తమ ప్రాణాలకు ఏ మోసం కలుగుతుందో అనే భయం ఏమాత్రం లేకుండా పుట్టిన అదృష్టవంతులలో రూజ్వెల్టు ఒకడు. ప్రాణాలంటే భయంలేనివారికి ఊహాశక్తి తక్కువ అంటారు గాని, చాలా గొప్ప ఊహాశక్తిగలవారిలో రూజ్వెల్టు ఒకడు.

అయితే, రూజ్వెల్టుకు నిప్పు అంటే చాలా భయమూ, ద్వేషమూ ఉండేవి. అతడు అవిటివాడు కావడంవల్ల, అతడు కూర్చున్న గదికి నిప్పంటుకుంటే, బయటికి వెళ్ళడం అతడికి సాధ్యంకాదు. అంచేతనే, అతడు ప్రయాణం చేసినప్పుడల్లా, అతడు కూర్చునే రైలుపెట్టెలో దానికి ప్రమాదవశాత్తూ నిప్పంటుకుంటే వెంటనే అతణ్ణి బయటికి తీసుకొని వెళ్ళడానికి వీలుగా, కర్రలుకట్టిన పెట్టెఒకటి ఎప్పుడూ ఉండేది.

సాహసం అనేది అనేక రకాలుగా ఉంటుంది. మాటవరసకి, మొండిసాహసం కొంతమందికి ఉంటుంది. అలాంటి సాహసం అంటే రూజ్వెల్టుకు కిట్టేదికాదు. కాని, సాహసించి ఫలితాన్ని దృష్టిలో పెట్టు

కాని, ఎంతోమంది వద్దని చెప్పినాసరే తనకు మంచిదనితోచిన మార్గంలో నడవడంలో రూజ్వెల్టు ప్రసిద్ధుడు. ఒకసారి తనకు మంచిదని తోచిందంటే, తన నిర్ణయాన్ని అవలంబించడంలో అతడు ఏమాత్రమూ వెనుకాడేవాడు కాదు.

డన్‌కిర్క్ వద్ద బ్రిటిషు సైన్యాలు ఓడిపోయి ఫ్రాన్సునుంచి తిరిగిపోయిన తరువాత, బ్రిటిషువారికి ఆయుధ సామగ్రిని యిచ్చి బ్రిటనును కాపాడడానికి అతడు స్వయంగా తానే నిర్ణయించాడు. 34 మంది సీనియరు ఆఫీసర్లమీద, జనరల్ మార్షల్‌కు పై హోదా యివ్వడంలోనూ, 366 మంది సీనియర్ ఆఫీసర్లమీద జనరల్ ఐసెన్ హోవర్‌కు పై హోదా యివ్వడంలోనూ, నూరుకోట్ల డాలర్లను ఖర్చుపెట్టి ఏటం బాంబును తయారు చేయించడంలోనూ అతడు తానే నిర్ణయాలను చేశాడు.

జపాను యుద్ధంలో దిగి పెరల్ హార్బరుమీద విమానదాడి జరిపిన నాడు, వాషింగ్టన్‌లోని ప్రజలు పిచ్చెక్కిపోయారు. ఏదో భూకంపం వచ్చి వాషింగ్టన్ తిరగబడి పోయినట్లుగా ప్రజలు అలజడి బడిపోయారు. అయినా, ఏ మాత్రం కలవరంలేకుండా ప్రశాంతంగా ఉన్న స్థలం, ఆనాటి వాషింగ్టన్‌లో ప్రెసిడెంటు భవనమే. ప్రజలు ఉద్రేకంలోనూ, కలవరంతోనూ కంపించిపోతూ ఉంటే, వాళ్ళకి ధైర్యాన్ని కలిగించిన వాడు రూజ్వెల్టు.

కాని, జపాను యుద్ధంలోకి వచ్చినందువల్ల కలిగే ఫలితాలను గాని, పెరల్ హార్బరుమీద జపాను దాడిచేసినందున కలిగే నష్టాన్ని గాని అతడు తెలుసుకోక పోలేదు. పైగా, రూజ్వెల్టుకు నౌకాదళం అంటే చాలా అభిమానం. పెరల్ హార్బరువద్ద అమెరికను నౌకలను జపానువారు ముంచివెయ్యడం రూజ్వెల్టు వంటిమీద దెబ్బకొట్టినట్లే అయినా అతడు, దెబ్బతిన్నానే అనే బాధను లోనుగాకుండా, వెంటనే ప్రతీకారాన్ని గురించి ఆలోచించాడు. ఆస్ట్రేలియాకు, ఉత్తర ఐర్లెండుకు సైన్యాలను పంపడానికి ఏర్పాట్లుచేశాడు.

ఎంత ప్రమాద పరిస్థితిలో చర్య తీసుకోవలసి వచ్చినా, అనవసరమైన అందోళన పడకుండా తాపీగా సరియైన మార్గంలో తనపని తను చేసేవాడు. ఒకసారి, చాలా ప్రమాద పరిస్థితిలో తగినచర్య తీసుకోడానికి ఉత్తరువులు ఇమ్మని మిలిటరీ ఆఫీసర్లు, సలహాదార్లు పట్టరాని ఆవేశాలతో వచ్చి అడుగుతూ ఉంటే, ఏ మాత్రం ఉద్రేకం లేకుండా, చేపలు పట్టడాన్ని గురించి ఒక కట్టుకథ చెప్పాడు.

ఇలాటి ధైర్యగుణం అతడికి ఎలా అలవడింది? కొంతవరకు తను సరియైన పనిని సకాలంలో చెయ్యగలననే గర్వం ఒక కారణం కావచ్చును. ఉత్సుకత, తనశక్తిలో నమ్మకము, విధిలో విశ్వాసము కూడా కొన్ని కారణాలే.

ఏ పనినైనా తను సరిగాచేస్తే, సరియైన ఫలితాలు తప్పక వస్తాయనే నమ్మకం అతనికి బాగా ఉండేది. ఈ విశ్వాసంవల్ల తను చేసేపని ఏమవుతుందా అనే బెంగ ఏ మాత్రమూ లేకుండా ఉండగలిగేవాడు.

## నిద్ర - ప్రశాంతత

రూజ్వెల్టు అమెరికా అధ్యక్షుడుగావున్న పన్నెండేళ్ళలోనూ, అతడు నిద్రలేకుండా గడిపిన రాత్రిళ్లు రెండే. అయితే, ఆ రెండు రాత్రులూ కూడా అతడు నిద్రపోకపోవడం నిద్రపట్టక పోవడంవల్ల కాదు. అత్యవసరమైన పనులవల్ల ఎవరో ఒకరు వచ్చి ఆయనకు నిద్రాభంగం కలిగించడమే దానికి కారణం. నిద్రపోవడానికి ఆటంకాలు కలిగినందున నిద్రపోకపోవడం వేరు; నిద్ర పట్టకపోవడంవల్ల నిద్ర పోక పోవడం వేరు.

ఆ రెండు రాత్రులలో ఒకటి, అతడు మొదటిసారి అధ్యక్షుడయినప్పుడు, బ్యాంకులన్నీ మూసివేయబడిన రోజులలో ఒకటి. మరొకటి, టోబ్రుక్‌ను జర్మనులు స్వాధీనం చేసుకున్న రోజు; ఆనాడు చర్చిల్, ప్రెసిడెంటు ఇంట్లో అతిథిగా ఉన్నాడు.

రూజ్వెల్టు కొడుకు జేమ్సు, అతనికి సెక్రటరీగావున్న గ్రేసుటల్లీలు వాళ్ళయింట్లో ఒక నియమం ఉండేదట. ఎంత అవసరమైన పని ఉన్నా సరే, రూజ్వెల్టును రాత్రి పన్నెండు గంటలకూ, ఉదయం ఎనిమిదిన్నర గంటలకూ మధ్య నిద్ర లేపకూడదని ఆ నియమం. నియమప్రకారం అలా నిద్రపోగలిగాడు. కనుకనే, మూడుసార్లు వరుసగా అధ్యక్షుడయినా, తన ఆరోగ్యాన్నీ, ప్రశాంతతనూ రూజ్వెల్టు కాపాడుకోగలిగాడు. అయితే, యుద్ధం తీవ్రరూపం దాల్చినకొద్దీ, [illegible] విస్తారంగా యూరపునుంచి రూజ్వెల్టుకు టెలిఫోనులో పిలుపులు వచ్చేవి. అవి ప్రధానంగా తెల్లవారుఝామున వచ్చేవి. ఆ టెలిఫోనులకు జవాబు చెప్పక తప్పేదికాదు. అందుచేత, రూజ్వెల్టుకు నిద్రాభంగం కలుగుతూ ఉండేది.

ఎంత ప్రమాద పరిస్థితులలో అయినా కలవరపడక రూజ్వెల్టు హాయిగా నిద్రపోయేవాడు. అందుచేత అతడు ఉద్రేకరహితుడనీ, పరిస్థితుల తీవ్రతను లక్ష్యపెట్టేవాడుకాడనీ కొందరంటారు. కాని, అలా నిద్ర పోబట్టే రూజ్వెల్టు తననూ, తనదేశాన్నీ రక్షించుకోగలిగాడు.

మొట్టమొదటిసారి రూజ్వెల్టు అధ్యక్షుడుగా ఎన్నుకోబడి పదవీ స్వీకరణ చేసిననాడు రాత్రి దేశమంతాకూడా ప్రజలు ఉద్రేకంతో నరాలు బిగిసేట్టు ఊగులాడుతుంటే, తనకు ఏమీ పట్టనట్టు రూజ్వెల్టు హాయిగా నిద్రపోయాడు. ఆ మరునాడు ఉదయం అతని ముఖ్య స్నేహితులలో ఒకడైన ఎడ్వర్డ్ ఫ్లిన్ అతనిని "రాత్రి బాగా నిద్ర పట్టిందా" అని అడిగాడట. దానికి రూజ్వెల్టు జవాబు ఇది: "హాయిగా నిద్రపోయాను. ఎందుకు పోకూడదు?"

ఒకసారి రూజ్వెల్టు ఒక స్నేహితుడితో ఇలా చెప్పాడు: "మేలుకున్న సమయంలో నా యావచ్ఛక్తినీ వినియోగించి నేను పనిచేస్తాను. నేను చేసిన పనులనుగురించి పశ్చాత్తాప పడవలసిన అవసరం ఏమీ నాకు కనపడదు. అలాంటప్పుడు, పడక చేరగానే కళ్ళుమూసుకొని నిద్రపోవడానికి ఆటంకంకూడా నాకు ఏమీ కనపడదు."

మరీ అలసిపోయినప్పుడూ, విసుగుదలకు కారణాలు ఏర్పడ్డగా ఉన్నప్పుడూ, ఒకొక్కప్పుడూ నిద్ర సరిగా పట్టలేదని తన భార్యతో చెప్పేవాడు రూజ్వెల్టు. అంటే మామూలుగా పడుకోగానే నిద్రపట్టక పక్కమీద దాదాపు అరగంటసేపు మెలకువతో ఉండేవాడన్న మాట.

నిద్రలో కలవరపడటమూ, కొన్ని తడవలు నిద్రలోనే లేచి నడవడమూ, రూజ్వెల్టు యువకదశలో ఉన్నప్పుడు జరిగిందని, రూజ్వెల్టు సతి తన "నా కథ" అనే పుస్తకంలో వ్రాసింది గాని, నిద్రలో లేచినడిచే జబ్బు అతనికి ఉన్నట్టు ఏమీ దాఖలా లేదు.

రూజ్వెల్టు తన మనస్సును తన యిష్టంవచ్చినట్టు నడపేవాడు. తన ప్రశాంతతను కాపాడుకోవడంలో ఇది అతనికి చాలా తోడ్పడింది. అప్పుడప్పుడు అతడు నిజంగా ఆందోళన పడేవాడు; ఏమీ తోచక కొట్టుకొనేవాడు. కాని, తనను కలవరపెట్టే సమస్యనుగురించి ఏదోఒక నిర్ణయం చేసుకున్న మరుక్షణంనుంచీ ఇక అతడు మానసికంగా ఏ విధమైన కలవరమూ పెట్టుకొనేవాడు కాదు. పడుకోడానికి ముందు అన్ని సమస్యలనూ తేల్చివేసుకొని హాయిగా పడుకొనేవాడు.

ఏ విషయంలోనూ నిరాశగాని, సందేహాలతో కొట్టుకోవడంగాని, మందకొడిగా ఉండడంగాని రూజ్వెల్టు స్వభావం కాదు. ఉత్సాహంతో ఊగులాడడం, ఎటువంటి దారుణ సంఘటనలను గురించిన వార్తలయినా హఠాత్తుగా వచ్చినప్పటికీ అదరుబాటు లేకపోవడం అతనిలో ఉన్న గొప్ప సుగుణాలు.

ఆఫ్రికాలో యుద్ధకాండ మిత్రమండలికి ఏమీ అనుకూలంగా సాగని రోజులలో కూడా తన కులాసాను ఏ మాత్రమూ అణచిపెట్టుకోకుండా ఉన్న రూజ్వెల్టును చూసి, జనరల్ ఐసెన్ హోవరు చకితుడయాడు. అంతే కాదు, గూడల్ కెనాల్ వద్ద అమెరికను సైన్యాలకూ, జపాను సైన్యాలకూ ఘోర యుద్ధం జరుగుతూ ఉన్న రోజులలో ఆర్చిబాల్డ్ మెక్లీష్‌ను రూజ్వెల్టు సమాలోచనలకు పిలచాడు. ఆ రోజులలో యుద్ధరంగంనుంచి వచ్చే వార్తలు చాలా నిరాశను కలిగిస్తూ ఉన్నాయి.

దేశమంతా ఉద్రేకంతో కొట్టుకులాడుతూ ఉంది. అయినా, మెక్లీష్ వచ్చేటప్పటికి రూజ్వెల్టు పోస్టుబిళ్ళలతో ఆటలాడుతూ ఉన్నాడు!

పెద్ద ప్రయత్నంలేకుండా సులభంగా అతడు విశ్రాంతిని పొందగలడు. అంచేతనే, ఎంత శ్రమకలిగించే కార్యక్రమాలను నడిపించినా, తన శక్తి సామర్థ్యాలు ఏమాత్రం మొక్కబోకుండా అతడు పనిచెయ్యగలిగాడు.

అయినా, రూజ్వెల్టుకూడా మానవమాత్రుడే. అంచేత, అప్పుడప్పుడు అతడు చాలా విసుగుదలను చూపేవాడు. విరామంలేకుండా పనిచేసే వ్యక్తులకు సహజంగా కలిగే చిరాకు రూజ్వెల్టుకుకూడా కలుగుతూ ఉండేది. రూజ్వెల్టు బాగా కోపగించుకొని చిరాకుపడడం ఎప్పుడైనా సంభవించిందా అని అతని అనుచరులను ప్రశ్నిస్తే, "ఆ ఒక్కొక్కప్పుడు పిచ్చెక్కినంత చిరాకు పడేవాడు" అని జవాబు వస్తుంది.

అయితే, తనకు చిరాకు కలగడం ఆరంభించిందంటే, విశ్రాంతి తీసుకోమని తన శరీరతత్వం తనను హెచ్చరిస్తున్నదని రూజ్వెల్టు గ్రహించేవాడు. ఒకసారి రూజ్వెల్టు చాలా పిచ్చెక్కినట్టు చిరాకుపడడం సమ్నర్ వెల్స్ చూశాడు. రూజ్వెల్టుతో సుమారు కొన్నివందల సార్లయినా సమ్నర్ వెల్స్ సంభాషించి ఉంటాడు. అయినా, అతడు చిరాకుపడడం సమ్నర్ వెల్స్ ఒక్కసారి మాత్రమే చూశాడు. దానికి కారణం ఏమిటంటే: రూజ్వెల్టుకు పరిచయం చెయ్యడానికి ఒక ఫ్రెంచి పెద్దమనిషిని సమ్నర్ వెల్స్ తీసుకువచ్చాడు. ఆ పెద్దమనిషి రూజ్వెల్టుతో సందర్భశుద్ధి లేకుండా ప్రవర్తించాడు. దానితో రూజ్వెల్టుకు పిచ్చెక్కినట్లయింది.

## విచిత్ర ఆకర్షణ

రూజ్వెల్టులో విచిత్రమైన ఆకర్షణశక్తి ఉంది. చాలామంది ప్రముఖవ్యక్తులకు తమలో గొప్ప ఆకర్షణశక్తి ఉన్నదని స్పష్టంగా తెలియదు. కాని, రూజ్వెల్టుకుమాత్రం తనకుగల ఆకర్షణ శక్తి స్పష్టంగా తెలుసు. అంతేకాదు, తనవద్దకు వచ్చినవారిని లోబరుచుకోవడంలో అతనికిగల

ప్రతిభ అపారమైనది. రూజ్వెల్టు అంటే తనుకు ఏమాత్రమూ ఇష్టంలేదని అనుకొనే చాలామంది రూజ్వెల్టును ఒక్కసారి కలుసుకోగానే అతనికి లోబడిపోయేవారు. తను లోబరుచుకో దలచిన వ్యక్తి ఎవరైనా తన మాటలకు ఒప్పుకోకపోతే, అది తన ఆకర్షణ శక్తికి ఒక సవాలు అని కూడా అతడు అనుకునేవాడు.

మరీ ముఖ్యంగా, కొన్ని కొన్ని రోజులలో రూజ్వెల్టు చాలా హుషార్‌గా ఉండేవాడు. రూజ్వెల్టు ప్రతిపాదనలను కాదని, తన ప్రతిపాదనలకు అతనిచేత ఔననిపించుకోవాలని ప్రభుత్వోద్యోగులు ఎవరైనా ఆ రోజులలో అతనిదగ్గరకువస్తే, రూజ్వెల్టు కార్యదర్శి ఆ ఉద్యోగులను ముందుగానే హెచ్చరించేవాడు. "జాగ్రత్త ఇవ్వాళ ప్రెసిడెంటు కొరకరాని కొయ్యచేతకూడా పనులు చేయించుకుంటాడు" అని ఆ కార్యదర్శి ముందుగానే జోస్యం చెప్పేవాడు.

1942 లో యూరపులోని అమెరికన్ సైన్యాలకు అధిపతిగా నియమించబడి, అక్కడకు వెళ్ళబోయేముందు, జనరల్ ఐసెన్‌హోవరు రూజ్వెల్టును కలుసుకున్నాడు. అంతకుముందు చాలాకాలం క్రిందట ఒక్కసారిమాత్రమే, యేదో సందర్భంలో రెండు మూడు నిముషాలు మాత్రమే వీరిద్దరూ కలుసుకున్నారు. అంచేత యూరప్‌కు వెళ్ళేముందు రూజ్వెల్టు తనతో రాజకీయాలూ, యుద్ధతంత్రం మొదలైన సంగతులను గురించి మాట్లాడుతాడని ఐసెన్ హోవరు అనుకున్నాడు. కాని రూజ్వెల్టు గదిలోకి ఐసెన్‌హోవరు వెళ్ళగానే రూజ్వెల్టు అన్నమాట లివి: "ఇదిగో, చూడండి. మీ చిన్నతమ్ముడు నా ప్రాణాని కొక పెద్దపీడ అయ్యాడు." ఐసెన్‌హోవరు అదిరిపడ్డాడు. "ఎవరు, మిల్టనా?" అని అడిగాడు. "అవును గవర్నమెంటు డిపార్టుమెంటులలో నాలుగు డిపార్టులవాళ్లు మీ తమ్ముణ్ణి తమ కిమ్మంటే, తమ కిమ్మని అడుగుతున్నారు. ఏ డిపార్టుమెంటుకు అతణ్ణి పంపడమా అనేది నా కొక సమస్యగా పరిణమించింది," అని రూజ్వెల్టు వ్యక్తపరిచాడు.

అమెరికా ప్రభుత్వంలో పెద్దపెద్ద ఉద్యోగాలను వదలేసి వ్యాపారంలోకి పోదామనీ, విశ్రాంతి తీసుకుందామనీ నిశ్చయించుకున్న

వాళ్ళను ఎంతో మందిని తమ పదవులను విసర్జించకుండా కేవలం తన బుజ్జగింపులవల్ల రూజ్వెల్టు ఆపేశాడు.

తనకు వచ్చే జీతం చాలడంలేదనీ, అంచేత ఉద్యోగం వదలిపెట్టి వెళ్ళిపోతాననీ, సెక్యూరిటీస్ ఎక్స్ఛేంజ్ కమిషను అధ్యక్షుడు జెరోం ఫ్రాంక్ అనే ఆయన రూజ్వెల్టుకు చెప్పాడు. "జెర్రీ, ప్రస్తుతపు తీవ్ర సమస్యను ఎలాగో పరిష్కరించామంటే ఆ తరువాత చాలినంతడబ్బు సంపాదించడానికి నీకూ నాకూ ఏమీ ఇబ్బంది ఉండదు" అని రూజ్వెల్టు బుజ్జగించాడు. జెరోం ఫ్రాంక్ మళ్ళీ మాట్లాడలేక పోయాడు.

తన ఆకర్షణశక్తికి లోబడినవాళ్ళు తన చెయ్యిజారిపోతే, ఏ స్త్రీ అయినా ఎంత బాధపడుతుందో, రూజ్వెల్టుకూడా అంత బాధపడేవాడు.

రూజ్వెల్టు కార్యదర్శులలో ఐక్స్ ఒకడు. రెండుసార్లు అతడు తన పదవికి రాజీనామా ఇవ్వడానికి నిశ్చయించుకొని, రూజ్వెల్టుతో చెప్పడానికి వెళ్ళాడు. రెండుసార్లూకూడా రూజ్వెల్టు అతడిని ఆప వేశాడు. మొదటిసారి ఐక్స్‌తో రూజ్వెల్టు చెప్పిన మాట లివి: "ఐక్స్, మంచో, చెడో మనయిద్దరికీ దాంపత్యం కుదిరింది. ఇక విడాకులు పుచ్చుకోవడం సాధ్యంకాదు." ఆ మాటలకు ఐక్స్ నిరుత్తరుడయాడు.

డోనాల్డ్ నెల్సన్ అనే ఉద్యోగికూడా అంతే. రాజీనామా ఇవ్వడానికి రూజ్వెల్టు గదిలోనికి వెడితే, రూజ్వెల్టు అతనితో నలభై అయిదు నిముషాలసేపు మాట్లాడి, అతణ్ణి మళ్ళీ మాట్లాడనివ్వకుండాచేసి బయటికి పంపించాడు. నెల్సన్ తన రాజీనామా మాట మళ్ళీ ఎత్తలేక పోయాడు.

ఉన్నవాళ్ళను చెయ్యిజారిపోకుండా నిలబెట్టుకోవడమే కాక, కొత్తవాళ్ళని పూర్తిగా తనవాళ్ళను చేసుకోవడంలో రూజ్వెల్టు ప్రజ్ఞ పరిపూర్ణమైనది.

రూజ్వెల్టుకు సెనెట్‌లో తీవ్ర ప్రతికూలుడు సెనెటర్ నై. అతడు రూజ్వెల్టును చూడడానికి వెళ్ళి "మిస్టర్ ప్రెసిడెంట్! బ్యాంక

వ్యాపారం, ఆర్థికసమస్య, బీర్ వ్యాపారములు విషయంలో మీ ప్రతిపాదనలకు నూటికి నూరుపాళ్ళు ప్రతికూలంగా ఓట్లు వేయిస్తాను," అని సంభాషణ ఆరంభించాడు. రూజ్వెల్టు భుజాలు ఎగరవేసి నవ్వుతూ "సెనెటర్, మీరు పొరపాటు పడుతున్నారు. మీరు నాకు నూటికి పాతికపాళ్ళే వ్యతిరేకంగా ఉన్నారు. తక్కిన విషయాలలో మన ఇద్దరి అభిప్రాయాలూ ఒకటే," అని జవాబుచెప్పాడు. చిట్టచివరికి రూజ్వెల్టుతో సంభాషణ ముగించి బైటకు వచ్చినతరువాత సెనెటర్ సైతం ఆ సంభాషణవల్ల తాను చాలా తృప్తిపడ్డానని చెప్పాడు.

ఎముకలు విరిగేటాకా రూజ్వెల్టుకోసం పనిచేసిన కొంతమందిపట్ల అతడు ప్రవర్తించినవిధం చూస్తే అతడు చాలా కృతఘ్నుడనిపిస్తుంది. అయితే, వాళ్ళని తనవద్దకు మళ్ళీ రప్పించుకొని తనవారిగా చేసుకోవడంలంటే రూజ్వెల్టు అలా చెయ్యగలిగినవాడే.

అతడికోసం ప్రాణాలను సమర్పించడానికి కూడా వెనుదియ్యకుండా, అతనికి నీడలాగ సంచరించిన చాలామందిని "రూజ్వెల్టు అమెరికా అధ్యక్షుడు కాకుండా సామాన్య వ్యక్తిగా ఉన్నాకూడా అతనికోసం మీరంత కష్టపడతారా" అని అడిగితే, అందరూ కూడా 'ఆ' అని సమాధానం చెప్పారు. అతని ఆకర్షణశక్తి అంతా మనిషిలోనే ఉండేది కాని, పదవిలో లేదు. నిజానికి, అతడు తన పరివారంతో మెలగినవిధం చూస్తే, తాను అధ్యక్షుడనేమాట వారు మరిచిపోయేటట్టు అతడు ప్రవర్తించేవాడు.

చిరునవ్వుతో పలకరించి, మనుష్యుల్ని అతడు వలలో వేసుకుంటాడని, అతడి చిరునవ్వులకు లోబడకూడదని దృఢనిశ్చయంతో వచ్చినవారు కూడా తిరిగి వెళ్ళేలోపల అతడికి వశీకృతులై పోయేవారు.

ఆకర్షణశక్తి ఎక్కువైనకొద్దీ, తమ ఆకర్షణశక్తి అప్రతిహతమైనదని తమకు తెలిసినకొద్దీ మనుష్యులకు అంగీకరణ తగ్గుతుంది. రూజ్వెల్టుకూడా కొన్ని సందర్భాలలో ఇలాగే ప్రవర్తించేవాడు. డోరొతీ తాంప్సన్ అనే సుప్రసిద్ధ పత్రికా రచయిత్రికీ, రూజ్వెల్టుకూ కొంతకాలం సరిపడలేదు. తరువాత అధ్యక్షపదవికి థామస్ డ్యూయీతో

రూజ్వెల్టు పోటీచేసినప్పుడు ఆమె రూజ్వెల్టుపక్షం వహించింది. అందువల్ల న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రికలో వుద్యోగాన్నికూడా ఆమె పోగొట్టుకుంది. తరువాత ఆమె తనను చూడడానికి వస్తే, “డొరొతీ, నీ వుద్యోగం నువ్వు పోగొట్టుకొన్నావు గాని, నా పదవి నేను నిలబెట్టుకున్నాను.” అని పకపక నవ్వుతూ ఆమెను పలకరించాడు రూజ్వెల్టు.

అతిగా మాట్లాడడమూ, ఎదుటివానిని ఆకర్షించడమూ వనితల లక్షణాలు. మగతనానికి నష్టం కలిగించకుండా ఎక్కువ వనితాత్వం రూజ్వెల్టులో ఉంది. “అనేకమంది పురుషులను వశపరుచుకున్నాను. అందుచేత, ఎటువంటి మహాపురుషున్నయినా వశపరుచుకోగల, ననే ధైర్యంతో, ఎటువంటి ధీరులనైనా లోబరుచుకోడానికి ఉద్యుక్తురాలయే జాణలాగ తన ఆకర్షణశక్తిని నమ్మి రూజ్వెల్టు చాలాసార్లు చాలా ప్రమాదకరమైన ఎత్తులలోకి దిగడంకూడా జరిగింది.

# అధికార కాంక్ష

అందరూ తను అంటే ఇష్టంగా ఉండాలని రూజ్వెల్టు అభిలషించేవాడు. కోరి, ప్రయత్నించి అతడు ప్రజలను తనవశం చేసుకొనేవాడు. అతని అభిరుచులు మంచివి; అతని స్వభావం మృదువైనది; అతనికి మానవతత్వం మీద అభిలాష ఎక్కువ. అందరికీ ఇష్టుడుగా ఉండి, అందరిచేతా ప్రేమింపబడాలని కోరడం కేవలం మంచిగా ఉండాలనే కోరికను మాత్రమే చాటదు. అధికారం బాగా తన చేతిలో పెట్టుకోవాలనే కాంక్షను అది వ్యక్తం చేస్తుంది. అంచేత, అధికార కాంక్షగలవాడూ, చారిత్రాత్మకమైన ఒక మహత్కార్యాన్ని సాధించటానికి విధి తన్ను నియమించిందని అనుకొనేవాడూ, ప్రజలందరూ తనంటే యిష్టంగా ఉండాలని కోరుకోవడమే కాదు; ప్రజలందరికీ యిష్టుడుగా ఉండాలి. అయితే, రూజ్వెల్టు యీ విషయంలో పది అడుగులు ముందుకువేశాడు. తన సమకాలికులు తనను మెచ్చుకోవాలని కోరడమే కాకుండా, తన తరువాతి తరాలవారు

కూడా తనను మెచ్చుకోవాలని కోరేవాడు. రాబోయే తరాల ప్రజలు తనను గురించి ప్రశంసాభావం కలిగి ఉండాలని అతడు కోరేవాడు. ఆచంద్రతారార్కమైన కీర్తిని సంపాదించడానికి మహాపురుషులు అంతా అలాగే కోరేవారు. తనను గురించి రాబోయే తరాలవారికి చెప్పుకోడానికీ, వ్రాసుకోవడానికీ, చదువుకోవడానికీ ఉపయోగపడే సమస్త విషయాలను అతడు భద్రపరిచాడు. చరిత్రకారులకు ఉపయోగపడుతుందని తను అనుకున్న ప్రతిలేఖనూ, ప్రతిపత్రాన్నీ, ప్రతి వస్తువునూ అతను భద్రపరిచాడు.

ప్రజలందరూ తనను ప్రేమించాలనీ, ఎవ్వరూ తనను ద్వేషించకూడదనీ కోరడమే కాక రూజ్వెల్టు నిజంగా తన ప్రజలను ప్రేమించాడు. అతడికి ప్రజలపైగల ప్రేమ స్పష్టమైన రూపం గలది. అంచేతనే, అతడి నాయకత్వము నుంచి బలిష్ఠమైనది. సమూహంగా ఉండే ప్రజలను ప్రేమించేవారు చాలామంది ప్రత్యేక వ్యక్తులపైన ఎక్కువ యిష్టం చూపేవారు కారు. కాని, రూజ్వెల్టు వ్యక్తులను, వ్యక్తులసమస్యలను ఆకళింపునకు తెచ్చుకొనేవాడు. అంచేతనే, అతడు ప్రజలకు నిర్దేశించిన ఆశయాలన్నీ ఏ వ్యక్తిఅయినా సాధించడానికి వీలయినవిగా ఉండేవి.

ప్రతివ్యక్తిపట్లా రూజ్వెల్టు తనకు వీలైనంతవరకు శ్రద్ధచూపేవాడు. అమెరికా సుప్రీంకోర్టు జడ్జి మెదడు ఎలా పనిచేస్తోందో తెలుసుకోవడంలో ఎంత కుతూహలమో, వచ్చిన ఉత్తరాలన్నిటినీ చదివిన తరువాతగాని చిరునామాదార్లకు వాటిని బట్వాడా చెయ్యని వామ్ స్ప్రింగ్స్ పోస్టు బంట్రోతు మెదడు ఎలా పనిచేస్తోందో తెలుసుకోవడంలో కూడా అంతే కుతూహలమూ రూజ్వెల్టుకు ఉండేది.

ఆర్థిక మాంద్యంవల్ల అమెరికాలోని ప్రజలందరూ అల్లాడిపోతూ ఉంటే, "ఇది యేదో కొన్నాళ్లు ఉంటుంది. కొంతకాలం అయిన తరువాత మళ్ళీ పరిస్థితులు బాగుపడతాయి. అంతవరకూ ప్రజలు ఎలాగో అలాగ కాలం గడపాలి" అని ఒక పెద్దమనిషి అంటే, "మనుష్యులు, ఎలాగో అలాగ కాలం గడపడానికి పశువులు కారు" అని రూజ్వెల్టు జవాబిచ్చాడు.

ప్రజల ఉపయోగానికి రాని నూతన భావాలతో అతడికి ప్రసక్తి ఉండేది కాదు. ప్రపంచ యుద్ధగమనాన్ని మార్పుచేసిన డి-డే (యూరప్‌లో అమెరికన్ సైన్యాలు, ఫ్రాన్సు విమోచనకు యుద్ధాన్ని ప్రారంభించిన దినం) రేపు అనగా ముందటిరాత్రి, మరుసటినాడు ప్రారంభం కాబోయే ఒక మహత్తర ప్రయత్నాన్ని గురించి ఆలోచించడంలో, పూర్వం తనయింట్లో పరిచారకుడుగా ఉండి అప్పుడు యూరప్‌లో యుద్ధానికివెళ్ళిన ఒకానొక పరిచారకుడు క్షేమంగా ఆ యుద్ధంలోనుంచి బయటపడి తిరిగి యిల్లు చేరుకుంటాడో, లేదో అని రూజ్వెల్టు ఎక్కువ మథనపడ్డాడట.

ప్రజా సౌఖ్యంకోసం అతడు అమలుజరిపిన అనేక కార్యక్రమాలు నానావిధ వ్యక్తిగతమైన కష్టసుఖాలను గమనించడంవల్ల పుట్టినవే.

న్యూయార్కులో తనయింట్లో ఖర్చుపెట్టిన విద్యుచ్ఛక్తికి యిచ్చే డబ్బుకన్న, వామ్ స్ప్రింగ్స్‌లో తన బసలో ఖర్చుపెట్టిన విద్యుచ్ఛక్తికి యివ్వవలసిన డబ్బు నాలుగురెట్లు అని తెలుసుకొని గ్రామాలలో చౌకగా విద్యుచ్ఛక్తిని ప్రజలకు యివ్వడంకోసం అతడు శాసనం అమలులోకి తెచ్చాడు.

చాలాకాలంనుండి రైతులు తమ పని సమయములో ఎంతో కష్టపడి జీవితాన్ని సాగించి, చివరకు ముసలితనంలో చాలా పేదరికాన్ని అనుభవిస్తున్నారన్న విషయాన్ని అతడు తన జన్మస్థలమైన హైడ్ పార్కులో కళ్ళారా చూశాడు. ముసలివారికి జీవనభృతి ఏర్పాటు చెయ్యడానికి అతడు ప్రవేశపెట్టిన శాసనం అతని ఈ స్వానుభవంవల్ల పుట్టినదే. వ్యవసాయానికి నీటిపారుదల బాగా ఉండేటట్టు చెయ్యడానికి అతడుచేసిన కృషి, అతడు యూరప్‌లో చూసివచ్చిన నీటిపారుదల ఏర్పాట్లు చాలా వరకు కారణం.

బట్టల మిల్లులలో చిన్నపిల్లలచేత పనిచేయించడాన్ని నిషేధిస్తూ శాసనాన్ని అమలు జరిపినరోజు తన జీవితంలో కెల్ల అత్యంత ఆనందాన్ని కలిగించిన రోజని రూజ్వెల్టే చెప్పుకొన్నాడు.

బిరుదులూ, గౌరవచిహ్నాలూ గలవారంటే రూజ్వెల్టుకు చాలా ఇష్టం. రాజులు, రాణులు అంటే అతనికి గల అనురాగాతిరేకం చెప్పు

నలవికానిది. ఇలా ఉండటంలో వైపరీత్యం లేదు. న్యాయంగా అతడిలో రాజతీవి ఉంది. అయినా, మొరాకో సుల్తాన్‌లాంటి వాళ్ళపట్లకూడా అతడు ఎక్కువ లాంఛనాలు చూపడం కొంతమందికి ఆశ్చర్యం కలుగక మానదు. అయితే, అది అతడు తన పదవిలో నిర్వర్తించవలసిన విధాయకాల్లో ఒకటి.

కాసాబ్లాంకాలో ఒకసారి మొరాకో సుల్తాన్‌ను కలుసుకొన్న తరువాత, రూజ్వెల్టు తనకొడుకు ఎలియట్‌ను పిలిచి "ఒకరోజు రాత్రి సుల్తాన్‌ను విందుకు పిలవాలి; జ్ఞాపకం పెట్టుకో. అయితే నోగ్స్ (మొరాకోలో రెసిడెంట్ జనరల్) ను మాత్రం పిలవవద్దు" అని చెప్పాడు.

కొంతమందిపట్ల రూజ్వెల్టు చాలా విముఖభావం చూపేవాడు. తన బంధువర్గంలోనే చాలామందిని ఇతడు చిన్నచూపు చూసేవాడు. తన తోటిపాటి కోటీశ్వరులలో చాలామందిని ఇతడు దగ్గరకు రానిచ్చేవాడు కాదు. అంచేత, వారు అతణ్ణి పూర్తిగా ద్వేషించేవారు. అలాగని భాగ్యవంతులంటే అతనికి కిట్టదనిగాని, భాగ్యవంతులను అతడంటే కిట్టదనికాని చెప్పడానికి వీలులేదు. చాలామంది కోటీశ్వరులు అత్యంతమైన అభిమానంతో ఇతనిని కొలిచారు. కోటీశ్వరులలో ఒకడైన ఆస్టర్‌తో అతడికి స్నేహం ఉండేది. ఆస్టర్ విహారనౌకలో అతడు అప్పుడప్పుడు విశ్రాంతి పొందేవాడు. దీనికి కారణం బహుశా తన వర్గానికి చెందిన వారికి యితడు ద్రోహంచేశాడు అని అనిపించుకోవడం యిష్టంలేకపోవడంవల్లనే నేమో!

"ధనికులలో చాలామందికి నేనంటే కిట్టకపోయినా, వాళ్ళతో నేనెంత చక్కగా మెలుగుతున్నానో చూడండి" అనేటట్లుగా అతడు ప్రవర్తించేవాడు.

అయినా, కోటీశ్వరులలో తానూ ఒకడుగా మెలిగేవాడేగాని, వాళ్ల దయాదాక్షిణ్యాలను కోరేవాడిలాగ మెత్తదనం చూపేవాడు కాదు. పైగా, అవసరం వచ్చినప్పుడు, భాగ్యవంతులకు ఇతడు కర్ర చూపించేవాడు కూడా. బెత్లెహెం స్టీల్ కార్పొరేషన్ ప్రెసిడెంటు యూజీన్ గ్రేస్‌కు

గురించి అతడు లేవ ఉద్యోగితో "ఇక అతడు ఏడాదికి పదిలక్షల డాలర్లు సంపాదించలేడని చెప్పు" అని అన్నమాటలు ఇప్పటికీ చాలామంది చెప్పుకుంటారు.

రూజ్వెల్టులో ఆడంబరం తక్కువ. అతడితో చాలా పరిచయం ఉండి, దాదాపు రెండుమూడు వందలసార్లు అతడితో కబుర్లు చెప్పుకున్న ఒక పెద్దమనిషి "ఒక్కసారి కూడా, రూజ్వెల్టు తను అమెరికా అధ్యక్షుణ్ణనే భావం స్ఫురించేటట్లు నా పట్ల ప్రవర్తించలేదు" అని చెప్పాడు.

ఇదివరకే ఒకసారి చెప్పినట్లు, ప్రతి మనిషినీ, ప్రథమ పరిచయం లోనే ఇంటిపేరు విడిచిపెట్టి మొదటిపేరుతో పిలవడం రూజ్వెల్టు స్వభావం. చాలామందికి అది చాలా కష్టం కలిగించేది. ఆయనో మహా రాజాధిరాజు, మేము పల్లెటూరి రైతులము అయినట్లు అలా పిలుస్తాడేమి ?" అని కొంతమంది గొణిగేవారు.

డీన్ ఏచిసన్ మొట్టమొదటిసారి రూజ్వెల్టును కలుసుకున్నప్పుడు, అతడు తనను "డీన్" అని పలకరించగా ఏచిసన్ ఉలికిపడ్డాడు. అయితే కొంతమంది గౌరవాన్ని ఇతరుల సమక్షంలో జాగ్రత్తగా కాపాడడంలో అతడు చాలా శ్రద్ధచూపేవాడు. జనరల్ జార్జి మార్షల్ ను, తనతో ఒంటరిగా ఉన్నప్పుడు ఎప్పుడూ "జార్జి" అనే పిలిచేవాడు. కాని ఇతరులెవరైనా ఉన్నప్పుడు అతణ్ణి జనరల్ అని సంబోధించేవాడు. ఈ గౌరవం జనరల్ మార్షల్ కు ఒక్కడికే. అడ్మిరల్ లీహీ, అడ్మిరల్ కింగ్ లను కూడా మొదటిపేరుతోనే, ఇతరుల సమక్షంలో పిలిచేవాడు.

అయితే రూజ్వెల్టును "ఫ్రాంక్లిన్" అని మొదటిపేరుతో పిలిచిన వారు చాలా కొద్దిమంది. ఆ కొద్దిమందికూడా, అతడితో ఒంటరిగా ఉన్నప్పుడు అలా సంబోధించేవారు గాని, ఇతరులెవరైనా ఉన్నట్లయితే ప్రెసిడెంట్ అనిగాని, ఛీఫ్ అనిగాని పిలిచేవారు. అతని పరివారంలో చాలామంది అతణ్ణి గవర్నర్ అని సంబోధించేవారు. అతని ఆఫీసులో పని చేసేవారు ఎక్కువగా అతన్ని "బాస్" అని పిలిచేవారు. కాని, అతనిని రోజూ కలుసుకొనేవారూ, అతన్ని చూడడానికి వచ్చేవారూ,

ఎక్కువగా "మిస్టర్ ప్రెసిడెంటు" అనేవారు. ఒకసారి, రూజ్వెల్టు తన ఆఫీసులో పని చూసుకొంటూ ఉండగా, అతని దగ్గరబంధువు వొకడు ఆఫీసులోకి వచ్చి, "ఫ్రాంక్లిన్" అని అతణ్ణి పలకరించాడు. అప్పుడు రూజ్వెల్టు ఉలికిపడ్డాడు.

# పెద్దమనిషి

రూజ్వెల్టు చాలా పెద్దమనిషి. ఈ మాట ప్రత్యేకంగా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, అమెరికా అధ్యక్షులుగా వున్నవారంతా పెద్దమనుషులు కారు గనుక, రూజ్వెల్టులో పెద్దమనిషి తరహా మూర్తీభవించింది. పెద్దమనిషి లక్షణాలు—అంటే ఎదుటివారి మనసు నొప్పించకపోవడం, వీలైనంతవరకు ఎదుటివారిని సంతోషపెట్టడం, క్రౌర్యం లేకుండా ప్రవర్తించడం, ఎదుటివారి ఇబ్బందిపట్ల సానుభూతి చూపడం—ఇవన్నీ రూజ్వెల్టుకు వున్నాయి. ఇంకొకరిపట్ల తన నడవడిలో నాగరికతా స్వరూపం లేకుండా వుండడం అంటే అతనికి మనస్సు ఒప్పేదికాదు.

అతడు తన సహచరులకు వ్రాసే ఉత్తరాలలో ఆప్యాయత ఒలికిపోతూ వుండేది.

శాసనసభ స్పీకరు శాం రేబర్న్ 60వ జన్మదినంనాడు అతనికి అభినందన లేఖ వ్రాస్తూ రూజ్వెల్టు ఇలా వ్రాశాడు: "అరవయ్యేళ్ళ వృద్ధాప్యం వచ్చిందంటే ఎవరికైనా మనస్సు కష్టంగానే వుంటుంది. ఇంకా 23 రోజులకుగాని నాకు ఆ దశ పట్టదు."

మరుసటి సంవత్సరం అదేరోజున రూజ్వెల్టు శాం రేబర్న్‌ను తన ఇంటికి ఆహ్వానించాడు. రేబర్న్ రాగానే "శాం, నిన్ను ప్రత్యేకంగా బాధించే ఒక విషాదకరమైన విషయాన్ని గురించి నీతో మాట్లాడడానికి నిన్ను పిలిచాను. ఆ విషయం నాకు చాలా బాధకలిగిస్తున్నది" అన్నాడు. ఏమిటా అని రేబర్న్ తెల్లబోయి చూస్తూవుంటే "శాం, నీకు అరవై ఒక్క—ఏళ్ళు వచ్చాయి సుమా" అన్నాడు రూజ్వెల్టు.

ప్రజల కష్టసుఖాలంటే రూజ్వెల్టు స్వయంగా పట్టించుకొనేవాడు. వ్యక్తిగతంగా ఎవరైనా తనకు ఏదైనా విన్నపం చేసుకుంటే, దానినిగురించి అతడు ప్రత్యేకశ్రద్ధ తీసుకొనేవాడు.

ఒకసారి అతడు 'టస్కలూసా' అనే నౌకలో విహారం చేస్తూవుంటే అతనికి ఒక స్త్రీ ఉత్తరం వ్రాసింది. ఆ ఉత్తరంలో ఆమె తన కవలపిల్లలు

యిద్దరూ ఆ నౌకలో నావికులుగా పనిచేస్తున్నారని వ్రాసింది. అది చదివి రూజ్వెల్టు ఆ నౌకాధిపతిని పిలిచి 'ఆ యిద్దరు కుర్రాళ్ళనీ తీరుబాటుగా ఒకసారి నాకు చూపించు' అని చెప్పాడు.

ఇతరుల మేలు విషయంలో అతడు చాలా జాగ్రత్త చూపించేవాడు. జాన్ ఎల్. మెక్రీని తన అంగరక్షకుడుగా ఉంచుకోవాలని అతనికి చాలా కోరికగా ఉండేది. కాని, అతడు తనతోటే ఉంటే, అతడి ఉద్యోగపు హోదా పెరగడానికి ఆటంకాలు కలుగుతవని తెలియగానే, 1942 లో అతణ్ణి నౌకాదళంలో పనిచెయ్యడానికి తనదగ్గర ఉద్యోగంనుంచి విడుదల చేశాడు రూజ్వెల్టు.

తన మంత్రులలో ఒకడైన ఇక్స్ జబ్బుపడి ఆస్పత్రిలో వుంటే, అతన్ని పరామర్శించడానికి రూజ్వెల్టు స్వయంగా ఆస్పత్రికి వెళ్లాడు. జబ్బుగా ఉన్నవారిని చూడడానికి అంతకుముందు అమెరికా అధ్యక్షు డెవరూ ఆస్పత్రికి వెళ్ళలేదు. అంతేగాదు, జబ్బునుంచి కోలుకుంటూ ఉన్న రోజులలో మంత్రిమండలి సమావేశానికి ఒకరోజు ఇక్స్ హాజరయాడు. అలా చేసినందుకు, రూజ్వెల్టు అతన్ని కోపపడ్డాడు కూడాను.

తనతో పనిచేసేవారికి ఎవరికైనా కొంత విశ్రాంతి అవసరమని తనకు తోస్తే, అతడు ఆ ఉద్యోగులకు ఏదో నెపంపెట్టి నిజంగా విశ్రాంతి దొరికే స్థలానికి ఎక్కడికైనా పంపించేవాడు.

పత్రికలలో తను అభిమానంతో రోజూ చదివే శీర్షిక ఏదైనా ఒకనాడు ప్రకటితం కాకపోతే, వెంటనే ఆ పత్రికా కార్యాలయానికి టెలిఫోనుచేసి, ఆనాడు ఆ శీర్షిక ఎందుకు అచ్చుకాలేదని అడిగేవాడు. రచయితకు జబ్బుగా వుందని తెలిస్తే వెంటనే ఆ రచయితకు సానుభూతి సందేశం పంపించేవాడు.

తనవద్ద పనిచేసేవారికి అనవసరమైన పనులు కల్పించడమంటే అతడికి యిష్టం ఉండేదికాదు. వీలైనంతవరకు, వారికి పని తగ్గించడానికి చూసేవాడు. విపరీతమైన పనిలో, తీవ్ర సమస్యలను గురించి తను ఆవేదన పడితే, ఆ

ఆవేదనను ఇతరులదాకా వెళ్లనిచ్చేవాడు కాదు. రూజ్వెల్టు మంచితనమూ, ఎవరిమనసు నొప్పించవమన్నా అతడికి ఇష్టం లేకపోవడం, అతడికి ఒక లోపాలుగా పరిణమించాయి. అంచేత, ఆఫీసు పనులలో తాత్సారం జరగడం మామూలు అయింది. అంతేకాదు, పని చకచక చెయ్యనివాళ్ళని పిలిచి, బాగా చివాట్లు పెట్టడానికి కూడా అతడికి మనస్కరించేది కాదు.

తనపిల్లలు పెరిగి పెద్దవాళ్లవుతూ ఉంటే, వాళ్ళు చెడ్డదారులలో పడకుండా కట్టుబాట్లలో పెట్టే బాధ్యత అంతా రూజ్వెల్టు భార్య భరించవలసి వచ్చేది. పిల్లలను కోపపడడం రూజ్వెల్టుకు చేతకాకపోయేది.

తన పరివారంలో ఎవరైనా సరిగా పనిచెయ్యలేకపోతే, వారిని పనిలోనుంచి తీసివెయ్యలేక పోగా, వారిని మందలించడంకూడా రూజ్వెల్టుకు చేతనయేదికాదు. రూజ్వెల్టుకు సమస్తోపచారాలూచేసే నౌకరు మెక్‌డఫీ అనే అతడు ఒకడు వుండేవాడు. అతడంటే రూజ్వెల్టుకు చాలా అభిమానం కూడా ఉండేది. కాని, రానురాను మెక్‌డఫీ ప్రవర్తన సహించడానికి వీలులేనిదయింది. మెక్‌డఫీని పనిలోనుంచి తీసివెయ్యడంతప్ప రూజ్వెల్టుకు వేరేమార్గం కనపడలేదు. అయినా ఆ పని తాను చెయ్యలేక, మెక్‌డఫీని పనిలోనుంచి తీసివెయ్యమనీ, ఆ తీసివెయ్యడం తనువూళ్లో లేనప్పుడు చెయ్యమనీ రూజ్వెల్టు తన భార్యను బ్రతిమలాడుకున్నాడు.

రూజ్వెల్టుకు చాలా ముఖ్యస్నేహితులలో ఒకరిని అతడు ఒక ముఖ్యమైన పదవికి నియమించాడు. అప్పుడా స్నేహితుడు రూజ్వెల్టుతో ఇలా చెప్పాడు: "మిస్టర్ ప్రెసిడెంట్ ఈ ఉద్యోగానికి ఒక షరతు మీద నేను ఒప్పుకుంటాను. అదేమిటంటే, నేను చెయ్యవలసినపని పూర్తి అయిన తరువాత, రాజీనామా ఇచ్చి వెళ్లిపోవడానికి నాకు హక్కు ఉండాలి. ఎందుచేత ఇలా చెపుతున్నానంటే, తమ ఉపయోగం తీరిపోయిన తరువాతకూడా పని ఏమీలేకుండా మీ యింట్లో ఉండేవాళ్లు చాలామంది నాకు కనిపిస్తున్నారు."

ఎవరినైనా ఉద్యోగంలోనుంచి తీసివెయ్యాలంటే ఏదో గిల్లి కజ్జా పెట్టుకొని, ఆ మనిషికి కోపంతెప్పించి, అతడే రాజీనామా పెట్టి

పోయేటట్టు చేసేవాడు రూజ్వెల్టు. రూజ్వెల్టుకు స్వయంగా పెద్ద ఆలోచనలూ, అభిప్రాయాలూ ఉండేవికావనీ, తనతో ఆంతకుముందు మాట్లాడి వెళ్లినవారి అభిప్రాయాలనే తన అభిప్రాయాలుగా అతడు చాటిస్తాడనీ అతడంటే కిట్టనివాళ్లు ప్రచారం చేసేవారు. కాని, అది నిజంకాదు. అతని అభిప్రాయాలు గాని, అతని ప్రవర్తనగాని ఏ ఒక్క మనిషి అభిప్రాయాలమీద ఆధారపడి ఉండేదికాదు. ఏ విషయాన్ని గురించి అయినా ఒక నిర్ణయం చేసుకుంటే, అతడు స్వయంగా ఆలోచించి, తనంతటతానే ఆ నిర్ణయాన్ని చేసేవాడు.

కొన్ని సందర్భాలలో తన యెదుటివారి అభిప్రాయాలతో తను అంగీకరించక పోయినా, అంగీకరించినట్టుగా కనపడేవాడు రూజ్వెల్టు. దానికి కారణం, ఎదుటివారి మనస్సుకు బాధ కలుగుతుందేమో నని. పైగా, వృథావాదనలతో కాలం పాడుచెయ్యకుండా, ఎదుటివారి భావాలను తెలుసుకోవడానికి యీ పద్ధతి సహాయపడుతుంది. గంటలకొలదీ వాదించినా, తన అభిప్రాయం మార్చుకోనని వ్యక్తితో మాట్లాడే టప్పుడు, ఆ మనిషి పలుకుబడిగల వాళ్లలో ఒక డైనప్పుడు, అతడు చెప్పినదానిని కాదనకుండా ఓపికగా వినడంకన్న వేరేమార్గం ఏముంది ?

అయితే, ఎదుటివాళ్ళతో ఏకీభవించక పోయినా, అలా నటించడం వాళ్ళని మోసంచెయ్యడం అవుతుందనీ, అలా మోసంచెయ్యడం ఒకవిధంగా తప్పేననీ రూజ్వెల్టు ఎప్పుడూ అనుకోలేదు.

ఒకొక్కప్పుడు రూజ్వెల్టుకు విపరీతంగా కోపం వచ్చేది. అప్పుడు చాలాకోపంతో బల్ల అదిరిపోయేటట్టు చేతితో బల్లను గ్రుద్దేవాడు. తప్పని సరిఅయితే, ఉద్యోగులను ఎవరినైనా బర్తరఫ్ చెయ్యాలంటే, అందుకుకూడా అతడు జంకేవాడుకాదు.

1933 లో ఒకసారి అతడు మంత్రిమండలి గజగజలాడేటట్టు తన కోపాన్ని ప్రకటించాడు. ఆనాడు అతడు ప్రదర్శించిన కోపాన్ని ఇప్పటికీ ఆ మంత్రిమండలి సభ్యులు మరిచిపోలేదు.

రూజ్వెల్టుకు బాగా కోపం తెప్పించిన పెద్దవాళ్ళలో డీన్ ఏచిసన్ ఒకడు. 1933లో డీన్ ఏచిసన్ కోశ శాఖలో ఉప కార్యదర్శిగా

వుండేవాడు. డాలరు విలువను తగ్గించివేస్తూ ప్రభుత్వం చేసే ఉత్తరువు మీద సంతకం పెట్టమని ఏచిసన్‌ను రూజ్వెల్టు ఆజ్ఞాపించాడు. కాని, "అటార్నీ జనరల్ అభిప్రాయం తెలుసుకుంటేగాని, తాను సంతకం పెట్టనని ఏచిసన్ కచ్చితంగా జవాబు చెప్పాడు. రూజ్వెల్టు ఉగ్రుడైనాడు. 'నా మాట నీకు లెక్క లేదా?' అని అడిగాడు. 'దాని మీద సంతకం పెట్టవలసింది నేనుగాని మీరుకాదు' అని ఏచిసన్ జవాబు చెప్పాడు. "ఇంక చాలు" అని రూజ్వెల్టు ఉక్కిరిబిక్కిరి అయ్యేటంత కోపంతో అన్నాడు.

తరువాత వారం రోజులకి కోశశాఖ మంత్రి ఏచిసన్‌ను కలిసి, "నిన్ను బర్తరఫ్ చెయ్యడానికి ఉత్తరువు తయారయింది. ఆ కాగితం రూజ్వెల్టు బల్లమీద వుంది. దానిమీద రూజ్వెల్టు సంతకం పెడితే, నేను నా పదవికి రాజీనామా ఇస్తానని అతడితో చెప్పాను. ఆ గొడవలన్నీ లేకుండా నీ అంతట నువ్వే రాజీనామా ఇవ్వడం మంచిది" అని చెప్పాడు. తరువాత ఏచిసన్ రాజీనామా ఇచ్చాడు. అతడికి బదులు నియమింప బడిన వ్యక్తిచేత రూజ్వెల్టు ప్రమాణస్వీకారం చేయించేటప్పుడు ఏచిసన్ కూడా హాజరయాడు. ఏచిసన్‌ను చూసి రూజ్వెల్టు నిర్ఘాంతపోయాడు. తరువాత తెప్పరిల్లి "నీమీద నాకు పిచ్చెక్కినంత కోపం వచ్చింది. కాని, యీ సందర్భానికి నువ్వు రావడం నీలో చాలా సుహృద్భావాన్ని చూపిస్తున్నది" అని సంతోషాన్ని వెలిబుచ్చాడు.

కొంతమంది రూజ్వెల్టుతో తీవ్రంగా ప్రతివాదాలు చేసేవారు. కొంతమంది అతడు చెప్పిన దానిని కాదనేవారు. అయితే, ఇలాంటివారు చాలా పెద్దవాళ్ళయినప్పుడూ, వారు చాలా నియమస్థులని రూజ్వెల్టు తెలుసుకున్నప్పుడూ వాళ్ళ మాటను సాగనిచ్చేవాడు.

ఐసన్‌హోవర్ యూరప్‌లో మిత్రమండలి సర్వసైన్యాధ్యక్షుడుగా వున్నప్పుడు అతడిని రూజ్వెల్టు ట్యునిస్‌లో కలుసుకున్నాడు. అతడితో రాజకీయాలు మాట్లాడుతూ, ఫ్రాన్సులో దేశీయ పరిస్థితులనుగురించి ఒక నివేదికను తయారు చెయ్యమని రూజ్వెల్టు అడిగాడు. అది తన పనికాదని ఐసన్‌హోవరు వెంటనే సమాధానం చెప్పివేశాడు. రూజ్వెల్టు కొంచెం చిన్నపుచ్చుకొని 'అలాగా' అనేశాడు. ఆ తరువాత మళ్ళీ ఆ ప్రస్తావన తేలేదు.

ఒక పత్రికలో ఒక వ్యాసం అచ్చయింది. అది నిందాభిప్రాయిష్టంగా వుందని రూజ్వెల్టు అనుకున్నాడు. ఆ పత్రిక ప్రతులను సైనికులకు పంప వద్దని సైనిక శాఖాధ్యక్షుడుగా వున్న జనరల్ మార్షల్‌కు కబురు పంపించాడు. "వ్రాతమూలకంగా ఉత్తరువు ఇస్తే నేగాని, ఆ వుత్తరువును నేను మన్నించను. అలాటి వుత్తరువును వ్రాతమూలకంగా ప్రెసిడెంటు పంపించాడంటే దానికి జవాబుగా నా రాజీనామాను పంపిస్తాను" అని జనరల్ మార్షల్ బదులు చెప్పాడు.

తను చెప్పినదానికల్లా తందాన పదం పాడేవారిని ఎక్కువగా తన దగ్గర పెట్టుకొనే వాడని రూజ్వెల్టును కొంతమంది నిందిస్తారు. కాని, పైన చెప్పిన ఉదాహరణలనుబట్టి బాధ్యత, సమర్థత గలవారి అభిప్రాయాలు తన అభిప్రాయాలకు వ్యతిరేకంగా వున్నా, వారిని రూజ్వెల్టు మన్నించే వాడని స్పష్టపడుతుంది.

రూజ్వెల్టు ఉదాసీనత్వము, ప్రసన్నతా, మంచి తనము అతనికి గూఢ శత్రువులను కలిగించాయి. అతని శత్రువులు అతనిని గురించి రహస్యంగా అపవాదులను ఎన్నిటినో ప్రచారం చేసేవారు. అతడిని తీవ్రంగా ద్వేషించిన వారు 1930లో చాలమంది వుండేవారు. రూజ్వెల్టు వ్రాసిన పుస్తకాలను అమ్ముతావా అని ఆ పుస్తకాల ప్రచురణకర్తలు బాస్టన్‌లోని ఒక పుస్తక విక్రేతను అడిగితే, ఆ రచయిత చర్మాన్ని ఒలిచి దానితో ఆ పుస్తకాలను బైండుచేసి పంపితే, వాటిని అమ్ముతానని ఆ పుస్తకవిక్రేత జవాబు చెప్పాడట. రూజ్వెల్టు శత్రువులు అతడిని అంత తీవ్రంగా ద్వేషించేవారు.

రూజ్వెల్టుకు తీవ్రమైన జబ్బులు చేశాయనీ, అతడు చచ్చిపోవడానికి సిద్ధంగావున్నాడనీ అనేక పత్రికలు అసత్యప్రచారాన్ని చేసేవి. వీటన్నిటినీ అతడు అట్టే గమనించేవాడుకాదు. కాని, ఒకసారిమాత్రం పత్రికావిలేఖరుల సమావేశంలో యీవిషయాన్నిగురించి దీర్ఘప్రకటనచేసి, పత్రికాస్వాతంత్ర్యం గల దేశంలో, పత్రికలు తమ స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగంచేసి, కేవలం పచ్చి అబద్ధాలను ప్రకటించడం చాలా అసహ్యమైనపని అని చెప్పాడు.

రూజ్వెల్టు ఎవరినైనా తీవ్రంగా ద్వేషించాడా? అవునని గట్టిగా చెప్పడానికి వీలులేదు. ద్వేషించడం అనే తత్వం మాత్రం అతడిలో లేదు.

"ద్వేషించడం నా చేతకాదు" అని పత్రికా విలేఖరుల సమావేశంలో అతను ఒకసారి చెప్పాడు. వ్యక్తిగతమైన సంబంధాలలో మర్యాద, మాననీయత వుండాలని అతడు కోరేవాడు. ఈ రెండూ లేని వారిని అతడు సహించేవాడు కాడు. తనను నమ్మించి మోసం చేసినవారిని గాని, తన పట్ల అపచారం చేసిన వారినిగాని అతడు క్షమించే వాడు కాదు.

రూజ్వెల్టుకు సాధారణంగా కోపం వచ్చేదే కాదు. వస్తే అతిజోరుగా వచ్చేది. కాని, కొన్ని నిమిషాలలోనే కోపమంతా మాయమైపోయేది.

రాజకీయాలలో తన ప్రతికక్షులైన లాండన్ పట్లనూ, విల్కీ పట్లనూ అతడికి మంచి గౌరవం ఉండేది. అయితే హూవర్ అంటే అతడు అసహ్యించుకునేవాడు. అసహ్యంతో పాటే హూవర్ పట్ల జాలికూడా వుండేది. డ్యూయీ అంటే అతడికి కిట్టేది కాదు; కొంచెం బెదురుకూడా వుండేది. వెండెల్ విల్కీ మాత్రం రూజ్వెల్టును బాగా విసిగించేవాడు. 1944లో రూజ్వెల్టుతో పాటు అధ్యక్షపదవికి వెండెల్ విల్కీ పోటీ చేశాడు. ఎన్నికల ఫలితం రాత్రి తెలుస్తుంది. ఆ రాత్రి అడ్మిరల్ లీహీ. ప్రెసిడెంటు భవనంలో అతిథిగా వున్నాడు. రాత్రి పది గంటలకు తనకు వచ్చిన ఓట్లు అప్పటివరకు వచ్చిన లెక్కనుబట్టి తను గెలిచినట్లే అని రూజ్వెల్టు లీహీకి చెప్పాడు. తరువాత లీహీ అప్పటికే చాల అలసిపోయి పడుకోడానికి వెళ్ళాడు. కాని, నిద్రపట్టక రాత్రి రెండు గంటలకు ఒక గ్లాసు పాలు త్రాగుదామని మేడ దిగి వస్తూవుంటే రూజ్వెల్టు అప్పుడు పడుకో బోతున్నాడు. లీహీను చూసి, "తను ఓడిపోయానని ఆ లంజకొడుకు ఒప్పుకుంటాడేమోనని ఇంతసేపు మేలుకున్నాను" అన్నాడు రూజ్వెల్టు.

తనను గురించిన పత్రికా విమర్శలు సబబుగా వుంటే, అతడు బాధ పడేవాడు కాదు. అబద్ధాలు, అసహ్య ప్రచారాలు, అసూయాపూరిత భావాలతో నిండిన విమర్శలను చూసినప్పుడు చిన్న పిల్లాడు బాధపడి నంతగా బాధపడేవాడు.

పైన చెప్పిన ఎన్నికల నాటి రాత్రి అధ్యక్షుని భవనంలో జరిగిన ఉదంతం అంటూ ఒక పత్రిక కొన్ని అబద్ధాలను ప్రకటించింది. దానిలో 34 అబద్ధాలను రూజ్వెల్టు ఏరి చూపించాడు. ఆ పత్రికను తీవ్రంగా

సిండిస్తూ ఉత్తరం వ్రాస్తానని కూచున్నాడు. అధ్యక్షుడు ఒక చిన్న పత్రికకు అలా ఉత్తరం వ్రాయడం సబబు కాదని, ఆ ప్రయత్నం నుంచి అతణ్ణి విరమింప జెయ్యడానికి అతని అంతరంగిక మిత్రులకు తలప్రాణాలు తోకకు వచ్చాయి.

వామ పక్షపు రాజకీయాలను అవలంబించడం, ప్రజా బాహుళ్యపు సౌఖ్యం కోసం పోరాడడం రూజ్వెల్టుకు విజ్ఞాన ప్రతిభ వల్ల అలవడిన ఆశయాలు కావు. బాధపడే ప్రజలకు మేలు చేద్దామనే ఆవేదన వల్ల అతడు ప్రజల పక్షాన్ని వహించాడు. అతడు పెరిగిన రీతి, అతని కుటుంబపు సాంప్రదాయము—వీటిని చూస్తే, అతడు వామపక్ష రాజకీయాలను అవలంబించడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది. అతడి వామపక్ష రాజకీయాలు హేతువాదం మీద ఆధారపడిన ప్రజ్ఞా విశేషం వల్ల కాక, కేవలం భావోద్రేకాల మీద ఆధారపడినవి. అందుచేతనే, అతను అవలంబించిన కార్యక్రమాలు చాలావరకు పూర్ణమైన హేతువాదం మీద ఎంత మాత్రమూ నిలవ జాలనివిగా వుంటాయి.

ప్రజలకు ఒక తండ్రిగా ఉండాలని రూజ్వెల్టు కాంక్షించేవాడు. అందుచేతనే, ప్రజాసామాన్యపు సౌఖ్యంకోసం పాటుపడేవాడు. తనకు మరీ ప్రియమైనవాటికి ఉత్తరాలు వ్రాసేటప్పుడు చివరగ సంతకం పెట్టడానికి బదులు "నాన్న" అని వ్రాసేవాడు.

తమపట్ల రూజ్వెల్టు తండ్రిగా ప్రవర్తిస్తున్నాడనే కారణంవల్ల చాలామంది తమ బాధ్యతలను నిర్వహించేవారు కారు. "ఇంతకన్న మా చేతకాదు. ప్రెసిడెంట్ యీ పనిని సొంతం చెయ్యాలి" అని చాలా మంది ఉద్యోగులు ఊరుకొనేవారు.

జీవితమంటే రూజ్వెల్టుకు ఉత్సాహం ఉండేది. జీవితంలోని ఆనందాన్ని సంపూర్ణంగా అనుభవించాలనీ, అధ్యక్ష పదవిలోని ఆనందాన్ని పూర్తిగాఅనుభవించాలనీ అతడు బహు ఉత్సాహపడేవాడు. అమాయకంగా ఒక మిత్రునితో అతడొకసారి ఇలా అన్నాడు: "అవగలిగితే, ప్రెసిడెంటు అవుదామని నీకు కోరికఉండదూ? ఆ మాట కొస్తే, ఆ కోరిక ఎవరికి ఉండదు?"

# లోపాలు

రూజ్వెల్టుకు, మానవ మాత్రులందరికీ ఉండే సహజమైన లోపాలు లేకపోలేదు. అతనికిగల ముఖ్యమైన లోపం ఏమిటంటే, తాత్సారము. తన మనసులోని మాటను స్పష్టంగా పైకిచెప్పకపోవడం దీనికి ముఖ్యకారణం. తన ఎదుటివారి మనస్సును నొప్పించడానికి అతడికి ఇష్టంలేకపోవడమే.

ఒకటిచెప్పి మరొకటి చెయ్యడం అంటే అతడికి సరదా. ఉత్తరాన ఏదో ఊరికి వెళుతున్నానని చెప్పి, దక్షిణపు వైపున ఏ ఊరికైనా ప్రయాణం కట్టేవాడు. గమ్మత్తుకోసమని అతడు దగాచేసేవాడు. సాధారణంగా నైతికధైర్యం లేనివాళ్ళే దగా చేస్తారు. కాని, రూజ్వెల్టుకు గల నైతికధైర్యం అపారమైనది. అయితే మరి దగాలాగ కనిపించే పనులను అతడు ఎందుకు చేసేవాడు? తనచుట్టూ ఉన్నవారిని ఆశ్చర్య చకితులను చెయ్యడం అంటే అతనికి సరదా. పైగా అతని కార్యాలు విస్తారమైనవి. అతడు ఫలానపనిని చెయ్యబోతున్నాడని ముందుగానే తెలిస్తే, అతడు ఆ పనిని చెయ్యకపూర్వమే దానికి ప్రతిఘటనలు పుట్టుకువస్తవి. అందుచేత, తననిర్ణయాన్ని కడపటివరకూ దాచి, అనుకూల తరుణంలో ప్రకటించడం చాలా ముఖ్యం.

అతనికిగల మరొక లోపం ఏమిటంటే, అతడు తన నిర్ణయాన్ని దేనినైనా మార్చుకొన్నప్పుడు అలా ఎందుకు చేసేవాడో ఎవ్వరికీ వివరించి చెప్పేవాడు కాడు. "రూజ్వెల్టుతో మాట్లాడుతూ ఉన్నంతసేపూ, అతడు నీతో అంగీకరించినట్లే కనపడుతాడు. కాని, తీరా అతడు తననిర్ణయాన్ని స్పష్టంగా ప్రకటించే పనిని చేసినప్పుడు నీతో కొంచెంకూడా అంగీకారం చూపలేదని స్పష్టపడుతుంది" అని అతడికి ఆంతరంగికుడొకడు చెప్పాడు.

రూజ్వెల్టు న్యూయార్కు గవర్నరుగా ఉండగా ఒక బిల్లును శాసనసభ ఆమోదించింది. దానికి తాను ఒప్పుకోననీ, తిరగగొట్టి వేస్తాననీ తన సలహాదారుతో చెప్పి, రూజ్వెల్టు దానికి ఆమోదిస్తూ సంతకం పెట్టాడు. ఆ తరువాత, రూజ్వెల్టు అమెరికా అధ్యక్షుడయిన దాకా ఆ సలహాదారు అతణ్ణి కలుసుకోలేదు. అప్పుడతడు రూజ్వెల్టును చూసి, "ఈ సారి మీరు

ఏదైనా ఒకమాట చెప్పినప్పుడు దానిని కాగితంమీదవ్రాసి యిమ్మని అడగాలి” అన్నాడు. రూజ్వెల్టు చిరునవ్వునవ్వి “మనం ఏం చెయ్యబోతున్నామో, ఎవరికీ తెలియకుండా ఉండడం ఒక మేలుకాదా ?” అని జవాబు చెప్పాడు.

తన కార్యాలయంలో ఉన్న ఉద్యోగులు ఏ విషయాన్నిగురించి అయినా వాదోపవాదాలు జరపడం అతడికి ఇష్టం ఉండేదికాదు. కాని, అతడు చేసేపనులు చాలావరకు వాదోపవాదాలకు కారణం అయేవి.

తన ఉద్దేశాలను రూజ్వెల్టు స్పష్టపరచక పోవడంవల్ల, అతని మంత్రిమండలిలో మంత్రులు ఏ విషయంలో ఎలా నడచుకోవాలో తెలియక గందరగోళ పడేవారు. అంతేకాదు, కొంతమంది మంత్రులు తమలోతాము పోట్లాడుకొనేవారు కూడాను. తన ఉద్యోగులు, ఎప్పుడేం చెయ్యాలో తెలియక ఒక అయోమయపు పరిస్థితిలోపడి, ఏదో ఒకదారి చూపమని తన దగ్గరకు పరుగెత్తిరావడం అతనికి ఇష్టంగా ఉండేది.

యుద్ధ సమయంలో యుద్ధసామగ్రి ఉత్పత్తిని చురుకుగా సాగించడానికి నియమింపబడిన కమిటీలో పూర్తి అధికారం ఎవరిదో రూజ్వెల్టు ఎప్పుడూ స్పష్టపరచలేదు. అంచేత ఏ నిర్ణయం చెయ్యవలసి వచ్చినా, ఆ కమిటీ సభ్యులు తమలోతాము కీచులాడుకొని చిట్టచివరకు రూజ్వెల్టు దగ్గరకు పరుగెత్తవలసి వచ్చేది.

ఒకసారి కార్డెల్ హాల్ కూ, హెన్రీ మోర్గెంతోకు ఒక విషయంలో తీవ్రమైన అభిప్రాయ భేదంవచ్చి, వారిద్దరూ ఎడమొగం పెడమొగం పెట్టుకొని, అసలుపనిని నిర్ణయించకుండా పోట్లాడుకున్నారు. అప్పుడు వారిద్దరికీ చాలా తక్కువ తాబేదారుగాఉన్న ఒక ఉద్యోగిని పిలిచి “వాళ్ళిద్దరికీ కాస్త బుద్ధిచెప్పి, ఇద్దరూ కలిసి పనిచేసేటట్టు చెయ్యి” అని ఆజ్ఞాపించాడు రూజ్వెల్టు. ఆ ఉద్యోగి హడలిపోయి “నేను వెళ్ళి వాళ్ళిద్దరితోటీ వారి ప్రవర్తన పిచ్చిగాఉందని చెప్పడమే ?” అని దిక్కుతోచకుండా ఆక్రోశించాడు. రూజ్వెల్టు అతడివంక చూసి “నువ్వు వెళ్ళి ఆ పని చెయ్యకపోతే అసలు ఆ కమిటీని రద్దుచేసి మరొక కమిటీని నియమిస్తాను” అన్నాడు.

ఇలాటి వాటివల్ల రూజ్వెల్టు శత్రువులు అతడిని నిందించడానికి చాలా సాకులు దొరికేవి. అతడు నిజాయితీ లేనివాడనీ, అతడి మిత్రులే అతనిని నమ్మలేక పోయేవారనీ అతడి శత్రువులు ప్రచారం చేసేవారు.

అమెరికా సుప్రీంకోర్టుకు జడ్జిగా జోసెఫ్ రాబిన్సన్‌ను నియమిస్తానని రూజ్వెల్టు ఒక సెనెటర్‌కు చెప్పాడు. ఆ సెనెటర్ వెళ్ళి ఆ మాటను రాబిన్సన్‌కు చెప్పాడు. "రూజ్వెల్టు స్వయంగా నాతో చెపితేగాని, యీ మాట నేను నమ్మను" అని రాబిన్సన్ అన్నాడు. చివరకు అంతే అయింది. జడ్జి నియామకం జరిగేలోపల, పరిస్థితులలో ఏదోమార్పు జరిగింది. రాబిన్సన్‌కు ఆ ఉద్యోగం రాలేదు.

తాత్సారంతోపాటు ప్రతి విషయంలోనూ దాపరికం అంటే రూజ్వెల్టుకు చాలా సరదా. అధ్యక్షుడు చెయ్యబోయే పనులనుగురించి దాపరికం ఉండడంగూడా అవసరమే. కాని, చిన్నచిన్న ఉద్యోగాల విషయంలోకూడా తను ఉద్యోగాన్ని ఎవరికి ఇవ్వబోతున్నాడో ఆ మనిషికికూడా ఆ సంగతి తెలియకుండా వుంచి, ఆఖరుకు ఉద్యోగం యిచ్చిన ఉత్తరువు వచ్చినపుడు ఆ వ్యక్తి చకితుడయేటట్టు చెయ్యడం అతనికి పరిపాటి. ఒకానొక ఉద్యోగానికి ఒక వ్యక్తిని రూజ్వెల్టు నియమించినట్టు రేడియోలో ప్రకటన జరిగితే. విని ఆ వ్యక్తి ఆశ్చర్యపోయాడు, "మీకు, అధ్యక్షుడు ఫలానా ఉద్యోగం ఇస్తున్నాడు. మీరు, ఏ వూరులో ఉండడం మీకు యిష్టం" అని రూజ్వెల్టు ఆఫీసునుంచి కబురు వచ్చినప్పుడు ఆ వ్యక్తులు చకితులయేవారు.

అందుకే రూజ్వెల్టు మిత్రుడొకడు అతడితో "నాకేదైనా కొత్త ఉద్యోగం ఇచ్చేటప్పుడు నాతోటి ముందుగా చెప్పకుండా చెయ్యవద్దు. ఇదే నేను మిమ్మల్ని కోరే వరం" అని చెప్పుకున్నాడు.

ప్రభుత్వాధికారులను . గురించీ, ప్రభుత్వ కార్యక్రమాలను గురించీ వీలైనంత సమాచారాన్ని ఇతరుల వద్దనుంచి తెలుసుకొని ప్రభుత్వోద్యోగులకు ఆ విషయాలను గురించి తాను తెలుసుకున్న సంగతులను చెప్పి వారికి ఆశ్చర్యం కలిగించడం అంటే రూజ్వెల్టుకు బహు

ప్రీతి, అయితే, ఎవరైనా చెప్పిన మాటలను అతడు సులభంగా నమ్మే వాడు. కొన్ని సందర్భాలలో నమ్మదగనివారి మాటలనుకూడా నమ్మి ఉద్యోగులను సంకటం కలిగించేవాడు.

మానవమాత్రుడే గనుక, మానవులకు సహజమైన లోపాలు ఎన్నో అన్నీ రూజ్వెల్టుకు ఉన్నాయి. కక్ష మనసులో పెట్టుకొని తనకు అపకారం చేసినవారిని ఎప్పటికీ మరిచిపోక పోవడం, వాగ్దానాలను నెరవేర్చక పోవడం కూడా రూజ్వెల్టుకు గల లోపాలలో కొన్ని. లూయీ జాన్సన్ అనే ఉద్యోగికి యుద్ధశాఖమంత్రి పదవిని ఇస్తానని ఆశపెట్టి అతడు రాజీనామా ఇవ్వకుండా చేశాడు. కాని, జాన్సన్‌కు మంత్రిపదవి మాత్రం ఇవ్వలేదు.

ప్రభుత్వ పరిపాలన అంతాకూడా ఇంకొకరి నిర్ణయాలకు ఎవకా మివ్వకుండా తన వొక్కడి చేతిమీదుగా నడిపేవాడు రూజ్వెల్టు. "పరిపాలనా నిర్వహణంలో రూజ్వెల్టు మనసులో ఏముందో అదే ప్రధానంగాని, మరేదీ ప్రధానంగాదు" అని హ్యారీ నాలెజ్ ఒకసారి అన్నాడు.

తన తరువాత పరిపాలనా నిర్వహణకు సమర్థులైనవారిని తయారు చెయ్యడానికి రూజ్వెల్టు ఎప్పుడూ శ్రద్ధ తీసుకోలేదు. తన ఉద్యోగులలో ఎవరైనా కాస్త ఎక్కువగా ప్రసిద్ధి పొందుతున్నారంటే వారిని మెల్లగా క్రిందకు దించేవాడు. ఇదే సూత్రంలో అధ్యక్షపదవికి తనకు ప్రత్యర్థులు కాబోతారని తనకు అనుమానమున్నవారిని రంగంలోనుంచి పైకి నెట్టి వేశేవాడు.

రూజ్వెల్టు ఒక్కొక్కప్పుడు విపరీతంగా చిరాకుపడేవాడు. ఒక్కొక్కప్పుడు అతి సులభంగా ఇతరుల టోపీలో పడిపోయేవాడు. ఒక్కొక్కప్పుడు అతి తొందరగా పొరపాటు నిశ్చయాలు చేసుకొనేవాడు. అతడికి కొంత దంభంకూడా లేకపోలేదు. కొన్ని సందర్భాలలో అతడు ప్రపంచానికంతకూ సార్వభౌముణ్ణనుకున్నట్లుగా ప్రవర్తించేవాడు. ప్రెంచి రాజకీయాలను గురించి మాట్లాడుతూ ఒకసారి "ట్యూలిప్ నా ఏం చెయ్యా

అనే విషయంలో నే నింకా ఏమీ నిశ్చయించలేదు" అన్నాడు రూజ్వెల్టు గ్రహించి సామ్రాజ్యమంతా తనదైనట్లు!

రూజ్వెల్టుకు ఉన్న మరొక గొప్పలోపం ఏమిటంటే కృతజ్ఞత చూపకపోవడం. అతడు ఎవరికీగూడా ఏ సందర్భంలోగూడా తప్పనిసరి అయితే తప్ప "థాంక్స్" చెప్పలేదని చాలామంది అంటారు. చాలా మంచివాళ్లు అతనికి సేవజేసి, ప్రతిఫలం ఏమీ లేకుండా నిరాశపొందినవాళ్లు చాలామంది ఉన్నారు. చాలా మంచిపని చేసినవాళ్ళని కూడా, చాలా ముక్తసరిగా పొగిడే ఆక్షేప ఉన్నతపదవులు కాకుండా వాళ్ళని ఒక మెట్టు క్రిందకు దింపి ఉంచేవాడు రూజ్వెల్టు.

తన స్నేహితులను చాలామందిని నడిదారిలో వదిలిపెట్టి, తన శత్రువులలో కొంతమందిని తన దగ్గరకు చేర్చుకొని, శత్రువులను మంచి చేసుకోడానికి రూజ్వెల్టు ప్రయత్నం చేసేవాడని కొంతమంది అంటారు. కాని, తన వ్యక్తిగత అభిప్రాయాలు, స్నేహ గౌరవాలను, అధ్యక్షుడుగా తన విధులను నిర్వర్తించేటప్పుడు అతడు ఎంతమాత్రమూ సరకు చెయ్యలేదనే మాటను ఎవరూ మరిచిపోకూడదు. అధ్యక్షుడుగా తన పదవిని నిర్వహించేటప్పుడు యోగ్యమైన పదవులకు అర్హులని తోస్తే తన శత్రువులైనా అతడు ఆ పదవులను ఇవ్వవలసిందే. అలా చేసినందుకు ఆక్షేపణ ఏమీ ఉండరాదు. అధ్యక్షుడుగా ఉన్నంతవరకు అతడు ప్రజాస్వామ్య సూత్రాలను అవలంబించాలి. అలాంటి సందర్భంలో స్నేహితులను వదలి, శత్రువులకు కొంతమందికి లాభం కలిగేటట్లు ప్రవర్తించడంలో అక్రమము ఏమీలేదు. పైగా, ఏదైనా ఒక ప్రయోజనం తనకు కలుగనివ్వలేదని నిజమైన స్నేహితుడెవ్వడూ కోపగించుకోబోడు. శత్రువులైనవాళ్ళు తమకు అర్హతలన్నీ ఉన్నా తమమీద వ్యక్తిగతమైన పగను సాధించడానికిగాను తమకు ఇవ్వవలసిన పదవులను ఇవ్వడంలేదని అనగలరు.

ఇక కృతజ్ఞత చెప్పడమా! అధ్యక్ష పదవిలోఉన్న వాడు, అంటే అధ్యక్షునికి ఎవరైనా ఒకపనిని సానుకూలం చేసిపెడితే అధ్యక్షుడు కృతజ్ఞత చెప్ప నవసరంలేదు. ఏమంటే అధ్యక్షుడు ఒకపదవిగాని ఒక వ్యక్తి కాదు.

# అతివాగుడు

రూజ్వెల్టు అతిగా మాట్లాడేవాడు. అయితే, ఎక్కువగాను, బాగాను మాట్లాడేవారందరిలాగానే, అతడు ఎక్కువగా వినేవాడు కూడాను. అది అవసరంకూడా. సమర్థుడైన పరిపాలకుడు అన్ని విషయాలను వీలైనంత ఎక్కువమందిద్వారా వినాలి. అయితే, అస్తమానం మాట్లాడుతూ వున్నట్లు కనిపించే రూజ్వెల్టు, ఇతరుల మాటలను ఎప్పుడు వినేవాడా అని అందరికి ఆశ్చర్యం వేసేది.

ప్రెసిడెంటు భవనంలో సమావేశాలకు వెళ్లిన చాలామంది ప్రముఖులు, ఆ సమావేశాలలో ఒక్కమాటకూడా మాట్లాడడానికి రూజ్వెల్టు తమకు అవకాశం ఇచ్చేవాడు కాదనీ, అస్తమానం తనే మాట్లాడే వాడనీ చెప్పేవారు. అలాటి సందర్భాలలో తాము చెప్పదలచుకున్న మాటలను నాలుగింటినీ చెప్పడానికి వారు ప్రత్యేకం ఏవో పన్నాగాలను పన్నవలసి వచ్చేదట.

"అయిదు నిమిషాలు అతణ్ణి మాట్లాడనిచ్చి, ఆ తరువాత నిర్దాక్షిణ్యంగా జోక్యం కలిగించుకొని నేను చెప్పదలచుకున్న దేదో చెప్పివేశేవాణ్ణి", అని ఒక సుప్రసిద్ధ జడ్జి అన్నాడు.

భోజనం చేసేటప్పుడు రూజ్వెల్టు సాధారణంగా ఏమీ మాట్లాడేవాడు కాడు. అంచేత, అతడు బాగా వినేటట్టు అతడికి ఏమైనా చెప్పదలచుకున్న వారు అతడితో సహపంక్తి భోజనానికి కూచునేవారు. అతడు నోటిలో ఒకముద్ద పెట్టుకోవడంచూసి, అదే తరుణమని తాము చెప్పదలచుకున్న దేదో గబగబ చెప్పేవారు. రూజ్వెల్టుకు యీ సంగతి తెలుసు. అంచేత, అవతలి వ్యక్తి మాట్లాడుతూ వుండగా మధ్యలో, 'ఏమిటది, నువ్వు వొక్కముద్ద కూడా తినడంలేదే' అని అడిగేవాడు.

తన వాగ్ధోరణిని రూజ్వెల్టు అనేక విధాలుగా వుపయోగించుకొనేవాడు. ఏదైనా సమావేశంలో సభికులంతా తీవ్రమైన వాదోపవాదాలలో వుంటే, ఆ తీవ్రతను తగ్గించడానికి, ఏదో ఒక కథ చెప్పేవాడు. ఈ పద్ధతి తెలియని అపరిచితు లెవరైనా రూజ్వెల్టుతో మాట్లాడడానికి

వచ్చి, తీవ్రమైన సంభాషణ మధ్య అతడు ఏదో కట్టుకథ చెప్పడం ప్రారంభించే సరికి, తాము వచ్చిన అసలు సంగతిని రూజ్వెల్టు మరిచిపోయా డనుకొని దిగాలుపడేవారు. అలా ఒక కథను చెప్పి, మళ్ళీ మొదటికివచ్చి అసలు సంభాషణను మధ్యలో ఎక్కడ ఆటంక పరచాడో అక్కడే మళ్లీ ఎత్తుకొని, తననిర్ణయాన్ని చెప్పివేసి, సంభాషణను ముగించివేసేవాడు రూజ్వెల్టు.

అలా చెయ్యడంలో ఒక పెద్ద యెత్తువుందని చాలామంది అనేవారు. ఎదుటివాడు వచ్చినపనిని గ్రహించిన తరువాతే, అతడు చెప్పేదానిని చెప్పనిచ్చి, ఎక్కువ తోమకుండా మధ్యలో ఒక కథచెప్పడం ఆరంభించి, ఆకథ చెబుతూ వున్నంతసేపూ, ఎదుటివాడి పనినిగురించి తను ఏంచెయ్యాలో నిర్ణయించుకుంటూ, తను ఒక నిర్ణయానికి రాగానే అది చెప్పివెయ్యడానికి యీ పద్ధతి రూజ్వెల్టుకు బాగా అనుకూలించేదట.

అంతేకాక, ఎదుటివారు చెప్పే సంగతిని వినడం తనకు ఇష్టం లేనప్పుడుకూడా, వేరే యేదో ప్రసంగాన్ని తెచ్చిపెడితే, ఎదుటివాడి నోటికి తాళంవేసి నట్లవుతుంది కదా! అలా చెయ్యడంలోకూడా రూజ్వెల్టు చాలా నేర్పరి.

చెప్పిన సంగతినే, చెప్పిన కథనే మళ్లీమళ్లీ చెపుతూ వుండేవాడు రూజ్వెల్టు. ఇది అతని స్నేహితులకు బహు వినుగుపుట్టించేది. హాకీ హాప్కిన్స్ రూజ్వెల్టుచెప్పే కథలలో కొన్నిటిని ముప్ఫయి, నలభైసార్లు వినివుంటాడు. సోమవారంనాడు విందుకు వచ్చిన పెద్దమనిషికి చెప్పిన కథనే, మంగళవారంనాడు విందుకు వచ్చిన మరో పెద్దమషికి రూజ్వెల్టు చెపుతూవుంటే, రెండు విందులకూ హాజరైన హాప్కిన్స్‌కు తలనొప్పి కాక మరేమిటి?

రూజ్వెల్టుచెప్పే కథలన్నీ చాలావరకు శరీర బలాన్ని గురించినవీ, రాజులు, రాణులు మొదలైన గొప్పవారిని గురించినవీ, అనేక క్లబ్బులలో చెప్పకొనే మాటలను గురించినవీ అయివుండేవి.

మొట్టమొదటిసారి తనను కలుసుకోడానికి వచ్చిన ప్రతివ్యక్తికీ రూజ్వెల్టు తన ఆఫీసులోని తన వ్రాతబల్లను చూపించేవాడు. ఆ బల్లలో

ఎన్ని అరలు వున్నవీ, ఎన్నిమరలు వున్నవీ, ఏ అరను ఎప్పుడు పెట్టించినదీ, ఏ మరను ఎప్పుడు, ఎందుకు పెట్టించినదీ విస్తారంగా వివరించి చెప్పేవాడు.

రూజ్వెల్టు దృష్టిని ఆకర్షించి, అతడిని తన మాటలు వినేటట్లు చెయ్యాలని ఎవరైనా కోరినట్లయితే, వారు చెయ్యవలసినది ఏమిటంటే, అతడికి బాగా తెలిసిన విషయంలో కొత్తసంగతులు చెప్పాలి.

రూజ్వెల్టు మాట్లాడకుండా నోటికి తాళం వేసుకున్నట్లు కూచున్న సందర్భం ఒకే ఒకటివుంది. అది, అతడు అధ్యక్షుడుగా మొట్టమొదటిసారి ఎన్నుకోబడిన తరువాత పదవీ స్వీకరణకు, అప్పుడు పదవిని తనకు ఒప్పజెపుతున్న ప్రెసిడెంటు హూవర్‌తో ఊరేగినప్పుడు. కారులో ఇద్దరూ కూచున్నారు. పదవిని కోల్పోయిన హూవర్, కారులో ముడుచుకొని కూర్చొని, తన మాటలకు జవాబు చెప్పక పోయేసరికి రూజ్వెల్టుకూడా, మాట్లాడకుండా కూర్చోవలసి వచ్చింది.

అంత అతిగా మాట్లాడే రూజ్వెల్టు, చర్చిల్‌ను అతివాగుడు మనిషి అని అనుకోవడం చాలా చిత్రంగానే కనిపిస్తుంది.

ఎంత అతిగా మాట్లాడినా, ముఖ్యమైన రాచకార్యాల విషయంలో మాత్రం, రూజ్వెల్టు ఎప్పుడూ అవ్యక్తతను చూపలేదు. యుద్ధకాలంలో, ఒక మహత్తర కార్యప్రారంభానికి సంబంధించిన స్వల్ప విషయాలు అనేకం వుంటాయి. ఏ స్వల్పవిషయాన్ని బయటపెట్టినా, అసలు ప్రయత్నమేమిటో బయట పడిపోవడానికి అవకాశం వుంటుంది. అలాంటి స్వల్ప విషయాలను కూడా రూజ్వెల్టు ఎప్పుడూ బయటపెట్టలేదు. ఒక ప్రత్యేక విషయాన్ని గురించి చెప్పాలని అతడు ముందుగా అనుకుంటే తప్ప, పొరపాటున ఏ విషయాన్నీ అతడు బయటపెట్టలేదు.

రూజ్వెల్టు అంత ఎక్కువగా ఎందుకు మాట్లాడేవాడు? కాళ్లు అవిటిపడి నడవలేక పోవడం ఒక కారణం; పైగా, పనిశ్రమను పోగొట్టుకోడానికి అదివొక వుపాయం.

ఎదైనా తీవ్రమైన సమస్యను గురించి వాదోపవాదాలు జరుగుతున్నప్పుడు, సామాన్యవ్యక్తి అయితే తను కూర్చున్నచోటినుంచిలేచి,

గదిలో ఒక మూలనుంచి మరొక మూలకు పచారు చెయ్యడం వల్లగాని, తన పక్కలో ఒక్క ప్రక్కనుంచి మరొక ప్రక్కకు పొర్లిగిల్లడం వల్లగాని, కాళ్లను ముందుకు వెనకకు ఆడించడంవల్ల గాని మానసికోద్రేకాన్ని కొంతవరకు ఉపశమింప జేసుకోగలడు. కాని, రూజ్వెల్టు కాళ్ల అవిటితనంవల్ల ఇవేవీ చెయ్యలేక పోయేవాడు. అంచేత, ఏవో కథలను చెప్పడంవల్లనూ, అసలు సమస్యకు సంబంధించని కబుర్లు చెప్పడంవల్లనూ, ఇతర విషయాలను గురించి ప్రశ్నలు వేయడంవల్లనూ రూజ్వెల్టు తన ఉద్రేకాన్ని తగ్గించుకొని, మనస్సుకు ఒకవిధమైన తెరిపిని కల్పించేవాడు.

రూజ్వెల్టుకు గల మరొకగుణం ఓపిక. ఇది కొన్నిసందర్భాలలో సుగుణంగానూ, కొన్ని సందర్భాలలో దుర్గుణంగానూ పరిణమించేది. కొన్ని చిక్కులను దాటాలంటే, వాటిని విడదియ్యడానికి ప్రయత్నించడం కంటే, వాటిని వాటంతట అవే విడిపోయేదాకా ఓపికపట్టి వుండడం మంచిదని అతడి ఉద్దేశం. ఇది కొన్ని సందర్భాలలో బాగా పనిచేసేది; కొన్ని సందర్భాలలో ఎదురు తిరిగేది.

క్రూరమైన పక్షవాతపు జబ్బు అతడికి ఓపికను నేర్పింది.

ఓపికతో కొన్ని చిక్కులను గడపడానికి అతడు ఏమీ చెయ్యకుండా కూచున్నా, సమయాన్ని గుర్తెరిగి సరియైనకాలంలో సరియైనపని చెయ్యడంలో అతడిప్రజ్ఞ అసామాన్యమైనది.

ప్రజలు కోరేది ఏమిటో ప్రతి రాజనీతిజ్ఞునికీ తెలుసు. కాని, వారు కోరేదానిలో ఎంత వారికి ఇవ్వాలో, ఆ యిచ్చేదాన్ని ఎప్పుడు ఇవ్వాలో రూజ్వెల్టుకు బాగా తెలుసు.

అంచేతనే ప్రజలు ఇకముందు ఏది అడుగబోతారో ముందుగానే ఆలోచించి, తదనుకూలంగా శాసనలను ప్రవేశపెట్టడంలో రూజ్వెల్టు చాలా నేర్పు చూపేవాడు.

ఏ అధ్యక్షునికీ గూడా, బయట కులాసాగా తిరగడానికి తగినంత వ్యవధి ఉండదు. రూజ్వెల్టు అధ్యక్షుడుగాఉన్న పన్నెండేళ్ళలోనూ ఏదో ఒక తీవ్రసమస్య లేకుండా గడిచిన రోజులు బహుకొద్ది. విధి విరామం

లేకుండా, మరలాగ అతడు పనిచేశాడని ఎవరూ అనరుగాని అతను చేసినపని, ప్రాణాలను తోడేటంత పనిమాత్రం అవును.

1945 లో ఒకరోజున అతడు హైడ్ పార్కునుంచి వైట్‌హౌసు (ప్రెసిడెంటు భవనం) కు ఉదయం 10_25 నిమిషాలకు వచ్చాడు. వైట్ హౌసునుంచి, వాం స్ప్రింగ్స్‌కు మధ్యాహ్నం 3.15 నిమిషాలకు బయలుదేరాడు. ఆ మధ్యలో అతడు చేసినపనులు ఇవి: జోనాథన్ డేనియల్ చేత, తన ప్రెస్ శెక్రటరీగా పదవీ స్వీకారం చేయించాడు; సెనెటర్ బార్క్లీతో చాలాసేపు మాట్లాడాడు; ఒక బ్రిటిషు ప్రతినిధ వర్గానికి దర్శనమిచ్చాడు; యునైటెడ్ నేషన్సులో రష్యాకు మూడు స్థానాలు ఇవ్వబడుతవని ప్రకటింపబడిన వార్త, ప్రభుత్వ రహస్యాన్ని బయట పడవేసిందని, దానిని గురించి తగినచర్య తీసుకున్నాడు. ఆ వార్తను గురించి ప్రభుత్వంచేసే ప్రకటన ముసాయిదాను సవరించడానికి శ్రమపడ్డాడు; తన బంధువు ఎవరో వస్తే అతనితోకలిసి భోజనంచేశాడు; సుమారు ముప్ఫయి దస్తా వేజులను చదివి, అర్థం చేసుకొని వాటికి అంగీకారాన్ని తెలియజేస్తూ సంతకంపెట్టాడు. ఒక పత్రికా ప్రకటనలో తప్పు కనిపెట్టి, తన సలహాదార్లను ఇద్దరిని పిలిచి ఆ తప్పును సవరించమని చెప్పాడు.

రూజ్వెల్టు రోజూచేసే పనినిచూసి సెనెటర్ హాచ్ నిర్ఘాంతు డయాడు. "అతడు చేసేపనిలో అరవయ్యోవంతు పనికంటె మాకు ఉండదు. దాంట్లో సగంపని చేసేటప్పటికే మాకు ప్రాణాలు పోతాయి. ఇంతపని ఇతడొక్కడూ ఎలాచేస్తున్నాడు?" అని ఆశ్చర్యపోయాడు.

ప్రభుత్వశాఖలో ఒక అసిస్టెంటు శెక్రటరీ ఒకసారి ఇలా అన్నాడు. "చాలా చిక్కుసమస్య ఏదైనా వచ్చినప్పుడు దానిని తేల్చి ఏదోఒక నిర్ణయానికి వద్దామని మేము ఇద్దరు ముగ్గురం ఆలోచించి, ఏమీ తెమలక ప్రాణాలువిసిగి ఉద్యోగానికి రాజీనామా ఇచ్చిపోదామన్నంత చిరాకు పుట్టి, చివరకు గత్యంతరంలేక, ప్రెసిడెంటు దగ్గరకు వెళ్ళేవాళ్ళము. ఇరవై నిమిషాలలో ఆయన ఆ చిక్కును విడదీసేవాడు. ఇలా రోజుకు అరడజను సార్లయినా ఏదో ఒక ప్రభుత్వ శాఖవారు ఆయనదగ్గరకు వెడుతూనే ఉండేవారు."

ఒక్కొక్కప్పుడు రూజ్వెల్టు విపరీతంగా అలసిపోయేవాడు. ఏదైనా ఒక సమావేశం జరిగిన తరువాత, అతడిముఖం చూసినవారికి కడుపు తరుక్కుపోయేది. కాని, మళ్ళీ పదినిమిషాలలో ప్రపంచపు భారాన్నంతటినీ మొయ్యగలిగినంత ప్రసన్నంగా కనపడేవాడు.

తనశక్తిలో రూజ్వెల్టుకుగల విశ్వాసం అమోఘమైనది. సహజంగా అతడిది నిరాశ యెరుగని తత్వము. దానికితోడు అతడు అసాధారణవ్యక్తి. ఈ రెండూ కలిసి అతడికి స్వశక్తిలో అమోఘమైన విశ్వాసాన్ని కలిగించినవి. "ఏ విషయాన్ని గురించి అయినా మూడుగంటలసేపు ఆలోచించి, నేనొక నిర్ణయానికి వచ్చానంటే నా నిర్ణయం సరిఅయినదని నాకు నమ్మకం కలిగినదంటే ఆ తరువాత ఆ విషయాన్ని గురించి మూడు సంవత్సరాలు ఆలోచించినా, నా నిర్ణయాన్ని నేను మార్చుకోవలసిన అవసరం ఉండదు," అని రూజ్వెల్టు ఒకసారి ఒక మిత్రుడితో చెప్పాడు.

తన శక్తిలో తను విశ్వాసాన్ని కలిగివుండటమే కాక, ఇతరులకు కూడా అతడు ఆ విశ్వాసాన్ని కలిగించేవాడు. తన సలహాదార్లకు ఉత్సాహాన్ని కలిగించి అసాధ్యమైనపని ప్రపంచంలో ఏదీలేదని వారికి నమ్మకం గలిగించడంలో రూజ్వెల్టు అందెవేసిన చెయ్యి.

"మనుష్యులు సాధించలేని కార్యం అంటూ ఒకటి ఉందని అతడు ఎప్పుడూ అనుకోగా నేను వినలేదు," అని రూజ్వెల్టు సతి చెప్పింది.

రూజ్వెల్టును ఒక మహానటుడని చెప్పవచ్చును. ఆ మాట ఒకసారి అతడే అన్నాడు. సుప్రసిద్ధ సినిమానటుడు ఆర్సన్ వెల్స్‌తో అతడన్న మాటలివి: "ఆర్సన్, అమెరికాలో నిన్నూ నన్నూ మించిన నటుడు లేడు."

తను అవలంబించవలసిన విధానాలను మార్చడంలో అతడు అప్పుడప్పుడు కొంత మెత్తదనంచూపినా తను సాధించవలసిన కార్యాలను గురించి మాత్రం మొండిపట్టుదల చూపేవాడు.

అతడు చాలా శ్రమను ఓర్చుకోగలిగేవాడు. ఎంత శ్రమపడినా ఇక పనిచెయ్యలేననే భావం అతడికి ఎప్పుడూ కలిగేది కాదు. ఒకసారి

ఎన్నికల ప్రచారం చేసేటప్పుడు అతడు ఏడువారాలలో 13.000 మైళ్ళు ప్రయాణం చేశాడు. తన కార్యక్రమాన్ని వివరిస్తూ 16 పెద్ద ఉపన్యాసాలనూ, 67 సాధారణ ఉపన్యాసాలనూ, లెక్కలేనన్ని చిన్న చిన్న ఉపన్యాసాలనూ చేసాడు. తనతోపాటు ఒక స్టేషనునుంచి మరొక స్టేషనుకు రైలులో ప్రయాణంచేసిన కొన్నివందలమంది సెనేటర్లతోను, గవర్నర్లతోను, మేయర్లతోను, అనేకమంది ఛోటా నాయకులతోను, రైతులతోను, గనులలోని కార్మికులతోను, వ్యాపారస్తులతోను, బ్యాంకుల యజమానులతోను, పత్రికల యజమానులతోను, పత్రికా విలేఖరులతోను, సాంఘిక సేవకులతోను మాట్లాడాడు. అంత చేసినా దారిపొడుగునా హుషారుగానే ఉన్నాడు. "నాకు అలసట అనేది లేదు." అని అతడు ఒకసారి గవర్నర్ నాక్స్‌కు వ్రాశాడు. అతడు రోజుకు 14 గంటలసేపు పనిచేసేవాడు.

నేను అధ్యక్షుణ్ణిగదా అని అతడెప్పుడూ విర్రవీగలేదు. కాని, తన గౌరవానికీ, తన దేశపు గౌరవానికీ భంగం కలిగించడానికి ఎవరైనా ప్రయత్నించినట్లయితే, వారికి సిగ్గువచ్చేటట్లు చెయ్యడంలో ఎప్పుడూ అతడు వెనుకాడలేదు.

అమెరికాకు టెలిఫోనులో మాట్లాడాలంటే, తన బసలోనుంచి కాక, టెలిఫోను ఆఫీసుకువచ్చి అక్కడనుంచి మాట్లాడాలని మాస్కోలోని అమెరికన్ రాయబారిని ఇబ్బంది పెట్టడానికి రష్యనులు ప్రయత్నిస్తే వాషింగ్టన్‌లోని రష్యను రాయబారిచేతకూడా అలాగే చేయిస్తే రష్యనుల తిక్క కుదురుతుందని అతడు సూచించాడు.

సంపూర్ణాధికారం చేతిలోకి వచ్చినా, అధికార ప్రమత్తత గనుక వచ్చినదంటే ప్రమాదం కలుగుతుందని రూజ్వెల్టుకు తెలుసు. న్యూయార్కు నుంచి సెనేటుకు ఎన్నిక కావడానికీ, 1920 లో వైస్ ప్రెసిడెంటు పదవికి పోటీ చెయ్యడానికీ తన పార్టీలో అసలు అభ్యర్థిత్వానికి పోటీ చేసినప్పుడే తాను ఓడిపోయిన సంగతిని అతడెప్పుడూ మరిచిపోలేదు. అంచేతనే రాజకీయాలలో తనబలం ఎప్పుడూ సన్నగిలకుండా ఎవరిని ఎంతవరకు కనిపెట్టి ఉండాలో అతడు ఎప్పుడూ విస్మరించలేదు.

సాంప్రదాయాలకు భిన్నంగా ప్రవర్తించడం అంటే అతడికి బహు మమకారం ఉండేది.

అధ్యక్ష పదవికి పోటీ చెయ్యడానికి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా ఇతణ్ణి ఆ పార్టీ మహాసభ ఎన్నుకొన్నప్పుడు స్వయంగా వెళ్ళి ఆ నియామకత్వాన్ని అంగీకరించిన అధ్యక్షు డితడే. అధ్యక్షుడయిన తరువాత మంత్రులందరినీ విడిగా ఒక్కొక్కరినిగాక అందరినీ ఒక్క సారిగా ప్రమాణ స్వీకారం చేయించిన మొదటి అధ్యక్షు డితడే. యుద్ధకాలంలో తన దేశంనుంచి విదేశాలకు ప్రయాణంచేసిన మొదటి అధ్యక్షు డితడే. ఒక స్త్రీని మంత్రిగా నియమించిన మొదటి అధ్యక్షు డితడే. విమానంలో ప్రయాణంచేసిన మొదటి అధ్యక్షు డితడే. క్రొత్త పంథాలను త్రొక్కడం అంటే అతడికి ఎప్పుడూ సంకోచం ఉండేది కాదు. నూతన భావాలంటే అతడు బహు యిష్టపడేవాడు.

అమెరికాలోని ఒక వారపత్రిక సంపాదకుడికి ఒక నూతనమైన ఆలోచన తట్టింది. అదేమిటంటే, ఇంగ్లండురాణి ఎలిజబెత్ చేత తన పత్రికకు ఒక వ్యాసం వ్రాయించుదామని. అతడంటే రూజ్వెల్టుకు అభిమానం ఉండేది. అంచేత, అతడు వెంటనే రూజ్వెల్టువద్దకు వచ్చి తన ఆలోచనను తెలియజేశాడు. ఆ ఆలోచన విని రూజ్వెల్టు ముచ్చట పడ్డాడు. అయితే ఒక షరతు పెట్టాడు. ఆ వ్యాసాన్ని అమెరికాలో బ్రిటిషు రాయబారిగా ఉన్న హాలిఫాక్సు ప్రభువుద్వారా తెప్పించవలసి ఉంటుందని. వెంటనే ఆ సంపాదకుడు హాలిఫాక్సు ప్రభువుదగ్గరకు వెళ్ళి, రూజ్వెల్టు ఉద్దేశాన్ని తెలియపరచాడు. అది విని హాలిఫాక్స్ మూర్ఛ పోయినంత అయి తెప్పరిల్లుకున్నాడు. ఏలాగయితేనేం, వ్యాసం తయారయింది. (ఆ వ్యాసాన్ని, రాణియే స్వయంగా వ్రాసిందా అన్న సంగతి ఎవరికీ ఇప్పటికీ తెలియదు.) వ్యాసం అచ్చుకూర్పు జరిగింది. కాని, ఆఖరు క్షణంలో బ్రిటిషుప్రభుత్వ విదేశాంగ కార్యాలయంవారు ఆ ప్రకటనను తీవ్రంగా ప్రతిఘటించారు. చివరకు, ఆ వ్యాసం పత్రికలో అచ్చు కాలేదు. ఇది చాలా సిగ్గుచేటు అని రూజ్వెల్టు అనుకున్నాడు.

తన పదవిలో తనకు ఏమాత్రం సంబంధంలేని అనేక విషయాలను గురించి అతడికి ఎంతో ఎక్కువగా తెలుసును. అంతేగాక, అతడికి గొప్ప జ్ఞాపకశక్తి ఉంది. అంచేత, ఏదైనా ఒక సమస్యనుగురించి ఆలోచించే టప్పుడు, దానికి సంబంధించిన అనేక పిల్లసమేకీలను గూడా అతడు పరిగణించేవాడు. అతడి అనుభవాలను వేటినీగూడా మరిచిపోయేవాడు కాడు. అవసరం వచ్చినప్పుడు తన పాత అనుభవా న్నంతటినీ వినియోగించుకొనే వాడు.

ప్రతి విషయాన్నిగురించీ అతడికి కొద్దో గొప్పో తెలుసును. అయితే, అతడికి బాగా తెలిసిన విషయాలు మూడు: రాజకీయాలు; అమెరికా దేశచరిత్ర; భూగోళశాస్త్రము. అమెరికా రాజకీయాలను గురించి రూజ్వెల్టుకన్న ఎక్కువ తెలిసినవా రెవరూ లేరు.

అమెరికాపటం తీసుకొని ఒక మూలనుంచి మరొక మూలకు ఎన్ని వంకరలతో నైనాసరే ఒక గీతను గీస్తే ఆ గీత ఏ ఏ రాష్ట్రాలగుండా గీయబడినదో, వరసతప్పకుండా చెప్పేవాడట రూజ్వెల్టు.

ఆంగోలానుగురించి వివరాలు కావాలని అతడు తన ఉద్యోగులను అడిగాడట. పదిహేనురోజులు కష్టపడి వివరాలన్నిటినీ సంపాదించి ఆ ఉద్యోగులు రూజ్వెల్టుకు ఒక నివేదిక యిచ్చారు. వారు వ్రాసిన దానికన్న రూజ్వెల్టుకే ఎక్కువ తెలిసినట్టు స్పష్టపడింది.

# నవ్వటమంటే సరదా

రూజ్వెల్టుకు మంచి హాస్యరసికత ఉండేది. తనంతట తాను గొప్ప వినోద కథలను సృష్టించడంగాని, ఇతరుల హాస్యాలకు ఘాటైన హాస్యంతో జవాబు చెప్పడంగాని రూజ్వెల్టుకు అంతగా చేతకాదు. అతడు ఏవైనా ఛలోక్తులు చెప్పినా, వాటిలో నిశితత్వం ఎక్కువ ఉండేదికాదు. అతడు చెప్పే కట్టుకథలు చాలా పెద్దవిగా ఉండేవి.

ఒక్కొక్కప్పుడు కట్టుకథలను తానే కల్పించి వాటికి చిలవలూ పలవలూ అల్లి, ఒకసారికి పదిసార్లు ఆ కథను పదిమందికీ చెప్పి,

చివరకు ఆ కథ నిజమని తానుకూడా నమ్మే స్థితిలోకి వచ్చేవాడు రూజ్వెల్టు.

ఒక్కొక్కప్పుడు చాలా చిన్న ఛలోక్తులకుకూడా అతడు విరగబడి నవ్వేవాడు.

హాస్యరసికతగల అధ్యక్షుడు 1932 లో అమెరికాకు దొరకడం కొంతవరకు దేశపు అదృష్టమే.

రూజ్వెల్టు తల్లి కొంచెం పిసినిగొట్టు. డబ్బు ఎక్కువ ఖర్చుపెట్టడమంటే ఆమెకు చాలా బాధగా ఉండేది. తన ఇరవైమూడో యేట, రూజ్వెల్టు లండను వెళ్ళి అక్కడనుంచి ఆమెకు ఉత్తరాలు వ్రాస్తూ, తనకు హోటలు ఖర్చులు రోజుకు వెయ్యి డాలర్లు అవుతున్నాయని వ్రాశాడు. డబ్బు ఖర్చునుగురించి అతిశయోక్తులు చెప్పి తల్లిని వుడికించడమంటే రూజ్వెల్టుకు సరదాగా ఉండేది.

నవ్వడానికి సందర్భం ఏమీలేదని ఇతరులు అనుకునే అనేక సందర్భాలలో అతడు పకపక నవ్వేవాడు.

పత్రికా విలేఖరుల సమావేశంలో వారడిగిన ప్రశ్నలకు తలతోక లేని సమాధానాలు చెప్పి, వారిని నవ్వించడమంటే రూజ్వెల్టుకు బహు ఇష్టంగా ఉండేది.

ఒకసారి రూజ్వెల్టు స్టాలిన్‌కు ఉత్తరం వ్రాశాడని తెలిసి, పత్రికా విలేఖరులు అతడిని ఆ ఉత్తరాన్నిగురించి ప్రశ్నించడం సాగించారు. వారిలో ఒకడు, "ఆ ఉత్తరం మీరు ఇంగ్లీషులో వ్రాశారా?" అని అడిగాడు. "లేదు, ఐరిష్ భాషలో వ్రాశాను" అని బదులుచెప్పాడు రూజ్వెల్టు.

# మానవత్వం

ప్రతి మనుష్యుని జీవితాన్ని నడపడంలోనూ సాధారణంగా కారణ భూతాలైన స్త్రీ, ధనము, దేవుడు, కీర్తికాంక్ష అనే నాలుగు విషయాలపట్ల రూజ్వెల్టు ఏ ధోరణి అవలంబించేవాడు ?

స్త్రీలంటే రూజ్వెల్టుకు ఇష్టం. పురుషుడైన ప్రతివాడూ స్త్రీని ఎంతవరకు అర్థంచేసుకోవాలో అంతా రూజ్వెల్టుకు తెలుసును. తన ఇరవై వొకటోయేట, ఎలియనార్‌ను గాఢంగా ప్రేమించినదాకా అతడు స్త్రీలతో సహవాసం చేసినట్లు దాఖలా ఏమీ కనిపించదు. స్త్రీలపట్ల అతడి ప్రకృతి కొంత ఆలస్యంగా మేల్కొనడానికి కారణం చాలావరకు అతడు తనతల్లి చెప్పుచేతలలో పెరగడమే. యువకులు సాధారణంగా వివాహం కాకపూర్వం తిరిగే తిరుగుళ్ళకు రూజ్వెల్టు లోబడ లేదు.

రూజ్వెల్టు ఆడవాళ్ళవెంట తిరిగేవాడు కాదనీ, ఎలియనార్‌ను ప్రేమించినదాకా, మరొక స్త్రీని గురించి తనవద్ద ఎప్పుడూ ప్రస్తావించ లేదనీ అతడితల్లి, అతడినిగురించి వ్రాసింది. బహుశా రూజ్వెల్టు తల్లికి, అతడి ప్రణయగాథలు ఏమీ తెలిసివుండక పోవచ్చును. రూజ్వెల్టులాంటి అసాధారణమైన అందంగల పురుషుడు ఇరవయ్యొక్కయేట తను పెళ్ళి చేసుకోదలచిన కన్యను ప్రేమించినదాకా మరొక యువతిని యెరిగివుండ డంటే ఎవరూ నమ్మరు. కాని, ఎంత పరిశోధించి చూసినా స్త్రీలతో అతడికి కామకలాపం ఉన్నట్లు ఎక్కడా ఒక చిన్న వదంతీకూడా లేదు.

వయస్సు వచ్చినకొద్దీ స్త్రీలపట్ల అతడి రసికత క్రమక్రమంగా ఎక్కువయేది. తన భార్యతో ఇతర స్త్రీలనుగురించి ఎక్కువగా పరిహాస మాడేవాడు. ఒకసారి ఒక అందగత్తె తమఇంటికి భోజనానికి వస్తూంటే తన భార్యను పిలిచి "నన్ను ఒంటరిగా ఆ ఆడదానితో వదలిపెట్టి వెళ్ళకు సుమా" అని హెచ్చరించాడు.

ఏదైనా సినిమాను చూస్తున్నప్పుడు సినిమాలోని నటుల శరీర పొంకాన్నిగురించి వ్యాఖ్యానాలు చేస్తూ తన ప్రక్కన కూర్చున్న తన తల్లిని చిరాకుపరచడం అంటే రూజ్వెల్టుకు ఒక పెద్ద వేడుకగా ఉండేది.

కామ ప్రకృతిని అణచుకొని, పనిని సరిగా చెయ్యడంమీద ధ్యానం లేని తన ఉద్యోగిని ఎవరినైనా చూస్తే తనకు విసుగు పుట్టినప్పుడు అతణ్ణి పిలిచి "ఊళ్ళోకిపోయి, ఆ మస్తు కాస్తా వదల్చుకొని రారాదా" అని సణిగేవాడు.

స్త్రీలుమాత్రం రూజ్వెల్టుమీద బహు ఆప్యాయతను చూపేవారు. జబ్బుపడి, కాళ్ళు అవిటి పడిపోయినా, అతని అందమైన రూపానికి ఎంతోమంది ఆడవాళ్ళు కరిగిపోయేవారు. నడి వయస్సు దాటినతరువాత, పదిమంది ఆడవాళ్ళతో కలసి కబుర్లు చెపుతూ కులాసాగా కాలక్షేపం చెయ్యడం అంటే అతడు సరదా పడేవాడు. ఇదంతా చూస్తే, అతడి భార్యకు చాలా అసూయకలిగేది. ఇద్దరు సమర్థులైన స్త్రీలు, తమ జీవితాలను అతడికి అంకితంచేసి చిట్టచివరి వరకూ అతడివద్దనే కార్య దర్శులుగా పనిచేశారు. వారు: మిస్సీ లిహాండ్; గ్రేస్ టుల్లీ. ఇద్దరూ కూడా తమ పనిలో సమర్థులు; ఇద్దరూ కూడా మంచి స్వభావం కలవారు; ఇద్దరూ చాలా అందమూ, చందమూ కలవారు.

అతని బంధువర్గంలోనూ, మిత్రవర్గంలోనూ చాలామంది స్త్రీలు అతడిని అంటిపెట్టుకుని ఉండాలని చాలా తాపత్రయ పడేవారు. అతడి దూరపు బంధువులైన మార్గరెట్ సక్లీ, లారా డిలానోలు, మిత్రవర్గానికి చెందిన లూసీ రూదర్ ఫర్డు అతడి అంత్య ఘడియలలో అతడి సమీపంలోనే ఉన్నారు కూడాను.

మిస్సీ లిహాండ్, మిస్ టుల్లీ లిద్దరూ రూజ్వెల్టు దగ్గర పనిచెయ్య డానికి అతడి భార్యద్వారానే వచ్చారు. మొదటిలో వీరిద్దరూ రూజ్వెలు సతికి కార్యదర్శులుగా ఉండేవారు. వీ రిద్దరిలోనూ మిస్సీ లిహాండ్ రూజ్వెల్టుకు చాలా దగ్గరగా ఉండేదని చాలామంది అంటారు. మిస్ టుల్లీ తనపనిని తాను సమర్థంగా చెయ్యడం, ఇతర జోక్యాలకు పోకపోవడం వల్ల, ఆమెవల్ల రూజ్వెల్టుకుగల ప్రయోజనం ఎక్కువ అనికూడా చాలా మంది అంటారు.

రూజ్వెల్టు అధ్యక్షుడయిన తరువాత మిస్సీ లిహాండ్ పట్ల తనకు గల ప్రేమనుతప్ప మిగతా వ్యక్తిగత సంబంధాల నన్నిటినీ అతడు త్రెంచి

వేసుకున్నాడని కూడా చాలామంది చెపుతారు. చాలాకాలం జబ్బుపడి, యుద్ధపు రోజులలో ఆమె చనిపోయింది. ఆమె మరణం రూజ్వెల్టుకొక దెబ్బ.

రూజ్వెల్టు ప్రవర్తనలో లోపాలు లేకుండానూ, అతడు పొరపాటు పడకుండానూ ఆమె అతణ్ణి ఎన్నోవిధాల సరిదిద్దింది. వైట్ హౌసులో విందులు, వేడుకలు మొదలైనవి ఏమి జరిగినా వాటి ఏర్పాట్లనుగురించిన పూర్తి పెత్తనం ఆమెదే. అధ్యక్షుని రోజు వారీ కార్యక్రమాన్ని నిర్ణయించడంలోకూడా ఆమెకు చాలా అధికారం ఉండేది. అంచేత ఆమె దయకోసం ప్రాకులాడేవారు ఎంతోమంది ఉండేవారు. కొన్నికొన్ని పెద్ద ఉద్యోగాలు ఎవరికి ఇవ్వాలో రూజ్వెల్టుకు సలహా ఇచ్చినది ఆమే. హోమర్ కమ్మింగ్స్‌ను అమెరికా అటర్నీ జనరల్‌గా రూజ్వెల్టు నియమించడం ఆమె సలహావల్లనే.

1940 సంవత్సరం తరువాత రూజ్వెల్టు తన ఆరోగ్యాన్ని కొంత వరకు కోల్పోవడానికి కారణం, అతడి పోషణ విషయంలో శ్రద్ధ తీసుకోడానికి మిస్సీ లేకపోవడమే అని అతని అంతరంగికులు చాలామంది చెపుతారు.

రూజ్వెల్టు దంపతుల అన్యోన్య సంబంధాలు మామూలుగా అందరు దంపతుల సంబంధాల లాగనే ఉండేవి. అతడి జబ్బు, దానికితోడు అధ్యక్ష పదవీభారము వారిద్దరిమధ్య ఇబ్బందులను కలిగించేవి.

రూజ్వెల్టు నౌకాశాఖ అసిస్టెంటు సెక్రటరీగా ఉండగా, మరొక యువతిని ప్రేమించాడనీ, అప్పు డతడికి విడాకులు ఇవ్వడానికి అతడిభార్య ఒప్పుకున్నదనీ, రూజ్వెల్టు తల్లి వీరిద్దరిమధ్యా ప్రమేయం కలిగించుకొని విడాకులు జరగకుండా చేసిందనీ ఒక కథనుకూడా చాలామంది చెపుతారు.

చాలాకాలం తరువాత రూజ్వెల్టు అధ్యక్షుడయినప్పుడు, నార్వే యువరాణి మార్థా ఎక్కువగా రూజ్వెల్టును అంటిపెట్టుకొని ఉండేది. వైట్ హౌసులోనే గాక, రూజ్వెల్టు స్వగృహమైన హైడ్ పార్కులో కూడా ఆమె చాలా స్వతంత్రత కలిగి ఉండేది. కాని, యీ స్నేహంలో

సందేహాస్పదమైన ప్రవర్తన ఎక్కడా ఏమీ ఉండేదికాదని చాలామంది చెప్తారు.

అయితే ఒక్క మాటమాత్రం ఖాయం. ఆడవాళ్ళంటే రూజ్వెల్టుకి యిష్టంవుండేది. తనచుట్టూ పదిమంది ఆడవాళ్ళు ఉంటే అతనికి ఆనందంగా ఉండేది.

## డబ్బు

రూజ్వెల్టు భాగ్యవంతుడు; దుబారాచేసే మనిషి కాదు. కాని, కేవలం కూడబెట్టడంకోసం డబ్బు కావాలని కోరేవాడు కాదు. ఏ పనికి ఎంతఖర్చు అవుతుంది, ఏ వస్తువుఖరీదు ఎంత అని జాగ్రత్తగా పరిశీలించేవాడు. అనవసరంగా డబ్బు ఖర్చుపెట్టడం అతనికి కిష్టేదికాదు. “ఇంటి దగ్గర భోజనం చెయ్యడానికి వసతి ఉన్నప్పుడు, డబ్బు ఖర్చుపెట్టి హోటల్‌లో భోజనంచెయ్యడం అతనికి ఎంతమాత్రమూ ఇష్టం ఉండేదికాదు”, అని అతడిభార్య వ్రాసింది.

తన తల్లిలాగానే అతడుకూడా, ఏ వస్తువునూ పనికిరాదని పారవేసేవాడు కాదు. రూజ్వెల్టు తాతకు ఒక ట్వీడ్ కోటు ఉండేది. దానిని రూజ్వెల్టు తండ్రి తన ఉపయోగం తీరిపోయినతరువాత రూజ్వెల్టుకు ఇచ్చాడు. రూజ్వెల్టు దానిని చాలారోజులు ఉపయోగించి తన కొడుకు, జేమ్సుకు యిచ్చాడు. బహుశా, జేమ్సు దానిని ఇప్పుడు ఉపయోగిస్తున్నాడేమో కూడాను!

రూజ్వెల్టు బాలుడుగా వుండగా డబ్బు అనే మాటను ఎవరైనా ఉచ్చరించగాకూడా రూజ్వెల్టు వినివుండడని రూజ్వెల్టు తల్లి అంటుంది. డబ్బు ప్రస్తావన అవసరంలేని ఆ కుటుంబం, ఎంత చక్కగా కాలం గడిపేవారో!

“ఆ రోజులలో మేము గ్రామంలో నివసిస్తూ ఉండటంవల్ల, డబ్బు ఖర్చుపెట్టడానికి అవకాశాలు ఏమీ కనిపించేవికావు. అంచేత,

మా అబ్బాయికి ఖర్చు పెట్టుకోడానికి చిల్లర ఇవ్వవలసిన అవసరం ఉండేది కాదు" అని ఆమె వ్రాసింది.

అయితే, కొంచెం పెద్దవాడయిన తరువాత అతడు డబ్బుపట్ల మామూలుగా ఆ వయస్సు బాలురు చూపే ధోరణినే చూపేవాడు.

తన పదిహేడోయేట ఆరు డాలర్లుపెట్టి ఒక ఫ్లానెల్ సూటును కొనుక్కొని తన తల్లిదండ్రులకు ఇలా వ్రాశాడు: "సూటు చాలా బాగుంది. ఆరు డాలర్లకి వచ్చింది. మీరు కోపగించ రనుకొంటాను".

రూజ్వెల్టును అతడి తల్లి చాలా గారాబంగా పెంచింది. కొన్ని విషయాలలో అతణ్ణి ఆమె కట్టుబాట్లలో ఉంచలేదు కూడా. కాని, డబ్బు విషయంలో మాత్రం ఆమె అతణ్ణి చాలా అదుపులో ఉంచింది.

పుస్తకాలు కొనడం అంటే రూజ్వెల్టుకు ఒక పిచ్చి. మంచి పుస్తకాలు ఎక్కడ కనపడితే అక్కడ కొనివేసేవాడు. చందా పద్ధతి మీద పుస్తకాలు తెచ్చేవాడు. తల్లికి కనపడకుండా తన పరుపుక్రింద ఆ పుస్తకాలను దాచేవాడు. తల్లి ఆ పరుపులను తిరగవేసి ఆ పుస్తకాలను కనుక్కొని మిగతా చందాలను కట్టవద్దని ఆపుచేసేది. అందువల్ల, పుస్తక విక్రేతలవద్ద రూజ్వెల్టుకు పరువుపోయేది. రూజ్వెల్టు అధ్యక్షుడయిన తరువాత చాలామంది సెకండ్ హాండ్ పుస్తకాల షాపులవాళ్ళకి చిన్న చిన్న బాకీలు ఎన్నో మిగిలివుంటే తీర్చాడు.

డబ్బు యివ్వడంలో కూడా, అప్పుడప్పుడు ఆమె అతడిపట్ల గారాబం మానకపోలేదు. ఒకసారి చిన్న చిన్న అప్పులు తీర్చకుండా ఉన్నందుకు అతణ్ణి కోపపడుతూ ఉత్తరంవ్రాసి ఆ అప్పులన్నీ ఆమె తీర్చివేసింది.

డబ్బు సంపాదించకుండా, ఇంట్లో కూచున్నా హాయిగా కాలక్షేపం చెయ్యడానికి రూజ్వెల్టుకు ఏమీ లోటు ఉండేదికాదు. అతడి తల్లికి మంచి ఆస్తి ఉంది. అతడి కుటుంబంలో తక్కినవారంతా భాగ్యవంతులే. అతడికి తండ్రి ఇచ్చిన ఆస్తి బాగా వుంది. అదికాక, అతడి సవతి అన్న తన మరణకాలంలో లక్ష డాలర్లు రూజ్వెల్టుకు వదలిపెట్టి పోయాడు.

అయితే, యింట్లో కూచుని ఉన్న ఆస్తిని తింటూ కాలంగడిపే తత్వం కాదు అతడిది. అంచేత కాలేజిని వదలిపెట్టినప్పటినుంచీ అతడు ఏదో ఒక ఉద్యోగం చేస్తూనే ఉన్నాడు.

చేతిలో డబ్బు ఉండటంవల్ల కలిగే ప్రయోజనాలన్నీ అతడికి తెలుసు.

అతడు స్వతహాగా భాగ్యవంతుడు కావడం అతడి రాజకీయ జీవితానికి బాగా ఉపకరించింది. అంతేకాక, అతడి జబ్బు కాలంలో అతడి ప్రాణాలను అదొక శ్రీరామరక్ష అయింది.

డబ్బును కావలసినంత వరకు ఉపయోగించుకోవడం, ఉపయోగానికి వచ్చినంత వరకు డబ్బువిలువను గుర్తించడం తప్ప, బ్రహ్మాండమైన ఆస్తిని సంపాదిద్దామన్న ఆలోచన అతడికి ఎప్పుడూ లేదు. దురాశ అనేది అసలే లేదు.

రూజ్వెల్టు కుటుంబం బాగా బ్రతికిన కుటుంబం. అనవసరమైన విలాసాలు అనుభవించక పోయినా, హాయిగా జీవించడంలో వారు ఎప్పుడూ ఏలోటునూ అనుభవించ లేదు.

వివాహం అయిన తరువాత కుటుంబపు ఖర్చులను రూజ్వెల్టు, అతడి భార్యా చెరిసగం పంచుకొనే వారు. నెలకు ఆరువందల డాలర్లతో వారి కుటుంబపు ఖర్చులను గడిపేవారు. కాని, క్రమేపీ వారిఖర్చులు ఎక్కువ అవడం ఆరంభించాయి. రూజ్వెల్టు నౌకాశాఖ అసిస్టెంటు సెక్రటరీగా ఉండగా, వాళ్ల యింట్లో పదిమంది నౌకర్లు వుండేవారు. నౌకర్ల భోజనాలకు అయే విపరీతపు ఖర్చులను తగ్గించడానికి వారు చాలా ప్రయత్నం చేశారు.

ఇంటిఖర్చు పద్దులువ్రాయడం తన భార్యకు రూజ్వెల్టు నేర్పాడు. కానీ ఖర్చుపెట్టినా ఆమె ఖర్చువ్రాసేది. తమ కూతురు, అన్నా పెద్దదయిన తరువాత యింటిఖర్చు పద్దువ్రాసే బాధ్యత ఆమెకు అప్పగించారు.

అధ్యక్షుడుగావున్న రోజులలో రూజ్వెల్టు ఒక్క కానీకూడా మిగల్చ లేకపోయాడు. అధ్యక్షుడికి జీతంక్రింద 75,000 డాలర్లు, ఖర్చులక్రింద

25,000 డాలర్లు ఇస్తారు. దానిలో దాదాపు 50,000 డాలర్లు పన్నుల క్రింద పోతాయి. అధ్యక్షుడి ఆఫీసులో ఉద్యోగులకు యివ్వవలసిన జీతాలు చాలా ఎక్కువ. అదికాక, అధ్యక్షుడియింట్లో వంటయింటి ఖర్చులే నెలకు దాదాపు 2,000 డాలర్లు అవుతాయి. ఏమంటే, తన నౌకర్లందరికీ అన్నం పెట్టవలసిన బాధ్యత అధ్యక్షుడిదే. అధ్యక్షుని భవనంలో 45 మంది నౌకర్లు వున్నారు.

రూజ్వెల్టు కుటుంబానికి ఏడాదికి 1,75,000 డాలర్లు ఇంటిఖర్చు అయేదట. ఈ ఖర్చు, హైడ్‌పార్కులోని యిల్లూ, కాంపోబెల్లో, వాంస్ప్రింగ్సులలోని వసతులను కలిపి. అయితే, వాంస్ప్రింగ్సులోని యింట్లో, ఎలక్ట్రిక్ రిఫ్రిజిరేటరుకూడా వుండేది కాదట. హైడ్ పార్కులోవున్న నౌకర్లకు జీతాలక్రింద నెలకు 3,000 డాలర్లు అయేది.

ప్రెసిడెంటుకు ఎన్నో ఖర్చులు వుంటాయి. తన కుటుంబంలోని వారికేగాక, తన ఉద్యోగులకు, నౌకర్లకు అతడు క్రిస్మస్ పండుగకు ఇచ్చే బహుమతులే బోలెడు ఖరీదు చేస్తాయి. గవర్నమెంటు ఖర్చులో లెక్కరాయడానికి వీలులేకుండా, అతడు ఎంతోమందికి విందులు ఇవ్వవలసి వుంటుంది.

అనేక రాజ్యాల పరిపాలకులలాగే, రూజ్వెల్టు తన జేబులో ఎప్పుడూ డబ్బు వుంచుకొనేవాడు కాదు. అతడు చనిపోయినప్పుడు అతడి జేబులో 133 డాలర్లు వున్నాయి. హఠాత్తుగా ఎప్పుడేనా అతడికి డబ్బుతో అవసరంవస్తే ప్రక్కన వున్న ఎవరిదగ్గరనైనా అప్పు తీసుకొనేవాడు.

తన ఇన్‌కంటాక్సు పద్దును అతడే స్వయంగా వ్రాసుకొనేవాడు. ఒకకానీ లెక్కతేలకపోతే, అది ఎలాపోయిందా అని గంటలతరబడి ఆలోచించేవాడట.

డబ్బుఅంటే అతనికి ఒకవేళ కొంతఇష్టంవున్నా, ధనవంతులంటే మాత్రం అతనికి ఇష్టంవుండేది కాదు. హఠాత్తుగా భాగ్యవంతులైన వారంటే అతనికి అసలు కిట్టేదికాదు.

మర్యాదగల కుటుంబీకుడు, ఒకటి రెండు తరాలనాడు పెద్దలు సంపాదించి యిచ్చిపోయిన ఆస్తిమీద గౌరవంగా కాలక్షేపం చేస్తున్నాడంటే, రూజ్వెల్టు అతణ్ణిజూచి మెచ్చుకునేవాడు. కాని, నడుమంత్రపు సిరిపట్టి, మిడిసిపడేవాళ్ళను చూస్తేమాత్రం చాలా అసహ్యించుకొనేవాడు. పైగా, ఎవరికీ విపరీతపు ధనం వుండడం అతడికి సరిపడేదికాదు. సాధారణంగా మామూలు కుటుంబీకుడు యేడాదికి 25,000 డాలర్లతో హాయిగా జీవితం గడపవచ్చునని అతడి అభిప్రాయం. ఇలాంటి అభిప్రాయాల వల్లనే భాగ్యవంతులమీద ఎక్కువ పన్నులను వేసి, సామాన్యుల జీవితాలకు సౌకర్యాలను కలిగించే నూతన ఆర్థిక విధానాన్ని (న్యూడీల్) అతడు ఊహించి అమలులోకి తెచ్చాడు.

"ధనికులంటే అసహ్యించుకోడానికి తగినంత ధనం రూజ్వెల్టుకు ఎప్పుడూ వుంది. అందుచేతనే అతడు వామపక్ష రాజకీయవాది అయినాడు," అని అతణ్ణి గురించి ఒక ప్రముఖుడు అన్నాడు.

రూజ్వెల్టు చనిపోయినప్పుడు వాంస్ప్రింగ్స్ నిధికి 5,62,142 డాలర్లను ఇన్సూరెన్సు పాలిసీల రూపంగా ఇచ్చిపోయాడు. అదికాక, అతడికి 10,85,486 డాలర్ల ఆస్తివుంది. దీనిలో చాలాభాగాన్ని అతడు తన భార్యపేర వ్రాశాడు. ఆమె తదనంతరం, ఆ ఆస్తి వారి అయిదుగురు బిడ్డలకూ చెందుతుంది. మిస్సీ లిహాండ్‌కు కొంత భరణం తన మరణ శాసనంలో వ్రాశాడు. కాని అతడికంటె ముందే ఆమె మరణించింది.

అతడి మొత్తం ఆస్తిలో చాలాభాగం అంటే 9,20,115 డాలర్లు అతడికి తన తల్లినుంచి సంక్రమించింది. ఆ ఆస్తిలో ఒక్కకానీ అయినా అతడు ముట్టుకోలేదు.

అతడి మరణ సమయానికి మిగిలిన ఆస్తిలో 1,03,855 డాలర్లు స్థిరాస్తి రూపంలోనూ, 3,53,855 డాలర్లు కంపెనీల వాటాలు, గవర్నమెంటు బాండ్లు రూపంలోనూ, 1,97,543 డాలర్లు రొక్కరూపంలోనూ, 29,726 డాలర్లు ఇన్సూరెన్సు పాలిసీల రూపంలోనూ, 1,05,208 డాలర్లు ఇంటిలోని

సామానుల రూపంలోనూ వున్నాయి. పన్నులుపోగా మిగిలిన ఆస్తి విలువ మొత్తం 10,85,486 డాలర్లు.

చనిపోయిన సమయానికి అతడు ఇవ్వవలసిన బిల్లులు: వార్తా పత్రికలకు 9 డాలర్లు; రొట్టెల షాపుకు 48·53 డాలర్లు; టెలిఫోను కంపెనీకి 44·86 డాలర్లు; తన పొలాలలో పనిచేసినవారికి 786·7 డాలర్లు; తన భార్యవద్ద అప్పు తీసుకున్నది 46·20 డాలర్లు; ఇంగ్లండులో పోస్టు బిళ్లలు అమ్మే ఒకషాపుకు 72·96 డాలర్లు; లండనులో ఒక పుస్తకాల షాపుకు 368·58 డాలర్లు.

చనిపోయినప్పుడు రూజ్వెల్టు వదలిపెట్టి పోయిన ఆస్తి, అంతకు పూర్వం ఏ ప్రెసిడెంటు వదలిపెట్టి పోయిన ఆస్తికన్నా చాలా ఎక్కువే. టాఫ్ట్ చనిపోయినప్పుడు 4,75,000 డాలర్ల ఆస్తినీ, విల్సన్ చనిపోయి నప్పుడు 2,50,000 డాలర్ల ఆస్తినీ, కూలిడ్జి చనిపోయి నప్పుడు 5,00,000 డాలర్ల ఆస్తినీ వదలిపెట్టి పోయారు.

# మతవిశ్వాసములు

దేవుడిపట్లనూ, మతంపట్లనూ రూజ్వెల్టుకుగల భావాలు చాలా నిరాడంబరమైనవీ; వ్యక్తిగతమైనవీ. తమపనిని తాము చేసేవారికి దేవుడు సహాయపడతాడని అతడి నమ్మకం. దేవుడున్నాడా లేదా, దేవుని పట్ల నమ్మకం ఎందుకువుండాలి అనే ప్రశ్నలను గురించి అతడు ఎప్పుడూ తర్కించలేదు. మతాన్ని ఒక సంస్థగా నెలకొల్పి ప్రచారం చెయ్యడం అనేది అతడికి ఎప్పుడూ ఇష్టమయేది కాదు.

మత విషయాలను గురించి అతడు ఒకే విశ్వాసానికి కట్టుబడి వుండక, కొత్త సంగతులను ఎవరైనా చెపితే వినడానికి ఎల్లప్పుడూ సుముఖత చూపేవాడు. తన ఆత్మ నాశనములేనిదనీ, ఆత్మకు శాశ్వతత్వము వుందనీ అతడు విశ్వసించినా, ఆ మాటలను పదేపదే ఎవరికీ చెప్పలేదు. పైగా, మరణమంటే అతడెప్పుడూ భయపడలేదు.

అన్ని మతాల వ్యక్తుల పట్లనూ అతడు సంపూర్ణమైన సహనభావం చూపేవాడు. జ్యూలలోను, కాథలిక్కులలోను అతడికి చాలామంది ప్రాణస్నేహితులు వున్నారు.

రూజ్వెల్టు ముఖ్యస్నేహితులలో వొకడైన పా వాట్సన్, తన భార్య కాథలిక్ కావడంవల్ల తనుకూడా కాథలిక్ కావాలని చాలా రోజులుగా అనుకుంటూ వుండేవాడు. యాల్టాకు వెళ్లి తిరిగివచ్చే ప్రయాణంలో, ఓడలో వాట్సన్ చనిపోతూ వుంటే, రూజ్వెల్టు ఒక కాథలిక్ ఫాదరీని పిలిపించి, వాట్సన్‌కు రోమన్ కాథలిక్ మతం ఇప్పించాడు.

రూజ్వెల్టు ఎపిస్కోపల్ చర్చికి చెందినవాడు. సాధారణంగా ప్రపంచంలోని ప్రజలలో మత విషయాలపట్ల ఏమాత్రమూ శ్రద్ధలేని ప్రజలలో స్పెయిను, ఆస్ట్రేలియా దేశస్థుల తరువాత, అమెరికన్ ప్రజలు లెక్కకు వస్తారు. అయినప్పటికీ, రూజ్వెల్టులోమాత్రం యీ తత్వం ఎంతమాత్రమూ లేదు. అతడు హైడ్‌పార్కులోని చర్చికి ప్రతివారమూ చాలాకాలం వెళ్లాడు. అధ్యక్షుడయిన తరువాత జబ్బువల్ల కాళ్లు అవిటి అవడంవల్ల క్రమేపీ చర్చికి వెళ్ళడం తగ్గించుకున్నాడు.

# కీర్తికాంక్ష

చరిత్ర తనకనుగురించీ, చరిత్రలో తనకుగల స్థానాన్ని గురించీ రూజ్వెల్టుకు ఒక విధమైన సూక్ష్మజ్ఞానం ఉండేది. తన రాజకీయ జీవితాన్ని అక్కడక్కడ తీసిన ఫిలిమునంతటినీ అతడు సేకరించి పెట్టాడు. కాని, తను స్వయంగా దానిని వేసి చూసుకోడానికి ఎప్పుడూ వుబలాట పడలేదు. తన చరిత్ర వ్రాసేవారికి ఎంతో ఉపయోగించే పత్రాలూ, లేఖలూ మొదలైనవాటిని అసంఖ్యాకంగా అతడు హైడ్ పార్కులోని తన యింట్లో భద్రపరిచాడు.

చరిత్ర అంటే అతడికి అభిమానం విస్తారం కాబట్టి, తన చరిత్ర పట్లకూడా అతడికి శ్రద్ధవుంది అని చెప్పవచ్చును. తననుగురించి ఏమైనా

వ్రాయాలని కోరి, తనతో ముచ్చటించడానికి వచ్చేవారికి సులభంగా అతడు దర్శనమిచ్చేవాడు. కాని, తను బ్రతికిఉండగా తన జీవిత చరిత్రను అధికారరీత్యా ప్రకటించమని సూచనచేస్తే దానికతడు ఎంతమాత్రమూ అంగీకరించలేదు.

తను అధ్యక్షుడుగా ఉండగా తననుగురించి ప్రకటించబడిన వందలాది పుస్తకాలలో తన మిత్రులువ్రాసిన ఏ ఒకటి రెండు పుస్తకాలనో తప్ప, తక్కినవాటిలో ఒక్కదానిని కూడా అతడు చదివి ఉండడు.

రూజ్వెల్టుకుగల జీవిత పరమాశయం ఏమిటి? ప్రపంచశాంతిని కాపాడడానికి ప్రయత్నంచేసే ఒక అంతర్జాతీయ సంస్థను నెలకొల్పడం అని దృఢంగా చెప్పవచ్చును.

నాలుగోసారి అధ్యక్షపదవి అయిపోయినదాకా బ్రతికిఉంటే యునైటెడ్ నేషన్స్ సెక్రటరీ జనరల్ లాంటి పదవిని దేనినైనా స్వీకరించడానికి అతడు బహు సంతోషంతో అంగీకరించేవాడు.

పెద్ద ఆశయాలతోపాటు రూజ్వెల్టుకు సామాన్యమైన ఆశయాలు కూడా ఉండేవి. అవేమిటంటే: రాష్ట్రాలలో ఎక్కడైనా ఒక పత్రికకు సంపాదకుడుగా ఉండటం; హైడ్ పార్కులో చెట్లను పెంచడం; ఫ్లారిడావద్ద తుఫానువచ్చినా పడిపోని గుడిసె కట్టుకొని అక్కడ హారీ హాప్కిన్సుతో చేపల్ని పట్టడం.

# స్నేహితులు

రూజ్వెల్టు స్నేహధర్మాన్ని బాగా పాటించేవాడు. ఎంతో మందిని అతడు మూడు నిమిషాలలో తన స్నేహితులుగా చేసుకొనేవాడు. అతడి స్నేహితులలో అన్నివర్గాలకు చెందినవారూ ఉన్నారు. చాలా కాలం అతడికి ప్రాణస్నేహితులుగా ఉన్నవారిద్దరినిగురించి చాలా మందికి తెలియదు. వారిలో ఒకడు, అతనితోపాటు ఒకే గదిలో ఉండి గ్రోటన్‌లోనూ, హార్వర్డులోనూ చదువుకున్న లాత్రాప్ బ్రౌన్. రూజ్వెల్టు

పెళ్ళినాడు తోడుపెళ్ళికొడుకు లాత్రాప్ బ్రౌన్. రెండవవాడు న్యూయార్కులో అటర్నీగా ఉన్న హెన్రీ హూకర్.

తన కుటుంబంలోనివారూ, మిస్సీ లిహాండ్, హారీ హాప్కిన్సు కాక అతడికి అత్యంత ప్రియమైనవ్యక్తి పా వాట్సన్.

కాలం గడిచినకొద్దీ, జీవితంలో మార్పులు వచ్చినకొద్దీ పాత స్నేహితులు చాలామంది మరుగున పడిపోయారు. కాని, కొంతమంది స్నేహితులను మాత్రం కడదాకా అతడూ విడువలేదు; అతనిని వారూ విడువలేదు.

స్నేహం విషయంలో అతడు రాజకీయాలను ఎప్పుడూ పరిగణించలేదు. అయితే, పా వాట్సన్‌ను అతడు అత్యంతం ప్రేమించడానికి కారణం వాట్సన్‌కు శత్రువులేవరూ లేకపోవడమే. ఒకసారి రూజ్వెల్టు వైస్ ప్రెసిడెంట్ గార్నర్‌తో ఇలా అన్నాడట: "జాక్, నేను ఒకవేళ చచ్చిపోయినట్లయితే వాట్సన్‌ను నువ్వు జాగ్రత్తగా చూడాలి. అతణ్ణి బెల్జియంకు రాయబారిగా పంపించు." దీనినిబట్టి, వాట్సన్ అంటే రూజ్వెల్టుకు ఎంత ప్రేమో స్పష్టపడుతుంది.

స్నేహితులంటే ప్రాణం ఇవ్వడమే కాకుండా అన్ని వర్గాల వారితోటీ వీలైనంతవరకు విరోధం లేకుండా అతడు మెలిగేవాడు. తన అనుచరులలో వచ్చే పోట్లాటలను సవరించడమూ, ఒకరంటే మరొకరికి కలిగే అసూయను తొలగించడమూ మొదలైన బాధ్యతలను అతడు ఎన్నో సార్లు నెత్తిన వేసుకోవలసి వచ్చేది.

వీలైనంతవరకు తన శత్రువులతోకూడా అతడు మంచిగానే ఉండడానికి ప్రయత్నించేవాడు.

అయితే, రూజ్వెల్టుదగ్గర వున్నవారంతా అతనంటే ప్రేమాభిమానాలు గలవారని చెప్పడానికి వీలులేదు. వారినిగురించి ఒక మంత్రి ఒకసారి ఇలా అన్నాడు: "అధ్యక్షుని చుట్టూ చేరేవారిలో రెండురకాల మనుష్యులు ఉన్నారు. అతనంటే అభిమానంగలిగి గౌరవంలేనివాళ్ళు ఒక రకం;

అతడంటే గౌరవంగలిగి అభిమానంలేనివాళ్ళు మరొకరకం." అయితే, వారిలో అధిక సంఖ్యాకులు అతడంటే అభిమానం కలవారే.

రూజ్వెల్టు చేసే పనులలో ఏదైనా ఒకటి పొరపాటు అని తెలిస్తే, అత డాపని చెయ్యకుండా అతణ్ణి ఆపాలని అందరూ తహతహ లాడే వారు. ఒక సలహాదారువచ్చి, ఏదోఒక సలహాచెప్పి పోయేవాడు. మరొకడు వచ్చి మరొకటి చెప్పేవాడు. ఎవడికి వాడికి తనుచెప్పిన సలహాయే సరియైనదనీ, రెండోవాడిది తప్పుసలహా అనీ నమ్మకం. అంచేత, రెండోవాడి సలహాప్రకారం రూజ్వెల్టు నడుచుకుంటే చాలా ప్రమాదం జరిగిపోతుందని ఎవడికివాడే తహతహలాడేవాడు. ఇలా ఇద్దరు చెప్పిన సలహాలు ఒకదానితో ఒకటి సరిపడకపోతే రూజ్వెల్టు తన ఆఫీసులోని సెక్రటేరియట్‌తో ఆలోచించి సరైన మార్గం ఏదో తాను వెతుక్కునేవాడు.

రూజ్వెల్టు తన ఉద్యోగులమీద ఎక్కువగా చిరాకుపడేవాడు కాదు. ఎవరైనా ఒక పనిని పాడుచేస్తే, ఎందుకు పాడుచేశావని వాడిమీద విసుక్కునేవాడు కాదు. "గతంతు గతమేవ," అని చెడిపోయిన దానికోసం బాధపడడంకన్న మళ్ళీ ఆలోచించి చెడిపోయిన దానిని బాగు చేసుకోడానికి ప్రయత్నించమని చెప్పేవాడు.

మియామిలో అతణ్ణి చంపడానికి జరిగిన ప్రయత్నాన్నిగురించి కూడా అతడు అట్టే ఆలోచించలేదు. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుందనే ఉపేక్షతో వూరుకున్నాడు.

ఇలాటి తత్వంతో చెడిపోయిన వాటిపట్ల ఉదాసీనత వహించడం వల్లనే, అతడు భవిష్యత్తునుగురించి ఆలోచించగలిగేవాడు.

రూజ్వెల్టుకుగల అనేకమంది స్నేహితులలో అతడికి ఎంతో ఉపయోగపడిన వారు, లూయీ హౌ, హారీ హాప్కిన్స్. ఇద్దరూకూడా బలహీనులు; తరచు ఎక్కువగా జబ్బులు పడుతూ ఉండేవారు. ఇద్దరూ మేధావులే; ఇద్దరూ నిష్కపటులే; ఇద్దరూ సంపూర్ణంగా విశ్వసింపదగిన వారే. ఏ విధమైన ప్రతిఫలాన్నీ ఆశించకుండా ఇద్దరూ రూజ్వెల్టు సేవకు

తమ జీవితాలను అంకితం చేసుకున్నవారే. ఇద్దరూ రూజ్వెల్టు సేవలో తమ యావచ్ఛక్తులనూ ధారపోసి ప్రాణాలను పోగొట్టుకొన్నవారే.

అయితే, ఇద్దరి తత్వాలలోనూ ఎంతో తేడా వుంది. హౌ రూజ్వెల్టు పట్ల వ్యక్తిగతంగా అభిమానం గలవాడు. రూజ్వెల్టును అధ్యక్షుణ్ణి చెయ్యడం అతని ఆశయం. రాజకీయ ధర్మాలూ, సూత్రాలూ అతడికి అనవసరం. హాప్కిన్సు అలా కాదు. అతడికి ధర్మాలమీదా, సూత్రాలమీదా అచంచలమైన విశ్వాసం ఉండేది. ఎప్పుడెలా నడుచుకోవాలో, ఎప్పుడేం చెయ్యాలో రూజ్వెల్టుకు హౌ చెప్పేవాడు. అంతేకాక విషయాలన్నిటినీ రూజ్వెల్టు దగ్గరనుంచి హాప్కిన్సు నేర్చుకొనేవాడు.

రూజ్వెల్టు హాప్కిన్సును ఎక్కువ ప్రేమించి వుండకపోవచ్చును గాని, హౌ పట్ల ఎక్కువ శ్రద్ధ చూపేవాడు.

మానవ చరిత్రలో రూజ్వెల్టును మించిన వ్యక్తి లేడనీ, అతడికి కన్నఛారిగా వుండటం ఒక గొప్ప అదృష్టమనీ హౌ అనుకొనేవాడు. రూజ్వెల్టుకు కార్యదర్శిగా వుండటంకన్న వేరేమీ అతడు వాంఛించలేదు. రూజ్వెల్టుచుట్టూ చేరినవారిలో గొప్ప ఆశలేమీ పెట్టుకోనివాడు హౌ ఒక్కడే.

హాప్కిన్సుకు కొన్ని ఆశలు, తనకోసం వ్యక్తిగతంగా కాకపోయినా, మానవజాతి సౌఖ్యానికి అవలంబించే కార్యక్రమాలను గురించిన ఆశలు, వుండేవి. అతడికి అధికారం చెలాయించడం అంటే ఇష్టంవుండేది. దానికి తగినట్టుగా, హౌకు ఉన్న అధికారాలకంటె హాప్కిన్సుకు ఎక్కువ అధికారాలు వుండేవికూడాను.

హౌ రూజ్వెల్టుకు ఒక తాబేదారుగా పనిచేస్తే, హాప్కిన్సు రూజ్వెల్టుతో సహసమానుడుగా పనిచేసేవాడు.

హాప్కిన్సుకన్న ముందే, హౌ రూజ్వెల్టు దగ్గర చేరాడు. రూజ్వెల్టుకంటె హౌ పదకొండేళ్లు పెద్దవాడు. హాప్కిన్స్ కంటె రూజ్వెల్టు ఎనిమిదేళ్లు పెద్దవాడు.

మొదట్లో హౌ న్యూయార్క్ గవర్నర్ కార్యాలయంలో న్యూయార్క్ హెరాల్డ్ పత్రిక విలేఖరిగా వుండేవాడు. 1912 లో

రూజ్వెల్టు న్యూయార్కు గవర్నరైనప్పుడు హౌను అతడు చూశాడు. రాజకీయ వార్తలను అతడివద్ద నుంచి తెలుసుకొనేవాడు. క్రమంగా హౌ రూజ్వెల్టుకు సలహాదారు, స్నేహితుడు అయాడు. తరువాత, అతడు రూజ్వెల్టు ఇంట్లోనే కాపురం వుండేవాడు. రూజ్వెల్టుకు పక్షవాతం వచ్చిన తరువాత, మళ్ళీ అతనిని రాజకీయాలలోకి తీసుకొని రావడానికి రూజ్వెల్టు భార్య తరువాత, ఎక్కువగా కృషిచేసినవాడు హౌ. 1933 లో హౌ మంచ మెక్కాడు; 1936 లో మరణించాడు. అతడు జబ్బుగా వున్నన్నాళ్ళూ, అతడి గదిలోకివెళ్ళి రూజ్వెల్టు అతణ్ణి పలకరించి, అతడికి ధైర్యం రావడానికి నాలుగు మాటలు చెప్పని రోజు లేదు.

హౌలో వున్న ఒక గొప్పప్రతిభ ఏమిటంటే, పనికివచ్చే మనుష్యులను వెతికి పట్టుకోవడం. ఒకరి మీద ఒకరికి కక్షలు వుండి పగ తీర్చుకోడానికి చూసేవాళ్ళను పసికట్టి, వారిలో అధ్యక్షుడికి ఎవరు పనికి వస్తారో వారిని ఏరి తీసుకొనివచ్చి అతడికి అప్పగించేవాడు.

రూజ్వెల్టుకోసం పనిచెయ్యడం, అతడికి విజయం చేకూర్చడం తప్ప అతనికి వేరే లక్ష్యం లేదు. రూజ్వెల్టుకోసం ప్రచారం చెయ్యడానికి అతడు పోగుచేసిన కొంతమంది యువకులకు అతడు ఇలా బోధించాడు: "ఈ కార్యక్రమంలో మీరు చెయ్యవలసింది ఒక్కటే. రాత్రింబగళ్ళు కృషి చేసి, రూజ్వెల్టు అధ్యక్షుడయేదాకా పాటుపడడం. వ్యక్తిగతంగా మీరొక లెక్కకాదు. మీ మొహాలు ఒక లెక్క కాదు. ఫోటోగ్రాఫులలో పకదామని, రూజ్వెల్టు చుట్టుప్రక్కల తారట్లాడుతూ వుండగా మిమ్మల్నెవరినైనా చూశానంటే మీ భరతం పడతాను. బాగా జ్ఞాపకం పెట్టుకోండి. మీరు చెయ్యవలసిన పని అంతా రూజ్వెల్టు అధ్యక్షుడవడానికి కావలసిన కృషి. అని."

రూజ్వెల్టు దగ్గరకు హాప్కిన్సు హౌ తరువాత ఎన్నో రోజులకు వచ్చాడు. అతడికీ, రూజ్వెల్టుకూ పరిచయం రూజ్వెల్టు భార్యద్వారా జరిగింది. హాప్కిన్సు చక్కనివాడు. చక్కనివాడైన రూజ్వెల్టు తనచుట్టూ చక్కని వాళ్ళను వుంచుకోవడం అంటే ముచ్చట పడేవాడు. హాప్కిన్సు చాలా ఓపికగా ఎదుటివారి మాటలను వినగలడు. గదిలో మరెవరూ

స్పష్టంగా రూజ్వెల్టు హాప్కిన్సుతో మాట్లాడే వాడు. రూజ్వెల్టు ఏ వేళ ఏ కళలో వుంటాడో హాప్కిన్సుకు బాగా తెలుసు.

హాప్కిన్సులోని వికటత్వము, హాస్యశక్తి, ఏ విషయం పట్లనైనా భయభక్తులు లేకపోవడం రూజ్వెల్టును ఆకర్షించాయి. అలాగని హాప్కిన్సు వొట్టి వికటపు మనిషి అని అనడానికి ఎంతమాత్రమూ వీలులేదు. ఏ విషయాన్ని గురించి అయినా అతడితో చెపితే దాని ఆంతర్యాన్ని ఇట్టే కనిపెట్టేవాడు. దేశంలోని వార్తలూ, ఊరిలోని కాకమ్మ కబుర్లూ, సమస్తమూ అతను తెలుసుకొనేవాడు.

శ్రమ ఎంతయినా సరే, ఖర్చు ఎంత అయినాసరే పని ముగించడంలో అతనికి మంచి పట్టుదల వుండేది. అందువల్ల రూజ్వెల్టుకి అతడిమీద ఎక్కువ ఇష్టముండేది. ఎందుచేతనంటే, ఏమయినాసరే పని జరగడం ప్రధానం అనే సిద్ధాంతం రూజ్వెల్టుది కూడా.

రూజ్వెల్టు మంత్రిమండలిలోకి చాలామందిని చేర్పించిన వారిలో హాప్కిన్సు ఒకడు. జనరల్ జార్జి మార్షల్‌ను సైన్యశాఖాధిపతిగా నియమించమని రూజ్వెల్టుకు ప్రోద్బలం చేసినవాడు అతడే.

రూజ్వెల్టుకూ, చర్చిల్‌కూ మధ్య రాయబారాలు, సందేశాలు నెరపిన వాడు హాప్కిన్స్. హాప్కిన్స్‌ను మొట్టమొదటిసారి చూసిన తరువాత చర్చిల్ తన అమెరికన్ స్నేహితుడొకనితో "అతడంటే నాకు చాలా ఇష్టం ఏర్పడింది" అని చెప్పాడు.

హాప్కిన్సు ఎప్పటికప్పుడు జబ్బు పడుతూవుంటే, రూజ్వెల్టు కేవలం ధైర్య వాక్కులవల్లనే అతడు బ్రతికివుండేటట్టు చేశాడు.

చాలా ప్రమాదమైన జబ్బుపడి బ్రతికిన చాలమంది వ్యక్తులలాగ రూజ్వెల్టుకూడా ఆత్మబలంతో ఎలాంటి జబ్బునైనా జయించవచ్చునని నమ్మేవాడు. అంతేగాక, హాప్కిన్సు ప్రాణాలను తానుమాత్రమే కాపాడగలనని నమ్మేవాడు. నిజానికి అంతే అయింది కూడా. చివరి రోజులలో చాలా తీవ్రమైన జబ్బుతో బాధపడి, రూజ్వెల్టు చనిపోయిన తరువాత ఏడాదికి హాప్కిన్సు మరణించాడు.

# సేకరణా తత్వం

అనేక వస్తువులను సేకరించి దాచిపెట్టడం అంటే రూజ్వెల్టుకు బహుప్రీతి. వస్తువులను సేకరించడం అనేది మానవులందరికీ సహజమైన గుణమే. కాని, రూజ్వెల్టుకు యీ గుణం ప్రబలంగా వుండేది.

పోస్టు బిళ్ళలను సేకరించడం అతడికొక మహాపిచ్చి. రూజ్వెల్టు తండ్రికీ, తల్లికీ కూడా యీ వ్యామోహం ఉండేది. రూజ్వెల్టుకు పదేళ్ళ వయస్సు వున్నప్పుడు, అతడి తల్లి అతనికి కొన్ని చైనా పోస్టుబిళ్ళలను యిచ్చింది. అప్పటినుంచి ఆ మరణాంతమూ, పోస్టుబిళ్ళలను సేకరించడం అతనికొక సహజ స్వభావంగా పరిణమించింది. రూజ్వెల్టు సేకరించిన పోస్టుబిళ్ళలు దాదాపు 12,50,000 వుంటాయి. వీటిలో దాదాపు పదిలక్షల బిళ్ళల విలువ ఆట్టేవుండదు. కాని, తక్కినవాటిని సుమారు 150 పుస్తకాలలో వరుసగా అంటించి, వాటిప్రక్కన వాటినిగురించి తనకు తెలిసిన వివరాలను రూజ్వెల్టు వ్రాశాడు. ఆ పుస్తకాలను 1946 లో వేలం వేస్తే సుమారు 2,50,000 డాలర్లు వచ్చాయి. ఇంతడబ్బు వచ్చిందా అని ఎవరైనా ఆశ్చర్యపడవచ్చును. కాని, ఇంతకన్న ఎక్కువ విలువగల పోస్టుబిళ్ళలను సేకరించిన వారు, యునైటెడ్ స్టేట్సులో అధమం నూరు మంది వున్నారు. ఇంగ్లండు రాజుదగ్గర వున్న పోస్టుబిళ్ళల విలువ 60,00,000 డాలర్లు వుంటుందట.

అధ్యక్షుడుగా వుండగా కూడా, ప్రతిరోజూ కొన్ని నిమిషాలయినా పోస్టుబిళ్ళలతో కాలక్షేపం చేసేవాడు రూజ్వెల్టు.

తీవ్ర సమస్యలనుగురించి ఆలోచించిన చిరాకును పోగొట్టుకోవడానికి అతడికి ఇదొక సాధనంగా కూడా ఉపకరించేది. అతడు యాల్టా, టెహరాన్‌లకు ప్రయాణం చేసినప్పుడు కూడా, ప్రయాణంలో అతడికి కాలక్షేపం కోసమని పోస్టుబిళ్ళలు అంటించిన పుస్తకాలను వెంట పెట్టుకొని వెళ్ళేవాడు.

పోస్టుబిళ్ళలను సేకరించడంలో అతడు ఖర్చుకు ఎప్పుడూ వెనుకాడేవాడు కాడు. ఒకేరకపు బిళ్ళలు రెండు మూడు వున్నా కూడా

అతడు ఒక్కదానినైనా పారవేసేవాడు కాదు. అనేక ప్రాంతాలనుంచి, అనేక విధాలుగా అతడు పోస్టుబిళ్ళలను తెప్పించేవాడు. ఎంత మంచి బిళ్ళకయినా, పది డాలర్లకన్న ఎక్కువ ఖరీదుమాత్రం యిచ్చేవాడు కాదు.

అతడు అధ్యక్షుడయిన తరువాత, వివిధ దేశాలనుంచి వచ్చే ఉత్తరాలకు వుండే బిళ్ళలలో ఇదివరకు కనపడనవి ఏమైనా వుంటే, వాటిని ప్రభుత్వోద్యోగులు రూజ్వెల్టుకు పంపించేవారు. అంతేగాక, అమెరికా ప్రభుత్వం కొత్తరకపు పోస్టు బిళ్ళలను అచ్చు వేయిస్తే, ఆ అచ్చువేయించిన బిళ్ళలలో మొట్ట మొదట అచ్చుఅయిన ముద్రల కాగితాన్ని రూజ్వెల్టుకు సమర్పించేది. రూజ్వెల్టు అధ్యక్షుడయిన తరువాత, 225 కొత్త పోస్టుబిళ్ళలు అచ్చు వేయబడినవి.

పోస్టు బిళ్ళలను అచ్చు వేయించేముందు తయారైన నమూనాలను అతడు స్వయంగా పరిశీలించి, వాటిలో మార్పులను సూచించడమే గాక, కొన్ని బిళ్ళలకు నమూనాలను అతడే స్వయంగా తయారు చేశాడు కూడా.

అనేక దేశాల ప్రభుత్వాలు, ఆ యా దేశాలలోని పోస్టుబిళ్ళలను ఎన్నిటనో సేకరించి రూజ్వెల్టుకు బహూకరణగా పంపించాయి. అంతేకాదు, కొన్ని ప్రభుత్వాలు తమ దేశపు పోస్టు బిళ్ళలమీద రూజ్వెల్టు బొమ్మను వేయించి అతణ్ణి గౌరవించాయి. ఇలా 23 దేశాలు చేశాయి. ఆ దేశాలలో రూజ్వెల్టు బొమ్మతో వేయబడిన పోస్టుబిళ్ళల రకాలు ౯౫.

విదేశాలలో రాయబారులుగావున్న అమెరికనులు, అక్కడ తమకు కనిపించిన మంచి పోస్టుబిళ్ళలను సేకరించి రూజ్వెల్టుకు పంపేవారు.

# ఓడలు, ఓడ ప్రయాణం

రూజ్వెల్టుకు కేవలం స్వభావంగా పరిణమించిన మరొక అభిరుచి ఏమిటంటే సముద్రంమీద విహరించటం.

చాలా చిన్నతనంలోనే పడవ నడపడం నేర్చుకున్నాడు రూజ్వెల్టు. తన పదహారో యేట, గ్రోటన్ స్కూలులో చదువుతూ వున్న రోజులలో అతడు న్యూయార్కునుంచి ఈస్ట్ పోర్ట్‌వరకూ పడవను నడుపుకొని వెళ్ళాడు. ఇది సామాన్యమైన పనికాదు. తరువాత, హార్వర్డు కాలేజీలో చదువుతూ వున్నప్పుడు, ఇతడికి 40 అడుగుల పొడవుగల పడవ తండ్రి కొని యిచ్చాడు. తరువాత అతను 18 టన్నుల చిన్న నౌకను కొనుక్కున్నాడు.

కేవలం కులాసా కొరకే మాత్రమే కాక, పరిశ్రమకూ, సాహసానికీ కూడా అతను నౌకావిహారాన్ని కోరేవాడు. ఎదురు గాలిలో పడవను నడుపుకొని పోవడమన్నా, ఇదివరకు ఎవరూ వెళ్ళని రేవుకు పడవను పట్టించడమన్నా రూజ్వెల్టుకు బహు ఉత్సాహంగా వుండేది.

ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోని సముద్రాలలో ఎక్కడెక్కడ నౌకలకు ప్రమాదమో, ఎక్కడ నౌకలు సురక్షితంగా నడవగలవో అతనికి కంఠతాగా తెలుసును.

నౌకల మీదనూ, నౌకలను నడపడం మీదనూ అతనికి గల అభిరుచిని బట్టి, అతడి స్వభావంకూడా వ్యక్తమౌతుంది. నౌకలను నడపాలంటే గాలినీ, సముద్రపు లోతుపాతులనూ గమనించి ప్రవర్తించాలి. అంటే వలవని తలంపుగా మనిషిని ఎదుర్కొనే ప్రతికూల శక్తులను ప్రతిఘటించడానికి పైయెత్తులు వెయ్యాలన్న మాట. నౌకలను నడపడం అభిరుచికావడంవల్ల, ఎత్తులకు పైయెత్తులు వెయ్యడం అతనికి సులువుగా చేతనైపోయింది.

నౌకలన్నా, నౌకాదళమన్నా, నౌకాదళాధిపతులన్నా అతడికి ఎక్కువ ఇష్టం. ఒక వ్యక్తిని రాయబారిగా నియమించడంలో, అతడు నౌకాదళాధిపతి అనే విషయానికే ప్రాముఖ్యత ఇచ్చి ఆ రాయబార పదవిని అతడికి ఇచ్చాడు రూజ్వెల్టు.

చేపలను పట్టడం అంటేకూడా రూజ్వెల్టుకు సరదా. అయితే, ఎలాటి చేపలను పట్టినదీ, ఎన్ని చేపలను పట్టినదీ అతడు అట్టే పరిగణించే వాడు కాడు. చేపలను పట్టడానికి తోడురమ్మని అతడు ఎవరినైనా ఆహ్వానించాడంటే వారిని అతడు గౌరవించినట్టు సూచన.

నాటకాలకు రూజ్వెల్టు ఎక్కువగా వెళ్ళేవాడు కాదు. దానికి కారణం చక్రాలకుర్చీలో కూచుని తోయించుకుంటూ నాటకశాలలోకి వెళ్ళడం చాలా విసుగు కలిగిస్తుందని. సినిమాలు చూడటం అంటే అతనికి ఇష్టమేగాని, అది ఒక పిచ్చిగా మాత్రం వుండేది కాదు.

స్త్రీలలో మిర్నా లాయ్, పురుషులలో వాల్టర్ హస్టన్ అతని అభిమాన తారలు.

పేకాటలో పోకర్ ఆట అంటే రూజ్వెల్టు చెవి కోసుకొనేవాడు. ఆ ఆటలో అతడు చాలా సమర్థుడుకూడాను. అయితే, పందెం వేసినప్పుడు పెద్ద మొత్తాలకు ఎప్పుడూ పందెం వేసేవాడు కాదు. రూజ్వెల్టుతో పేకాటలో ఎవరైనా నూరు డాలర్లకన్న ఎక్కువ గెలిచినా, పోగొట్టుకున్నా అది ఒక విశేషమే అన్న మాట. ఆటలో ఓడిపోతే మాత్రం రూజ్వెల్టు బాగా ఉడుక్కునే వాడు.

కుక్కలను పెంచడం అంటే అతనికి మోజు ఎక్కువ. కుక్కల జాతులు, లక్షణాలు మొదలైన వివరాలన్నీ అతడికి బాగా తెలుసు. అతడి పెంపుడు కుక్క పేరు ఫాలా. తన స్నేహితులలో చాలా మందిని అతడు ఎంత ఎక్కువగా ప్రేమించాడో ఫాలానుకూడా అంత ఎక్కువగానూ ప్రేమించాడు.

యుద్ధకాలంలో రూజ్వెల్టు ఎక్కడికైనా వెళ్ళినప్పుడు, అతడి ప్రయాణాన్ని రహస్యంగా వుంచవలసి వచ్చేది. కాని, అతడితో ఫాలా కూడా వెళ్ళేది. అది పోలీసుల కట్టుదిట్టాలను దాటి విచ్చలవిడిగా తిరగడం వల్ల ఆ సమీపంలో రూజ్వెల్టు వున్న సంగతి బయటపడిపోతుందని అధికారులు చాలా భయపడేవారు. కాని బాధపడలేక పోలీసులు విసుక్కునేవారు.

ఈ పుస్తకం వ్రాసేటప్పటికి ఫాలా బ్రతికే వుంది.

# భోజనకాలే...

రూజ్వెల్టుకు మంచి జీర్ణశక్తి వుంది. శుభ్రంగా అన్ని పదార్థాలూ తినేవాడు. వంట చెయ్యడంకూడా అతడికి తెలుసు. వయస్సు ఎక్కువైన కొద్దీ రకరకాల పిండివంటలను తినడం క్రమేపీ అతను మానివేశాడు, జీర్ణ శక్తి బాగా వున్నా, అతను ఎప్పుడూ అధికంగా మాత్రం తినేవాడు కాదు. భోజనందగ్గర యిష్టం వచ్చినంతసేపు కూచొని తాపీగా, ఎక్కువగా తినడానికి అతడికి ఎక్కువ వ్యవధికూడా వుండేదికాదు. పక్షి మాంసం అంటే అతడికి అభిరుచి ఎక్కువ. అప్పుడప్పుడు కొత్తన పక్షి మాంసం కావాలని అతడు కోరుకునేవాడు.

రూజ్వెల్టు ఇంట్లో వంట అంతా ఒక నిశ్చిత పద్ధతి ప్రకారం జరిగేది. ఫలాని రోజున ఫలానివంట అనే నిర్ణయం పాటింప బడేది. అంచేత, వైట్‌హౌసులో చాలా రోజులు బసచేసిన అతిథులు ఏరోజు, ఏపూట తమకు ఏ ఏ పదార్థాలు వడ్డింపబడుతవో ముందుగానే చెప్పగలిగేవారు.

భోజనాల వేళ వీలయినంతవరకు విశ్రాంతి వుండాలని అతడు కోరే వాడు. పెద్దపెద్ద విందులంటే అతడికి అట్టే ఇష్టంవుండేది కాదు. ముఖ్యమైన స్నేహితుణ్ణయినా, దగ్గర బంధువులలో ఎవరినైనా పంక్తిలో తనతో పాటు కూచోబెట్టుకొని, ఎక్కువ రద్దీ లేకుండా భోజనం చెయ్యడం అతడికి ఇష్టం. భోజనానికి రమ్మని అతను ఎప్పుడూ, ఎవరినీ, ఎక్కువగా పిలిచేవాడు కాదు. భోజనానికి ఎవరినైనా ఆహ్వానించడం రూజ్వెల్టు భార్య, కూతురు, మిస్సీ లిహాండ్ మొదలైనవారి పని.

జబ్బుపడి, అపిటిపసం వచ్చిన తరువాత విందులకు బయటికి వెళ్ళడం అతడు మానుకున్నాడు. ఎవరి ఇంటికైనా అతను విందుకు వెళ్ళాడంటే వాళ్ళమీద అతడికి అత్యంతానురాగం వుందని స్పష్టపడేది.

అప్పుడప్పుడు హెరాల్డ్ ఐక్స్ ఇంటికి వెళ్ళటమంటే అతడు ముచ్చట పడేవాడు.

# అదృష్టం

రూజ్వెల్టు చాలా అదృష్టవంతుడని చాలామంది అంటారు. అయితే అదృష్టమంతా నిజానికి సమయమెరిగి, ముందుచూపుతో పనిచెయ్యడంలో వుంది. చాలామంది అదృష్టవంతులలాగా తన అదృష్టాన్ని తానే నిర్మించుకున్నాడు రూజ్వెల్టు. అయితే, అతడు అదృష్టవంతుడని అందరికీ ఒక నమ్మకం వుండడం అతడి రాజకీయవిజయాలకు చాలా అనుకూలించింది. 1932 లో చాలామంది అతనికి ఓట్లువెయ్యడానికి కారణం అతడు అదృష్టవంతుడని వారికి విశ్వాసం వుండటమే. ఒకవిషయం మాత్రం నిజం. రూజ్వెల్టు జీవితం అంతటిలోనూ కూడా వాతావరణం విషయంలో అతడికి మంచి అదృష్టం వుండేది. వానలు చాలాకాలం కురవని ఒకవూరికి అతడు వెళ్ళినతరువాత అక్కడ వానకురిసింది. అందుచేత, 'వర్ష దేవత' అని అతనికి అక్కడిప్రజలు పేరుపెట్టారు కూడాను.

అదృష్టశాలులైన చాలామంది వ్యక్తులలాగనే రూజ్వెల్టుకుకూడా కొన్ని మూఢనమ్మకాలు వుండేవి. శుక్రవారంనాడు గాని, పదమూడో తేదినాడు గాని ఏపనిచెయ్యడం అన్నా అతడు అంగీకరించేవాడుకాదు. ఏమయినాసరే, శుక్రవారంనాడు అతను ప్రయాణం ప్రారంభించేవాడు కాదు. అలాగే పదముగ్గురితో సహపంక్తిభోజనానికి కూచునేవాడు కాదు.

# అభిరుచులు

ప్రయాణం చెయ్యడం, భవనాలను నిర్మించడం, చెట్లను పెంచడం, అలమారులనిండా వస్తువులను పేర్చడం ఇవి అతని అభిరుచులు. రాజకీయ వాదులన్నా, సవాలు చెయ్యడమన్నా, ద్వీపాలను చూడడమన్నా, గాడిదలను చూడడమన్నా, భవిష్యత్తును గురించి ఆలోచించడమన్నా ఎక్కువ ఇష్టం.

చేతులకు గ్లౌవ్స్ పెట్టుకోవడమన్నా, చిన్నమాటలతో చెప్పే సంగతులకు పెద్దమాటలను వుపయోగించడమన్నా, తీరుబాటుగా చేసేపనికి తనను ఎవరైనా తొందరపెట్టినా అతడు సహించేవాడుకాదు. వికాసవంతమైన అభివృద్ధిని అరికట్టడానికి ప్రయత్నించేవారిని చూస్తే అసలు భరించలేకపోయేవాడు.

# ఇల్లు, గ్రంథాలయం, సేకరణలు

రూజ్వెల్టు తనఇంట్లో నిత్యజీవితం ఎలా గడిపేవాడో తెలుసుకుందా మని కుతూహలం వున్నవారంతా, హైడ్ పార్కులోని ఆ యింటిని చూడవచ్చును. ఆ యిల్లు యీనాడు దేశపు ఆస్తిగా అందరూ దాన్ని చూడడానికి ఒకమ్యూజియంగా వున్నది. రూజ్వెల్టు బ్రతికివున్నప్పుడు ఆయింట్లో అతడు నివసించేటప్పుడు ఆయింట్లో ఏర్పాట్లు ఎలావుండేవో, ఇప్పుడు కూడా ఆ ఏర్పాట్లన్నీ అలాగే వుంచబడినవి.

హైడ్ పార్కు భవనాన్ని తనతల్లి మరణానంతరం ఎలా వుపయోగించాలా అని రూజ్వెల్టు చాలారోజులు మీమాంస పడ్డాడు. తన బిడ్డలకు ఎవరికైనా ఆ యింటిని వ్రాసియిస్తే, వారి సత్వపుపన్నులు కట్టడానికి ఆ యింటి ఆస్తిలో కొంత పోగొట్టుకో వలసివస్తుందనీ, పైగా ఆ యింటి నంతటినీ జాగ్రత్తగా చూసుకోవాలంటే చాలాడబ్బు ఖర్చుపెడుతూ వుండాలనీ అతడికి తెలుసు. ఆయింటిలో కాపురం వుండే వాంఛ ఏమీ తన కక్కరలేదన్నది రూజ్వెల్టు భార్య.

ఆలోచించి, ఆలోచించి ఆ యింటిని దేశానికి యిచ్చివెయ్యడానికి నిశ్చయించాడు రూజ్వెల్టు. తనబిడ్డల జీవితకాలంలో, వారు ఆ యింటిలో కాపురం వుండడానికి వీలుండే షరతుమీద ఆ యింటిని దేశానికి అంకితం చేశాడు రూజ్వెల్టు. తన యింటిని దేశానికి అంకితంచేసిన ప్రెసిడెంటు రూజ్వెల్టుతప్ప మరొకడు లేడు. రూజ్వెల్టుయిచ్చిన యీగొప్ప విరాళాన్ని అంగీకరిస్తూ కాంగ్రెస్ (అమెరికా పార్లమెంటు) తీర్మానం చేసింది. ఆ యింటి ఆవరణా, చుట్టూవున్న ఆవరణా కలిపి 33.23 ఎకరాలు వుంది. రూజ్వెల్టు చనిపోగానే అతడి భార్యా బిడ్డలుకూడా ఆ ఆస్తిమీద తమకు వున్న హక్కులన్నిటినీ వదులుకున్నారు.

తరవాత రూజ్వెల్టు ప్రథమసంవత్సరీకం నాడు అంటే 1946 ఏప్రిల్ 12 తేదీన ఆ గృహానికి ప్రారంభోత్సవం, జాతీయసంపదగా, జరిగింది. ఆ యింటినీ, ఆ యింటికి సంబంధించిన ఆస్తినీ భద్రంగావుంచడం ప్రభుత్వపు దేశీయశాఖకు సంబంధించిన నేషనల్ పార్క్ సర్వీసు వారు చూస్తున్నారు.

1946 ఏప్రిల్ నుంచి 1950 ఏప్రిల్ లోపల దాదాపు పదిలక్షలమంది యీ యింటిని చూడడానికి వెళ్ళారు. అక్కడి రిజిస్టరునుబట్టిచూస్తే, ఒకే రోజున 11,000 మంది ఆ యింటిని చూడడానికి వెళ్ళినట్లు తెలుస్తోంది. ఒకే సారి 70 మందికంటే యింటిలోపలికి వెళ్ళడానికి వసతిలేనందున, చాలా మంది యింటిలోపలికి వెళ్ళి చూడకుండా తిరిగిపోవడంకూడా జరిగింది.

హడ్సన్ నదికి అరమైలు దూరంలో చక్కని పచ్చిక బయలులో వుంది ఆ యిల్లు. ఆ యింటిలోకి వెళ్ళిచూస్తే రూజ్వెల్టు కుటుంబపు వాతావరణం స్పష్టంగా కనిపిస్తుంది. రూజ్వెల్టు పూర్వీకుల బొమ్మలు, నౌకల బొమ్మలు, పారవెయ్యడానికి యిష్టంలేక పూర్వీకులు దాచిపెట్టిన అనేకమైన పనికిరాని వస్తువులు ఆ యింటినిండా కనిపిస్తాయి. రూజ్వెల్టు కుటుంబీకులు ఎవరూ ఏవస్తువునూ పారవేసేవారు కారు. రూజ్వెల్టు మరణానంతరం రూజ్వెల్టుభార్య ఆ యింట్లో అన్ని మూలలనూ శోధిస్తే, 50 సంవత్సరాల నాటి రూజ్వెల్టుతల్లి ఎక్కడో ఒకమూల దాచిపెట్టిన రిబ్బనుముక్కలు కనిపించాయట.

రూజ్వెల్టు వంశీకులలో నాజూకుదనానికి అందచందాల లీల తెలియదు. అందచేత, వాళ్ళ యింటిని చూస్తే ఒక తీరూ తెన్నూ లేనిదిగా కనిపిస్తుంది.

పూర్వకాలంనుంచీ ఎక్కడ ఏవస్తువు వున్నదో దానిని అక్కడే వుంచటంతప్ప దానిని మార్చటమంటే రూజ్వెల్టు సహించేవాడు కాడు. అతని ప్రాచీనస్వభావంకూడా అంతే. ఇంటికట్టడంలో ఏ విధమైన మార్పునూ అతడు చేయించలేదు. పక్షవాతం వచ్చిన తరవాత, మేడమీద పడకగదికి వెళ్ళడానికి మెట్లు ఎక్కడం అతడికి సాధ్యంకాదు గనుక, ఎలక్ట్రిక్ లిఫ్ట్ పెట్టించమని ఎందరుచెప్పినా అతడు అంగీకరించలేదు. అందుచేత, ఒక తొట్టెను కట్టించి, మేడమీద ఒకగిలక పెట్టించి, తను పైకి వెళ్ళవలసి వచ్చినప్పుడు ఆ తొట్టిలో కూచుని, బావిలోనుంచి నీళ్ళను తోడినట్లు పైకి తోడించుకొనేవాడు. క్రిందకు దిగవలసి వచ్చినా, అదే పద్ధతి అవలంబించేవాడు. ఇప్పటికీ ఆ యింట్లో వున్న లిఫ్ట్ అదే.

రూజ్వెల్టు గ్రంథాలయం రూజ్వెల్టు ఇంటికి ఈశాన్యంగా కొన్ని వందల గజాల దూరంలో వుంటుంది. ఆ భవనాన్ని ఎలాకట్టాలో

పంపిణీ వేసి అజమాయిషీ చేసినవాడు రూజ్వెల్టు. ఈ గ్రంథాలయాన్ని భద్రంగా చూడడం, నేషనల్ ఆర్కైవ్స్ శాఖవారి బాధ్యత. ఆ గ్రంథాలయంలో రూజ్వెల్టు వ్రాసిన వుత్తరాలు, అతడికి వచ్చిన వుత్తరాలు, అతడు వ్రాసిన ఇతర కాగితాలు అన్నీ వున్నాయి. కట్టలు కట్టలుగా పేర్చబడివున్న ఆ పత్రాలనుచూస్తే ఎవరికైనా ఆశ్చర్యం కలుగక మానదు.

తన కాగితాల నన్నిటినీ ఏంచెయ్యడమా అని రూజ్వెల్టు చాలా కాలం ఆలోచించి, వాటన్నిటినీ దేశానికి అంకితం చేయడానికి నిశ్చయించాడు. తరువాత వాటన్నిటిని భద్రపరుచడానికి ఒక భవనం నిర్మించడానికి పూనుకున్నాడు. ఆ భవన నిర్మాణానికి కావలసిన స్థలాన్ని, 16 ఎకరాల నేలను అతడితల్లి విరాళంగా ఇచ్చింది. భవన నిర్మాణానికి కావలసిన డబ్బును 4,00,000 డాలర్లను మొత్తం 28,000 దాతలు విరాళంగా యిచ్చారు. ఈ గ్రంథాలయాన్ని కేంద్రప్రభుత్వ సంస్థగా నిర్వహించడానికి కాంగ్రెసు అంగీకరించింది. భవన నిర్మాణానికి శంఖుస్థాపనను 1939 నవంబరు 19 తేదీన రూజ్వెల్టే చేశాడు. దీని నిర్వహణకు అయ్యే ఖర్చులో కొంత భాగాన్ని ప్రభుత్వం భరిస్తున్నది. తక్కినది లోపలికి వెళ్ళడానికి ప్రేక్షకులు చెల్లించే రుసుములవల్ల వస్తుంది. లోపలికి వెళ్లడానికి ప్రతిప్రేక్షకుడూ 25 సెంట్లు (దాదాపు రూపాయి జేబ) చెల్లించాలి. ఏడాదికి సుమారు 5,00,000 మంది ఆ గ్రంథాలయం లోపలికి వెళ్ళిచూస్తారు. చూసేవారెవరూ తాము యిచ్చిన రుసుము వృధాఖర్చు అని అనుకోరు.

ప్రెసిడెంటు తనకు సంబంధించిన పత్రాలన్నిటినీ దేశానికి అంకితం చెయ్యడం అనేది రూజ్వెల్టుకుపూర్వం అమెరికా దేశపు చరిత్రలో ఎన్నడూ జరుగలేదు. తన జీవితానికి సంబంధించిన రికార్డులంతటినీ ప్రభుత్వానికి అప్పగించడమనేది అంతకు పూర్వము ఏ ప్రెసిడెంటూ తలపెట్టనైనా తలపెట్టలేదు.

ప్రెసిడెంటు వ్రాసిన ఉత్తర-పత్రాలన్నీ అతడి సొంత ఆస్తి అనీ, వాటిని అతడు తన యిష్టంవచ్చినట్లు చేసుకోవచ్చు ననీ అమెరికా సాంప్రదాయం. కొంతమంది ప్రెసిడెంట్లు తమ పదవి ముగిసి యింటికి

నెళ్ళేటప్పుడు తమ పత్రాలను తమతో తీసుకొని పోయారు. కొంతమంది తమ పత్రాలను తగలబెట్టి వేశారు. కొంతమంది ప్రెసిడెంట్లకు సంబంధించిన పత్రాలు దేశంలో తలోమూలా వున్నాయి. అబ్రహాం లింకన్‌కు సంబంధించిన ఏదో ఒకపత్రం యిప్పటికీ కొత్తగా బయటపడుతూనే వుంది. చాలామంది ప్రెసిడెంట్లను గురించి వ్రాయాలంటే, చరిత్రకారులకు పెద్ద ఇబ్బంది కలుగడానికి కారణం, వాటికి సంబంధించిన రికార్డు అంతా ఒకచోట ఎక్కడా దొరకక పోవడమే.

చరిత్రకారులకు ఇబ్బంది ఏమీ కలుగకుండా తనను గురించిన రికార్డు అంతా ఒకస్థలంలో వుండేటట్లు చెయ్యాలని రూజ్వెల్టు వాంఛించినట్లు స్పష్టంగా తెలుస్తున్నది. కాని, చరిత్రకారులకు ఎంతకష్టమైన పనిపెట్టాడో రూజ్వెల్టుకు తెలియదు. ఏమంటే గ్రంథాలయ భవన నిర్మాణం పూర్తి కాగానే, దానికి పత్రాలనూ, పుస్తకాలనూ పంపించడం ఆరంభించాడు. వచ్చినవాటిని కట్టలువిప్పి వాటిని సరియైన స్థానంలో అమర్చడమే ఒక బ్రహ్మాండమైనపని అయింది. ఇప్పటికీ కొన్నివందల కట్టలు విప్పకుండా అలాగే వున్నాయి. విప్పవలసిన కట్టలు సుమారు 50 టన్నుల బరువు వుంటాయని అంచనా.

తన పత్రాలలో ఏవి కేవలమూ తన వ్యక్తిగతమైన సంబంధాలకు చెందినవో, వేటిని గ్రంథాలయానికి పంపి ప్రజలు చదవడానికి వీలుకలిగించ వచ్చునో నిర్ణయించడానికి 1943 లో రూజ్వెల్టు ఒక కమిటీని నియమించాడు. పోప్, ఇంగ్లండు రాజు మొదలైన ప్రముఖులకు కొందరికి తానువ్రాసిన ఉత్తరాలు, వారువ్రాసిన జవాబులను మాత్రం ఎప్పటికీ బైటపెట్టకూడదని అతడు నిష్కర్షగా ఒక షరతుపెట్టాడు.

కొంతమంది వ్యక్తులనుగురించి ఆయనవ్రాసుకున్న అభిప్రాయాలనూ, కొంతమంది వ్యక్తులనుగురించి ఆయనకి అధికారులు రహస్యంగా విచారణచేసి తెలియచేసిన అభిప్రాయాలనూ, దేశపు మర్యాదను లోపంకలిగించే పత్రాలనూ, వివిధదేశాలతో స్నేహానికి భంగంకలిగించే పత్రాలనూ ప్రస్తుతం ఎవరికంటికీ కనబడకుండా దాచివుంచడానికి గ్రంథాలయ నిర్వాహకులు నిశ్చయించారు. ఈ విధంగా ఆ గ్రంథాలయంలోని

పత్రాలలో దాదాపు ఆరవవంతు ప్రస్తుతం దాచిపెట్టడానికి నిశ్చయింప బడింది. కొంతకాలం పోయినతరువాత అన్ని పత్రాలుకూడా బహిరంగ పరచబడుతవి.

మిలిటరీ వ్యవహారాలను గురించీ, రాజకీయాలను గురించీ విదేశ ప్రభుత్వాలతో రూజ్వెల్టు జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు చాలావరకు ఈ గ్రంథాలయానికి చేరలేదు. వాటన్నిటినీ తన ఉపయోగంకోసం వైట్ హౌసులోనే వుంచమని ప్రెసిడెంట్ ట్రూమన్ ప్రత్యేకంగా కోరినందున అవన్నీ అక్కడే వుంచబడినవి.

రూజ్వెల్టు కుటుంబంలోనివారందరూ ఇతర ప్రజలందరి లాగే ఆ గ్రంథాలయంలో పరిశోధన చేసుకోడానికి వెళ్ళవచ్చును. అంతేకుమించి వారికి ఆ గ్రంథాలయంతో వేరే సంబంధం ఏమీలేదు.

రూజ్వెల్టును గురించి గ్రంథాలు వ్రాస్తున్నవారు చాలామంది, యీ గ్రంథాలయంలో పరిశోధన చేస్తున్నారు.

ఈ గ్రంథాలయంలో వున్న రికార్డును చూస్తే ఎవరికైనా కళ్ళు తిరుగుతవి. 16,000 పుస్తకాలు, 34,000 కరపత్రాలు, 15,000 ఫోటోగ్రాఫులు, 2,75,000 అడుగుల ఫిలిం (రూజ్వెల్టు ప్రయాణాలు, ఉపన్యాసాలు మొదలైనవాటికి సంబంధించినది), 300 శబ్దగ్రాహక ఫిలిములు కాక, 1,200 బీరువాలలో పట్టేటన్ని ఇతర పత్రాలు ఇప్పటికి విషయంవారీగా అమర్చబడినవి. దానిలోని వస్తువులనూ, పత్రాలనూ వరుసగా లెక్కపెడితే, అయిదుకోట్ల సంఖ్యవరకూ లెక్కపెట్టవలసి వస్తుందట.

తను బ్రతికివున్నన్నాళ్లూ, యీ గ్రంథాలయంపట్ల రూజ్వెల్టు ఎక్కువ శ్రద్ధ తీసుకొనేవాడు. అప్పుడప్పుడు కొన్ని గంటలసేపు అక్కడ గడిపి, పత్రాలనన్నిటినీ విషయంవారీగా పోగుచేసి, వాటినిగురించి ఒక పట్టీని తయారు చెయ్యడంలో అతను చాలా శ్రమపడేవాడు.

తను రెండుసార్లు మాత్రమే అధ్యక్షుణ్ణవుతాననీ, ఆ ఎనిమిదేళ్ళ లోపల జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలైనవాటిని పెట్టడానికి

మాత్రమే స్థలం కావాలనీ అనుకొని రూజ్వెల్టు ఆ గ్రంథాలయ భవనాన్ని నిర్మింపచేశాడు. కాని, పన్నెండుసంవత్సరాలు అధ్యక్షుడుగా వున్నందు వల్లనూ, మామూలు పరిస్థితులు కాక, మహాయుద్ధం ఒకటి సంభవించి నందువలనూ అనుకున్నదానికంటె ఎక్కువరెట్లు గ్రంథం ఆ గ్రంథాలయానికి చేరింది.

వస్తువులను సేకరించడంలోనూ, వచ్చినవాటిని పారవెయ్యకుండా భద్రంగా దాచడంలోనూ రూజ్వెల్టుకు వున్న చాదస్తంవల్ల అతడికి ప్రతి సంవత్సరమూ వచ్చిన క్రిస్మస్ కార్డులూ, జన్మదిన సందేశపు కార్డులూ ఎన్ని వేల సంఖ్యలలో, బాగులేనివాటిని పారవెయ్యగా, డ్రాయర్లన్నీ నిండిపోతూ ఆ గ్రంథాలయంలో వున్నాయి.

రూజ్వెల్టును గురించి వార్తలు, వ్యాఖ్యలు పత్రికలలో ప్రకటింప బడినప్పుడు వాటన్నిటినీ కత్తిరించి చదరపు అడుగు సైజులో ఎనిమి దంగుళాల మందంలో కట్టిన పుస్తకాలలో అంటించడం వైట్ హౌస్ లోని కొందరు గుమాస్తాల పని. అలాటివన్నీ, ఆ గ్రంథాలయంలోని ఎన్నో గదులనిండా వున్నాయి.

పుస్తకాలలో తన పేరు వ్రాయడం అంటే రూజ్వెల్టుకు చాలా ఇష్టంగా వుండేది. తనకు వచ్చిన ప్రతి పుస్తకంమీదా ఎఫ్. డి. రూజ్వెల్టు అని సంతకం పెట్టేవాడు. ఎందుకూ పనికిరాని అనేక కరపత్రాలమీదకూడా అతని సంతకం కనిపిస్తుంది. ఈ గ్రంథాలయంలోవున్న పుస్తకాలలో దాదాపు నాలుగైదువేల పుస్తకాలమీద అతని సంతకాలు కనిపిస్తాయి.

అతనువ్రాసిన 'ఆన్ అవర్ వే' (On Our Way) అనే పుస్తకం అచ్చుకాగా, ప్రెస్సువారుపంపిన మొట్టమొదటి ప్రతి లోపలి మొదటి పేజీలో ఇలా వ్రాసి వుంది: "అచ్చు అయిన పుస్తకాలలో మొట్టమొదట బయటికివచ్చినవాటిలో ఇది ఒకటి. తప్పులు ఏమయినా వున్నాయేమో చూడాలి. ఎఫ్. డి. ఆర్." రూజ్వెల్టు వ్యక్తిగత జీవితానికీ, అతని పూర్వీకుల వ్యక్తిగత జీవితానికీ సంబంధించిన వస్తువులన్నీ పెట్టిన వస్తుప్రదర్శనశాల యీ గ్రంథాలయంలో ఒకభాగం. అయితే, ప్రదర్శనశాలలో పెట్టవలసిన వస్తువులన్నిటినీ ఒకేసారి దానిలో ప్రదర్శించడానికి స్థలం చాలదు.

వస్తువులలో పదివవంతువాటిని మాత్రమే ఒకసారి దానిలో ప్రదర్శించ వచ్చును. అందుచేత, వస్తువులను పది భాగాలుగాచేసి, ఒకభాగం తరువాత మరొకభాగాన్ని వంతులప్రకారం దానిలో ప్రదర్శిస్తారు.

దానిలో ప్రదర్శించే వస్తువులు ఎన్నోరకాలు వుంటాయి. మచ్చుకి యీక్రింద వుదహరించినవి కొన్ని :

రూజ్వెల్టు చిన్నతనంలో అతణ్ణి పడుకోబెట్టిన ఉయ్యాలతొట్టి, అతడికి నామకరణం చేసిననాడు తొడిగిన జాకెట్; రూజ్వెల్టు భార్య నామకరణంనాడు ఆమెను తొడిగిన దుస్తులు.

రూజ్వెల్టు పూర్వీకులలో ఒకడైన జాకొబస్ రూజ్వెల్టు అనే ఆయన ఉపయోగించిన బంగారపు గడియారము, దాని బరిణె.

రూజ్వెల్టుకు అరేబియారాజు ఇబిన్ సావుద్ బహూకరణగా యిచ్చిన వజ్రాలుతాపిన ఖడ్గములు రెండు. దానిలో ఒకదాని ఖరీదు లక్షడాలర్లు వుంటుందట.

రూజ్వెల్టుకు తీవ్ర రాజకీయప్రతికక్షి అయిన సెనెటర్ ఓడానియెల్ రూజ్వెల్టుకు బహూకరణగా యిచ్చిన నాలుగు అడుగులు పొడవుగల ఫౌంటెన్ పెన్.

రూజ్వెల్టు వుపయోగించినవీ, అతడికి అనేకులు బహూకరణగా యిచ్చినవీ అనేక బొత్తాములు, కఫ్ బొత్తాములు, సిగరెట్టుపెట్టెలు, మెడల్సు మొదలైనవి కొన్నివందలు.

రూజ్వెల్టును చంపడానికి మియామిలో ప్రయత్నం జరిగినప్పుడు అతడిమీదకు ప్రేల్చబడిన రివాల్వరు గుండ్లలో ఒకటి.

ఒక పెద్దగదిలో అతడికోసం ప్రత్యేకంగా చేతితో బ్రేకు వేసే ఏర్పాటు చేయబడి అతడు స్వయంగా నడుపుకోవడానికి వీలయిన ఫోర్డు మోటారుకారు; అతడి తండ్రి చిరకాలం వుపయోగించిన సైకిలు.

ఆ గ్రంథాలయానికి ప్రెసిడెంటు బ్రతికివున్న రోజులలో అతడు వెళ్ళినప్పుడు ఆఫీసుగా ఉపయోగించిన గది కొంచెం పెద్దగదే. ఆ గదిలో

ఆఖరుసారి రూజ్వెల్టు కూచున్నది 1945 మార్చి 28 న. ఆనాడు అతడు ఆ గదినుంచి వెళ్ళినప్పుడు అతడు ఆ గదిని ఎలా వదలిపెట్టి వెళ్ళాడో ఇప్పటికీ దానిని అదేస్థితిలో వుంచారు. అతడి వ్రాతబల్లమీద అతడు వదలిపెట్టిన కేమెల్స్ సిగరెట్ పెట్టె కూడా అలాగే వుంది.

ఆ గదిలో నేలమీద అతడికి పెర్షియారాజు బహూకరణగా యిచ్చిన తివాసీ పరిచి వుంది. ఆ గదిలోని బీరువాలలో అతడి చిన్నతనంలో చదివిన క్లాసుపుస్తకాలు, పిల్లలపత్రికలు, యువకదశలో చదివిన గ్రంథాలు వున్నాయి.

ఆ గదిలోనికి ఇక చచ్చిపోతాడనగా రూజ్వెల్టు తీసుకువచ్చిన వస్తువులు ఏమిటంటే ఆనాటి కాలంలో యునైటెడ్ నేషన్సులో అగ్రరాజ్యాలుగా వున్న యునైటెడ్ స్టేట్సు, రష్యా, చైనా, బ్రిటను దేశాల పతాకాలు.

మరొక బీరువాలో రూజ్వెల్టుకు చర్చిల్ బహూకరణగా యిచ్చిన పుస్తకాలు, అన్నీ చర్చిల్ వ్రాసినవి, ఉన్నాయి.

## సమాధి

హైడ్ పార్కు భవనానికీ, గ్రంథాలయానికీ మధ్య రూజ్వెల్టుసమాధి వుంది. ఆ సమాధిచుట్టూ గులాబీతోట వుంది. ఆ తోటచుట్టూ కదంబ వృక్షాలు తీరుగా నాటబడినవి. తన సమాధిని ఎలాకట్టాలో నిర్ణయిస్తూ 1937 లో రూజ్వెల్టు ఒక వీలునామా వ్రాశాడు. దానిలో ఇలావుంది:

"తెల్లని, ఏమీ చెక్కడపు పనితనముగాని, అలంకారములు గాని లేని సమాధిని నా గోరీమీద కట్టాలి. అది ఎనిమిదడుగుల పొడవు, నాలుగు అడుగుల వెడల్పు, మూడు అడుగుల ఎత్తు ఉండాలి. ఈ సమాధిని అన్నివైపులా రెండడుగులు ఎక్కువగా వున్న పాలరాతి గట్టుమీద కట్టాలి. ఈ గట్టు నేలమీద ఆరు అంగుళాల ఎత్తుకన్న ఎక్కువ వుండకూడదు.

"నా ప్రియమైన భార్యకూడా ఆమె మరణించినప్పుడు అక్కడే సమాధి చేయబడుతుందని నాకోరిక. ఆ సమాధులపైన

ఏవిధమైన చెక్కడపుపనీ వుండకూడదు. ఈ క్రింద సూచించిన విధంగా మాపేర్లు మాత్రం చెక్కాలి.

ఫ్రాంక్లిన్ డిలానో రూజ్వెల్టు 1882-19...
ఆనా ఎలియనార్ రూజ్వెల్టు 1884-19...

ఈ సమాధిని చూచినవారు కొన్నివేలమంది అక్కడే పొంగిపొర్లి వచ్చిన దుఃఖంతో కన్నీరు విడిచారు.

# ఇతర దృశ్యాలు

ఆ హైడ్ పార్కు ఆవరణ అంతా రూజ్వెల్టు జీవితాన్ని, అతని కుటుంబపు జీవితాన్ని ఎక్కువగా స్మరణకు తెస్తూ వుంటుంది. రూజ్వెల్టు అభిమానానికి ఎక్కువగా పాత్రమైన రిఫార్మ్డ్ డచ్చి చర్చి, అతడు ఓటింగులో పాల్గొన్న టౌనుహాలు, రూజ్వెల్టు తండ్రిపేర, రూజ్వెల్టు తల్లి కట్టించిన జేమ్సు రూజ్వెల్టు లైబ్రరీ—ఇవన్నీకూడా ఆ ఆవరణలోనే వున్నాయి.

హైడ్ పార్కు గ్రామానికి కొద్దిమైళ్ల దూరంలో వాల్-కిల్ అనే చిన్న ఇంటిలో, రూజ్వెల్టుసతి ప్రస్తుతం నివసిస్తున్నది. ఈ ఇంటిని ఆర్థిక మాంద్యపు రోజులలో పనిలేనివారికి గృహోపకరణ వస్తువులను తయారుచేసే పని కల్పించడానికి ఒక చిన్న కర్మాగారంగా ఉపయోగిస్తుందని రూజ్వెల్టు కట్టించాడు గాని, ఆ ప్రయత్నం సాగలేదు. ఆ యింటిని నివాస యోగ్యమైన దానిగా తగినమార్పులు చేయించి, దానిలో ఇప్పుడు రూజ్వెల్టు సతి నివసిస్తున్నది. దానికి ప్రక్కనే స్టోన్ కాటేజి అనే ఇల్లు వుంది. దాని కట్టడమునకు నమూనా రూజ్వెల్టే తయారుచేశాడు. ఆయిల్లు ఇప్పుడు అతిథులకు వసతి గృహంగా ఉపయోగిస్తున్నది. దాని ప్రక్కన యీత కొట్టడానికి నిర్మించిన కొలను వున్నది.

సమీపంలోనే చిన్న కొండమీద టాప్ కాటేజి అనే యిల్లు వుంది. దానిలో రూజ్వెల్టుకొడుకు ఎలియట్ ప్రస్తుతం నివసిస్తున్నాడు.

చెప్పితే నమ్మడానికి సాధ్యంకాదు గాని, వామ్‌స్ప్రింగ్స్‌లో చికిత్సకోసం కట్టించుకున్న యిల్లుతప్ప, తనది అని చెప్పుకోడానికి రూజ్వెల్టుకు ఇల్లులేదు. హైడ్ పార్కు యిల్లు అతని తల్లిది. గవర్నరుగా వున్నన్నాళ్లూ న్యూయార్కు ప్రభుత్వభవనంలో ఉన్నాడు. ప్రెసిడెంటుగా వున్నన్నాళ్లూ అతడు నివసించిన వైట్ హౌస్ దేశానిది. అధ్యక్షుడుగా ఎన్నికో బడడానికి పూర్వం అతడు వాషింగ్టన్‌లో వున్నన్నాళ్లూ అద్దెయింటిలో వున్నాడు.

ప్రస్తుతం ఎలియట్ నివసిస్తూవున్న టాప్ కాటేజిని తాను నివసించడానికి రూజ్వెల్టు కట్టించాడు. ఆ యింటి నిర్మాణానికి నమూనాను అతడే తయారు చేశాడు. నిర్మాణాన్ని దగ్గరవుండి అజమాయిషీ చేశాడు. 1940 తరువాత ఆ యింట్లో నివసించుదామనీ, తన జీవితచరిత్రను వ్రాసుకుంటూ, చుట్టూ తోటలో చెట్లను పెంచుతూ, ప్రక్కనవున్న తన పొలాలలో వ్యవసాయం చేయిస్తూ కాలం గడుపుదామనీ అతడి వుద్దేశం. కాని, విధి మరొకలాగ నిర్ణయించింది. ఏమంటే, టాప్ కాటేజి నిర్మాణం పూర్తి అయిన తరువాత ఒక్కరోజుకూడా అతడు ఆయింట్లో నివసించలేదు. దానిలో నివసించడానికి ఆ యింటిని ఎలియట్ తీసుకున్నదాకా ఆ యింట్లో ఎవరూ కాపురం వుండలేదు.

తన హైడ్ పార్కు యింటిని చూడడానికి వచ్చిన ప్రసిద్ధవ్యక్తులందరినీ రూజ్వెల్టు స్వయంగా టాప్ కాటేజికి తీసుకువెళ్లి దానినికూడా చూపించేవాడు.

## మరికొన్ని వివరాలు

రూజ్వెల్టు మేధాశక్తి ఏమిటి? సాయంత్రంపూట అతడి మేధ బాగా పని చేసేది. తీవ్రమైన సమస్యలను గురించి అతడు రాత్రి తొమ్మిది, పన్నెండు గంటలమధ్య చక్కగా, సునిశితంగా ఆలోచించేవాడు. పగలంతా మామూలుగా చేయవలసిన కార్యక్రమాలను చేసేవాడు. కొత్త కార్యక్రమాలను గురించి ఆలోచించడమూ, తీవ్రమైన సమస్యలను పరిష్కరించడానికి మార్గాలను వెతకడమూ, చిక్కులను విడదియ్యడమూ ఇదంతా

రాత్రిపూట చేసేవాడు. ఏదైనా ఒక విషయాన్నిగురించి, ఏదో ఒక నిర్ణయం చెయ్యవలసివస్తే, పగలంతా ఎలాగో అలాగ దాన్ని వాయిదావేసి రాత్రిభోజనం అయినదాకా గడిపేవాడు. అప్పుడిక అతడొక నిర్ణయం చేశాడంటే అది అమోఘంగా వుండేది.

అసలు నిజం చెప్పాలంటే ఏ విషయాన్నిగురించీ రూజ్వెల్టు అదే పనిగా ఆలోచించేవాడు కాదు. ఏసమస్యనూ అతడు భిన్న దృక్పథాలతో పరిశీలించేవాడుకాదు. తనకు తాను గజిబిజిపాటు లేకుండా వున్నప్పుడు ఏనిర్ణయం తోస్తే దానిని అవలంబించేవాడు. తను ఫలానా నిర్ణయం చెయ్యడానికి కారణాలు ఏమిటో అతడు ఎప్పుడూ వివరించేవాడుకాదు. అంటే అతడు కేవలం తనకు ఏది స్ఫురిస్తే దానిని చేసేవాడన్నమాట. అంచేతనే ఏదైనా ఒక సమస్యనుగురించి తన సలహాదార్లు తనఎదుట వాదోపవాదాలు చేస్తుంటే, వాటిని అతడు వింటున్నట్టుకూడా కనపడేవాడుకాదు. ఏవిషయాన్ని గురించి అయినా ఎవరైనా విస్తరించిచెప్పినా, వాదోపవాదాలను విస్తరించి చేసినా అతడికి విసుగ్గా వుండేవి. ఒక నిర్ణయాన్ని చెయ్యడానికి ఎలా ఆలోచించాలి అనేదానికన్న, ఆ నిర్ణయాన్ని చెయ్యడంపట్ల అతడు ఎక్కువ ఆత్రపడేవాడు. అయితే, అతడి ఆత్రతవల్ల ఎప్పుడూ నష్టం కలగలేదు.

అతడి మేధాశక్తిలో లోపాలు వున్నాయి. కాదని ఎవరూ అనలేరు. తీవ్రమైన ఆలోచనలకంటె, చాకచాక్యంతోనిండిన సంభాషణలవల్ల అతడికి సునిశితమైన నిర్ణయాలు తోచేవి. "రూజ్వెల్టు బాగా వాదించగలడా," అని అతడి ముఖ్యస్నేహితులలో ఒకరిని అడిగితే, "వాదించడమంటే అతడికి ఇష్టంవుండేదికాదు," అని అతడు జవాబు చెప్పాడు.

పైగా, ఏదైనా ఒక పెద్ద పేచీ వచ్చినప్పుడు తన పట్టు నెగ్గించుకోవడంకంటే, ఏదోఒక రాజీమార్గాన్ని అవలంబించడానికి అతడు ఎక్కువగా మొగ్గేవాడు. ఒకసారి ఒక పేచీ వచ్చింది. కెనడానుంచి అమెరికాకు ఒక నష్టపరిహారం రావలసివచ్చింది. ఆ నష్టపరిహారం 30 లక్షల డాలర్లు వుండాలని అమెరికా ప్రభుత్వ విదేశశాఖామంత్రి నిర్ణయించాడు. 60

లక్షల డాలర్లకు తక్కువ అయితేగాని ఒప్పుకోజాలమని ఆర్థికశాఖా మంత్రి పట్టుపట్టాడు. తగాదా రూజ్వెల్టుదగ్గరకు వెళ్ళింది.

"మనం అడిగిన నష్టపరిహారం నిజంగా ఎంతవిలువ వుంటుంది ?" అని అతడు విదేశశాఖామంత్రి కార్డెల్ హల్‌ను అడిగాడు. "కోర్టుకు వెడితే, బహుశా మనకు కానీకూడా రాకపోవచ్చు" అని హల్ బదులు చెప్పాడు.

వెంటనే రూజ్వెల్టు టెలిఫోనులో ఆర్థికశాఖామంత్రి హెన్రీ మోర్గంతోతో ఇలా చెప్పాడు: "హెన్రీ, కెనడాదగ్గరనుంచి మనం రాబట్ట వలసిన నష్టపరిహారాన్నిగురించి మాట్లాడడానికి కార్డెల్ నాదగ్గరకు వచ్చాడు. దానినిగురించి మనమొక చిన్న లెక్క వెయ్యాలి. ఒక కాగితం తీసుకో. నష్టపరిహారం 60 లక్షల డాలర్లు అని నువ్వు అంటున్నావు. ఆ అంకె ఆ కాగితం మీదవేసుకో. దానిక్రింద మనకు రావలసిన నష్టపరి హారపు విలువ ఎంత అని నేను అనుకుంటున్నానో ఆ అంకె వెయ్యి. ఆ అంకె ఎంతో తెలుసా ? సున్న. అరవైలక్షలకు సున్న కలుపు. ఎంత వచ్చింది. అరవైలక్షలు. అదేమిటీ, మనఇద్దరమూకలిసి అనుకున్నది. దానిని రెండుపెట్టి భాగిస్తే మనఇద్దరి అభిప్రాయమూ విడివిడిగా ఎంతో తేలుతుంది. భాగించు ఎంతవచ్చింది. 30 లక్షలు. కార్డెల్ అడిగేదికూడా అంతే. కాబట్టి, 30 లక్షలకు వొప్పుకుందామా?"

టెలిఫోనులో ఒక నిమిషం నిశ్శబ్దం. తరువాత, రూజ్వెల్టు టెలిఫోను క్రిందపెట్టివేసి హల్ వంకతిరిగి "హెన్రీ ఒప్పుకున్నాడు" అని చెప్పాడు.

అంకెలను తనయిష్టం వచ్చినట్టూ నిర్ణయించడంలో రూజ్వెల్టుకు ఏ మాత్రం భయంగాని, సంకోచంగాని వుండేదికాదు. 1933 లో బంగారపు ధరను ఎంత పెంచాలి అని నిర్ణయించవలసి వచ్చినప్పుడు అతడు 21 సెంట్లు ఎక్కువ పెంచాలి అని నిర్ణయించాడు. "21 సెంట్లు ఎందుకు నిర్ణ యించావు" అని ఒకమిత్రుడు అడిగితే, "అది అదృష్టపు సంఖ్య: మూడేడ్లు ఇరవైఒకటి" అన్ని సమాధానం చెప్పాడు.

యుద్ధనిర్మాణ కార్యక్రమాన్ని నిర్ణయించ వలసినప్పుడు, సంఖ్యలను అతడు తన యిష్టంవచ్చినట్టు నిర్ణయించేవాడు. 1942 లో 75,000 టాంకు

లను, 1,00,000 విమానాలను తయారు చెయ్యడానికి డబ్బును మంజూరు చెయ్యమని అతడు కాంగ్రెసును అడిగాడు. అంత పెద్ద నిర్మాణకార్యక్రమం సాగుతుందా అని అందరూ అదిరిపోయారు. "ఫరవాలేదు. చెయ్యాలనుకుంటే, మనవాళ్లు వాటిని తయారు చెయ్యగలరు" అని ధీమాగా చెప్పాడు. చివరకు అనుకున్న నిర్మాణకార్యక్రమం పూర్తిగా సాగింది.

1944 లో అతడు చికాగోలో ఒక ఉపన్యాసం ఇచ్చేటప్పుడు, యుద్ధానంతరం దేశంలో నిరుద్యోగ సమస్య ఏర్పడకుండా యుద్ధంనుంచి వచ్చిన వారందరికీ పనులు కల్పించడాన్ని గురించి మాట్లాడాడు. యుద్ధానంతరం కల్పించే నిర్మాణ కార్యక్రమాలవల్ల 5,70,00,000 మందికి పనులు కల్పించవచ్చునని ఆయా శాఖల నిపుణులంతా సూచించారు. "ఒక చక్కని ముచ్చటైన సంఖ్యలో చెప్పాలి," అని అతడు ఆ సంఖ్యను ఆరుకోట్లు చేశాడు.

ఏపని చేసినా అసలు ఆశయానికీ, సాధ్యపడే దానికీ మధ్య ఒక రాజీ ఏర్పడేటట్టుగా పనిని సాధించాలని అతని మతం.

రూజ్వెల్టుకు వున్న ఒక గొప్పప్రజ్ఞ ఏమిటంటే, సమర్థులనూ, మేధావులనూ ఏరుకోవడం. ప్రతివ్యక్తినీ, ప్రతి అంశాన్నీ, ప్రతి వస్తువునూ సంపూర్ణంగా గొప్ప ఫలితాలు సాధించడానికి వుపయోగించు కోవడం ప్రజ్ఞాశాలి లక్షణం. ఈ దృష్టితో చూస్తే, రూజ్వెల్టు ఒక గొప్ప ప్రజ్ఞాశాలి. పైగా, తనకు దొరికిన దానిలోని సంపూర్ణమైన విలువను పూర్తిగా గ్రహించడంలో అతనికి ఒక మహత్తు వుంది.

ప్రతి వ్యక్తీ తనకు ప్రతి విషయాన్నీ పూర్తిగా చెప్పేటట్టుగా రూజ్వెల్టు తనవద్దకు వచ్చినవారి నందరనూ ప్రోత్సహించేవాడు. తాను విన్న విషయాలన్నిటిలోనూ ముఖ్యాంశాలను మాత్రమే అతడు మనస్సులో వుంచుకొనేవాడు. ఎవరైనా తనకొక సలహా చెప్పినప్పుడు, మరి కొందరితో దానిని గురించి తర్కించనిదే ఆ సలహాప్రకారం నడుచుకొనేవాడు కాదు.

కాలంగడిచిన కొద్దీ మొదట్లోలాగ అతడు ఎవరిదగ్గర ఏ విషయాన్ని మాట్లాడినదీ స్పష్టంగా జ్ఞాపకం పెట్టుకోలేక పోయేవాడు. పైగా, ఇతరుల అభిప్రాయాలూ, తన అభిప్రాయాలూ కలిసి మనస్సు చిందరవందర

అవడంచేత తనకు ఒకవ్యూహం చెప్పిన వ్యక్తికే కొన్నాళ్ళు గడిచిన తరువాత ఆ వ్యూహాన్నే తన సొంతవ్యూహంగా చెప్పేవాడు కూడాను.

కొత్త విషయాలను తెలుసుకోడానికి అతడికి విపరీతమైన అంతులేని కుతూహలం వుండేది. అంతేకాదు, ఎంతో తీవ్రమైన, దారుణమైన విషయాలను అతడు విస్మరించేవాడు కాదు.

జర్మనులు లండనుమీద అతి దారుణంగా విమానదాడులను జరిపి, బాంబుల వర్షాన్ని కురిపిస్తూవున్న రోజులలో ఇంగ్లండులోని సాంఘిక వ్యవస్థ, సాంఘిక సమస్యలను గురించి తనకు నివేదికలను పంపమని రూజ్వెల్టు ఇంగ్లండులోని అమెరికన్ రాయబారిని పదేపదే హెచ్చరించేవాడు. దీనికి కారణం, యుద్ధం అయిపోగానే సాంఘిక సమస్యల పరిష్కారం ఒక ప్రధానమైన విధిగా తయారవుతుందనీ, అప్పుడు పరిస్థితులను అవగాహన చేసుకోవడం ప్రారంభిస్తే అసలు సమస్యను పరిష్కరించడం చాలా ఆలస్య మౌతుందనీ, అంచేత ముందుగానే సమస్త విషయాలనూ తెలుసుకొని తయారుగా వుండాలనీ అతడి ఉద్దేశం.

రూజ్వెల్టు మెదడు చాలా సునిశితమైనది. ఏ విషయాన్ని గురించి అయినా అసలు దాని మూలకందాన్ని ముందుగా గ్రహించేది. ప్రధాన విషయమేదో గ్రహించిన వెంటనే, దానిని సాధించడానికి అతడు కృషి ప్రారంభించేవాడు. ఫలితాన్ని సాధించడానికి అతడు ఏదో ఒక్క మార్గాన్నే అవలంబించేవాడు కాదు. "మనం చేసేపని సానుకూలం కావడానికి ఒక పద్ధతి అనుకూలించకపోతే, మరొక పద్ధతిని అవలంబించాలి" అనేవాడు.

ఒకే ఒక విషయంమీద కాక, అనేక విషయాలమీద అతడు ఒకేసారి తన మనస్సును నిలపగలిగేవాడు. జపాను అమెరికా మీద యుద్ధం ప్రకటించిన మరునాడు అంతకుముందే ఏర్పాటు చేయబడిన ఒక సమావేశంలో సంతాన నిరోధాన్ని గురించిన సమస్యలను చర్చించడం గురించి ప్రత్యేకశ్రద్ధ చూపాడు. తన ఆఫీసులోని ఒక ఉద్యోగిని పిలిచి పోర్టోరికో అనే ద్వీపాన్ని గురించి ఒక నివేదిక కావాలని అడిగాడు.

రూజ్వెల్టుకుగల మహత్వపు లక్షణాలలో ధైర్యం, ఆకర్షణలకంటె అతడి మనో నిశితత్వం ప్రధానస్థానాన్ని పొందుతుందని ఒక ప్రముఖుడు చెప్పాడు. ఒకేఒక సమస్యను పరిష్కరించడానికి ఒక నిర్ణయం చేసినప్పుడు ఆ నిర్ణయంతో సమానప్రాధాన్యంగల అనేక నిర్ణయాలు, వివిధదృష్టులతో చూస్తే అన్నీ సరిగ్గా సబబైనవే, కనపడతాయి. కాని, మనోధైర్యంతో ఒక నిర్ణయానికి రావడం ఒక గొప్ప ప్రజ్ఞ.

ఒక నిర్ణయానికి వచ్చినతరువాత దానిప్రకారం నడచుకోవడంలో అతడు ఆలస్యాన్ని ఏమాత్రమూ సహించేవాడు కాదు. ఒకసారి చాలా ఆలోచనలు, వాదోపవాదాలు, ఘర్షణలు జరిగినతరువాత, ప్రభుత్వానికి చెందిన ఆరుశాఖలను ఒక్కశాఖగా కలిపివెయ్యడానికి నిర్ణయం జరిగింది. నిర్ణయం జరిగిన వెంటనే తన బల్లమీదనున్న కాగితం తీసుకొని ఆ నిర్ణయాన్ని అమలుజరపడానికి వుత్తరువును స్వయంగా తన చేతితో వ్రాసి ఇచ్చేశాడు. ఆఫీసులో టైపుచేసిన వుత్తరువు సంతకంకోసం తన దగ్గరకు వచ్చేటంతవరకు ఆగడానికికూడా అతడికి ఓపిక లేకపోయింది.

రూజ్వెల్టుకు గల దూరదృష్టి అపారమైనది. 1941 లో తన ఉద్యోగులకు అతడు తటస్థదేశాలలో అమ్మకానికి లభించే వున్ని నంతటినీ అమెరికా ప్రభుత్వంతరఫున కొనవలసిందని చెప్పాడు. అతడు అలా చెప్పినప్పుడు ఆ వుద్యోగులంతా వెర్రిచూపులు చూశారు. అలా చెప్పడంలో అతడి ఉద్దేశాలు ఇవి: జర్మనులను ముందుకు సాగిరానివ్వకుండా రష్యనులు బహుశా అరికట్టగలరు; అలా జరిగినప్పుడు చలికాలంలోకూడా జర్మనులు రష్యాలో యుద్ధం చెయ్యక తప్పదు; రష్యామీద దాడిచేసిన ఏదేశపు సైన్యాలయినా రష్యాలో చలిని తట్టుకోలేవు; అంచేత, జర్మను సైన్యాలకు వున్నితోచేసిన యూనిఫారములు చాలా అవసరమౌతవి; అలాటప్పుడు తటస్థంగావున్న దేశాలలో దొరికే వున్నినంతనూ జర్మనులు కొని వెయ్యగలరు; ముందుగానే ఆ వున్నినంతటినీ అమెరికా కొనివేస్తే, ఆ వున్ని జర్మనులకు దొరకకుండా చెయ్యవచ్చును. ఎంత దూరాలోచన! కొత్త భావాలను స్వీకరించడానికి అతడిమనస్సు ఎప్పుడూ సంసిద్ధంగా వుండేది. ఎవరుచెప్పినా, ఏ విషయాన్ని గురించి చెప్పినా ప్రతి సలహానూ, ప్రతి

సూచననూ అతడు పరిశీలించేవాడు. తనకు తెలియని విషయాన్ని తెలియదని ఒప్పుకోవడంలో అతడు ఎప్పుడూ సంకోచించలేదు. ఏదైనా సంగతిని ఒకరు చెప్పినప్పుడు దానిని తాను పూర్తిగా గ్రహించలేక పోయినట్లయితే ఆ సంగతిని మళ్లీ మళ్లీ చెప్పమని తనకు అర్థమైనదాకా చెప్పించుకొనేవాడు.

ఎప్పటికప్పుడు అతనికి నూతనభావాలు స్ఫురిస్తూవుండేవి. కొత్త ప్రయత్నాలు చెయ్యడం అంటే అతడు విపరీతమైన ఉత్సాహం చూపించేవాడు. సహారా ఎడారిని చూచినప్పుడు, దానినంతటినీ నీటికాలువలు త్రవ్వించి అక్కడ వ్యవసాయంచేస్తే బాగుండునని తహతహ పడ్డాడు. తాను టెహరాన్ వెళ్లినప్పుడు, అక్కడి పరిస్థితులను చూసి పర్షియా ప్రజల జీవితప్రమాణాన్ని బాగుచెయ్యడానికి ఏమేమి కార్యక్రమాలు అమలు జరపాలో ఆలోచించడం సాగించాడు.

ప్రపంచమంతటికీ ఒకే నాణెము చెలామణీలో వుండేటట్టు చేస్తే మంచిదనీ, నిజమైన వార్తలను ప్రచారంలోకి తేవడానికి స్వేచ్ఛగల వార్తా ప్రచార కేంద్రాలను సాపించడం మంచిదనీ, అనేక విషయాలనుగూర్చి అతడు ఆలోచించేవాడు.

మరీచిత్రం ఏమిటంటే 1956 లో అమెరికాకు అధ్యక్షుడుగా వున్న వ్యక్తి ఏ ఏ కార్యక్రమాలను అమలు జరపాలో ఒక నివేదికను వ్రాశాడు ఒకసారి! అంతేకాదు. 2057 లో ప్రపంచం ఏ రూపంలో వుంటుందో తాను వూహించిన విషయాలన్నిటినీ ఒక నివేదికగా వ్రాసిపెట్టాడు కూడాను !

అతడి తెలివితేటలు అమోఘమైనవి. తనను ఎవరైనా దగా చేసినా, దగా చెయ్యడానికి ప్రయత్నిస్తూవున్నా రూజ్వెల్టు అతిశీఘ్రంగా కనిపెట్టివేశేవాడు. మనష్యుల తత్వాలనేగాక, సమష్టిమీద కొన్ని కొన్ని జాతుల తత్వాలనుగూడా అతడు చక్కగా గ్రహించాడు. యుద్ధం అయిపోయిన తరువాత, జర్మనులు మళీ మిలిటరీ యూనిఫారములు ధరించకుండా చెయ్యాలని అతడొకసారి అన్నాడు. దానినిబట్టి జర్మనులు స్వభావాన్ని అతడెంత చక్కగా గ్రహించాడో స్పష్టమవుతుంది. తగినంత అవకాశం యివ్వకుండా ఎవ్వరినీ అతడు త్రోసి పారవెయ్యలేదు. సరిగ్గా పరీక్షించకుండా ఎవరకీ అతడు పెద్ద బాధ్యతలను అప్పజెప్పలేదు.

1943 లో తనతోపాటు ఐసెన్‌హోవరును విలాసార్థం రమ్మని కొన్నాళ్ళు తనతోతిప్పాడు. ఇలా చేయ్యడంలో అతడి వుద్దేశం ఐసన్ హోవరుకు కూడా అర్థంకాలేదు. తరువాత, ఐసన్‌హోవరును యూరప్ లోని మిత్రమండలి సర్వసైన్యాధ్యక్షుడుగా అతడు నియమించినప్పుడు అతడి సమర్థతను పరిశీలించడానికే అతడిని రూజ్వెల్టు తనతో తిప్పాడని అందరికీ అర్థమైంది.

ఏదైనా ఒక కార్యక్రమాన్ని నిర్ణయించినప్పుడు దానిలో మెట్టు మెట్టుకీ ఏం చెయ్యాలోకూడా అతడు శ్రద్ధగా పరిశీలించేవాడు.

రూజ్వెల్టు ఏ పని ప్రారంభించినా తన అదృష్టానికి లోపం లేదనీ, తాను ప్రారంభించిన పని సానుకూలం అవుతుందనీ గట్టిగా నమ్మేవాడు. అదృష్టాన్ని నమ్మినట్లయితే నమ్మినవారిని అది మోసం చెయ్యదని అతడి విశ్వాసం. ఎప్పుడు ఏ సంఘటనలు జరిగినా, అవన్నీ మన మేలుకొరకే అని అతడు విశ్వసించేవాడు. అతడి విషయంలో అన్నీ అలాగేఅయినవి కూడాను.

## అతడి విశ్వాసాలు

రూజ్వెల్టుకు ఎక్కువగా విశ్వాసం వున్నది దేనిలో? ప్రధానంగా ప్రజలు. ప్రజలను అతడు గాఢంగా నమ్మేవాడు. అంతేకాక మనుష్యుడు సహజంగా మంచివాడనీ, నీతిపరుడనీ అతడి విశ్వాసము.

రాజకీయంగా అతడి లక్ష్యాలు ఏమిటి? మానవత్వాన్ని నిలబెట్టడం సాంఘికంగా మానవుని వున్నతస్థానాన్ని నిలబెట్టడం.

స్వేచ్ఛ, రక్షణ, భావస్వాతంత్ర్యము స్వేచ్ఛా జీవనములను ప్రజలు కలిగివుండేటట్టు చెయ్యడానికీ, వాటికి ఏవిధమైన ఆటంకాలూ కలుగకుండా వుండడానికీ రూజ్వెల్టు తాను అధ్యక్షుడుగా వున్నన్నాళ్ళూ కృషిచేశాడు.

తాను అధ్యక్షుడుగా వున్న పన్నెండు సంవత్సరాలలోనూ, అమెరికన్ ప్రజలకు 'మాకు ఏవిధమైన భయమూలేదు' అనే నిశ్చితిని రూజ్వెల్టు కలిగించగలిగాడు. ఒకసారి అతడు ఇలా చెప్పాడు:

"అట్లాంటిక్ ప్రణాళికలోని చతుస్స్వాతంత్ర్య సూత్రాలు సాధించడానికి సాధ్యమైనవి కావని చెప్పేవారిని చూస్తే, నాకు అపరిమితమైన కోపంవస్తుంది. వారే గనుక 150 సంవత్సరాలకు పూర్వం జీవించివుంటే, అమెరికాదేశం స్వాతంత్ర్య ప్రకటనచేసి, ఇంగ్లండునుంచి స్వాతంత్ర్యాన్ని సాధించడం అసాధ్యమని చెప్పివుండేవారు."

# పుస్తకాలు

రూజ్వెల్టు పుస్తకాలను చాలా ఎక్కువగా కొనేవాడు. వాటిని అక్కడక్కడ చదివేవాడు గాని, శ్రద్ధగా మొదటినుంచి చివరదాకా పట్టుపట్టి చదివేవాడు కాదు. రూజ్వెల్టు ఎక్కువగా చదివిన విషయాలు ఇవి: (1) అమెరికాదేశపు చరిత్ర; (2) నౌకాశాస్త్రము, నౌకల పుట్టు పూర్వోత్తరాలు; (3) కలగూరగంప.

వార్తా పత్రికలను మాత్రం అతడు అతిశ్రద్ధగా చదివేవాడు. ప్రతిరోజూ ఉదయం, దాదాపు ఎనిమిది పత్రికలను అతడు శ్రద్ధగా చదివేవాడు. గుమాస్తాలు అతడి దృష్టిని ఆకర్షించడానికి గుర్తుపెట్టిన విషయాలను మాత్రమేగాక, పత్రికలలోని అన్ని విషయాలనూ అతి జాగ్రత్తగా చదివేవాడు. పత్రికలను చదివేటప్పుడు అతడు ఒంటరిగా వుండగోరేవాడు. గబగబ చదివేవాడు. చదివిన దానిని మనస్సుకు పట్టించుకోవడంలోనూ, పత్రికలలో ఏ ఏ విషయాలను చదివినదీ జ్ఞాపకం పెట్టుకోవడంలోనూ అతడి శక్తి అద్భుతమైనది.

రేడియోను వినడం అంటే అతడికి ఎక్కువ అభిలాష వుండేదికాదు. తన ఉపన్యాసాల రికార్డును రేడియోలో ప్రసారంచేస్తే, వాటిని ఎప్పుడైనా వినేవాడు.

పద్య సాహిత్యంపట్ల రూజ్వెల్టు ఎప్పుడూ శ్రద్ధచూపలేదు. మంచి ఊపుతో, కథలనువర్ణించే పద్యసాహిత్యం అంటే కొంచెం ఇష్టపడేవాడు. సంగీతమన్నాకూడా రూజ్వెల్టుకు ప్రత్యేకమైన అభిమానం వుండేదికాదు.

చిన్నప్పుడు పియానో వాయించడం నేర్చుకున్నా, పెద్ద అయినకొద్దీ సంగీతం పట్ల అతడి అభిరుచి బాగా తగ్గిపోయింది.

ఇళ్లు, ఫ్యాక్టరీలు మొదలైనవాటి కట్టడములకు నమూనాలు వ్రాయడమంటే మాత్రం రూజ్వెల్టుకు చాలా సరదాగా వుండేది. విమానాలను మోసే ఒక నౌకను కట్టడానికి, దాని నమూనాను తయారుచెయ్యడంలో అతడు నౌకాశాఖ నిపుణులతో కలిసి పనిచేశాడు.

రూజ్వెల్టుకు మూడు పరదేశ భాషలు వచ్చు. అన్ని భాషలువచ్చిన వ్యక్తి ఎవరూ అంతకుపూర్వం అమెరికా అధ్యక్షుడుగా వుండలేదు కూడాను. జర్మను భాషను చకచక మాట్లాడలేక పోయేవాడు గాని, చదవగలిగేవాడు. స్పానిష్ భాష కొద్దిగా తెలుసు. ఫ్రెంచిభాషలో చక్కగా మాట్లాడగలడు; చదవగలడు. అతడు ఫ్రెంచి భాషలో ఒకసారి వుపన్యసించాడు కూడా. ఫ్రెంచి భాషలో వుపన్యసించిన అధ్యక్షుడు రూజ్వెల్టుకు పూర్వం ఎవరూలేరు.

రూజ్వెల్టుశైలి అంతగొప్పదికాదు. ఉపన్యాసాలనూ, ఉత్తరాలనూ తప్ప అతడు ఎక్కువగా వ్రాసినది కూడా ఏమీలేదు.

ప్రతి సంవత్సరమూ, దినచర్యను వ్రాయడం అలవాటు చేసుకొందామని నాలుగైదుసార్లు అతడు డైరీ వ్రాయడం ఆరంభించాడు. కాని, ప్రతి సంవత్సరమూకూడా జనవరి 4 వ తేదీ, 5 వ తేదీ దాటి ఆ డైరీ నడవలేదు.

అతడు జబ్బుపడి, తిరిగి కోలుకుంటున్న రోజులలో ఒక నవల వ్రాద్దామని అనుకున్నాడు. కాని, అది సాగలేదు. ఒక సినిమాకు ఒక కథవ్రాసి అతడు హాలివుడ్‌లో ఫిలిం నిర్మాతలకు పంపించాడట గాని, అది అక్కడితోనే ఆగిపోయింది.

రూజ్వెల్టు రచనాశైలికి ప్రధాన నిదర్శనము అతడి లేఖలే. ముఖ్యంగా అతడు తన బంధువులకు వ్రాసిన లేఖలలో అతడి హృదయం తొంగి చూస్తూ వుంటుంది. ప్రేమను, ఆదరణను గుప్పించివేసే పదాలను ఎక్కువగా ప్రయోగించడం అతడికి అలవాటు.

1937 లో తన వ్యాసాల నన్నిటినీ రూజ్వెల్టు ఒక సంపుటిగా ప్రకటించాడు. ఆ సంపుటిని 25,000 ప్రతులు అచ్చువేస్తే 4,000 ప్రతులు

మాత్రం అమ్ముడుపోయాయి. ఆ రోజులు ఆర్థిక మాంద్యపు రోజులు. సంపుటి వెల 15 డాలర్లు. అంత డబ్బుపెట్టి పుస్తకాలుకొనే సత్తా సామాన్య ప్రజలకు లేదు. నూతన ఆర్థికవిధానం అమలులోపెట్టి భాగ్యవంతులమీద పన్నులను ఎక్కువగా వేస్తున్నందువల్ల రూజ్వెల్టు పేరు చెపితే భాగ్యవంతులు మండిపడుతున్నారు. అలాంటప్పుడు ఆపుస్తకాలను కొనేవారెవరు? పుస్తకాలను అచ్చువేసిన రాండమ్ హౌస్ అనే కంపెనీవారు చిట్టచివరకు, ఆ పుస్తకాలను ఎలాగయినా వదుల్చుకుందామని ధరను విపరీతంగా తగ్గించివేశారు. దానితో రూజ్వెల్టుకు ఆ కంపెనీ యజమాని మీద కోపంవచ్చి, అతడికి క్రిస్మసు పండుగలకు కార్డుపంపించడం కూడా మానివేశాడు.

## ఉపన్యాస రచన

రూజ్వెల్టు తన ఉపన్యాసాలను తయారు చెయ్యడం ఒక యుద్ధ కార్యాన్ని సాగించినంత హంగామాతో చేసేవాడు. అతడి ఉపన్యాసాన్ని దాదాపు పదిమంది సలహాదార్లు కలిసి తయారు చేసేవారు. చిన్నచిన్న ఉపన్యాసాలను ఎక్కువగా ఆర్చిబాల్డ్ మెక్లీష్ వ్రాశేవాడు. రాజకీయాలను గురించీ ఆర్థిక ప్రణాళికలను గురించీ, కాంగ్రెసుకు సందేశాలను పంపేటప్పుడూ, రూజ్వెల్టుచేసే వుపన్యాసాలను దాదాపు పదిమంది వ్రాశేవారు. తనకు ఉపన్యాసాలను తన సలహాదార్లు వ్రాసి పెడతారనే విషయాన్ని రూజ్వెల్టు ఎప్పుడూ దాచలేదు. దానిని గురించి అప్పుడప్పుడు ఛలోక్తులు పలికేవాడు కూడాను.

రూజ్వెల్టుకు వుపన్యాసాలను వ్రాసేవారిలో ప్రముఖుడైన షెర్వుడ్ ఒక రోజున తన గదిలోనుంచి బయటికి వస్తూవుంటే రూజ్వెల్టును చూడడానికి వచ్చిన అతడి మిత్రుడొకడు అతణ్ణి వరండాలో కలుసుకొని, "షెర్వుడ్, ఇక్కడ నువ్వేం చేస్తున్నావ్" అని అడిగాడు. ఇంతలో ప్రక్కనవున్న మరొక గదిలోనుంచి వరండాలోకి వచ్చిన రూజ్వెల్టు సతి, "ప్రెసిడెంటు కాంగ్రెసుకు పంపే సందేశాన్ని ఇప్పుడే పూర్తిగావ్రాసి యిచ్చి బైటికి వస్తున్నాడు, షెర్వుడ్" అని జవాబు చెప్పింది.

చర్చిల్ ఒకసారి రూజ్వెల్టు ఇంటిలో అతిథిగా వున్నప్పుడు హారీ హాప్కిన్సు షెర్‌వుడ్‌ను చర్చిల్ గదిలోనికి తీసుకువెళ్లి చర్చిల్‌కు పరిచయం చేశాడు. అప్పుడు చర్చిల్ షెర్‌వుడ్‌తో "ప్రెసిడెంటు వుపన్యాసాలన్నీ మీరే వ్రాస్తారనీ మీరు వ్రాసినదానిని మించి కొత్తగా చెప్పవలసిన విషయాలేమీ తనకు తెలియవనీ ప్రెసిడెంటు నాతో చెప్పాడు" అన్నాడు. దీనినిబట్టి, రూజ్వెల్టు తన సలహాదార్లు తనకు ఎంత వుపయోగపడేదీ స్పష్టంగా అంగీకరించేవాడని స్పష్టమవుతోంది.

ఒకసారి రూజ్వెల్టు ఒక ఉపన్యాసాన్ని చదివాడు. దానిని రేడియోలోవిని అది బాగున్నదని మెచ్చుకుంటూ షెర్‌వుడ్ భార్య రూజ్వెల్టుకు టెలిగ్రాం పంపించింది. నిజానికి ఆ ఉపన్యాసంలో ప్రధాన భాగం షెర్‌వుడ్ వ్రాసినదే. అందుచేత షెర్‌వుడ్ భార్యకు బదులు టెలిగ్రాం పంపిస్తూ, రూజ్వెల్టు ఇలా వ్రాశాడు: "ఆ వుపన్యాసాన్ని నువ్వు మెచ్చుకున్నందుకు నేనూ నీ భర్తా చాలా సంతోషించాము."

ఉపన్యాసాల విషయంలో రోజెన్‌మన్‌కూడా రూజ్వెల్టుకు ముఖ్యుడే. మెక్లీష్, షెర్‌వుడ్‌ల రచనలలో ఎక్కువగా సారస్వతశైలి భావాలు వుండేవి. రోజెన్‌మన్ రచన చాలావరకు రూజ్వెల్టు తన భావాలను తనే తనకువచ్చినభాషలో చెపితే ఎలావుంటాయో అలావుండేది.

మొదట్లో రూజ్వెల్టు తను ఏ ఏ భావాలను తన వుపన్యాసంలో చెప్పదలచుకున్నదీ తన రచయితలకు చెప్పేవాడు. వారంతా కలిసి ఆ యా విషయాలను గురించిన సమాచారాన్నంతా పోగుచేసి ఒక పెద్ద వుపన్యాసాన్ని తయారు చేసేవారు. చదివితే నాలుగైదు గంటలు పట్టే ఆ వుపన్యాస రచనలను చదివి ముఖ్యమైన అంశాలన్నిటినీ క్రోడీకరించి, మిగతాభాగాన్ని కొట్టి పారవేశేవాడు. తరువాత ఉపన్యాస రచయితలు మళ్లీ దానిని చదివి ఇంకా అనవసరమైన భాగాలను తగ్గించి వేశేవారు. ఆ తరువాత రూజ్వెల్టు మళ్లీ దానిని చదివి తను ఉపన్యసించవలసిన వ్యవధి ఎంతో అంతసేపటికే సరిపోయేటట్టుగా ఇంకా తగ్గించేవాడు.

ఉపన్యాస రచయితలు తాము వుపన్యాసాలను వ్రాయడంలో, రూజ్వెల్టు భావాలను మాత్రం చక్కగా వుంచేవారు. అతడు మామూలుగా

వుపయోగించి, ప్రజలకు అతడి భాషగా అలవాటైన పదాలను అక్కడక్కడ ప్రయోగించేవారు.

ఏడెనిమిది చిత్తు ప్రతులను సవరించిన తరువాత రూజ్వెల్టు ఉపన్యాస రచన ఒక రూపానికి వచ్చేది. ఎన్నిచిత్తులు సవరించినా ఎంతమంది కలిసి వ్రాసినా ఎన్ని చేతులలో నలిగినా చిట్టచివరకు ఆ ఉపన్యాసాన్ని రూజ్వెల్టు చదివేసరికి, అది అతడు స్వయంగా చెప్పిన ఉపన్యాసపు రూపునే పొందేది.

పైగా ఉపన్యాసం చదివేటప్పుడు రూజ్వెల్టు దానికి ప్రాణం పోసేవాడు. అతడు చదువుతూ వున్నప్పుడు ప్రతి వాక్యమూ, ప్రతి పదమూ అతడి సృష్టి అయిపోయేది.

రూజ్వెల్టు ఉపన్యాసాల చిత్తు ప్రతులు హైడ్ పార్కులోని రూజ్వెల్టు గ్రంథాలయంలో వున్నాయి. ఒక్కొక్క ఉపన్యాసానికి సాధారణంగా ఏడెనిమిది చిత్తు ప్రతులు వున్నాయి. కొన్నిటికి పది పదకొండు చిత్తు ప్రతులుకూడా వున్నాయి. ప్రతి చిత్తుమీద రూజ్వెల్టు సవరణలు విస్తారంగా కనిపిస్తాయి. కఠినమైన పదాలను కొట్టివేసి సామాన్య పదాలను వెయ్యడం, మధ్య మధ్య కొత్త భావాలను కలపడం, అనవసర మనుకున్న కొని భావాలను కొట్టి వెయ్యడం ఎవరో పెద్దమనిషి ఏదో చెప్పవస్తున్నాడనే భావం కలిగించకుండా, పరిచయస్థుడైన హితుడు ప్రత్యేకం మంచి మాటలను చెపుతున్నాడనే భావం కలిగించే ధోరణికి అనువైన మాటలను వుపయోగించడం, ఇవన్నీ రూజ్వెల్టు ఉపన్యాసాల చిత్తు ప్రతులను చూసినవారికి అతడుచేసిన సవరణలో స్పష్టంగా కనపడతాయి.

రూజ్వెల్టు తన వుపన్యాసాలను వ్రాయడానికి ఇంత మందిని నియోగించడం వల్ల, తానొక్కడూ స్వయంగా ఉపన్యాసం వ్రాసుకో జాలడని గాని, వ్రాయ నక్కర లేకుండా ఆశువుగా వుపన్యసించ లేడనిగాని ఎవరూ అనుకోడానికి వీలులేదు.

వ్రాసిన ఉపన్యాసాన్ని చదివేటప్పుడు కూడా, మధ్యమధ్య సందర్భాన్నిబట్టి కొత్త మాటలనూ, వాక్యాలనూ కలిపి చెప్పేవాడు రూజ్వెల్టు.

అప్పుడప్పుడు అతడు కొన్ని అపురూపమైన సమాసాలను కల్పించేవాడు. వాటిలో కొన్ని శాశ్వతంగా వాడుకలోకి వచ్చేశాయి కూడాను.

రూజ్వెల్టు ఉపన్యాసాలను విన్నవారికి, అతడు వాటిని చదువుతూవుంటే, ప్రతిమాటకూ ఎంతజీవం పోసేవాడో స్పష్టంగా తెలుస్తుంది. అతడి ఉపన్యాసాలను చదివిన వారికన్న, అతడు చదువుతూవుంటే విన్నవారికి ఎంతో ఆత్మవిశ్వాసము, కార్యదీక్ష, ఉత్తేజమూ కలిగేవి.

# ఆఫీసులో పని

చకచక పనిని సాగించడంలో రూజ్వెల్టు మహాసమర్థుడు. ఏదైనా ఒక విషయాన్ని గురించి అతడి నిర్ణయంకోసం అతడి ఉద్యోగులు పెద్దపెద్ద నివేదికలతో కాగితాల కట్టలను తీసుకొని వచ్చినప్పుడు, "అసలు విషయాన్ని ఒక్క పేజీలో ఇమిడ్చి వ్రాయకూడదా" అని అడిగేవాడు. క్లుప్తంగా వ్రాయబడిన నివేదికలను అతడు ఎక్కువగా మెచ్చుకొనేవాడు. తాను మెచ్చుకున్న నివేదికలను, వ్రాసిన వ్యక్తికే తాను చదివివినిపించేవాడు.

చాలామంది రాజ్యపాలకులు విదేశ రాయబారులతో గాని, దేశంలో ప్రముఖ రాజనీతిజ్ఞులతో గాని ఏ విషయాన్ని గురించి అయినా చర్చించినప్పుడు, తమ చర్చల సారాంశాన్ని వ్రాసి పెట్టుకుంటారు. రూజ్వెల్టు అలాంటిదేమీ చేసేవాడు కాదు. అతడు ఎక్కువగా తన జ్ఞాపకశక్తిమీద ఆధారపడేవాడు.

ఏవైనా నిర్ణయాలు చెయ్యవలసి వచ్చినప్పుడు, ఆఫీసులో మామూలు ఫక్కీలో ఉత్తరవు మసాయిదా తయారై, సంతకానికి తనదగ్గరకు వచ్చినదాకా ఆగక తనబల్లమీద ఒకచిన్న కాగితం తీసుకొని, ఫలానా విషయంలో తాను ఫలానా నిర్ణయం చేశానని వ్రాసి సంతకంపెట్టి ఆఫీసుకు పంపించివేసేవాడు. దానితో ఆ విషయం అక్కడికి తేలిపోయేది.

ఒక దేశం అమెరికాకు ఒక వ్యక్తిని రాయబారిగా నియమించింది. ఆ వ్యక్తిని రాయబారిగా అంగీకరించడానికి అమెరికా ప్రభుత్వం ఒప్పుకుంటుందో లేదో తెలియపరచడంలో అమెరికా ప్రభుత్వ విదేశాంగ కార్యాలయం ఆలస్యంచేసింది. తన సంగతి ఏమయిందీ తెలియక, ఆ వ్యక్తి అమెరికాలోని తన మిత్రుడొకనికి టెలిగ్రాం పంపించాడు. ఆ మిత్రుడు, ఆ టెలిగ్రాం తీసుకొని రూజ్వెల్టు దగ్గరకు వచ్చాడు. రూజ్వెల్టు ఆ టెలిగ్రాం కాగితం తీసుకొని, దాని వెనకప్రక్కన "సరే" అని వ్రాసి సంతకం పెట్టివేశాడు అంతే. దానితో ఆ వ్యవహారం తెమిలిపోయింది.

తన పనిని చాలా వరకు, రూజ్వెల్టు టెలిఫోనుద్వారా చేసేవాడు. అతడు పనిచేసే కాలంలో దాదాపు నాల్గవవంతు టెలిఫోనులో

మాట్లాడడంతోటే సరిపోయేది. అతడి సెక్రటరీ అనుమతి లేకుండా, నేరుగా అతడితోటే టెలిఫోనులో మాట్లాడగల చనువూ, సదుపాయమూ గలవారు దాదాపు ఒక నూరుమంది వుండేవారు. అయితే, ఈ సదుపాయాన్ని దుర్వినియోగం చేసుకొని, అయినవేళా కానివేళా అతడిని టెలిఫోనులో ఎవరూ పిలిచేవారు కారు. ఇంగిత జ్ఞానంలేకుండా ఎవరైనా అలా చేసినట్లయితే, వారికిగల ప్రత్యేక సదుపాయం అంతటితో అంతమయేది.

రాత్రిళ్లు చాలా ముఖ్యమైన సమాచారం చెప్పవలసివస్తే తప్ప, రూజ్వెల్టుకు ఎవరూ టెలిఫోను చేసేవారు కారు.

ఉత్తరాలను చదవడంలో రూజ్వెల్టు అనుసరించిన విధానం చాలా అద్భుతంగా వుండేది. అతడికి రోజుకు కొన్నివేల వుత్తరాలు వచ్చేవి. చాలా సమర్థులైన అనేకమంది వుద్యోగులు ఆ వుత్తరాల నన్నిటినీ పరిశీలించి, అతడే స్వయంగా జవాబు వ్రాయవలసిన వాటినన్నిటినీ అతడిముందు పెట్టేవారు. వాటన్నిటికీ జవాబులు చెప్పడంలోనూ, టైపుకొట్టి వచ్చిన జవాబులమీద సంతకం పెట్టడంలోనూ అతడు ఒకయంత్రంలాగా పనిచేసేవాడు. క్రిస్మస్ పండుగకు అతడికి వచ్చిన బహూకరణల పెట్టెలను విప్పుతూ వుండేనే, వాటిని పంపించిన వారికి కృతజ్ఞత తెలియజేస్తూ సందేశాలను చెప్పేవాడు. టైపిస్టులు వాటిని అక్కడికక్కడే వ్రాసుకొని, వుత్తరాలను టైపుకొట్టి సంతకాలకు అతడిముందర పెట్టేవారు. తన పరిశీలనకు వచ్చిన కాగితాలను అన్నిటినీ ఆఖరువరకూ చూపి సంతకాలు పెట్టిన తరువాతగాని అతడు ప్రతిరోజూ రాత్రి నిద్రపోయేవాడు కాదు. చిన్న చిన్న వుత్తరాలకుకూడా అతి ఆప్యాయంగా అతడు జవాబు వ్రాసేవాడు. ఒకసారి చాలా స్వల్పమైన విషయంలో రూజ్వెల్టు చర్యను అభినందిస్తూ ఒక వ్యక్తి వుత్తరం వ్రాశాడు. అలాటి వుత్తరాలు తనకు చాలాకొద్దిగా వస్తాయనీ, ఆ వుత్తరం తనకు చాలా ఆహ్లాదాన్ని కలిగించిందనీ జవాబు వ్రాశాడు రూజ్వెల్టు. ఆనాడు రూజ్వెల్టుకు వచ్చిన ఉత్తరాలు ఎనిమిదివేలు.

రూజ్వెల్టును చూడడానికి వచ్చేవారికి ఫలానా టైములో రావలసిందని నిర్ణయించడంలో అతడి ఆఫీసువారు చాలా చాకచక్యం చూపేవారు.

సంభాషణలో మునిగిపోతే వచ్చిన వ్యక్తితో అతడికి మొదట నిర్ణయించిన వ్యవధి దాటిపోయినాకూడా ఎక్కువసేపు మాట్లాడుతూ కూచునేవాడు రూజ్వెల్టు. అంచేత, ఒక వ్యక్తికీ, మరొక వ్యక్తికీ రూజ్వెల్టు దర్శనమిచ్చే నియమిత కాలాలను మధ్యలో కొంత వ్యవధవుంచి నిర్ణయించేవారు, అతడి వుద్యోగులు. అతడిని ఏవో వరాలను కోరడానికి వచ్చేవారు, నిజంగా పని లేకపోయినా ఏదోవంకతో రూజ్వెల్టును దర్శించాలనే ఆపేక్షతో వచ్చేవారు, వచ్చినపని చిన్నదయినా ఎక్కువకాలం కబుర్లతో గడపగోరే వారు, రకరకాల మనుష్యులు రూజ్వెల్టు దగ్గరకు వచ్చేవారు. కొంతమంది, రూజ్వెల్టుతో ఎక్కువసేపు మాట్లాడితే తాము గొప్పవారమని బైటనున్న పత్రికా విలేఖరులను భ్రమపెట్టవచ్చునని భ్రమపడేవారు. ఇలాటి వారందరి తోనూ అతి చాకచక్యంతో మెలగవలసి వచ్చేది రూజ్వెల్టు వుద్యోగులకు. వచ్చినపనిని త్వరగా బైటపెట్టి అనుకున్నదానికన్న కొంచెం ముందుగా బైటపడేవారిని చూస్తే రూజ్వెల్టుకూ, అతడి వుద్యోగులకూకూడా చాలా ముచ్చట కలిగేది.

పరిపాలనా వ్యవహారాలను అన్నిటినీ సంపూర్ణంగా పరిశీలించేవాడు కాదని రూజ్వెల్టును కొంతమంది విమర్శిస్తారు. కాని అతడు ప్రతిరోజూ పరిశీలించే పనిని చూస్తే, అంత పనిని ఇద్దరు ముగ్గురు వ్యక్తులు కలిసి చెయ్యలేరని స్పష్టమౌతుంది. ప్రతిరోజూ ఎంతపని చెయ్యగలిగితే అంతా చెయ్యడమే అతడి పద్ధతి. అతని వుద్యోగులు కూడా అతడితో సంపూర్ణంగా సహకారంచేసి చాలా ఎక్కువపని తెమిలిపోయేటట్టు చూసేవారు. 1944 లో అతడి కార్యాలయంలో స్త్రీలూ, పురుషులూ కలిసి మొత్తం 607 మంది ఉద్యోగులు వున్నారు. అందరూ పరిపాలనకు సంబంధించిన ఏదో ఒక విషయాన్ని గురించి సమగ్రంగా తెలిసినవారే. వీరందరూకలిసి అతడిపట్ల ప్రత్యేకమైన అభిమానంతో పని చెయ్యడంవల్లనే రోజుకు బోలెడెంత పని తెమిలేది.

సాంప్రదాయానికి భిన్నం అని ఆలోచించకుండా అనేక పనులను అతడు స్వయంగా చేసేవాడు. ప్రభుత్వ కార్యాలయంలో ఎక్కడచూసినా కాగితాలతోనిండిన అలమారులు వున్నాయనీ, మనిషి మెదలడానికికూడా చోటు చాలడంలేదనీ అతడికి తెలిసింది. ఆ కార్యాలయానికి వెళ్లి అది

ఎలావుందో స్వయంగా చూడా మనుకున్నాడు. ప్రధానమంత్రి కార్డెల్ హాల్‌కుగాని, మరేమంత్రికిగాని చెప్పకుండా ఒకరోజు సాయంత్రం అయిదు గంటలకు అతడు ప్రభుత్వ కార్యాలయానికి తన చక్రాలకుర్చీలో కూచొని త్రోయించుకొని వెళ్ళాడు. తాను నౌకాశాఖ అసిస్టెంటు శెక్రటరీగా పని చేసినప్పుడు కూచొనే గదిలో సరాసరి ప్రవేశించాడు. ప్రెసిడెంటు స్వయంగా ఆఫీసుకురావడం చూసి దిగ్భ్రమచెంది కొయ్యలాగ నిలబడిపోయిన ఒక చిన్న వుద్యోగుని ఆప్యాయంగా పలకరించి, ఒక అల మారు తెరవమన్నాడు రూజ్వెల్టు. ఆ వుద్యోగి సంకోచిస్తూవుంటే రూజ్వెల్టు తానే ఆ అలమారు తెరిచాడు. దానిలో చాలా ముఖ్యమైన అవసరమైన కాగితాలు వున్నాయని ఆవుద్యోగి అంటూవుండేనే, రూజ్వెల్టు అలమారులో నుంచి కాగితాలను బొత్తులు బొత్తులుగా తీసి చూశాడు. అవన్నీకూడా, ఏమాత్రం వుపయోగం కినపడని ఎన్నో సంవత్సరాలనాడు చైనాను గురించి వ్రాసిపెట్టిన సమాచారానికి సంబంధించినవి. తరువాత ఒకసారి రూజ్వెల్టు ఒక వుద్యోగితో మాట్లాడుతూ, "నేను ఇవ్వాళ ఆ ఆఫీసుకు వెళ్లడం మంచిదే అయింది. నేను ఏవేళ, ఏ ఆఫీసుకు వస్తానో అని రేపటినుంచి, అన్ని ఆఫీసులలోనూ అందరూ జాగ్రత్తగా వుంటారు," అన్నారు.

ఫలానా విషయంలో ఇతడు చాలా నిపుణుడు అని పేరుపొందిన వాళ్ళను రూజ్వెల్టు అంత ఎక్కువగా నమ్మేవాడు కాడు. విదేశ శాఖామంత్రి కార్యాలయంలో, ఇలా పేరుపొందిన వ్యక్తులు చాలామంది వుండేవారు. వారందరి విషయంలోనూ అతడు ఎక్కువ జాగ్రత్తగా వుండేవాడు. జంగ్ కై షేక్‌తో సమాలోచనలు జరపడానికి అతడు కెయిరో వెళ్లినప్పుడు, తనవెంట దూరప్రాచ్య రాజకీయాలలో నిపుణులని పేరుపొందినవారెవరనీ తీసుకొని వెళ్లలేదు. అప్పుడు ప్రభుత్వాధికారులు, రూజ్వెల్టు దూరప్రాచ్య రాజకీయాలు తెలియక ఏ అవక తవక నిర్ణయాలకు కట్టుబడి పోతాడో అని చాలా భయపడ్డారు.

తనకు నచ్చిన వ్యక్తులకు, వారు నిర్వహించ గలరని అనుకున్న పనులను చెప్పి, వాటిని వారు చేస్తూవున్నప్పుడు తాను జోక్యం కలిగించుకోకుండా, పనిని సొంతం వారినే చెయ్యనిచ్చే వాడు.

రూజ్వెల్టు కార్యాలయంలో అప్పుడప్పుడు కొన్ని చిల్లర తమాషాలు కూడా జరుగుతూ వుంటాయి. 1925 జనవరిలో యునైటెడ్ నేషన్సు స్థాపనను గురించిన ప్రకటనపై సంతకం పెట్టడానికి, రూజ్వెల్టు బల్లమీద కలంలేదు. చివరకి ఒక కలాన్ని వెతికి తెచ్చేటప్పటికి, అసలు ఆ ప్రకటన కాగితాలే ఎక్కడ పెట్టినదీ కనపడలేదు. పదిమంది ఆత్రంతో అన్ని మూలలూ, అన్ని గదులూ వెతికి వాటిని పట్టుకొని వచ్చారు.

ఒక్కొక్కప్పుడు రూజ్వెల్టు కొంతమందికి ఉద్యోగాలను ఇచ్చినప్పుడు, ఇంతకన్న సమర్థుడెవడూ ప్రెసిడెంటుకు దొరకలేదా అని అందరూ విస్తుపోయేవారు. రాయబారులను నియమించేటప్పుడు, టెలిఫోనులో తనకు పరిచయంగల వాళ్లందరితోనూ సంప్రతించి, సమర్థుడైన రాయబారి ఎక్కడ దొరుకుతాడా అని రూజ్వెల్టు చాలా వెతుకవలసివచ్చేది.

అతడు ఇచ్చే ఉద్యోగాలు, కొన్ని వేల సంఖ్యలో వుండేవి. అంచేత, ఆ యా వుద్యోగాలను యిచ్చేటప్పుడు వాటికి సమర్థులైన వారిని వెతకడం ఎంతకష్టమో ఊహించవచ్చును. కొన్ని సందర్భాలలో, దొరికినమనిషి ప్రజ్ఞ ఎంతవుంటే అంతటితోటే అతడు తృప్తిపడవలసి వచ్చేది. మరికొన్ని సందర్భాలలో, రాజకీయాలలో పలుకుబడిగల వ్యక్తులు, తమ అభిమాన పాత్రులను తీసుకొనివచ్చి రూజ్వెల్టుకు అంటగట్టేవారు. వారిమాట కాదనలేక, సమర్థులు కానివారికికూడా వుద్యోగాలను ఇవ్వవలసి వచ్చేది.

కాంగ్రెసులో, తానుచేసిన ప్రతిపాదనలకు ప్రతిఘటన ఎక్కువ లేకుండా వుండడానికి, ఏ సెనెటరునయినా అతడు కట్టుకోవలసివస్తే, ఆ సెనెటరు సూచించిన వ్యక్తికి ఏదో ఒక వుద్యోగం యివ్వవలసివస్తే, రూజ్వెల్టు ఒప్పుకోక తప్పేదికాదు. ఒక ప్రధాన కార్యక్రమానికి అడ్డులేకుండా వుండడానికి స్వల్ప విషయాలలో అతడు లొంగిపోవలసి వచ్చేది. ప్రజారాజ్య విధానాన్ని అమలు జరపడంకోసం ఆ సూత్రాలలోనే కొన్నిటికి విరుద్ధంగా ప్రవర్తించవలసి వచ్చేదన్నమాట.

ఉద్యోగాలలో వున్నవారిలో కొందరు అసమర్థులు వుంటే వారిని తొలగించడం కూడా రూజ్వెల్టుకు కష్టంగా వుండేది. దానికి కారణం, ఉన్నవాడిని తీసివేస్తే అంతకన్న పనికిరానివాణ్ణి వేసుకోవలసి

వస్తుందేమోననే భయమే. ప్రభుత్వ నిర్వహణను నిరంతరాయంగా సాగించ డానికి అనువైన ఉద్యోగ బృందాన్ని, శాశ్వతంగా పనికివచ్చే పద్ధతిలో అతడు తర్ఫీదు చెయ్యలేకపోయాడు. అలాటి పద్ధతి బ్రిటనులో వుంది. కాని, అమెరికాదేశపు రాజకీయాల పద్ధతే వేరు. అంచేత, అమెరికాలో అది సాధ్యంకాలేదు. పైగా ప్రెసిడెంటుకు ఇలాటి పద్ధతిని అనులులోకి తెచ్చి, దానిని సక్రమంగా నడిచేటట్టు చూసేటంత వ్యవధికూడా లేదు.

ప్రెసిడెంటు పరిపాలన అంతా అతడి ఒంటిచేతిమీద నడిచేది. అంటే, ఒక క్రమపద్ధతిలో కాకుండా, ఎప్పుడుబడితే అప్పుడు ఏ విషయం మీద బడితే దానిమీద నిర్ణయాలు జరిగేవన్నమాట. ఇలా జరగడంవల్ల, తరువాత కొంత గందరగోళానికి అవకాశం కలిగేది.

తమ అధికారాన్ని మించిన పనులను చేసేవారినీ, తాముపున్న వుద్యోగంకంటె తాము అధికులమనుకునే వారినీ, తమకు సంబంధంలేని విషయాలలో జోక్యం కలిగించుకునే వారినీ, రూజ్వెల్టు ఒక కంటితో కని పెడుతూనే వుండేవాడు.

తనకు చిరాకు కలిగించకుండా, పదేపదే తన సలహాలకు రాకుండా వుండే వుద్యోగులన్నా, కాంగ్రెసుతో పేచీలు లేకుండా పనులను నిర్వ హించుకొనే వుద్యోగులన్నా రూజ్వెల్టు మహా యిష్టంగా వుండేవాడు.

ఒక మనిషికీ, ఇంకొక మనిషికీ మధ్య పేచీలు పెట్టడం, హఠాత్తుగా మనిషిని బోల్తా కొట్టించడం అంటే రూజ్వెల్టుకు వెన్నతో పెట్టిన విద్య. ఒక్కొక్కప్పుడు తన దగ్గరవున్న వుద్యోగుల ప్రవర్తననుగురించి తనకు ఏదైనా రహస్యంగా తెలిస్తే దానినంతా ఒక రిపోర్టుగా వ్రాయించి, ఆ రిపోర్టును ఆ వుద్యోగికే పంపించేవాడు.

రూజ్వెల్టు ఉద్యోగులు, తమ అభిప్రాయాలు అతడి అభిప్రాయా లకు భిన్నంగావున్నా, సాధారణంగా వాటిని వెలిబుచ్చేవారు కారు. కాని, ముఖ్యమైన సమస్య లేవయినా వుంటే, వాటిని గురించిన తమ వ్యతి రేకాభిప్రాయాలను దాపరికం లేకుండా వారు అతడికి చెప్పేవారు. రూజ్వెల్టు మిత్రులు తమ అభిప్రాయాలను స్పష్టంగా నిర్మొగమాటంగా అతడికి చెప్పేవారు. అయితే, ఒకొక్కప్పుడు వారు అతడి కోరచూపులకు గురికావలసి వచ్చేది.

రూజ్వెల్టు ఏ విషయంలోనూ తప్పటడుగు వెయ్యకుండా చూడ డానికి అతడి వుద్యోగులంతా ఎప్పుడూ అతి జాగరూకతతో మెలిగేవారు. అతడుకూడా వారి విశ్వాస విధేయతలను నమ్మి సంచరించేవాడు.

తన ఉద్యోగులు ఎప్పటి కప్పుడు అన్ని విషయాలను గురించి సమగ్రమైన జ్ఞానంకలిగి వుండేటట్టు అతడు శ్రద్ధవహించేవాడు. రష్యా రాజకీయాలను గురించి తాను తెలుసు కోవడానికి ఒక సమగ్రమైన నివేది కను తయారు చెయ్యమని రూజ్వెల్టు తన వుద్యోగులకు చెప్పాడంటే దాని అర్థం ఆ విషయాన్ని గురించి సమస్తమూ వాళ్ళు తెలుసుకొని వుండాలని హెచ్చరించడం అన్నమాట.

అతడి అధికారానికి ప్రధానమైన అవలంబనలు ప్రజారాజ్య విధా నంలో అతడికిగల విశ్వాసమూ, ప్రజల మంచి చెడుగులను తనవిగా పాటించ డమూ, రాజకీయాలలో ఎత్తులు వెయ్యడంలో అతడికిగల ప్రజ్ఞ— ఇవి మూడు.

ఎంత కొత్త ప్రతిపాదనను చేసినా ప్రజలు బిత్తరపోకుండా దానిని వెలిబుచ్చడంలో అతడి ప్రభావం చాలా గొప్పది. మరొక గొప్పశక్తి ఏమిటంటే, ప్రజలకు చెప్పకుండా తానే నిర్ణయించిన ఒక కార్యాన్ని చెయ్యడంలో అసంఖ్యాకులైన ప్రజలు ఆ కార్యం ఇంకా జరగలేదేమా అని తహ తహ లాడుతున్నట్టు చెయ్యడం. దానితో, అతడుచేసిన పను లన్నీ ప్రజలు కోరగా చేసినట్టే కనపడేవి. ఎవరివారి అభిప్రాయాన్ని కనుక్కోవడంలో తన అభిప్రాయమే వారి అభిప్రాయంకూడా అని తప్ప వేరే జవాబు చెప్పడానికి వీలులేని ధోరణిలో అతడు ప్రశ్నలను వేయగలడు.

రూజ్వెల్టు ఒక గొప్ప రాజకీయవేత్త మాత్రమే కాదు; ఒక గొప్ప బోధకుడు కూడాను. అతడి వుపన్యాసాలను విన్నందువల్ల ఎంతోమంది ఎన్నో విషయాలపై విజ్ఞానాన్ని సంపాదించుకో గలిగారు. అమెరికన్ ప్రజల జీవితాన్నిగురించీ, అమెరికా సాంఘిక వ్యవస్థనుగురించీ అంతకు పూర్వం ఏ అధ్యక్షుడుకూడా రూజ్వెల్టు కలిగించినంత ప్రబోధాన్ని కలిగించలేదు.

# మంత్రిమండలి సమావేశాలు

మంత్రిమండలి సమావేశాలను జరపడంలో రూజ్వెల్టు ఏ మాత్రమూ దర్పం లేకుండా మిత్రులు కొంతమంది మాట్లాడుకోడానికి కలుసుకున్నట్టుగా ఏర్పాటు చేసేవాడు. కాలం గడిచిన కొద్దీ, మంత్రిమండలి నిర్ణయాలను పాటించడంలో అతడు ఎక్కువ శ్రద్ధను చూపేవాడు కాడు. ఒక సమూహంతో వ్యవహరించడంకంటె వ్యక్తులతో వ్యవహరించడం అంటే రూజ్వెల్టుకు యిష్టం ఎక్కువ. తన మంత్రిమండలిలో చాలామందికి అతడు రాజకీయ కారణాలవల్ల ఉద్యోగాలు ఇచ్చాడు. మంత్రిమండలి సమావేశం జరిగినప్పుడు అన్ని విషయాలనూ చర్చించినా, దేనిని గురించీ నిర్ణయాలు జరక్కపోవడం, నిర్ణయం జరిగినా దానిప్రకారం రూజ్వెల్టు నడచుకోక పోవడంవల్ల ఒక మంత్రి ఆ రేడు నెలలు ఆ సమావేశాలకు హాజరు కాలేదు కూడా. మంత్రిమండలి సమావేశంలో రాచకార్యాలను చర్చించడం కంటె ఒంటరిగా రూజ్వెల్టుతో మాట్లాడి తనశాఖకు సంబంధించిన విషయాలపై అతడి నిర్ణయాలను తెలుసుకోడానికి ప్రతిమంత్రీ విడివిడిగా ప్రయత్నించేవాడు.

కాలం గడిచినకొద్దీ, మంత్రిమండలి సమావేశాలలో చర్చలు జరగడం కూడా తగ్గిపోయింది. ప్రతిమంత్రీ, తన శాఖకు సంబంధించిన వ్యవహారాలు ఎలా సాగుతున్నదీ రూజ్వెల్టుకు వివరించడంతో సరిపోయేది. తరువాత యుద్ధకాలంలో మంత్రిమండలి సమావేశాలకన్న సైన్య నౌకా విమాన శాఖాధిపతుల సమావేశాల ప్రాముఖ్యత హెచ్చిపోయింది.

మంత్రిమండలి సమావేశం జరిగినప్పుడల్లా, రూజ్వెల్టు కార్డెల్ హల్‌ను చూసి "కార్డెల్, బయటినుంచి వార్తలు ఏమిటి?" అని అడగడంతో సమావేశం ప్రారంభమయేది. ప్రతిసారీకూడా తప్పనిసరిగా, ఆ ప్రశ్నకు "ఏమంత ఉత్సాహకరంగా లేవు" అని కార్డెల్ జవాబు చెప్పేవాడు. కార్డెల్ హల్‌కు బదులు సమ్నర్ వెల్స్ గనుక ఆ సమావేశానికి హాజరు అయితే, అతడు రూజ్వెల్టు అడిగిన ప్రశ్నకు సూటిగా, సమగ్రంగా చకచక జవాబు చెప్పేవాడు. నిజంగా హల్‌కు బదులు వెల్సే విదేశశాఖా మంత్రిగా వుంటే బాగుండునని కొన్నివేల సార్లయినా రూజ్వెల్టు అనుకొని

వుంటాడు. కాని కార్డెల్ హాల్‌కు సెనేట్‌లోవున్న ప్రాబల్యం వల్లనూ, దేశంలో వున్న పలుకుబడి వల్లనూ, రూజ్వెల్టు అతణ్ణి వదలించుకోలేక పోయాడు. హాల్ అంటే రూజ్వెల్టుకు ఇష్టమే. అతడిమీద అభిమానంకూడా వుండేది. కాని, ఏ విషయాన్నీ త్వరగా గ్రహించలేక పోవడమూ, అంతు లేకుండా కబుర్లుచెప్పడమూ హాల్ స్వభావాలు. అవి రూజ్వెల్టుకు చికాకు కలిగించేవి.

కార్డెల్ హాల్‌కు తన శాఖమీద ఎక్కువ అధికారం లేకుండానూ, రాజకీయ వ్యవహారాలలో ఎక్కువజోక్యం లేకుండానూ రూజ్వెల్టు క్రమ క్రమంగా ఏర్పాట్లు చేసివేశాడు. యుద్ధకాలంలో చర్చిల్, స్టాలిన్‌లను కలుసుకోవడానికి రూజ్వెల్టు ప్రయాణం చేసినప్పుడు తనతో ఎక్కువమంది ఉద్యోగులను తీసుకొని వెళ్ళక పోవడానికి కారణం హాల్‌ను ఎలాగయినా తనతో గాకుండా చెయ్యడానికే.

మంత్రిమండలి సమావేశాలలో, హాల్‌తో మాట్లాడడం అయిపోయిన తరువాత, కోశశాఖమంత్రి హెన్రీ మోర్గంతోతో మాట్లాడేవాడు రూజ్వెల్టు. నౌకాశాఖ తరువాత, రూజ్వెల్టుకు ఎక్కువ అభిమాన పాత్రమైన ప్రభుత్వ శాఖ, కోశశాఖ. రూజ్వెల్టువద్ద మోర్గంతో అతి అణకువతో ప్రవర్తించే వాడని, వైస్-ప్రెసిడెంట్ గార్నర్ అనేవాడు. ప్రతి సోమవారం, రూజ్వెల్టుతో విందుకుడిచే హక్కు తనకు దేవుడిచ్చాడని అత డనుకొనే వాడట. మంత్రిమండలి సమావేశాలలో మోర్గంతో ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. తను చెప్పదలచుకున్న దంతా రూజ్వెల్టు తాను ఒంటరిగా వున్నప్పుడు చెప్పేవాడు. రూజ్వెల్టుకు మోర్గంతో అంటే ఎక్కువ అభిమానంకూడా ఉండేది.

హెరాల్డ్ ఐక్స్ మంత్రిమండలి సమావేశాలలో సాధారణంగా మాట్లాడేవాడు కాదు. కాని, మాట్లాడినప్పుడు తన ఉద్దేశాలను నిష్కర్షగా చెప్పేవాడు. అంచేత, రూజ్వెల్టుకు అతడంటే గౌరవభావం వుండేది.

రూజ్వెల్టు మంత్రులలో ఒకరినిచూస్తే మరొకరికి కిట్టేదికాదు. కొంత మందికి ప్రత్యక్ష విరోధంకూడా వుండేది. కొంతమంది మంత్రులు రూజ్వెల్టుకు ద్రోహంకూడా చేసేవారు. ఒకసారి మంత్రిమండలి సమావేశం జరుగుతూ

వుంటే, రూజ్వెల్టు టెలిఫోనులో మాట్లాడడానికి ప్రక్కగదిలోకి వెళ్ళవలసి వచ్చింది. అంతకు పూర్వం యెప్పుడూ అలా జరగలేదు. రూజ్వెల్టు మళ్ళీ తనగదిలోకి రావడానికి అయిదు నిమిషాలు పట్టింది. ఆ అయిదు నిమిషాలలోను, మంత్రులంతా ఒకరి నొకరు దూషించుకొని, తిట్టుకొని వాదించుకొని ఎడమొగం పెడమొగం పెట్టడం జరిగింది. రూజ్వెల్టు తిరిగి మంత్రిమండలి గదిలోకి వచ్చిన తరువాత, అతడి పక్షం మాట్లాడినవారు ముగ్గురే—మిస్ పెర్కిన్స్, మోర్గంతో, హాప్కిన్సు.

# పత్రికలతో సంబంధాలు

రూజ్వెల్టు మేధావి అనడంలో సందేహంలేదు. కొన్ని విషయాలలో అతడు మహా మేధావి. పత్రికలతోను, పత్రికా విలేఖరులతోను, అతడు బహునేర్పుతో ప్రవర్తించేవాడు. దేశంలోని పత్రికలలో నూటికి 80 వంతులు, అతడిపట్ల ప్రతికూలంగా వుండేవి. కాని, అన్ని పత్రికల విలేఖరులతోను అతడు సుహృద్భావంతో ప్రవర్తించేవాడు. 1940 లో అతడు అధ్యక్ష పదవికి పోటీ చేసినప్పుడు, ఆరు రాష్ట్రాలలో ఒక్క పత్రిక కూడా అతడిపట్ల అనుకూలంగా లేదు. పత్రికల యజమానులు అతడికి ప్రతికూలంగా వున్నా, పత్రికలు అతడికి వ్యతిరేకంగా వ్రాసినా, పత్రికలలో పనిచేసేవారు మాత్రం అతడికి పూర్తిగా అనుకూలంగా వుండేవారు. రహస్యంగా అతనికోసం పనిచేసేవారు.

వారానికి రెండుసార్లు, ప్రతివారమూ అతడు పత్రికావిలేఖరులతో సమూహ ప్రసంగాలు జరిపేవాడు. అతడికి ప్రతికూలంగా వున్న పత్రికల విలేఖరులు ఎంతోమంది యీ సమావేశాలకు వచ్చేవారు. వారందరితోటీ, అతడు ఎంతో సుహృద్భావంతో మాట్లాడేవాడు. అందుచేత, ఎంతోమంది అతడికి మైత్రి నెరపేవారు.

రూజ్వెల్టుకు పత్రికా రచన, ప్రచురణ అంటే ప్రత్యేకంగా శ్రద్ధవుండేది. సంపాదకీయాలు లేకుండా, వార్త లన్నిటినీ స్పష్టంగా ప్రకటించే పత్రికను స్థాపించుదామని అతడు చాలాకాలం అనుకున్నాడు. పత్రికల ద్వారా, తననుగురించి ప్రచారం సాగించుకోవడంలో అతడికి గల

ప్రజ్ఞ మరెవరికీ లేదు. పత్రికలతో తన సంబంధాలను బాగా వుంచుకోవడానికి అనువైన అవకాశం ఎంత చిన్నది వచ్చినా అతడు దానిని వృధాగా పోనివ్వలేదు.

వైట్‌హౌసులో వార్తలను సేకరించడానికి నియమించబడిన పత్రికా విలేఖరుల బాగోగులను కనుక్కోవడమూ, వారికి ఏదైనా మేలుచేయడమూ అతడికి సహజగుణాలు. తనతో ఓడ ప్రయాణం చేస్తున్న పత్రికా విలేఖరికి ఎవరికైనా ఒళ్లు బాగా లేకపోతే అతడి బదులు తానే అతడి పత్రికకు వార్తలను వ్రాసిపెడతానని ఉద్యుక్తుడయే వాడట రూజ్వెల్టు !

తనకు ఎంతకోపం వచ్చేటట్టు ఏ పత్రిక వ్రాసినా పత్రికా విలేఖరులలో ఎవరినీ అతడు ఎప్పుడూ పేరుపెట్టి దూషించలేదు.

రూజ్వెల్టు జరిపే పత్రికా విలేఖరుల సమావేశాల లాంటివి అంతకు పూర్వం ఎప్పుడూ వాషింగ్టన్‌లో జరుగలేదు. నిజానికి థియోడోర్ రూజ్వెల్టు అధ్యక్షుడయినదాకా, పత్రికా విలేఖరులకు వైట్‌హౌసులో ప్రవేశం వుండేదికాదు. రూజ్వెల్టు తన అధ్యక్ష పదవిలో మొత్తం 999 సార్లు పత్రికా విలేఖరులతో గోష్ఠి జరిపాడు. సాధారణంగా అలాటి గోష్ఠిలో నూరుమంది విలేఖరులు పాల్గొనేవారు. ఒకొక్కప్పుడు రెండువందలమంది కూడా వుండేవారు. తన గోష్ఠికి హాజరయే విలేఖరులలో చాలామంది పేర్లుడు పేర్లనుకూడా రూజ్వెల్టు ఎరుగును. గోష్ఠిలో విలేఖరులకు తన కార్యక్రమాలను వివరించడం, ఛలోక్తులు పలకడం యెత్తుకు పైయెత్తువేసి సమాధానాలలో చెప్పకూడని రహస్యాలను విలేఖరులు ఎన్నివిధాల ప్రయత్నించినా చెప్పక పోవడం, రూజ్వెల్టు బహు నేర్పుతో నిర్వహించేవాడు.

అతడు జరిపిన మొట్టమొదటి పత్రికా విలేఖరుల గోష్ఠి 1933 మార్చి 8 వ తేదీన. అప్పటికి ఆర్థిక మాంద్యం ప్రబలంగానే వుంది. బాంకులు ఇంకా తెరవలేదు. దేశంలోని ప్రజలంతా నిరాశతో జీవచ్ఛవాల లాగ వున్నారు. అలాటి పరిస్థితులలో, రూజ్వెల్టు ఏం చెపుతాడో అని ఆత్రుతతో విలేఖరులంతా పోగయారు. కాని, రెండు నిమిషాలలో వారంతా రూజ్వెల్టు ఛలోక్తులతో పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వడం ఆరంభించారు.

పత్రికా విలేఖరుల గోష్ఠిలో అధ్యక్షుడితో ఎవరూ వాదించడానికి వీలులేదు; అతడికి ఎవరూ ఎదురాడ కూడదు. ఏ విషయాన్ని గురించి అయినా చర్చించవచ్చును. ఈ చర్చలు చాలా కులాసాగా జరిగేవి కూడాను.

రూజ్వెల్టు చేసినంత ఎక్కువ ప్రయాణాలు అంతకు పూర్వం ఏ అధ్యక్షుడూ చెయ్యలేదు. మరే దేశపు ప్రభుత్వాధిపతీకూడా చేసి వుండడు. అతడు అధ్యక్షుడుగా వున్న 12 సంవత్సరాలలోనూ, అతడు రైలులో చేసిన ప్రయాణాలు మాత్రం 399. ఈ ప్రయాణాల మొత్తం 5,44,864 మైళ్లు. 400 సారి అతడు చేసిన ప్రయాణం అతడి శవం వాంస్ప్రింగ్స్‌నుంచి వాషింగ్టన్‌కు రావడం.

రైళ్లలో కాక, విమానాలలోనూ, కార్లలోను, నౌకలలోను అతడు చేసిన ప్రయాణలను గురించి వివరాలు తెలియవు.

ప్రయాణం చెయ్యడం అంటే రూజ్వెల్టుకు చాలా సరదా. రైళ్లలో ప్రయాణం అంటే మరీ ఇష్టం. రైలుప్రయాణం చేసేటప్పుడు వ్యాపులను తనతో తీసుకొనివెళ్లి తను ప్రయాణం చేస్తున్న దేశాన్ని, పరిశీలించడం అతడికి అలవాటు. మెల్లగా ప్రయాణం చెయ్యడం అతడు ఎక్కువగా కోరేవాడు. గంటకు 35 మైళ్ల వేగంతో రైలు నడవడం అతడికి చాలు. పగలు గంటకు 35 మైళ్ల వేగంతో నడిచిన రైలు, రాత్రిళ్లు అతను నిద్ర పోయేటప్పుడు ఎక్కువ వేగంతో నడిచి, పగలు నడవవలసిన దూరాన్ని కూడదీసుకొనేది. రాత్రిళ్లు తన రైలు ఎంత వేగంగా వెళ్ళేదో రూజ్వెల్టుకు బహుశా తెలిసివుండదు.

రూజ్వెల్టు రైలు ప్రయాణాలను ఏర్పాటు చెయ్యడానికి ప్రత్యేకం ఏడుగురు గుమస్తాలతో ఒక చిన్న ఆఫీసు వుండేది. ఆ ఆఫీసుకు పెద్ద డేనియల్ లాంగ్. తాను ఏ ప్రయాణం చెయ్యదలచుకున్నా రూజ్వెల్టు, లాంగ్‌ను పిలిచి చెప్పేవాడు. తరువాత, సి. ఐ. డి. శాఖ అధికారికి చెప్పేవాడు. రూజ్వెల్టు రైలుకు ఒకమైలు ముందుగా రైలుదారి సరిగా వుందో లేదో చూడడానికి ఒక పైలట్ రైలు నడిచేది. రూజ్వెల్టు రైలు వెళ్లిపోయిన తరువాత తగినంత వ్యవధి అయిన తరువాతనే ఆ దారిమీద తక్కిన రైళ్లు నడిచేవి.

ఎన్నికల ప్రచార సమయంలో రూజ్వెల్టు ప్రయాణంచేసే స్పెషలు రైలుకు 16 లేక 18 పెట్టెలు వుండేవి. ఉత్తప్పుడు న్యూయార్కుకీ, వాంషింగ్టన్కీ ప్రయాణం చేసేటప్పుడు ఎనిమిది పెట్టెలు వుండేవి. ఆ రైలు పెట్టెలలో ఒక పెట్టెనుంచి మరొక పెట్టెకు టెలిఫోను సౌకర్యం వుండేది. అంతేకాదు. వైట్ హౌసునుంచి కబుర్లు తెలుసుకోవడానికీ, వైట్ హౌసుకు కబుర్లు చెప్పడానికీ వైర్లెస్ యంత్రంకూడా ఆ రైలు పెట్టెలలో ఒకదానిలో అమర్చబడి వుండేది.

1940 వరకూ, పుల్ మన్ కంపెనీవారి ప్రైవేటు రైలుపెట్టెలలో దేనినో ఒకదానిని రూజ్వెల్టు వుపయోగించేవాడు. అప్పుడు ప్రత్యేకం అతడి ఉపయోగంకోసం తగిన సదుపాయాలతో ఒక పెట్టె నిర్మించబడింది. అది యునైటెడ్ స్టేట్సు గవర్నమెంటు ఆస్తి. రైలుపెట్టెలోకి రూజ్వెల్టు ఎక్కాలంటే ప్రత్యేకం మెట్లులేకుండా ఏటవాలుగా ఒక బల్లలకూర్పు వెయ్యవలసిన వచ్చేది. 1940 లో అతడిని రైలుపెట్టెలోకి ఎక్కించడానికి ఒక లిఫ్టును ఇంజనీర్లు ప్రత్యేకం ఏర్పాటు చేశారు.

విమానాలలో ప్రయాణం చెయ్యడమంటే రూజ్వెల్టుకు ఎక్కువ ఇష్టం వుండేదికాదు. దానికి కారణం రైలుపెట్టెలోనూ, నౌకలోనూ కూర్చున్నంత సదుపాయంగా విమానంలో కూర్చోడానికి వీలులేక పోవడమూ, విమానంలో ప్రయాణం చేస్తూవుంటే ప్రక్కన చూడడానికి ఏమీ వుండకపోవడమూ.

అధ్యక్షుడయిన తరువాత రూజ్వెల్టు చేసిన మొట్టమొదటి విమాన ప్రయాణం అతడు 1943 జనవరిలో కాశబ్లాంకాకు వెళ్ళినప్పుడు. అతడి విమానానికి ముందు ఒక విమానమూ తరువాత ఒక విమానమూ ఒకగంట వ్యవధిలో కాపలాచేస్తూ ప్రయాణం చేశాయి.

# రూజ్వెల్టు రక్షణ

ప్రెసిడెంటులందరికీ కూడా ఏ విధమైన ప్రమాదం కలగకుండానూ, వారి ప్రాణాలను హరించడానికి ఎవరూ ప్రయత్నించకుండానూ, రక్షణ చర్యలు చాలా జాగ్రత్తగా తీసుకోబడుతవి. అయితే, రూజ్వెల్టును

రక్షించడానికి చేసే ఏర్పాట్లకు ఒక చిక్కు వుండేది. అతడు నడవలేక పోవడంవల్ల అతణ్ణి హత్య చెయ్యడానికి ఎవరైనా ప్రయత్నించినప్పుడు అతడు తనువున్న స్థానంలోనుంచి చప్పున తప్పుకోవడం సాధ్యంకాదు. పైగా అతడు సంచారం చేసినప్పుడు, అతడిచుట్టూ వేలకొలది జనం గుంపులు కూడేవారు. ఒకసారి పెన్సిల్వేనియా నగరంలో అతడిచుట్టూ చేరిన జనం విపరీతంగా వున్నందున ఆ గుంపులోనలిగి ఇద్దరు చచ్చిపోయారు.

రూజ్వెల్టు ఉపయోగించే మోటారుకారుకి, దానిలోనుంచి తుపాకి గుండు దూరకుండా ఉక్కుతో చేసిన కట్టడంవుండేది. అందేత ఆకారు బరువు 8,000 పౌనులు వుండేది.

రూజ్వెల్టుకు విషంపెట్టి చంపడానికి ప్రయత్నం జరగకుండా జాగ్రత్త పడడానికి పోలీసులు రూజ్వెల్టు ఇంటికి కావలసిన వంట సామానులను, మాంసాన్ని సప్లయిచేసే దుకాణదారుల దూరపు బంధువులను గురించికూడా పత్తాతీసి, వాళ్ళందరినీ ఓకంట కనిపెడుతూ వుండేవారు. రూజ్వెల్టు ప్రయాణం చేసేటప్పుడు, దారిలో ఎక్కడబడితే అక్కడ పాలూ నీళ్ళూ కొనే అక్కరలేకుండా ఇంటినుంచే పాలనూ, నీళ్లనూ రైలులో వెంటతీసుకు పోవడానికి సి. ఐ. డి. పోలీసులు ఏర్పాటు చేసేవారు. విమాన ప్రయాణాలలో కూడా పాలనూ నీళ్ళనూ వెంట తీసుకు వెళ్లేవారు.

రూజ్వెల్టుకు ఎవరైనా బాంబులను పోస్టుద్వారా పంపుతారేమోననే భయంతో, అతడికి వచ్చిన పోస్టుపార్శెళ్ళ నన్నిటినీ విప్పడానికి పూర్వం పరీక్షి చెయ్యడానికి వైట్ హౌసులో ఒక ఎక్స్-రే యంత్రంకూడా వుండేది. యుద్ధకాలంలో, అమెరికాలోని ఏ పిచ్చివాడైనా విమానంలో ఎక్కి వైట్ హౌసుమీద బాంబులు వేస్తాడేమోనని, విమానాలను పడగొట్టే ఫిరంగినికూడా వైట్ హౌసు డాబామీద పెట్టించారు పోలీసులు.

యుద్ధానికి పూర్వం, ప్రెసిడెంటు ప్రాణాలను కాపాడడానికి ప్రత్యేకమైన ఏర్పాట్లు వున్నట్లే కనపడేదికాదు. ఒక యూరపియను పత్రికా విలేఖరి, అతడు ఫలానా అని రూజ్వెల్టు ఆఫీసువారు తెలుసుకొని పత్రికా విలేఖరుల గోష్ఠికి హాజరు కావడానికి అనుమతి యిచ్చేలోపల,

ఆప్పటి కప్పుడే ఆరుసార్లు గోష్ఠికి హాజరయ్యాడు. ఎవరో తెలియక పోయినాకూడా, అతణ్ణి ఎవరూ ఆటంక పరచలేదు.

ఇతర దేశాల పరిపాలకులు, తమలాగే కనపడే బదులు మనుష్యులను చాలాసార్లు ఉపయోగించినా రూజ్వెల్టుమాత్రం తనలాటి పోలికలుగల బదులుమనిషిని ఒకే ఒకసారి ఉపయోగించుకున్నాడు. అది ఎప్పుడంటే, అట్లాంటిక్ ప్రణాళిక సమావేశానికి రూజ్వెల్టు వెళ్ళినప్పుడు. అతడు చాలాదూరం వెళ్ళిపోయి, నడిసముద్రంలో ప్రయాణంచేస్తూవున్న సమయంలో అతడు ఎక్కడికి వెళ్ళినదీ ఎవరికీ తెలియనియ్యకుండా వుంచడానికీ, అతడు తీరసమీపంలోనే వున్నట్టు భ్రమ కలిగించడానికీ, రూజ్వెల్టులాగ డ్రస్సువేసుకొని రూజ్వెల్టులాగే కనిపించే ఒక వ్యక్తిని పడవమీద చుక్కాని దగ్గరగా కుర్చీలో కూచోపెట్టి, ఆ పడవను తీర సమీపంలో రోజంతా తిప్పడం జరిగింది.

ఒకసారి రూజ్వెల్టు ప్రయాణంచేస్తున్న నౌకమీద, అమెరికా నౌకా దళానికి చెందిన మరొకనౌకనుంచి ప్రమాద వశాత్తు టార్పెడో వెయ్యడం జరిగింది. ఇది అతడు, చర్చిల్ స్టాలిన్‌లను కలుసుకోవడానికి టెహరాన్ వెడుతున్నప్పుడు. ఆ టార్పెడో, రూజ్వెల్టువున్న నౌక "అయోవా"ను సమీపించకముందే "అయోవా"లోని ఆఫీసర్లు దానినిచూసి, అతి చాకచక్యంతో "అయోవా"ను ప్రక్కకుత్రిప్పి, ప్రమాదంనుంచి కాపాడారు. ఆ టార్పెడో, అయోవాకు 20 గజాల దూరంనుంచి పోయింది. ఒక నావికుడు పొరపాటున ఆ టార్పెడోను వదిలాడు. అతణ్ణి తరువాత కోర్టుమార్షల్ విచారణ చేశారు; కాని క్షమించి వదిలేశారు.

ఆ టార్పెడోను ప్రయోగించిన నౌక, తాంప్సన్, తరువాత పసిఫిక్ యుద్ధంలో శత్రుచర్యవల్ల మునిగిపోయింది.

# వైచిత్ర్యము

చిన్నప్పుడు విశేషమైన ప్రజ్ఞ ఏమీ చూపని ఒక యువకుడు, ఒక గొప్ప నాయకుడెలా అయాడు? రూజ్వెల్టు సాధించిన మహా విజయాలకు కారణం ఏమిటి? అతడి గొప్పతనం ఏమిటి?

వీటన్నిటికీ చాలా సమాధానాలు చెప్పవచ్చును.

1. క్రమంగా వ్యక్తిత్వాన్ని పరిణామం పొందించుకొని, మహత్వాన్ని చూపగల పురుషులలో అతడొకడు; తన జీవితమంతా, అతడొక యువకుని లాగనే ఉత్సాహ పటిమను చూపాడు.

2. సాంప్రదాయాలనూ, కట్టుబాట్లనూ లక్ష్యపెట్టకుండా నూతన నిర్ణయాలను అమలు జరుపడంలో అతడికిగల సాహసం; నూతన విషయాలను తెలుసుకోవడంలో అతడికిగల ఆసక్తి.

3. యువకదశలో అతడు బుద్ధిమంతుడని పేరుతెచ్చుకున్నాడు. పెద్దవాడయిన తరువాత, బుద్ధిమంతుని ధోరణిలోనే, మర్యాదకు లోపంలేకుండా మూఢ సాంప్రదాయాలను భగ్నంచెయ్యి గలిగాడు. అలా చెయ్యడంలో అతడు విశేషమైన ఆనందాన్ని ప్రదర్శించే వాడు.

4. అతడు స్వతహాగా భాగ్యవంతుడు కావడం. గొప్ప ఆశయాలు కలవా రెందరో, భాగ్యవంతులు కాకపోవడంవల్ల తమ ఆశయాలను సాధించలేక పోయారు. అతడు తీవ్రవాదికాడు అని విశ్వాసం కలిగించ డానికి అతడి ధనికత్వం సహాయపడింది.

5. అతడికి గొప్ప ఆత్మవిశ్వాసం వుంది. మూడు సంవత్సరాలు మరణంతో హోరాహోరిగా పోట్లాడి, తీవ్రమైన పక్షవాతపు వ్యాధినుంచి అతడు ప్రాణాలతో బయటపడ్డాడు.

6. తన అవిటితనాన్ని పరిహరించడానికి, అతడు గొప్ప కార్య దీక్షనూ, ఉత్సాహాన్నీ పెంపొందించుకున్నాడు.

7. అన్నిటికన్న ముఖ్యమైనది ఆలోచనతో కొట్టుకోవడం కాకుండా కార్యాన్ని సాధించడానికి పూనుకోవడంలో అతడికిగల అభిలాష. చిక్కులతో నిండిన అనేక సమస్యలను, ఏదో ఒక పద్ధతిలో నడపడం ప్రధానం అనే సూత్రంతో, అతడు పరిష్కరించ గలిగాడు.

ఇలాటి స్వభావంగల, యీ మహాపురుషుని పుట్టు పూర్వోత్త రాలను ఇక తెలుసుకుందాము.

# పుట్టు పూర్వోత్తరాలు

## హైడ్ పార్కు

హైడ్ పార్కు పరిసరంలో రూజ్వెల్టు కుటుంబంకన్న చాలా పూర్వమే వేళ్లు పాతుకుపోయిన కుటుంబాలు చాలా వున్నాయి. రూజ్వెల్టు పూర్వీకులు మొదట్లో న్యూయార్కు నగరంలో నివసించేవారు.

రూజ్వెల్టును గురించి చెప్పేటప్పుడు, హైడ్ పార్కు అనే పదం ఉపయోగించి నప్పుడల్లా, అతడి కుటుంబీకులు నివసించిన స్ప్రింగ్ వుడ్ అనే పేరుగల ఇల్లు అని అర్థం చెప్పుకోవాలి. ఈ ఇల్లు 1826 లో నిర్మాణం అయింది. క్రమేపీ దానికి అనేక హంగులు, ఆభరణాలు ఏర్పాటుచేయ బడినవి. రూజ్వెల్టుతండ్రి జేమ్సు రూజ్వెల్టు ఆ యింటిని, కౌలుకు రైతులు వ్యవసాయంచేసే 110 ఎకరాల భూమిని, నీటివంటలుగల దానితోసహా 1867 లో 40,000 డాలర్లకు కొన్నాడు. తరువాత, రూజ్వెల్టు కుటుంబీకులు ఆ చుట్టుప్రక్కల సంపాదించిన భూమి అంతాచేరి 1,300 ఎకరాల భూవసతి అయింది. ఈ భూమి పల్లంగా హడ్సన్ నదీ తీరంవరకూ వ్యాపించి వుంది. జేమ్సు మరణానంతరం, హైడ్ పార్కు ఇల్లు రూజ్వెల్టు తల్లికి సంక్రమించింది. తరువాత ఎన్నో సంవత్సరాలు అది ఆమె ఆస్తిగానే వుంది.

ఆ ఇంటిలోనే రూజ్వెల్టు జన్మించాడు.

హైడ్ పార్కు అనే పేరుగల చిన్నగ్రామం, ఆ యింటికి ఉత్తరంగా మైలున్నర దూరంలో వుంది. పోకీప్సీ అనే పెద్దగ్రామం, ఆ యింటికి దక్షిణంగా నాలుగుమైళ్ళ దూరంలో వుంది. ఈ హైడ్ పార్కు ప్రదేశ మంతాకూడా, న్యూయార్కు నగరానికి 80 మైళ్ళ దూరంలో వుంది. ఈ ప్రాంతంలో నివసించే వారంతా 18 వ శతాబ్దంలో హాలెండు దేశంనుంచి వచ్చిన డచ్చి కుటుంబాలవారే. ఇక్కడికి మొట్టమొదట వచ్చిన కుటుంబం జాకొబస్ స్టౌటెన్ బర్గ్ అనే అతడు. అతడు 1741 లో వచ్చాడు. మొదట్లో హైడ్ పార్కు గ్రామానికి అతడిపేరే స్టౌటెన్ బర్గ్ అని వుండేది.

హడ్సన్ నదీ లోయప్రాంతంలో నివసించే వారంతా భూస్వాములని చెప్పవచ్చును. ఈ నదీతీరపు భూస్వామి కుటుంబాలన్నీ, అక్కడే పెరిగి అక్కడే విస్తరిల్లాయి. పెళ్ళి పేరంటాలన్నీ, యీ కుటుంబాల మధ్యనే జరిగేవి. బయటనుంచి వచ్చే దూరపు సంబంధాలేవీ వీరిలో కలవలేదు. అంచేతనే రూజ్వెల్టు యువకదశలో కూడా, యీ కుటుంబాలలో మేనరికపు పెళ్ళిళ్ళుతప్ప దూరపు సంబంధాల పెళ్ళిళ్ళు అవవు అని ఎక్కువగా వాడుకమాట వుండేది. దానికి కారణం, యీ కుటుంబాలలోని బాల బాలికలను, యితర కుటుంబాల బాలబాలికలను చూడడానికి ఎక్కువ అవకాశం లేక పోవడమే.

హడ్సన్ లోయ నివాసులు లోభులైనా, చాలా చర్చిలను కట్టించడమూ, అనాథ శిశువులను పోషించడమూ, స్కూళ్లను కట్టించడమూ మొదలైన ఘనకార్యాలను చాలా చేశారు. ఆ కుటుంబాలలోని బాల బాలికలంతా సాంప్రదాయ బద్ధమైన కట్టుదిట్టాలలో పెరిగారు. పాత పద్ధతులు అలాగే నిలిచిపోతాయనీ ఆ పద్ధతులుతప్ప వేరే సాంప్రదాయం లేదనీ ఆ కుటుంబాలు అనుకునేవి.

కాని, ఈనాడు ఆ వ్యవస్థే పూర్తిగా మారిపోయింది. ఆ వ్యవస్థను సంపూర్ణంగా మార్చివెయ్యడానికి చాలావరకు రూజ్వెల్టే బాధ్యుడు. పూర్వకాలపు పెద్ద కుటుంబాలకు అక్కడవుండే పలుకుబడి అంతా సన్నగిలి పోయింది. పెద్ద పెద్ద ఆస్తులన్నీ, పేరు మాసిపోయాయి. పన్నుల భారంతో ఆస్తులు కృశించాయి. ఆ కుటుంబాలలో పూర్వంలాగ విస్తారంగా సంతానంకలగడం ఆగిపోయింది. పుట్టిపెరిగిన కొద్దిమంది పిల్లలూ గ్రామాన్ని విడిచిపెట్టి, తమ పూర్వీకుల ఆస్తులను వదలిపెట్టి న్యూయార్కు నగరానికో, మరెక్కడికైనానో పోవడానికి ఎక్కువగా ఉత్సుకతను చూపుతున్నారు.

రూజ్వెల్టు భూస్వాముల కుటుంబానికి చెందినవాడు. అతడి పెంపకం అంతా, ఇంగ్లండులోని భూస్వాముల బిడ్డల పెంపకంలాగా జరిగింది. అతడికి వారసత్వరీత్యా వచ్చిన ఆస్తి అంతా నౌకలవల్లనూ భూమివల్లనూ కూడినదే; పరిశ్రమలవల్ల గాని, కార్మికుల కృషి ఫలితాలవల్లగాని వచ్చిన ఆస్తి కాదు.

యంత్రాగారాలను స్థాపించి కార్మికులు చెమటూడ్చి సృష్టించే సరకులవల్ల అంతులేని సంపదలను కూడబెట్టే భాగ్యవంతులను చూస్తే,

భూస్వాములకు సాధారణంగా కిట్టదు. అంచేత, భూస్వాములు కార్మికుల పక్షం వహించేవారు.

భూస్వామి కుటుంబానికి చెందినవాడు కావడంవల్ల కార్మికులను ఫాక్టరీ యజమానులు ఎలా పీడించేదీ అతడికి అనుభవం లేదు. అంచేత, దురాశతో కార్మికులను ద్వేషించడం అతడికి పట్టుబడలేదు. కష్టాలవల్లనూ దారిద్ర్యం వల్లనూ బాధపడేవారికి సహాయపడే కుటుంబ వాతావరణంలో అతడు పెరిగాడు.

పైగా, ఇరుగుపొరుగున వున్న భాగ్యవంతులతో పోలిస్తే రూజ్వెల్టు కుటుంబం పెద్ద భాగ్యవంతులని అనడానికే వీలులేదు.

# వంశవృక్షము

అమెరికాలోని రూజ్వెల్టు కుటుంబానికి మూలపురుషుడు, క్లేస్ మార్టెన్‌సెన్ వాన్ రూసెన్‌వెల్ట్. ఇతడు 1640 లో హాలెండ్ నుంచి అమెరికాకు వాచ్చాడు. అతడు అమెరికాకు వలస రావడానికి కారణం ఏమిటో స్పష్టంగా తెలియదు. అతడొక ఆజానుబాహు విగ్రహమట.

ఇప్పటికీ హాలెండులో కొంతమంది రూజ్వెల్టులు వున్నారు. ఆ వంశపు ఆఖరి రూజ్వెల్టు హార్లెంలోని ఒక చైనీసు హోటలులో వారానికి 18 డాలర్ల జీతంమీద జీవిస్తున్నాడు. అతడిభార్య ఒక కుట్టుపని దుకాణంలో పనిచేస్తోంది. అతడితండ్రి ఓడరేవులో కూలిపని చేసుకుంటున్నాడు.

అమెరికాకు వలసవచ్చిన క్లేస్ రూసెన్‌వెల్ట్‌కు నికొలస్ రూజ్వెల్టు అని ఒక కొడుకు. ఆ కొడుకు హేలిట్జ్‌జాన్స్ కున్‌స్ట్ అనే ఒక యువతిని వివాహం చేసుకున్నాడు. వారికి జోహన్స్, జాకొబస్ అని ఇద్దరు కొడుకులు. ఈనాడు అమెరికాలో వున్న రూజ్వెల్టులంతా, యీ యిద్దరి కొడుకుల సంతతివారే. ఒకడి వంశంలో థియొడోర్ రూజ్వెల్టు పుట్టాడు. మరొక వంశంలో ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు పుట్టాడు. ఇద్దరూ అమెరికాకు అధ్యక్షులు లైనారు.

క్రమక్రమంగా రూజ్వెల్టు కుటుంబీకులు, పరిసరాలలో వున్న ఇతర దేశీయులతో సంబంధాలు కలుపుకున్నారు. అంచేతనే, రూజ్వెల్టులో డచ్చి

రక్తంకన్న ఇంగ్లీషురక్తం ఎక్కువ వుందని అంటారు. అమెరికాదేశపు అధ్యక్షులలో పదకొండుమంది ఏదోవిధంగా రూజ్వెల్టుకు బంధువు లవుతారట. రూజ్వెల్టు వంశపు మూలపురుషుడు క్లేస్ రూసెన్‌వెల్ట్ సంతతి పరంపరలోనే అయిదుగురు అధ్యక్షు లయినారట.

పారంపర్య సంబంధాలవల్ల తనలో ఇంగ్లీషు రక్తమే ఎక్కువవున్నా, రూజ్వెల్టుమాత్రం తాను పూర్తిగా డచ్చివాణ్ణేనని అనుకొనే వాడు. ఇంగ్లీషు, జర్మన్, డచ్చి స్త్రీలను, రూజ్వెల్టు కుటుంబాల పురుషులు ఎక్కువగా పెళ్ళి చేసుకున్నారు. అయినా, చాలావరకూ వీరి సంబంధ బాంధవ్యాలన్నీ, తమ బంధువర్గంలోనే జరిగేవి. రూజ్వెల్టు తనకు అయిదు వేళ్లు విడిచిన జ్ఞాతికుమార్తె ఎలియనార్ రూజ్వెల్టును పెళ్ళి చేసుకున్నాడు. ఆమె, రూజ్వెల్టుకు మరొక జ్ఞాతి అయిన థియొడోర్ రూజ్వెల్టుకు పెంపుడు కూతురు. ఆమెతండ్రి ఎలియట్ రూజ్వెల్టు థియొడోర్‌కు ఏకైక సోదరుడు.

రూజ్వెల్టు తన తండ్రికి రెండవభార్య కొడుకు. మొదటిభార్య కొడుకు జేమ్సు రూజ్వెల్టు. అతడికి ఇద్దరు కొడుకులు. ఆ యిద్దరూకూడా తమ పినతండ్రి రూజ్వెల్టుకన్న వయసులో పెద్దవారు.

రూజ్వెల్టుకు తన వంశవృక్షాన్ని పరిశీలించడం అంటే చిన్నప్పటినుంచీ చాలా సరదాగా వుండేది. మొట్టమొదట అమెరికాకు వచ్చిన రూసెన్‌వెల్ట్ మొదలుకొని తనవరకూ తన వంశీకులందరిని గురించీ వివరాలు సేకరించడంలో చాలా శ్రద్ధ చూపేవాడు. తన పూర్వీకులలో చాలామంది నావికాగ్రణులు వున్నారనీ, చాలామంది విప్లవకారులు వున్నారనీ అతడు పొంగిపోయే వాడు. అమెరికా స్వాతంత్ర్య యుద్ధంలో అతడి పూర్వీకులు అమెరికా పక్షం వహించారుగాని బ్రిటనుపక్షం వహించలేదు.

అయితే, రూజ్వెల్టుతరం వచ్చేదాకా అతడి పూర్వీకులలో ఎవరూ ప్రసిద్ధిని పొందలేదు. వారివంశం మంచివంశం అనిపించుకున్నదే గాని, గొప్ప కుటుంబం అని ప్రసిద్ధి పొందలేదు. సమీపంలోవున్న కుటుంబాలలో తప్ప ఎక్కువమంది అమెరికనులకు రూజ్వెల్టు కుటుంబం అని ఒకటి వున్నట్టుకూడా తెలియదు.

మూడువందల సంవత్సరాలు, అంటే ఆరు తరాలపాటు నివురు గప్పిన నిప్పులాగ యీ వంశం మరుగునపడి, ఏడోతరంలో, ఇరవయ్యో

శతాబ్దంలో ఒక్కసారిగా ప్రజ్వరిల్లి, ప్రపంచపు దృష్టిని మిరుమిట్లు గొల్పడం చరిత్రకారు లందరికీ ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఈ ప్రజ్వలన కూడా ఒక్క వ్యక్తివలన కాదు. మొదట తియొడోర్ రూజ్వెల్టు; తరువాత ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు.

అంతవరకూ ఈ వంశంలో విశేష ప్రజ్ఞను చూపినవాడు గాని, విశేషంగా అప్రతిష్ఠ పొందినవాడు గాని ఒక్క వ్యక్తీ లేడు. ఎవరో ఒక రిద్దరు లక్షాధికార్లన్న పేరు సంపాదించారు; కాని, ఒక్కడూ అడుక్కు తినలేదు. అందరూ గౌరవంగా తమ వృత్తిని చేసుకొని, మర్యాదగా కాలం గడిపినవారే.

# పితామహ శాఖ

ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు ముత్తాత ఐసాక్ రూజ్వెల్టు జాకొబస్ రూజ్వెల్టు కొడుకు. ఐసాక్ 1726 లో జన్మించాడు. 1794 లో మరణించాడు. రూజ్వెల్టు వంశీకులు దీర్ఘాయుష్కులు. ఐసాక్ న్యూయార్కులోని వాల్ స్ట్రీటులో నివసించేవాడు. అతడు సారాయి వ్యాపారంలో బాగా డబ్బు సంపాదించాడు. అమెరికా కాంగ్రెసులో చేరాడు. అమెరికన్ స్వాతంత్ర్య యుద్ధంలో అమెరికనులకు బాగా ధనసహాయం చేశాడు. న్యూయార్కు సెనెట్ లో సభ్యుడుగా వున్నాడు; న్యూయార్కురాష్ట్ర రాజ్యాంగ విధానాన్ని వ్రాయడంలో సహాయపడ్డాడు. న్యూయార్కులో మొట్టమొదట స్థాపించబడిన బ్యాంకికి వైస్ప్రెసిడెంటుగా వున్నాడు.

అతడికొడుకు జేమ్సు 1760 లో పుట్టాడు. ప్రిన్స్టటన్ కాలేజిలో చదివాడు. తరువాత, తండ్రిలాగనే బ్యాంకివ్యాపారంలో చేరాడు. మర్యాదస్తుడూ, పెద్దమనిషీ అనిపించుకొని, 87వ ఏట చనిపోయాడు. ఇతడి జీవితకాలంలో రూజ్వెల్టువంశంలో జరిగిన ఒక విశేషమైన మార్పు ఏమిటంటే, న్యూయార్కునుంచి కాపురం ఎత్తివేసి, హైడ్ పార్కులో కాపురం పెట్టిన రూజ్వెల్టు ఇతడే. జేమ్సును హడ్సన్ నదీ లోయ ఆకర్షించింది. న్యూయార్కులోని విశేషమైన భూవసతిని వదలి, అతడు హైడ్ పార్కులో కాపురం పెట్టాడు.

జేమ్సు పెద్దకొడుకు ఐసాక్. రూజ్వెల్టు 1790 లో పుట్టాడు. అతడుకూడా ప్రిన్స్టన్ కాలేజిలో చదివాడు. తరువాత వైద్యవృత్తికి చదివాడు. కాని, వైద్యుడుగా వృత్తిమాత్రం ఎప్పుడూ చెయ్యలేదు. దానికి కారణం, రోగుల బాధనుచూస్తే అతడు భరించలేక పోయేవాడట. ఏదో ఒక వ్యాపకం వుండటంకోసం అతడు వృక్షశాస్త్రం పట్ల ప్రత్యేక అభిమానం కలిగివుండే వాడు. అతడి కాలమంతా పెద్దమనిషిగా గడిచి పోయింది. అతడి కొడుకు జేమ్సు రూజ్వెల్టు, అమెరికా అధ్యక్షుడైన ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు తండ్రి.

ఈ శాఖ యిలా చిలవలు పలవలు వేస్తూవుంటే, థియొడోర్ రూజ్వెల్టు పితామహశాఖ కూడా దానంతట అదీ చిలవలు పలవలు వేసుకు పోయింది. ఈ శాఖకు మూల పురుషుడు, అసలు రూజ్వెల్టు వంశానికే మూలపురుషుడైన క్లేస్ రూసెన్ వెల్టు పెద్దకొడుకు జోహాన్స్ రూజ్వెల్టు. ఈ శాఖలోని వారంతా జాకొబస్ శాఖలోని వారిలాగ కాక, ఎక్కువగా న్యూయార్కు నగరంలోనే కాపురం వుండిపోయారు. ఏదో కొంతమందిమాత్రం లాంగ్ ఐలెండులో వుండేవారు. జాకొబస్ శాఖ రూజ్వెల్టులు డెమొక్రాటిక్ పక్షపు రాజకీయాలను అవలంబిస్తే, జోహాన్స్ శాఖ రూజ్వెల్టులు రిపబ్లికన్ పక్షంవారయారు. జాకొబస్ శాఖకంటె, జోహాన్సశాఖలో ప్రజ్ఞావంతులైన వ్యక్తులు కొంత ఎక్కువగా ఉద్భవించారు. ప్రసిద్ధిపొందిన దాత జేమ్స్ హెన్రీ రూజ్వెల్టు, నికొలస్ రూజ్వెల్టు అనే ఒక పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్త, నౌకాశాఖలో ప్రశంసనీయమైన ఉద్యోగ భారాన్ని నిర్వహించిన లాట్రోబ్ రూజ్వెల్టు, రచయిత, సంఘ సంస్కారిగా పేరుపొందిన రాబర్ట్ రూజ్వెల్టు – వీరంతా జోహాన్స్ శాఖలోనివారే.

## మాతామహ శాఖ

రూజ్వెల్టు మాతామహ వర్గం డిలానోలు. రూజ్వెల్టులో మాతామహ కుటుంబపు చాలికలు చాలావున్నాయి. కొన్ని గుణాలలో అతడు రూజ్వెల్టు వంశీయ దనడంకన్న డిలానో వంశీయ డనడమే సబబు

అనిపిస్తుంది కూడాను. తల్లి పోలికలూ, చాలికలూ కూడా అతడిలో చాలా ఎక్కువగా వున్నాయి. అంచేతనే, ఆమె అప్పుడప్పుడు "నా కొడుకు ఫ్రాంక్లిన్, రూజ్వెల్టు కాడు, డిలానో" అనేది.

అమెరికాకు వలసవచ్చిన డిలానో కుటుంబానికి మూలపురుషుడు ఫిలిప్ డి లా నోయ్. ఇతడు 1621 లో అమెరికాకు వచ్చాడు. ఈ వంశం ఫ్రెంచి, డచ్చివంశాల కలయికవల్ల ఏర్పడింది. ఫిలిప్ కొడుకు థామస్. తన భార్యతో వివాహానికి పూర్వమే సంభోగ కలాపం జరిపినందుకు అతడికి పదిపౌనులు జరిమానా విధింపబడింది.

ఫిలిప్ కొడుకులలో మరొకడు జోనాథన్. వారెన్ కుటుంబానికి చెందిన మెర్సీ అనే యువతిని వివాహం చేసుకున్నాడు. ఈ ఇరువుర సంతతే రూజ్వెల్టు తల్లికి పూర్వీకులు.

డిలానో వంశీకులకు నౌకావ్యాపారం విస్తారంగా వుండేది. చైనాతో ఎక్కువగా వ్యాపార సంబంధాలు వుండేవి. వారంతా చాలా ధనికులు.

1880 ప్రాంతంలో ఫ్రాంక్లిన్ డిలానో అనే యీ వంశీకుడొకడు లారా ఆస్టర్ అనే యువతిని పెండ్లాడాడు. వీరిద్దరికీ పిల్లలు కలుగలేదు. వీరికి చాలా ఆస్తి వుండేది. వారి ఆస్తిలో కొంతభాగం ఫ్రాంక్లిన్ సోదరుని కూతురు శారాకు సంక్రమించింది. ఈ శారాయే రూజ్వెల్టు తల్లి.

శారా డిలానో తండ్రిపేరు వారెన్ డిలానో. తల్లిపేరు కాథరిన్ రాబిన్స్ లేమన్. ఆమె 1854 లో జన్మించింది. ఆమెకు నలుగురు అక్కచెల్లెండ్లు వున్నారు. శారాతండ్రి చాలాకాలం దూరప్రాచ్యదేశంలో వున్నాడు. ఆమె పదోయేటికి పూర్వం, అతడు వ్యాపారంలో తన ఆస్తి అంతనూ పోగొట్టుకొన్నాడు. అప్పుడు తన కుటుంబం అందరినీ తీసుకొని హాంగ్ కాంగ్ వెళ్ళిపోయి, అక్కడ బాగా డబ్బు సంపాదించి తిరిగి అమెరికాకు చేరుకున్నాడు.

శారాకు ఆరుగురు అన్నదమ్ములు వున్నారు. తనకు కొంత ఆస్తిని యిచ్చిపోయిన తన పినతండ్రి ఫ్రాంక్లిన్ పేరునే తనకొడుకుకు పెట్టింది శారా. అంతకుపూర్వం ఫ్రాంక్లిన్ అనే పేరు రూజ్వెల్టు వంశీకులలో ఎవరికీ లేదు.

# తల్లిదండ్రులు

రూజ్వెల్టు తండ్రి జేమ్సు రూజ్వెల్టు; 1828 లో జన్మించాడు. జేమ్సు పాతకాలపు పల్లెటూరి మోతుబరిలాగ వుండేవాడు. అతడు తన హోదానుగురించి చాలా దంభం చూపేవాడు. రాజులతో సమానమైన హోదా గలవారు తప్ప, తక్కిన సామాన్యులు తన సమీపంలో వుండడానికి అనర్హులని భావించేవాడు. దానినిగురించి అతడి బంధువర్గంలో కొందరు అతడిని ఎగతాళి చేసేవారు కూడాను.

ఏమయినా జేమ్సు రూజ్వెల్టులో మంచి ప్రజ్ఞాచాతుర్యాలు వుండి వుండాలి. అప్రయోజకుడైన వ్యక్తి అయినట్లయితే, అసమాన బుద్ధిచాతుర్యమూ, అసాధారణ సౌందర్యమూ గల శారా డిలానో అతడిని పెండ్లాడేది కాదు. అతడి జీవితంకూడా మందకొడిగా జరగలేదు. అతడు హార్వర్డ్ లా కాలేజిలో చదువుకున్నాడు. యూరప్‌లో వున్నప్పుడు ఇటలీలోని గారిబాల్డి స్వచ్ఛంద సైనికదళంలోచేరి, ఇటలీ స్వాతంత్ర్యంకోసం యుద్ధం చేశాడు. తన ఆస్తిని అతడు చాలా జాగ్రత్తగా వృద్ధిచేశాడు. అతడు దాదాపు అరడజను కంపెనీలలో డైరెక్టరుగా వుండేవాడు. ఏడాదికొకసారి అతడు తనభార్యను తీసుకొని యూరప్ వెళ్ళేవాడు. యూరప్‌లోని అనేకదేశాల పెద్ద పెద్ద కుటుంబాలలో వీరికి మంచి స్థానం లభించేది.

జేమ్సు మొట్టమొదట రెబెక్కా బ్రయన్ హాలెండ్ అనే యువతిని 1853 లో వివాహం చేసుకున్నాడు. ఆమె 1876 లో చనిపోయింది. వారికి ఒకే ఒక కొడుకు, జేమ్సు రూజ్వెల్టు. రూజ్వెల్టు 1854 లో పుట్టాడు. అతడు ఫ్రాంక్లిన్ రూజ్వెల్టుకన్న 28 సంవత్సరాలు పెద్ద. అతడి జీవితమంతా అదొక గాథ. యూరప్‌లోని అమెరికన్ రాయబార కార్యాలయాలలో పనిచేసి, అన్నిచోట్లా ప్రసిద్ధిపొంది, తన 73 వ ఏట 1927 లో అతడు మరణించాడు. అతడికి తన సవతి తమ్ముడు ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు అంటే అత్యధికమైన ప్రేమ.

రెబెక్కా మరణానంతరం జేమ్సు కొన్నాళ్లు మళ్లీ పెళ్లిచేసుకోకుండా కాలంగడిపాడు. తరువాత తియొడోర్ రూజ్వెల్టూ, అతడి భార్యా

చేసిన ఒక విందుసందర్భంలో న్యూయార్కులో అతను శారా డిలానోను కలుసుకున్నాడు. అప్పటికి శారా డిలానోకు 26 ఏళ్ళు. కలుసుకున్న ముహూర్తంలోనే వీరిద్దరూ తాము జ్ఞాతులమని సంబంధం కలుపుకున్నారు. మరుక్షణంలో ఒకరినొకరు ప్రేమించుకున్నారు. వీరిద్దరికీ వివాహం 1880 అక్టోబరు 7 తేదీన జరిగింది.

తనకొడుకు ప్రెసిడెంటు పదవిని స్వీకరించగా చూడడానికి నోచుకున్న అమెరికన్ యువతి ఇప్పటివరకు శారా ఒక్కతే. వివాహం నాటికి ఆమెకు 26 ఏళ్ళయితే, ఆమెభర్తకు సరిగ్గా రెట్టింపు, 52 ఏళ్ళ వయస్సు. ఇద్దరిమధ్యా ఇన్ని సంవత్సరాల తేడా వున్నా వారిద్దరి కాపురమూ హాయిగా జరిగింది. అతను తన 72 ఏట 1900 లో చనిపోయాడు. అప్పటికి శారాకు 46 ఏళ్ళు. ఆమె అసాధారణ సౌందర్యము ఒక్కవన్నెకూడా తగ్గలేదు. అంతటి అందగత్తె అయినా, మంచి ధనికురాలయినా, నడి వయస్సులో వున్నా ఆమె ఎందుచేతనో కాని మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు.

జేమ్సు తన మరణశాసనంలో తనకొడుకు ఫ్రాంక్లిన్‌కు గార్డియన్‌గా భార్యనే నియమిస్తూ, అతడు తల్లి యిష్టప్రకారం నడుచుకోవడం తన అభిలాష అని కూడా వ్రాశాడు.

తండ్రి చనిపోయే టప్పటికి రూజ్వెల్టుకు పద్దెనిమి దేళ్ళు. తల్లి శారా తన సంపూర్ణదృష్టిని తనకొడుకుమీద పెట్టి, అతణ్ణి పెద్దవాణ్ణి చెయ్యడంలో ఎంతో తోడ్పడింది.

# రూజ్వెల్టు జననం

ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు జననాన్నిగురించి అతడి తండ్రి తన డైరీలో ఇలా వ్రాశాడు:—"1882 జనవరి 30. పావుతక్కువ తొమ్మిది గంటలకు నాభార్య ఒక చక్కని మగశిశువును కన్నది. ఆ బిడ్డ పదిపౌనుల బరువున్నాడు."

ప్రసవ సమయంలో క్లోరోఫారం ఎక్కువగా ఇవ్వడంవల్ల తనూ తన బిడ్డా ప్రాణాలు పోవలసిన ప్రమాదంలోపడి, బయటపడ్డామని రూజ్వెల్టు తల్లి చెప్పింది.

రూజ్వెల్టు పుట్టేటప్పటికి అతని తండ్రికి 54 ఏళ్లు. తండ్రి ఫలానా అని రూజ్వెల్టు తెలుసుకొనే టప్పటికి జేమ్సు ముసలివా డయాడన్నమాట. తన తండ్రిలో రూజ్వెల్టు ముసలితనపు లక్షణాలనే ప్రధానంగా చూశాడు. అందుచేత, చిన్నతనంనుంచీ అతనికి ముసలివాళ్ళంటే ఏవగింపు ఏర్పడి వుంటుంది. తండ్రిపట్ల కొడుకుకు వుండవలసిన గౌరవభావం తప్ప, రూజ్వెల్టుకు తన తండ్రిపట్ల ప్రత్యేక ప్రేమాభిమానాలు ఏమీ వున్నట్టు కినపడవు.

తుపాకి కాల్చడం, గుర్రపుస్వారి చెయ్యడం, పడవ నడపడం మొదలైన విద్యలను రూజ్వెల్టుకు నేర్పినవాడు అతడి తండ్రే. రూజ్వెల్టుకు తన తల్లి అంటే ప్రత్యేకప్రేమ వుండేది. అంచేత, తన తల్లిమీద పెత్తనం సాగించే తన తండ్రినిచూస్తే అతడికి భయభక్తులు విశేషంగా వున్నా అనురాగం మాత్రం ప్రత్యేకం వుండేది కాదు. కాని, తండ్రి కొడుకుల మధ్య ద్వేష భావాలు ఏవిధంగానూ, ఎప్పుడూ పుట్టలేదు.

రూజ్వెల్టు తల్లిని గురించి ఎప్పుడు ప్రస్తావనవచ్చినా, ఆమె అపురూప సౌందర్యవతి అనేమాట మాత్రం మళ్ళీమళ్ళీ చెప్పక తప్పదు. ఆమెముఖం తామరపద్మం లాగ వికాసంతో చాలా ప్రసన్నంగా వుండేది. ఆమెలో ఒక రాజఠీవి వుండేది. ఆమె వున్న స్థానం కళతో నిండిపోయేది. ఆమె అందాలరాణియే గాక, ఠీవిలోగూడా మహారాణులను ధిక్కరించేటట్టు వుండేది. ఆమె తనమాటకు ఎదురుమాటను సహించేదికాదు. తన మాట ప్రకారం అన్నీ జరుగుకొనేవి. అత్యంతమైన కారుణ్యాన్ని ఒలింకించే ఆమె చూపులు, అవసరమైనప్పుడు కాఠిన్యాన్నికూడా చూపగలిగేవి.

ఆమె ఎక్కడవున్నా ఆమెదే పైచేయి. తనకొడుకు అమెరికా అధ్యక్షుడుగా వున్నప్పుడు కూడా, వారి యింటిలో, ఆమె వచ్చినప్పుడలా, ఆమెదే పెత్తనం. భోజనాలవేళ బల్లదగ్గర అతిథులు కూర్చుంటే, ప్రధాన స్థానంలో ఇంటి యజమాని రూజ్వెల్టుకు కాక అతడి తల్లి శారా కూర్చునేది. అంటే, ఆమె ఎక్కడవుంటే అక్కడ యజమానిత్వం ఆమెదే.

డబ్బు విషయంలో శారా కొంచెం పిసినిగొట్టు. తన ఆస్తినంతనూ చెక్కుచెదరకుండా తన కొడుకుకు అప్పజెప్పి పోవాలని ఆమెకోరిక.

ఆమెకు తన తండ్రిద్వారా 13,38,000 డాలర్ల ఆస్తి వచ్చింది. ఆ డబ్బు పెట్టుబడిమీదవచ్చే వడ్డీని ఖర్చుపెట్టడానికి ఆమె సంకోచించేది కాదు. కాని, అసలు మూలధనంలో ఒకి కానీ ముట్టుకోవడం అంటే ఆమె సహించలేక పోయేది. ఆమె షాపులలో కొన్న వస్తువులకు బిల్లులు చెల్లించవలసి వచ్చేసరికి చాలా తాత్సారం చేసేది. అదేగుణం రూజ్వెల్టుకు కూడా పట్టుబడింది.

తనకాలంలో వుండే అధికార దర్పాలు క్రమక్రమంగా తగ్గిపోతూ వుండటం ఆమె ముసలి వయసేసరికి ఆమె కళ్లారా చూస్తూనే వుంది. కాని, అలా జరుగుతోందని విశ్వసించడానికి మాత్రం ఆమెమనసు ఒప్పుకొనేది కాదు. 1939 లో ఆమె సోదరి ఒకామె అమెరికాకు తిరిగి రావడానికి ప్రయాణ సదుపాయం లేక యూరప్‌లో కొన్నాళ్ళు ఆగిపోవలసి వచ్చింది. అప్పుడు శారా, ప్రెసిడెంటుగావున్న తనకొడుకు దగ్గరకువచ్చి ప్రభుత్వపు యుద్ధనౌకలలో ఒకదానిని యూరప్‌కు పంపి తన చెల్లెలిని అమెరికా వచ్చేటట్టు చెయ్యవలసిందని అడిగింది. అలా చెయ్యడానికి తనకు అధికారం లేదని రూజ్వెల్టు చెపితే, ఆమెకు చాలా ఆశ్చర్యమూ, కోపమూ కలిగాయి. పట్టుదల అనేది ఆమెకు వంశపారంపర్యా వచ్చిన గుణం. ఈ గుణం ఆమె అక్కచెల్లెండ్రందరికీ వుండేది. వారంతా కూడా, రాజకీయాలలో రూజ్వెల్టుకు వ్యతిరేక పక్షంవారు. అన్ని ఎన్నికలలోనూ వారు రూజ్వెల్టుకు ప్రతికూలంగానే ఓటు చేశారు.

ఆమె అందవికారాలనూ, బుద్ధి వికారాలనూ, చేష్టావికారాలనూ ఎంతమాత్రమూ సహించేది కాదు. రూజ్వెల్టుతో పనివుండి హైడ్ పార్కుకు వచ్చే రాజకీయవాదులలో చాలామంది వికారచేష్టలను ఆమె సహించేది కాదు. ఆమె మనసులోవున్న మాటను, ఎదుటివారి మనస్సుకు కష్టం కలుగుతుందేమో అని సందేహించకుండా స్పష్టంగా అనేసేది. ఒకసారి ఒక ప్రముఖవ్యక్తికి రూజ్వెల్టు విందుచేశాడు. ఆ వ్యక్తి రూజ్వెల్టుప్రక్కనే కూచున్నాడు. అదిచూసి ఆమె అందరూ వినేటట్టుగా 'నాకొడుకు ప్రక్కన కూచున్న ఆ దారుణమైన మనిషి ఎవరు' అని అడిగివేసింది. తన కోడలు ఎలియనార్ తమ ఇంటికి తీసుకువచ్చే కొంతమంది వ్యక్తు లంటే

ఆమెను ఎంతమాత్రం కిట్టేదికాదు. "ఈ మనుషులంతా దీని కెక్కడ దొరుకుతారో" అనివిసుక్కునేది.

ఒకసారి రాజకీయవర్గపు నాయకులు కొందరు హైడ్ పార్కు భవనపు వరండాలో ఏదో ముఖ్యమైన విషయాలు మాట్లాడుకోడానికి గుంపు చేరారు. అదిచూసి వాళ్ళందరూ వినేటట్టుగా "వాళ్ళనిచూడు, బంతి పోటు మూకలాగ వున్నారు" అంది, ఆమె.

రూజ్వెల్టు తల్లికి గల ఆత్మవిశ్వాసం చాలా పరిగణనీయమైనది. రూజ్వెల్టు మొదటిసారి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినప్పుడు 1932 లో ఆమెను "నీ కొడుకు అధ్యక్షు డయినప్పుడు నీకు ఆశ్చర్యం కలగలేదా?" అని ఒకరు అడిగారు. "ఎంతమాత్రమూ ఆశ్చర్యం కలగలేదు. మొదటి నుంచీ నేను నా కొడుకు అధ్యక్షుడు కావడంకోసమే ఏర్పాట్లు చేస్తూ వచ్చాను" అని జవాబు చెప్పింది ఆమె.

ఆమె మనుమలూ, మనుమరాండ్రూ ఇంటికి యజమానురాలు ఆమె అనే అనుకొనేవారు. తన మనుమల్నీ, మనుమరాళ్ళనీ ఆమె చాలా ముద్దు చేసేది. కాని, అవసరంవచ్చినప్పుడు వాళ్ళని చాలా కఠినంగా మందలించేది కూడా. మంచి మాటలతో ఆమెను లాలన చేసినట్లయితే వాళ్ళకి కావలసినవన్నీ ఇచ్చేది.

రూజ్వెల్టు పెద్దవాడయినా, ప్రెసిడెంటు అయినా ఆమె అతణ్ణి ఒక చిన్నకుర్రాణ్ణి చూసినట్టు చూసేది. అతడు హార్వర్డు యూనివర్శిటీలో చదవడానికి వెళ్ళినప్పుడు అతడికి దగ్గరగా వుండటం కోసమని ఆమె బోస్టన్‌లో ఒక యిల్లు తీసుకొని అక్కడ వుండేది. అతడు తన 46 వ ఏట న్యూయార్కు గవర్నరైనప్పుడు "ఫ్రాంక్లిన్ పెద్దవాడయాడు గవర్నరయాడు" అంది. తనకొడుకు మంచిచెడ్డలను గమనించడంలో ఆమె శ్రద్ధనుగురించి హైడ్ పార్కుకు వచ్చి పోయే బంధు మిత్రులంతా తలా వొక కథా చెపుతూనే వుంటారు.

తనకొడుకుకు 56 ఏళ్ళ వయస్సువచ్చినా, తన 82 వ ఏట ఒకసారి ఆమె ఒక పత్రికా విలేఖరితో ఇలా చెప్పింది: "రేపు ఫ్రాంక్లిన్‌ను చర్చికి వెళ్ళనియ్యను. వాడు చాలా ఉత్తరాలను చదువుకోకుండా వదిలేశాడు. అవన్నీ రేపు చూసుకో మంటాను!"

కొన్నికొన్ని విషయాలలో రూజ్వెల్టు తన తల్లినిచూస్తే విసుక్కునేవాడు. మామూలుగా రూజ్వెల్టు మద్య పానీయాలను స్వల్పంగానే త్రాగేవాడు. కాని, వాటిని అతడు అసలు ముట్టుకోకూడదని ఆమె పట్టుపట్టేది. పక్షవాతంవచ్చి, మళ్ళీ కోలుకొనేటప్పుడు అప్పుడప్పుడు ఆమెకు తెలియకుండా ఒక చుక్క వేసుకోడానికని ఒక చిన్న సీసాలో కొంచెం మద్యం పోసుకొని రూజ్వెల్టు ఆ సీసాను తన పరుపు మడతలలో దాచుకొనేవాడు.

ఒకసారి భోజనాల దగ్గిర రూజ్వెల్టు చిన్నకొడుకు జాన్ ఒక అశ్లీలపు మాటను ఉపయోగించాడు. సారాకు చాలా కోపం వచ్చింది. కాని, మాట్లాడకుండా తన కోపాన్ని దిగమ్రింగి ఊరుకుంది. తరువాత కొన్నాళ్లకు అదేమాటను రూజ్వెల్టు వుపయోగించాడు. అప్పుడామె ఊరుకోలేక పోయింది. "జాన్ తన భాషను గుర్రాల చావిడిలో నేర్చుకుంటున్నాడు. వాడి దగ్గర నుంచి, ఆ భాషను తండ్రి నేర్చుకుంటున్నాడు" అనేసింది ఆమె. అప్పుడు రూజ్వెల్టు చాలా చిన్నబుచ్చుకొని మహాకోపం తెచ్చుకుని బాధపడ్డాడు.

రూజ్వెల్టును తనవాడిగా చేసుకుందామని అటు తల్లికీ, భార్యకూ మధ్య విపరీతమైన అంతరంగిక పోరాటం జరిగింది. రూజ్వెల్టు తన తల్లిచేతిలో నుంచి బయటపడలేక పోయాడు. పక్షవాతపు జబ్బు వచ్చినప్పుడు భార్యది పైచెయ్యి అయి క్రమంగా రూజ్వెల్టు తన తల్లి పెత్తనంలోనుంచి చాలావరకూ బైటపడ్డాడు.

1941 సెప్టెంబరు నెలలో బెర్నార్డ్ బరూచ్ అనే మిత్రుడొకడు రూజ్వెల్టును చూడడానికి వచ్చి సారాను గురించి ప్రస్తావిస్తూ, "ముసలిదయిపోయింది. ముసలితనంలో ఆమెనుగురించి అందరూ తాపత్రయ పడుతున్నారని తెలిస్తే, ఆమె కొంత సంతోషిస్తుంది" అని చెప్పాడు. రూజ్వెల్టు వెంటనే టెలిఫోనులో హైడ్ పార్కులో వున్న తల్లితో చాలాసేపు మాట్లాడాడు. తరువాత కొన్నిరోజులకు ఆమె చనిపోయింది. అప్పటికి ఆమెకు 86 ఏళ్ల వయస్సు. అంటే, భర్త మరణానంతరం ఆమె 41 సంవత్సరాలు జీవించిందన్న మాట.

# యౌవన ప్రాదుర్భావం

రూజ్వెల్టు చిన్నతనం చాలాహాయిగా గడిచిపోయింది. అనేకమంది బాలురను బాధపెట్టే కష్టాలు ఏవీకూడా అతనిజోలికి రాలేదు. ఇంటిలో అతనికి అసౌఖ్యంలేదు; బయటినుంచి కలిగే బాధలేదు. ఇంటిలో అత డెప్పుడూ కఠినమైన శిక్షలను పొందలేదు. అందుచేతనే, అతడికి ఆత్మ విశ్వాసం ఎక్కువగా కలిగింది. అయితే, విమర్శనలను సహించలేక పోవడానికి కూడా బహుశా అదే కారణమై వుంటుంది.

చిన్నప్పుడు ఇంటిలో అతడు ఒంటరిగానే పెరిగాడు. ఆడుకోడానికి ఎక్కువమంది స్నేహితులు వుండేవారు కారు. పధ్నాలుగేళ్లు వచ్చినదాకా అతడు స్కూలుకు వెళ్ళలేదు. ఇంట్లోనే, ప్రైవేటుగా చదువు చెప్పించారు. చిన్నప్పటినుంచీ అతడికి పెత్తనం చెయ్యడం అలవాటు. తనతోటి పిల్లల మీద అతడు అస్తమానూ అధికారం చెలాయించడం చూసి, అతడి తల్లి ఒకసారి "అస్తమానూ వాళ్ళమీద నువ్వే పెత్తనం చెయ్యకూడదు. వాళ్లకి కూడా పెత్తనం చెయ్యడానికి కాస్త సందు వొదలాలి" అని చెప్పిందట. దానికి రూజ్వెల్టు "అమ్మా నేను పెత్తనం పెట్టుకొని వాళ్లకి ఆజ్ఞలు ఇస్తేనేకాని ఒక్కపనీ జరగదు" అని జవాబు చెప్పాడట.

రూజ్వెల్టు నాలుగైదేళ్ళ బాలుడుగా వుండగా, అతడి తండ్రి అతణ్ణి వెంటబెట్టుకొని అప్పుడు అమెరికా ప్రెసిడెంటుగా వున్న క్లీవ్‌లాండును చూడడానికి వెళ్లాడట. పదవీభారంలో కొట్టుకుంటున్న ఆ ప్రెసిడెంటు రూజ్వెల్టుకు ఆశీర్వాదంయిస్తూ "నాయనా నీకు నేను కోరేది ఒక్కటే. ఎప్పుడూ అమెరికాకు అధ్యక్షుడివిగా అయ్యే అవస్థ నీకు పట్టకుండుగాక అని" అన్నాడట.

ఒకసారి రూజ్వెల్టు చిన్నతనంలో బయట ఆడుకుంటూ వున్నవాడు గబగబ యింటిలోకి వచ్చాడట. అప్పుడు తల్లి అతణ్ణిచూసి ఏమిటని అడిగిందట. "బయట తోటలో ఒకమంచి పక్షినిచూశాను దాన్ని కొట్టాలి. తుపాకికోసం వచ్చాను" అని జవాబు చెప్పాడట. అప్పు డామె నవ్వి,

"నువ్వు తుపాకి వెతుక్కుని మళ్లీ అక్కడికి వెళ్లినదాకా ఆ పక్షి అక్కడే నీకోసం కనిపెట్టుకుని వుంటుందా" అని అంటే, "తప్పకుండా కనిపెట్టుకొని వుంటుందమ్మా" అని జవాబు చెప్పాడట. ఇలాంటి కథలన్నీ చిన్నప్పటినుంచీ అతడికిగల ఆత్మవిశ్వాసాన్ని వ్యక్తపరుస్తాయి.

అతడు చిన్నప్పుడు ఎక్కువగా చదివేవాడు కాదు. అతడి బుద్ధి వికాసంకూడా క్రమక్రమంగా పెంపొందింది. ఒకసారి అతడు ఒక నిఘంటువును మొదటినుంచి చివరదాకా శ్రద్ధగా చదివాడట. అప్పుడు తల్లి 'అదేమి చదువురా?' అని అడిగితే, 'నిఘంటువు చదవడానికి చాలా బాగుందమ్మా' అని జవాబు చెప్పాడట.

చిన్నతనంలో రూజ్వెల్టు చాలా ఎక్కువగా ప్రయాణాలు చేశాడు. తన ఏడోయేడు మొదలు, పదిహేనో ఏడువరకూ ప్రతి సంవత్సరమూ అతడు తన తల్లిదండ్రులతో యూరప్‌కు వెళ్ళి వచ్చేవాడు. జర్మనీలో అతడి తండ్రి కొన్నాళ్ళు వైద్యంకోసం వున్నప్పుడు అతడు జర్మన్ స్కూలులో ఒక దానిలో కొన్నాళ్ళు చదివాడు కూడాను.

ఒకరోజున రూజ్వెల్టూ, అతడిమేస్త్రరూ కలిసి ఒక అడవిలో సైకిళ్ళ మీద సంచారంచేస్తూ ఒక బాతుమీదనుంచి సైకిలు పోనిచ్చినందుకూ, తోటలోని పళ్లను ఏరుకు తిన్నందుకూ, రైలుస్టేషనులో సైకిళ్లను పెట్టినందుకూ, చీకటిపడ్డ తరువాత సైకిలుమీద ఎక్కినందుకూ నాలుగుసార్లు పోలీసులచేత అరెస్టు చేయబడ్డారట. జర్మను పోలీసు పద్ధతినిగురించీ, జర్మను ప్రజల స్వభావాన్నిగురించీ, అతడి అభిప్రాయాలు చిన్నతనంనుంచీ స్పష్టంగా ఏర్పడి పోవడానికి ఇలాంటి సంఘటనలూ, జర్మనీలో తను వున్నప్పుడు అతడుచూసిన దృశ్యాలూ చాలావరకూ కారణం అని చెప్పవచ్చును.

హైడ్‌పార్కులో నివాసపు వాతావరణంనుంచి రూజ్వెల్టు తన 14 వ ఏట బయటపడ్డాడు. అదే అతడు మొట్టమొదట స్కూలుకు వెళ్ళడం. పధ్నాలుగేళ్ళవరకూ ఒకేప్రాంతంలో నివసించడంవల్ల ఆ ప్రాంతపు వాతావరణం ఎప్పుడూ అతడిచుట్టూ వుంటూనే వచ్చింది.

# గ్రోటన్ స్కూలు

రూజ్వెల్టు మొట్టమొదట చదివిన స్కూలు గ్రోటన్ స్కూలు. ఆ కాలంలో అది అంత పెద్ద స్కూలు కాదు. రూజ్వెల్టు అక్కడ చదవడానికి వెళ్ళేటప్పటికి అది స్థాపింపబడి పన్నెండు సంవత్సరాలు మాత్రమే అయింది. దానిలో ఆరు తరగతులు వుండేవి. తరగతికి పాతికమంది చొప్పున మొత్తం 150 మంది విద్యార్థులు దానిలో చదువుకునేవారు. విద్యార్థులందరూకూడా స్కూలు హాస్టలులోనే బస. రూజ్వెల్టు చదువుకొనే రోజులలో ఒక విద్యార్థి చెల్లించవలసిన జీతం ఏడాదికి 500 డాలర్లు వుండేది. ఇప్పుడు 1,500 డాలర్లు వసూలు చేస్తున్నారు.

గ్రోటన్ స్కూలుకు కొన్ని ప్రత్యేక సాంప్రదాయాలు వుండేవి. అది ఎక్కువగా బ్రిటిషుతత్వాన్ని బోధించేది. క్రైస్తవ మతంకోసం ప్రచారం చెయ్యడం, విద్యార్థులకు సత్ప్రవర్తనను అలవరచడం, వారికి శరీర వ్యాయామం ఎక్కువగా ఇచ్చి దృఢకాయులనుగా తయారు చెయ్యడం ఆ స్కూలు ఆశయాలుగా వుండేవి. ఇప్పుడిప్పుడు ఆ స్కూలులో పేద పిల్లలకు విద్యార్థి వేతనాలు ఇచ్చి చేర్చుకోవడం జరుగుతున్నది. కాని, రూజ్వెల్టు చదివిన కాలంలో ఘరానా కుటుంబాలకు చెందిన బాలురను తప్ప ఆ స్కూలులో చేర్చుకొనేవారు కారు.

గ్రోటన్ స్కూలుకు ఆ రోజులలో ఖ్యాతిని తెచ్చిపెట్టింది ఆ స్కూలు హెడ్ మాస్టరు రెవరెండ్ డాక్టర్ ఎండికాట్ పీబాడీ. ఆయనే ఆ స్కూలును స్థాపించాడు. తన 86 వ ఏట ఉద్యోగంనుంచి విరమించేదాకా ఆయనే దానిని 56 సంవత్సరాలు నడిపాడు. ఆయన చాలా నియమబద్ధుడు. విద్యార్థులంతా ఆయన పేరు చెపితే అత్యంత భయభక్తులను ప్రదర్శించేవారు. దేవుడి తరువాత ఆయన అత్యంత గౌరవం చూపేది ప్రజాసేవకు. ప్రజాసేవలో పాల్గొని మనదృష్టవంతులను బాగు చెయ్యడానికి కృషి చెయ్యడం అదృష్టవంతుల విధి అని ఆయన ప్రతిరోజూ విడువకుండా తన విద్యార్థులకు బోధ చేసేవాడు. చాలావరకూ ఈ బోధలన్నీ రూజ్వెల్టు మనస్సులో హత్తుకొని పోయాయి. రూజ్వెల్టు స్వభావం, పెద్దవాడయే లోపల పొందిన రూపానికి పీబాడీ బోధనలుకూడా చాలా

వరకు కారణమే. అమెరికా రాజకీయ రంగంలో ప్రసిద్ధిపొందిన వారిలో చాలామంది గ్రోటన్ స్కూలులో చదివినవారే. సమ్నర్ వెల్స్, డీన్ ఏచిసన్, ఎవరెల్ హారిమన్, న్యూబోల్డ్ మారిస్, ఫ్రాన్సిస్ బిడ్డిల్ మొదలుగా అనేకమందిని యీ స్కూలు విద్యార్థులలో ఏకరువు పెట్టవచ్చును.

రూజ్వెల్టు చదువుకున్న నాటికీ, ఇప్పటికీ ఆ స్కూలులోని పద్ధతు లేమీ ఎక్కువగా మారలేదు. ఆ రోజులలో విద్యార్థులు ఉదయం ఏడు గంటలలోపల నిద్రలేచి తీరవలసిందే. ప్రతిరోజూ తప్పనిసరిగా చన్నీళ్ళ స్నానం చెయ్యవలసిందే. అందరూ తలుపులులేని మందువాలో పడుకో వలసిందే. పాఠాలు చదివినంత శ్రద్ధగా వ్యాయామ క్రీడలలో పాల్గొన వలసిందే. వాళ్ళు చదువుకుంటూ వున్నంతసేపూ, ఒక ఉపాధ్యాయుడు వాళ్ళకు కాపలా వుండేవాడు. భాగ్యవంతుల పిల్లలను కఠినమైన క్రమ శిక్షణలో సాంప్రదాయ బద్ధులనుగా తయారు చెయ్యడమే ఆ స్కూలు ప్రధానాశయంగా వుండేది.

రూజ్వెల్టు మాత్రం గ్రోటన్ స్కూలును అభిమానించలేక పోయాడు. అలాగే, ఆ స్కూలుకూడా రూజ్వెల్టును ప్రత్యేకం అభిమా నించలేదు. స్కూలులో వుండగా అతడు ప్రత్యేక ప్రతిభను ఏమీ కనపరిచ లేదు. ఆ స్కూలులో ఎక్కువ ప్రతిభచూపిన బాలుర పెద్దవాళ్ళయిన తరువాత ఏమీ పేరు ప్రతిష్ఠలను పొందలేదు. రూజ్వెల్టు ఆ స్కూలులో మూడవ ఫారంలో చేరాడు. ఆ క్లాసులో వుండవలసిన వయస్సుకంటె, అతడికి అప్పటికి రెండేళ్ళు ఎక్కువ. అతడితోపాటు, మరొక 21 మంది బాలురు ఆ క్లాసులో వుండేవారు. వారిలో చాలా కొద్దిమంది మాత్రమే పెద్దవాళ్ళయిన తరువాత కొద్దిగా పేరు తెచ్చుకున్నారు. విద్యార్థులుగా వున్నప్పుడు ఆ స్కూలులో చదువును ఏవగించుకున్న బాలురంతా పెద్ద వాళ్ళయిన తరువాత బాగా పైకివచ్చారు.

రూజ్వెల్టును ఆ స్కూలులో ఎవరూ ఏవగించలేదు. కాని, అతడి పట్ల ఎవరూ శ్రద్ధచూపినట్టుగాని, రూజ్వెల్టు అంటూ ఒక బాలుడు వున్నా డని ఎవరూ ఎక్కువగా గమనించినట్టుగాని ఏమీ కనపడదు. ఒక విశేషం

ఏమిటంటే, ఆ రోజులలో ఆ స్కూలులోని బాలురలో డెమొక్రాట్ పక్షపు కుటుంబానికి చెందిన బాలుడు రూజ్వెల్టు ఒక్కడే.

గ్రోటన్ స్కూలులో చదువుతున్న రోజులలో అక్కడ వున్నన్నాళ్ళూ తాను అదొక అయోమయపు ప్రపంచంలో వున్నట్టుగా వుందని రూజ్వెల్టు తన సహాధ్యాయుడు ఒకడికి చాలాసంవత్సరాల తరువాత చెప్పాడు. ఆ నాటి అతడి సహాధ్యాయులను అడిగితే అతడిని గురించి "మంచివాడే గాని, అతడిలో ప్రత్యేకప్రజ్ఞ ఏమీ కనిపించలేదు" అంటారు.

మొట్టమొదటి సంవత్సరం చదువు అయిన తరువాత స్కూలులో అతడి చదువు ప్రవర్తనలను గురించి వ్రాసే రిపోర్టులో హెడ్‌మాస్టర్ పీబాడీ ఇలా వ్రాశాడు: "మంచివాడు. తెలివితేటలుగల బుద్ధిమంతుడి లాగ నాకు అతడు కన్పిస్తున్నాడు." అతడు స్కూలులో చదివిన రోజులలో మొదటి మూడు సంవత్సరాలు వరసగా అతను ప్రజ్ఞ చూపినది దేనిలో అంటే, , వేళకు సరిగా క్లాసుకు హాజరవడంలో. వేళకు సరిగా హాజరైనందుకు ఇచ్చే బహుమతిని మొదటి మూడుసంవత్సరాలూ అతడే సంపాదించాడు.

ఆ స్కూలులో వున్నరోజులలో మొత్తం మూడుసార్లు అతడు ఉపన్యాసపు పోటీలలో పాల్గొన్నాడు. యునైటెడ్ స్టేట్సుకి వలసవచ్చే వారి సంఖ్యను ఒక నిర్ణీతసంఖ్యలో నిర్ణయించే పద్ధతికీ, హవాయీని యునైటెడ్ స్టేట్సులో కలిపివేసుకోవాలనే ప్రతిపాదనకు వ్యతిరేకం గానూ, ఫిలిప్పైన్స్ దీవులకు స్వాతంత్ర్యాన్ని ఇవ్వాలనే ప్రతిపాదనకు అనుకూలంగానూ అతడు వాదించాడట. దీనినిబట్టి, చిన్నతనంనుంచీ అతడికి విశాల రాజకీయ భావాలు వున్నట్టు స్పష్టపడుతుంది.

గ్రోటన్‌లో చదువు పూర్తి అయే చివరిరోజులలో అతడి రాజకీయ భావాలు మరీ విశాల పరిణామం పొందాయి. నీగ్రోలకు యునైటెడ్ స్టేట్సులోని దక్షిణ రాష్ట్రాలలో సరియైన విద్యా సౌకర్యాలు లేవని ప్రభుత్వాన్ని నిందిస్తూ ఒక నీగ్రో ఉపన్యసిస్తూ వుంటే, దానిని వినడానికి రూజ్వెల్టు వెళ్లాడు. దక్షిణాఫ్రికాలో బ్రిటిషు వారిపై తిరుగుబాటు చేసిన బోయర్ల స్వాతంత్ర్యయుద్ధం పట్ల అభిమానం చూపించి, బోయర్లకు సహాయం చెయ్యడానికి కొంత నిధినికూడా పోగుచేశాడు. అమెరికాను,

స్పెయినుకు యుద్ధం వచ్చినప్పుడు రహస్యంగా పారిపోయి యుద్ధంలో పాల్గొందామని ఎత్తువేశాడు గాని, హఠాత్తుగా ఆటలమ్మ పొయ్యడంవల్ల ఆ ప్రయత్నానికి విఘాతం కలిగింది.

గ్రోటన్ హెడ్‌మాష్టరు పీబాడీ రూజ్వెల్టు ప్రవర్తనకూ, స్వభావానికీ పునాదులు వేసిన వారిలో ఒకడు. తనతల్లి తరువాత, రూజ్వెల్టు చూపిన అత్యంత సామర్థ్యమూ, అధికార విజృంభణమూగల వ్యక్తి డాక్టర్ పీబాడీ. ఆ హెడ్‌మాష్టర్ రూజ్వెల్టు మానసిక ప్రవృత్తిని రూపొందించిన బాధ్యతలో చాలాభాగం పంచుకున్నాడు. ఆ హెడ్‌మాష్టరు బ్రతికి వున్నన్నాళ్లూ రూజ్వెల్టు ఆయనతో చాలా దృఢ స్నేహ సంబంధాలను నెరపాడు. రూజ్వెల్టు పెళ్లికి పౌరోహిత్యం చేసినవాడు డాక్టర్ పీబాడీయే. ప్రతి సంవత్సరమూ ఉగాది పండుగకు డాక్టర్ పీబాడీ హైడ్‌పార్కులో ఆతిథ్యం పొందేవాడు. రూజ్వెల్టు అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన ప్రతిసారీ అతడు పదవీ స్వీకరణ చేసినప్పుడు అక్కడ పౌరోహిత్యం పీబాడీదే. ఆ హెడ్‌మాష్టరు పట్ల రూజ్వెల్టు చూపిన యీ ఆదరణానురాగాలకు కారణం కేవలం "మంచి ముసలివాడు గనుక అతణ్ణి ఆహ్వానిద్దాం" అనే ధోరణి కాదు. ఆ వృద్ధ ఉపాధ్యాయుని పట్ల రూజ్వెల్టుకు గల విశేష భక్తి, గౌరవాలే దానికి కారణం.

ప్రతి సంవత్సమూ రూజ్వెల్టు జన్మదినంనాడు రూజ్వెల్టుకు అభినందిస్తూ డాక్టర్ పీబాడీ పంపిన జన్మదిన శుభాకాంక్షల లేఖలను—43 సంవత్సరాల వాటిని—రూజ్వెల్టు చాలా భద్రంగా దాచిపెట్టుకున్నాడు.

కాని, గ్రోటన్‌స్కూలు ఏ పద్ధతులను, ఏ సాంప్రదాయాలను అవిచ్ఛిన్నంగా, శాశ్వతంగా వుంచడానికి తన విద్యావిధానాన్ని తయారు చేసిందో, ఆ పద్ధతులను, ఆ సాంప్రదాయాలను రూజ్వెల్టు సంపూర్ణంగా అంతమొందించి, నూతన సాంఘిక వ్యవస్థను స్థాపించడానికి తన రాజకీయ జీవితంలో కృషిచేసి నప్పుడు హెడ్‌మాష్టరు పీబాడీ మానసికంగా ఏ భావాలతో కొట్టుకు లాడేవాడో గాని, రూజ్వెల్టును ఎవరు నిందించినా పీబాడీ ఏమాత్రం సహించేవాడు కాదు. రూజ్వెల్టు ప్రవర్తనను సంపూర్ణంగా సమర్థించేవాడు. పీబాడీ తన అంత్యకాలంలో కూడా రూజ్వెల్టును గురించి మాట్లాడుతూ "రూజ్వెల్టు చాలా చిత్తశుద్ధిగలవాడు," అని అన్నాడు.

# హార్వర్డ్, కేంబ్రిడ్జి

గ్రోటన్ స్కూలునుంచి హార్వర్డ్ కాలేజికి రూజ్వెల్టు 1900 సంవత్సరంలో వెళ్లాడు. హార్వర్డ్‌లోవున్న నాలుగేళ్లూ అతడు చాలా హాయిగా వున్నాడు. నాలుగు సంవత్సరాలలో పూర్తిచేయవలసిన పాఠాలను మూడేళ్ళలోనే పూర్తిచేసి, నాలుగో సంవత్సరం ఊరికే ఆ కాలేజిలో గడిపాడు. గ్రోటన్ స్కూలులో చదువు బాగా చెప్పడంవల్ల, కాలేజికి వెళ్ళిన కుర్రవాళ్ళంతా అక్కడ తమ పాఠాలలో చాలా చురుకు చూపించి, ఒక ఏడాది చదువును తగ్గించుకోవడం ఆ రోజులలో మామూలే.

కాలేజిలో చదివిన రోజులలో కూడా తక్కినపిల్లలతో రూజ్వెల్టు ఎక్కువగా కలిసి మెలిసి తిరిగేవాడు కాదని అతడి సహాధ్యాయులు చెపుతారు. తానొక అధికుణ్ణని అనుకోవడం, ఎవరైనా ఏమైనా అంటే అతి సులభంగా ఆగ్రహం తెచ్చుకోవడం, అందరిచేతా మంచివా డనిపించు కోవడం, రెండు కక్షలకు చెందిన విద్యార్థులతో కలిసిపోవడానికి ప్రయత్నించడం అతడి స్వభావమట. రూజ్వెల్టు ఆ రోజులలో తనక్లాసు కమిటీకి అధ్యక్షుడుగా ఎన్నుకో బడినాడు. ఇది చాలా పెద్ద గౌరవమట. కాలేజి పత్రికకు అతడు సంపాదకుడుగాను, ప్రెసిడెంటుగాను వుండేవాడు. తన సంపాదకీయ వ్యాసాలలో విద్యార్థులు తమ కాలేజి ఎన్నికలలో అసభ్యమైన ప్రవర్తనను చూపకూడదని తీవ్రంగా ప్రచారం చేశాడు.

కాలేజిలో వున్న న్నాళ్ళూ అతడు ఆ చుట్టుప్రక్కల వున్న ప్రముఖ క్లబ్బులన్నిటిలోనూ సభ్యత్వాన్ని సంపాదించాడు.

కాలేజి ఆఖరు సంవత్సరానికి ముందువచ్చే ఎండాకాలపు సెలవులలో అతడు ఒక మిత్రుడితో యూరప్ వెళ్ళి, లండను ఇంటర్లేకన్‌లలో కొంతకాలం గడిపాడు. హార్వర్డ్ తరువాత కొన్నాళ్లు కేంబ్రిడ్జిలో చదివాడు.

# ఎలియనార్ - కల్యాణం

హార్వర్డ్‌లో చదువుతూ వుండగానే రూజ్వెల్టుకు యాపత్ప్రేష్టత ప్రారంభమైంది. అంతేకాదు, అతడి జీవితంలో మరొక నూతన అధ్యాయం ప్రారంభమైంది. అది అతడి సహభాగినితో పరిచయం. ఆమె ఎలియనార్.

రూజ్వెల్టు జీవితంలో 1905 మార్చి 17 తేదీ ఒక దివ్యదినం. ఆనాడు అతడు ఎలియనార్ రూజ్వెల్టును వివాహం చేసుకున్నాడు. తల్లి దండ్రులు లేని, తన జ్ఞాతి అయిన 21 ఏళ్ల ఎలియనార్‌ను పెళ్లి చేసుకోవడంవల్ల రూజ్వెల్టు నిజంగా అదృష్టవంతుడే. ఎలియనార్ పినతండ్రి ప్రెసిడెంట్ థియొడోర్ రూజ్వెల్టు కన్యాదానం చేశాడు. పెళ్ళికివచ్చిన అతిథులంతా ప్రెసిడెంటు థియొడోర్ చుట్టూ మూగడంలో అసలు పెళ్లికూతుర్నీ, పెళ్లికొడుకునూ అభినందించడంకూడా మరచిపోయారు.

అధ్యక్షుడు కన్యాదాతగా వున్న ఆ కల్యాణాన్ని చూడడానికి వచ్చిన అసంఖ్యాక జనంతో నిండిపోయిన ఆ వీధిలో జనసమ్మర్దాన్ని సర్దడానికి 75 మంది పోలీసులు పనిచెయ్యవలసి వచ్చిందట. వధూవరులను గుర్రపుబగ్గీలో కూచోబెట్టుకుని ప్రెసిడెంటు థియొడోర్ కల్యాణమందిరం నుంచి యింటికి వస్తూవుంటే, దారిపొడుగునా ప్రజలు ప్రెసిడెంటుకు హర్ష ధ్వానాలు చేశారు. కుర్రాళ్ళు అతి ఉత్సాహంతో దారిపొడుగునా తనకు హర్షధ్వానాలు చేస్తూవుంటే, ప్రెసిడెంట్ నవ్వుతూ తన ముష్టిని చూపించి బెదిరిస్తే, ఒక కుర్రాడు నిజంగా బెదిరి వెనక్కు పడ్డాడు.

21 సంవత్సరాల పడుచు వధువు ఎలియనార్ 1884 అక్టోబరు 11 న జన్మించింది. ఆమె తండ్రి ఎలియట్ రూజ్వెల్టు; తల్లి అన్నా హాల్. వారి సంతానం ముగ్గురిలోనూ ఎలియనార్ పెద్దది. ఎలియనార్ తల్లి రూజ్వెల్టు తల్లిలాగే చాలా అందగత్తె. ఎలియనార్ చిన్నతనం అంతా కష్టాలతో గడిచింది. ఆమె ఎనిమిదవ యేటనే ఆమె ఎక్కువగా ప్రేమించిన సోదరుడూ, తల్లీ చనిపోయారు. తరువాత రెండేళ్ళకు ఆమెతండ్రి చనిపోయాడు. ఈ కుటుంబం హైడ్‌పార్కుకు 26 మైళ్ళదూరంలో హడ్సన్‌నదీ తీరాన వున్న టివోలిలో నివసించేవారు. తల్లిదండ్రు లిద్దరూ

చనిపోగానే ఎలియనార్ పెంపకం ఆమె అమమ్మ నెత్తిన పడింది. ఆ అమ్మమ్మ తన మనుమరాలిని చాలా కట్టుబాట్లలో పెట్టింది. ముసలితనపు మూఢత్వంలో ఆ అమ్మమ్మ అవలంబించే సాంప్రదాయబద్ధమైన కట్టుబాట్లను ఎలియనార్ భరించలేక పోయింది.

తరువాత కొన్నాళ్ళకు ఎలియనార్ ఇంగ్లండులోని ఎల్లెన్స్‌వుడ్ అనే స్కూలులో కొన్ని సంవత్సరాలు చదువుకున్నది. ఆ స్కూలు హెడ్‌మిసెస్ మదాం సోవిస్ట్రి చాలా విశాలభావాలు గల మనిషి. ఆమెను చూచినదాకా మూఢ సాంప్రదాయాలు తప్ప మరేమీ ఎరుగని మనుష్యులు కాక, విశాల దృక్పథంగల మనుష్యులు యీ లోకంలో వుంటారని ఎలియనార్‌కు తెలియదు.

బ్రతికివున్న రోజులలో కూడా ఎలియట్ రూజ్వెల్టును అతడి బిడ్డలు బాగా ఎరుగరు. దానికి కారణం అతడు విశేషంగా త్రాగుబోతు కావడం. అతడిని పిల్లలతో కలియనిస్తే వారి ప్రవర్తనకూడా చెడిపోతుందని పిల్లలకు దూరంగా వుంచేవారు. మరీ చివరరోజులలో అతడు తన ఆస్తి వ్యవహారాలనుకూడా సరిగ్గా గమనించలేనంత మతిభ్రమణం పొందాడట.

ఎలియనార్ సోదరుడు జి. హాల్ రూజ్వెల్టు 1941 లో మరణించాడు. అతడుకూడా విస్తారంగానే త్రాగేవాడు. త్రాగుడువల్ల తన పుట్టింటిలో జరిగిన దారుణ ఫలితాలను బాగా గ్రహించడంవల్ల కాబోసు, ఎలియనార్ మాత్రం మద్యాన్ని తన దగ్గరకు రానిచ్చేది కాదు.

హాల్ అంటే ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు చాలా ప్రేమించేవాడు. హాల్ బ్రతికి వున్నన్నాళ్ళూకూడా అతణ్ణి త్రాగుడు మానమని చిన్నతమ్ముణ్ణి బ్రతిమలాడినట్టుగా బ్రతిమలాడేవాడు రూజ్వెల్టు. అయితే రూజ్వెల్టు రాజకీయాలలో హాల్ ఎప్పుడూ జోక్యం కలిగించుకోలేదు. ఎంత అన్యోన్యంగావున్నా యీ యిద్దరూ రాజకీయాలలో అన్యోన్యతనుగాని, వైరుధ్యాన్నిగాని ప్రదర్శించలేదు.

రూజ్వెల్టు ఎలియనార్‌ను మొట్టమొదట కలుసుకున్నప్పుడు ఆమెకు రెండేండ్ల వయసు. రూజ్వెల్టు నాలుగేళ్ళ బాలుడు. అప్పుడతడామెను తన వీపుమీద ఎక్కించుకొని గుర్రపు సవారి ఆట ఆడేవాడనికూడా బంధువులు

చెపుతారు. తరువాత చాలా ఏండ్లవరకూ వీ రిద్దరూ కలుసుకోలేదు. ఒక సారి ఎప్పుడో రూజ్వెల్టూ, అతని తల్లీ రైలులో ప్రయాణం చేస్తూవుండగా ప్రక్క పెట్టెలో ఎలియనార్ వుంటే ఆమెనువచ్చి తమపెట్టెలో కూచోమని రూజ్వెల్టు అడిగాడట. ఆమె వచ్చి కూచుంది. కాసేపు వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు. తరువాత వీళ్ళిద్దరూ తమ బంధువులంతా ఏవైనా విందులకూ, విశేషాలకూ కలుసుకున్నప్పుడు ఒకరి నొకరు చూసుకొనేవారు.

క్రమంగా ఆమె అంటే అతడికి ఇష్టం కలిగింది. కొంతకాలానికి ఆమెను తను ప్రేమించినట్టు అతడు గ్రహించాడు. అప్పుడు రూజ్వెల్టు ఇంకా హార్వర్డులో చదువుతూనే వున్నాడు. కాని, తన ప్రేమను అతడు చాలా గోప్యంగా వుంచాడు. 1903 లో ఆమెను అతడు తనను పెళ్ళి చేసుకోమని అడిగాడు. ఆమె వెంటనే అంగీకరించింది.

కాని, వెంటనే వివాహం జరగడానికి వీలులేకపోయింది. వీలైతే యీ వివాహం అసలు అవకుండా చెయ్యడానికీ, లేకపోతే వీలైనంతకాలం పెళ్ళిని ఆపడానికీ రూజ్వెల్టు తల్లి ఎత్తులువెయ్యడం ఆరంభించింది. దానికి కారణం ఎలియనార్ అంటే ఆమెకు ఇష్టంలేక కాదు, తనకొడుకు మరొక యువతికి లోబడిపోయి, తన అజమాయిషీలోనుంచి తప్పిపోతాడనే భయంతో అతడు ఎవరిని పెళ్ళి చేసుకోవడమూ ఆమె సహించలేక పోయింది.

వీళ్ళిద్దరికీ ప్రధానం జరిగిన సంగతిని ప్రకటించవద్దని, ఆమె ఆ సంగతిని బయట పడకుండా దాచింది. తరువాత 1904 లో తన కొడుకును ఒక స్నేహితుణ్ణి తోడుఇచ్చి కారిబ్బీన్ దీవులకు ప్రయాణం చేయించింది. కాని, అతడు తన ప్రియురాలిని మరిచిపోలేదు. గబగబా తన ప్రయాణాన్ని ముగించుకొని మళ్ళీ ఇంటికివచ్చి చేరాడు. అప్పుడాతడితల్లి రూజ్వెల్టుకు లండన్‌లోని అమెరికన్ రాయబార కార్యాలయంలో వుద్యోగం ఇప్పించి లండను పంపించి వేద్దామని చూసింది. కాని, అమెరికన్ రాయబారి రూజ్వెల్టు చదువు పూర్తి అయితేగాని ఉద్యోగం యివ్వనని చెప్పి శారా కోరికను నిరాకరించాడు.

1904 లో రూజ్వెల్టు తన పట్ట ప్రధానోత్సవానికి హాజరయినప్పుడు అతడితల్లీ, ఎలియనారూ కూడా ఆ వుత్సవానికి వెళ్ళారు. డిసెంబరులోపల ఎలియనార్‌ను తప్ప మరెవరినీ వివాహమాడడని తన కొడుకు ధోరణిని

పూర్తిగా గ్రహించిన తరువాత వారి వివాహానికి శారా ఒప్పుకుంది. అప్పుడు వారిద్దరికీ ప్రధానం జరిగినట్లు ప్రకటన అయింది.

అత్తగారిలాగే ఎలియనార్ కూడా తన అధికారం సాగాలనీ, తన పట్టుదల నెగ్గాలనీ కోరే వ్యక్తి. ఈ ఇద్దరూ ఇంటిలో పెత్తనం సాగించడానికి ఎంతెంత ఎత్తులతో తమలో తాము యుద్ధం చేశారో పైకి తెలియదు.

ఎలియనార్ అందగత్తె కాదు. కాని, ఆ రోజులలో ఆమె ఫోటోలను చూస్తే ఆమె కురూపి కాదని మాత్రం స్పష్టంగా చెప్పవచ్చును. రూజ్వెల్టుకు ఆమె తగిన భార్య కాదని అనడానికి వీలులేదు. ఆమె తెలివిగలది; విధేయతగలది; కపటమెరుగనిది. ఆమె పినతండ్రి ప్రెసిడెంటు థియొడోర్ రూజ్వెల్టుకు ఆమె అంటే చాలా అభిమానం. ఏడాదికి 5,000 డాలర్ల ఆదాయం వచ్చే ఆస్తి ఆమెకు వుంది. ఆమెను ప్రేమించడంలోనూ, ఆమెనే వివాహం చేసుకోవడంలోనూ రూజ్వెల్టు మంచి తెలివిగల పనే చేశాడు. ఏ విధంగానూ పైకివచ్చే సూచనలు ఏమీ కనపడని ఒక యువకుణ్ణి మంచి అదృష్టశాలులలో ఎవరినైనా పెళ్ళి చేసుకోవలసిన ఎలియనార్ ఎందుకు పెళ్ళి చేసుకుందా అని ఆ రోజులలో చాలామంది ఆశ్చర్యపడ్డారట కూడాను.

## నిషేకం

పాశ్చాత్య సాంప్రదాయప్రకారం వివాహానంతరం నిషేకానికి నూతన దంపతులు తమ బంధువులందరినీ విడిచి దూరంగా వెళ్ళడం, అన్యోన్యతతో ఇద్దరూ మాత్రమే కలిసివుండడం మామూలు. పెళ్ళిరోజులలో కొలంబియాలో న్యాయశాస్త్రం చదువుతూ వున్నందున రూజ్వెల్టు వారం రోజులకంటె ఎక్కువగా భార్యతో కలిసివుండలేక పోయాడు. ఆ వారం రోజులూ వారిద్దరూ హైడ్ పార్కులో గడిపారు. తరువాత కొన్నాళ్ళు వెబ్స్టర్ హోటల్లో గడిపారు. మళ్ళీ యిద్దరూ కలిసి హైడ్ పార్కుకి వెళ్ళారు. తరువాత 1905 లో వారిద్దరూ యూరప్ వెళ్ళి చాలా నెలలు వుండి వచ్చారు. నిజమైన నిషేకం అది. సముద్ర ప్రయాణం చేసినన్నాళ్ళూ ఎలియనార్ చాలా భయపడిందట. సముద్ర ప్రయాణంలో ఆమెకు తల

నొప్పి మొదలైన చికాకులు వస్తాయి. కాని, రూజ్వెల్టుకు సముద్రయానం అంటే ఒక చెలగాటము. అలాంటి భర్తఎదుట కొత్త కాపురంలో ముక్కుతూ, మూలుగుతూ వుంటే ఆత డేమనుకుంటాడో అని ఆమె చాలా భయపడిందట.

యూరప్ ప్రయాణంలో వాళ్ళు తమ మొదటి బస లండన్‌లో చేశారు. ఫ్రాంక్లిన్ రూజ్వెల్టును, ప్రెసిడెంటు థియొడోర్ రూజ్వెల్టు అను కొని హోటలువాళ్లు సాధారణంగా రాజులకు యిచ్చే గదులను యిచ్చారట. ఆ గదులకు చార్జిలను యివ్వబోయేసరికి రూజ్వెల్టుకు కళ్ళు గిర్రున తిరిగాయట.

యూరప్‌లోని అన్ని పట్టణాలూ తిరిగి, అక్కడక్కడ కొన్ని నగ రాలలో వున్న తమ బంధువులను చాలామందిని చూసి, ఆనందమయమైన నిషేక కాలాన్ని పూర్ణంగా అనుభవించారు ఆ దంపతులు.

స్విట్జర్లెండులో పర్వతాలను ఎక్కడంలో రూజ్వెల్టు చాలా ఉత్సాహ పడేవాడట. ఎలియనార్ పర్వతాలను ఎక్కలేదు. అందుచేత రూజ్వెల్టు మరొక స్త్రీతో ఆ పర్వతాలను ఎక్కి కాలం గడుపుతూ వుంటే, ఎలియనార్ చాలా అసూయపడిందట. ఆ పర్వతాల దేశంనుంచి తన భర్తతోకూడా బయటపడ్డదాకా ఆమె ప్రాణం తెరపిన పడలేదట. కాని, రూజ్వెల్టుతో పర్వతాలు ఎక్కిన స్త్రీ మిస్ కిట్టీ గాండీ, ఎలియ నార్‌తో స్నేహం కలుపుకొన్నది. నా రిద్దరూ క్రమక్రమంగా చాలా మంచి స్నేహితు లయ్యారు.

యూరప్‌లో తిరుగుతూ వున్నన్నాళ్ళూ క్రమం తప్పకుండా యీ నూతన దంపతులు రూజ్వెల్టు తల్లికి ఎప్పటికప్పుడు వుత్తరాలు వ్రాస్తూనే వుండేవారు.

పారిస్‌లో వుండగా ఒక రోజున యీ నూతన దంపతులు ఒక జోస్యునికి చేతులు చూపించారట. "ఎలినార్‌కు గొప్ప ఆస్తి సంక్రమిస్తుం దనీ, ఆమె 105 సంవత్సరాల వయస్సు వచ్చినదాకా జీవిస్తుందనీ, రూజ్వెల్టు అమెరికాకు అధ్యక్షుడు అవుతాడనీ" ఆ జోస్యుడు చెప్పాడట.

యూరప్‌నుంచి యీ నూతన దంపతులు స్వదేశానికి తిరిగివచ్చే లోపల వారికి వుండడానికి న్యూయార్కులో ఒక యిల్లు కుదిర్చి దానిలో

అమర్చవలసిన కుర్చీలూ మంచాలూ మొదలైన వాటినన్నిటినీ అమర్చి, కావలసిన నౌకర్లను కుదిర్చి సౌఖ్య ప్రదమైన, గృహప్రవేశానికి అవసరమైన ఏర్పాట్లన్నిటినీ చేసింది రూజ్వెల్టు తల్లి శారా.

ఇంటికి వచ్చేటప్పటికి ఎలియనార్ గర్భిణి అయింది. గృహకృత్యాల పరిశీలన అంతా శారాయే వహించింది. ఇంటిలో పెత్తనం ఆమెదే అయింది. తను చాలామంది పిల్లలతల్లి అయినా, ఇంటిలో తనకు ప్రత్యేకంగా ఒక గది అంటూ ఎప్పుడూ లేదనీ, ఇంటిలో ఏర్పాట్లన్నీ పూర్తిగా అత్తగారి ఆజ్ఞప్రకారమే జరిగేవనీ ఎలియనార్ తన జీవితచరిత్రలో వ్రాసింది.

అత్తగారి ఆజ్ఞలను ధిక్కరించుదామనే ఆలోచన ఆమెకు ఎప్పుడూ కలుగలేదు. ఎన్నో సంవత్సరాలు అత్తగారి అదుపులోనే ఆమె కాపురం చేసింది. కాని, క్రమక్రమంగా, స్పష్టంగా కనపడకుండానే ఆమె స్వాతంత్ర్యాన్ని పొందడం ఆరంభించింది.

కాని, వీరి జీవితం ఆట్టేకాలం గోప్యంగా జరగలేదు. రూజ్వెల్టు రాజకీయాలలో ప్రవేశించగానే, వీరియిల్లు ఒక సత్రము అయిపోయింది. వచ్చేవారు, పోయేవారు, వాగ్వాదాలూ, సమాలోచనలతో యిల్లు ఒక సభ అయిపోయింది. భార్యాభర్త లిద్దరూ ఏకాంతంగా వుండడానికి అవకాశమే చాలా తక్కువ అయిపోయింది.

తమ దాంపత్య కాలంలో యీ యిరువురిమధ్యను ఏ కలహాలు వచ్చినా ఇరువురూ ఏ యే మనోవేదనలను భరించినా యీ దాంపత్యం మాత్రం నేటి చరిత్రలో ఒక ఆదర్శప్రాయమైనదని చెప్పడంలో అతిశయోక్తి ఏమీ లేదు.

ఎలియనార్ ఒక మహావ్యక్తి అనడం అతిశయోక్తి కాదు. మొదటి నుంచీ ఆమె, స్వార్థరాహిత్యతతోపాటు సేవాతత్పరత చూపింది. ఆమె ఏ పని చేసినా, అది తనకు యిష్టమైన పనా కాదా అని కాక ఆ పని చెయ్యవలసిన అవసరం వుందా లేదా అని ఆలోచించేది.

ఆమె తన అరవై సంవత్సరాల వయస్సులో, ఒక మిత్రునితో ఇలా అన్నదట: "నాకు అరవై ఏళ్లు. ఇంక బహుశా పదిహేను సంవత్సరాలు మాత్రమే ప్రజాసేవ చెయ్యగలనుగదా అని నాకు బాధగా వుంది." ఈ మాటనుబట్టి, ఆమె నిజస్వభావం బైటపడుతున్నది.

రూజ్వెల్టు చనిపోయినప్పుడు, "నేను మీ కేమైనా చెయ్యగలనా" అని ప్రెసిడెంటు ట్రూమన్ అడిగితే, "నీకు మేము ఏం చెయ్యగలమో చెప్పు" అన్నదట.

తనభర్త సెనెటర్‌గా ఎన్నుకోబడినప్పటినుంచీ, దాదాపు 40 సంవత్సరాల నాడు ఆమె రాజకీయాలలో శ్రద్ధ తీసుకోవడం ప్రారంభించింది. తన పిల్లలు పెద్దవాళ్లయిన కొద్దీ, ఆమెకు యింటిపనులలో కొంత తెరపి చిక్కేది. అలాంటి వ్యవధిని వృథాగా పోనివ్వకుండా సత్కార్యాలకు వినియోగించే వారు చాలా తక్కువమంది ఉంటారు. ఆమె రోజుకు దాదాపు ఇరవై మూడైన, కార్యక్రమాలలో పాల్గొనడం యీనాడు మనకు ఆశ్చర్యం కలిగించక పోవచ్చును. కాని, నలభై సంవత్సరాలుగా ఆమె ఇదే విధంగా అనేక కార్యక్రమాలలో పాల్గొని ప్రజాసేవ చేస్తున్నదంటే అది చాలా హర్షించ వలసిన విషయం.

రూజ్వెల్టు న్యూయార్కు గవర్నరుగా వున్నప్పుడు ఆమె ఒక స్త్రీల పత్రికకు సంపాదకురాలుగా పనిచేసింది. వాల్-కిల్‌లో కర్ర సామానులను తయారుచేసే ఫాక్టరీని స్థాపించడానికి తోడ్పడింది.

రూజ్వెల్టు ప్రెసిడెంటు అయిన తరువాత, ఆమె ఎన్ని ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొన్నదీ లోకవిదితమే. సభలలో ఉపన్యసించడానికి ఆమె దాదాపు 4,00,000 మైళ్లు యునైటెడ్ స్టేట్సులో ప్రయాణం చేసింది.

రూజ్వెల్టులో వున్న, రూజ్వెల్టు వంశపు రక్తంకంటె ఎలియనార్‌లో వున్న రూజ్వెల్టు వంశపు చాలికలు ఎక్కువ అని చాలామంది అంటారు. అధికారకాంక్ష, కార్యదీక్ష రూజ్వెల్టు వంశపు చాలికలలో ప్రధానమైనవి. ఈ రెండూ కూడా ఆమెలో చాలా ప్రబలంగా వున్నాయి.

రాజకీయాలలో ఆమె ఎక్కువగా వామపక్షపు ధోరణినే అవలంబించింది. రూజ్వెల్టుకన్న, ఎలియనార్ ఎక్కువ అతివాది అని చెప్పవచ్చును. అయితే, ఎదుటివారి అభిప్రాయాలను తెలుసుకోవడంలోనూ, వాటిని మన్నించడంలోనూ ఆమె యెప్పుడూ గర్విష్ఠితనాన్ని చూపలేదు. చాలామంది రాజకీయవాదులు ఆమెను మోసగించారు.

ఈనాడు ఆమె కమ్యూనిస్టులను — ముఖ్యంగా అమెరికన్ కమ్యూనిస్టులను-తీవ్రంగా ద్వేషిస్తుంది. దానికి కారణం వారిలో చాలామంది

తనకు అబద్ధాలు చెప్పడం, నమ్మించి మోసగించడం; పైగా యునైటెడ్ నేషన్సులో రష్యనుల ప్రవర్తన చూస్తే, రష్యనులు తాను పూర్వం అనుకున్నలాటి మనుష్యులు కారనేభావం ఆమెకు స్పష్టంగా కలిగింది.

ఈనాడు, అరవై అయిదేళ్ల వయస్సులో ఆమె చక్కని ఆరోగ్యాన్ని కలిగివుంది. దయారహితమైన కాలవాహిని ఆమెకు కలిగించిన వైకల్యం, కొద్దిగా చెవుడుమాత్రమే. అందమైన వారిని వికారులుగా చూపించడమూ, వికారులను అందంగల వారిగా చూపించడమూ ఫోటోగ్రాఫ్ కెమెరాలలో వున్న ప్రధానలోపము. ఆ లోపంవల్ల, ఆమె ఫోటోగ్రాఫ్‌లలో బాగా పడదు. కాని, నిజానికి ఆమె ఇప్పటికీ చూడడానికి చుచ్చటగానే వుంటుంది.

ఆమెకుగల ఓపిక, కార్యనిర్వహణ పట్ల ఆమెకుగల ఉత్సాహము, యీనాడు కూడా ఏమీ తగ్గలేదు. ఇప్పటికీ ఆమె సహాయాన్నీ సలహాలనూ కోరుతూ ఎన్నో సంస్థలు ఆమెకు పని కల్పిస్తూనే వున్నాయి.

ఆమె భర్త జీవించిన నాటికంటె, యీనాడు ఆమె ప్రాముఖ్యత ఎక్కువగా వున్నదని చెప్పవచ్చును. ఆమె కావాలంటే చాలు ఆమెకు ఏ పదవి అయినా యీనాడు లభిస్తుంది.

# దాంపత్యం

రూజ్వెల్టు స్వభావాన్నీ, జీవితాన్నీ తీర్చిదిద్దిన అనేక శక్తులలో ఎలియనార్ ఒకతె. ఆమెను వివాహం చేసుకోకపోతే, రూజ్వెల్టు జీవితం ఎలాగ వుండేదో అని చాలామంది విస్తుపోతూ వుంటారు. రూజ్వెల్టు పక్షవాతంవల్ల అవిటివాడయినప్పుడు, అతడికి కాళ్లులేని లోపం ఆమె తీర్చింది.

అంతేకాదు. అతడి కళ్ళూ, చెవులూకూడా ఆమే. ప్రయాణాలలోనూ, చర్చలలోనూ, పరిశోధనలలోనూ ఆమె తెలుసుకున్న విషయాలన్నీ రూజ్వెల్టుకు ఉపయోగించేవి. అంతేకాదు, ఆమె ఒక్కొక్కప్పుడు ఒక నిశ్చయానికి వచ్చినా, కొన్ని రాజకీయ విధానాల పట్ల ఆమె ఒక నిర్ణయం చేసినా, ఆమెమాటకు తిరుగు వుండటానికి అవకాశం లేదు. అందరి అభిప్రాయాలకన్న, ఆమె అభిప్రాయాలకు ఎక్కువ విలువ ఇచ్చేవాడు రూజ్వెల్టు.

రూజ్వెల్టుకు అత్యంత సన్నిహితురాలు అతడి భార్యయే కావడంవల్ల ఆమె ప్రాపకంకోసం ఎంతోమంది ప్రాకులాడేవారు. అధ్యక్షపదవికి రూజ్వెల్టు పోటీచెయ్యడం ఆమెకు మొదట్లో అంత ఇష్టం లేదు. కాని, పోటీ చెయ్యడానికి అతడు నిశ్చయించుకున్న తరువాత అతడిని పూర్తిగా బలపరచి సంపూర్ణమైన ప్రోత్సాహాన్ని యిచ్చింది. కొన్ని సందర్భాలలో రూజ్వెల్టు నిర్ణయాలను కాదని తన నిర్ణయం ప్రకారం అతణ్ణి ఆమె నడిపించేది. అయితే తనకుగల యీ చనువును ఆమె యెప్పుడోకాని వినియోగించేది కాదు. అత డేదైనా తప్పుచేశాడని ఆమె అనుకుంటే ఆ మాటను స్పష్టంగా అతడితో చెప్పివేసేది. హారీ హాప్కిన్సు, ప్రెసిడెంటుకు చెప్పే సలహాలను చాలావాటిని ఆమె నిరసించేది. కొంతకాలం ప్రెసిడెంటుకు సలహా ఇవ్వడంలో ఎలియనార్, హాప్కిన్సులు ఒకరితో ఒకరు పోటీ పడేవారు కూడా.

అప్పుడప్పుడు కొన్ని ఉద్యోగాలకు వ్యక్తులను నియమించడంలో ప్రెసిడెంటుకు ఆమె సలహా యిచ్చేది. అయితే, తన సలహా ప్రకారమే ఆ ఉద్యోగ నియామకం చెయ్యాలని ఆమె పట్టుపట్టేదికాదు. సమర్థుడని తనకు తోచిన వ్యక్తినిగురించి ప్రెసిడెంటుకు తెలియజేస్తే, తన బాధ్యత పూర్తిగా నెరవేరినట్లే అని ఆమె భావించేది.

ఒకొక్కప్పుడు ఆమె ప్రెసిడెంటును చాలా చమత్కారంగా మందలించేది. స్పెయినుకు సహాయం చెయ్యడంలో రూజ్వెల్టు రూఢమైన విధానాన్ని అవలంబించ నందుకు అతడిని ఆమె ఒకసారి చాలా చక్కగా చివాట్లు పెట్టింది. అప్పుడు అక్కడ వున్న లియాన్ హెండర్సన్‌ను చూసి, "స్పెయిను విషయంలో చాలా ఘోరమైన తప్పు చేశామని మనం ఎప్పుడో ఒకనాడు గ్రహిస్తాము. ప్రెసిడెంటును కొంచెం గట్టిగా నొక్కి వుండవలసింది" అని అంది. అక్కడేవున్న రూజ్వెల్టు పెదవి కదల్పలేదు.

రూజ్వెల్టుకీ ఎలియనార్‌కీ మధ్య అన్యోన్యత బాగా వుండేది. రూజ్వెల్టు ఆమెను ప్రేమించడమే కాక గౌరవించాడు. ఆమెను వేళాకోళం చెయ్యడం అంటే అతడికి సరదా. ఒకొక్కప్పుడు ఆమె అతణ్ణి విసిగించేది. ఆమె స్నేహితులలో చాలా మందిని సి రూజ్వెల్టు చికాకు పడే

వాడు. ఏమయినా ఆమెపట్ల అతనికిగల గౌరవభావం మాత్రం ఎన్నడూ సన్నగిల లేదు.

"మరొక భార్యతో, అంటే అతడిని ఏ మాత్రమూ విమర్శించక అన్ని విధాలా అతడికి అణకువగా వుండే భార్యతో అతడు ఎక్కువ సుఖంగా కాలం గడిపేవాడేమో. కాని, నేనుమాత్రం అతణ్ణి విమర్శించ కుండా వుండలేక పోయేదాన్ని. కొన్ని సందర్భాలలో నేను అతడికి ఊహా, ఉత్సాహాలను కలిగించేదాన్ని" అని ఆమె తన జీవితచరిత్రలో వ్రాసుకుంది.

ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విషయంమీద భార్యాభర్తలకు కలహంరాకుండా ఏ దాంపత్యమూ నలభై సంవత్సరాలు వెళ్ళదు. ఒకొక్కప్పుడు ఏదో అవసరమైన పని చూసుకోవలసివుంటే, భోజనాల బల్ల దగ్గరనుంచి ఎలియనార్ ఎవరి అనుమతీ తీసుకోకుండా లేచి వెళ్ళిపోయేది. అలాటప్పుడు రూజ్వెల్టు తల్లికీ రూజ్వెల్టుకీ కోపంవచ్చేది. ఒకసారి భోజనాల సమయంలో రూజ్వెల్టు తన ప్రక్కనున్న వారితో ఏదో విషయాన్ని గురించి చాలా శ్రద్ధగా మాట్లాడు తున్నాడు. పంక్తి చివర కూచున్న ఎలియనార్ ఆ సంభాషణ దేనినిగురించి అని అడిగింది. "మా సంభాషణ పంక్తికి యీ చివరనే సాగుతుంది కాని ఒక చివరనుంచి ఇంకొక చివరకు ప్రయాణం చెయ్యదు" అని రూజ్వెల్టు సమాధానం చెప్పాడు.

ఎలియనార్‌ను ఇతరు లెవ్వరైనా విమర్శించినా అపహసించినా రూజ్వెల్టు ఎంతమాత్రమూ సహించేవాడు కాదు.

ఒకరోజున రూజ్వెల్టు ఒక మిత్రునితో మాట్లాడుతూ రేడియో వింటున్నాడు. అప్పుడు పసిఫిక్ యుద్ధరంగంలో సంచారించేసి వచ్చి నందుకు ఎలియనార్‌ను విమర్శిస్తూ, ఒక ఉపన్యాసకుడు ఏమేమో చెపుతున్నాడు. అది వినగానే, చాలా బాధపడుతూన్న మొహంతో రూజ్వెల్టు ఆ రేడియోను ఆపివేశాడు.

యుద్ధకాలంలో చాలా ప్రమాద పరిస్థితులు కలిగిన రోజులలో, 1942 లో జర్మనులు ఈజిప్టు సమీపం దాకానూ, జపానువారు ఇండియా సరిహద్దుల దాకానూ సాగిపోయిన రోజులలో, రూజ్వెల్టు యుద్ధ కార్యాలను గురించి ఆలోచించడం ఎడతెరపిలేకుండా అవస్థ పడుతున్న రోజులలో,

తన యజమానిని చంపినందుకు ఉరిశిక్ష విధించబడిన ఒక నీగ్రో ప్రాణాలను రక్షించ వలసిందని ఆమె రూజ్వెల్టును చాలా వత్తిడి చేసింది.

ఆ నీగ్రోకు శిక్షవిధించిన రాష్ట్రపు గవర్నరుకు ఉత్తరం వ్రాసి ఆ ఉరిశిక్షను యావజ్జీవ ఖైదుశిక్షగా మార్పించ వలసిందనీ, ఏలాగైనా సరే ఆ నీగ్రో ప్రాణాలనుమాత్రం కాపాడవలసిందనీ ఆమె పట్టుపట్టి కూర్చుంది. మొదట్లో రూజ్వెల్టు తాను యీ విషయంలో జోక్యం కలిగించుకో నన్నాడు. అప్పటి కప్పుడే, ఆ రాష్ట్రపు గవర్నరు పురిశిక్ష పొందిన ఆరుగురు వ్యక్తులకు పురిశిక్ష తగ్గించి యావజ్జీవ శిక్షగా మార్చాడు. పైగా, యీ నీగ్రో విషయంలో జాలి చూపవలసిన అంశం ఏమీ కనపడదు. అయినా, వాడి ప్రాణాలను రక్షించి తీరాలని ఏలియనార్, పట్టు పట్టి కూర్చుంది. మార్గాంతరం లేక, రూజ్వెల్టు ఆ గవర్నరుకు చాలా గట్టిగా ఒక వుత్తరం వ్రాశాడు.

ఇలాగే దిక్కులేనివారిని ఎవరినో ఒకరిని వెదికి వాళ్లకు మేలు చెయ్యడానికి ఆమె ఎప్పుడూ ఏదో ఒక మార్గం వెదుకుతూనే వుండేది. ఇలా సహాయం చెయ్యడంలో వ్యక్తులనేగాక, సాంఘిక, రాజకీయ పరిస్థితులు చక్కగాలేక హీనస్థితిలోవున్న అనేక వర్గాలకు సహాయం చెయ్యడానికి ఆమె నిరంతరమూ పాటుపడేది.

రూజ్వెల్టు తల్లి, తన కొడుకును ఒక విషయంలో టోపీవేసేది. అదేమిటంటే, తన కొడుకుచేత ఎవరినైనా తాను పరిచయం చెయ్యాలనుకుంటే, ఆ వ్యక్తిని చూడడానికి రూజ్వెల్టు యిష్టపడక పోతే, ఆమె ఆ వ్యక్తిని తమ యింటికి భోజనానికిపిలిచేది. భోజనాలవేళ ఆవ్యక్తిని రూజ్వెల్టు తప్పనిసరిగా చూడవలసి వచ్చేది. ఈ చిన్న చిటకాను ఎలియనార్ తన అత్తగారి దగ్గర నుంచి నేర్చుకుంది.

నేషనల్ యూత్ అడ్మినిస్ట్రేషన్ నాయకుడు ఆబ్రే స్మిత్ ఒకసారి ప్రెసిడెంటును చూడవలసిన అగత్యం కలిగింది. కాని, ఆ రోజులలో యుద్ధ చర్యల గజిబిజిలో ఎడతెరపిలేకుండా వున్న రూజ్వెల్టు స్మిత్‌కు దర్శనం యివ్వడానికి ఏమాత్రం అవకాశం లేకుండా వున్నాడు. అప్పుడు, ఎలియనార్, స్మిత్‌ను తమయింటికి భోజనానికి పిలిచింది. ఇలాటి పన్నాగం ద్వారా రూజ్వెల్టును కలుసుకోవడం ఎంత మాత్రమూ బాగుండదని స్మిత్ ఎంత చెప్పినా అతడు రూజ్వెల్టుతో మాట్లాడవలసిన కార్యం చాలా

ముఖ్యమైనందున మరేం తప్పులేదని ఎలియనార్ ఆబ్రే స్మిత్‌ను ఒప్పించింది. భోజనానికి వచ్చిన స్మిత్‌ను చూసి, రూజ్వెల్టు ఆశ్చర్య పడ్డాడు. కాని, మాటలు కలిసిన తరువాత స్మిత్ అంటే రూజ్వెల్టుకు మంచి అభిప్రాయమే కలిగింది.

అయితే ఆ భోజనాలవేళ మరో గమ్మత్తు జరిగింది. భోజనాలు ప్రారంభం కాక పూర్వమే ఎలియనార్ రూజ్వెల్టునుచూసి, చైనానుంచి ఒక యువక విద్యార్థి వచ్చాడనీ అతడిని రూజ్వెల్టు చూసితీరాలనీ, చైనాను గురించి ఆ యువకుడు చెప్పే విషయాలు వింటే చైనాను గురించి రూజ్వెల్టుకు వున్న దృక్పథమే బహుశా పూర్తిగా మార్చుకోవలసి వుంటుందనీ చెప్పింది. చైనానుంచి వచ్చిన యువకుని చూడడానికి తన కప్పుడు వ్యవధి లేదనీ పైగా ఎవడో ఒక చైనా విద్యార్థిని సబబూ సందర్భమూ లేకుండా అమెరికా ప్రెసిడెంటు దర్శన మివ్వడం అనుచితమనీ రూజ్వెల్టు చెప్పినా, ఎలియనార్ తన ధోరణిని విరమించకుండా, ఆ విద్యార్థిని తప్పకుండా చూడమని పట్టు పట్టడం ప్రారంభించింది. "ఆ చైనామనిషిని విదేశ వ్యవహారాల శాఖకు పంపించి, అతడు చెప్పేదేదో చెప్పుకోమను" అన్నాడు రూజ్వెల్టు. కాని, ఎలియనార్ తన పట్టు విడువలేదు. ప్రాణాలు విసిగి, "అతణ్ణి హారీ హాప్కిన్సు దగ్గరకు పంపించు" అన్నాడు రూజ్వెల్టు. హాప్కిన్సుకు ఒక్క క్షణంకూడా తీరికలేదు అంది ఎలియనార్. "అయితే నేను మాత్రం ఆ చైనా మనిషిని చూడను" అన్నాడు రూజ్వెల్టు. అప్పుడు ఎలియనార్ "ఆ చైనా యువకుణ్ణి మన ఇంటికి భోజనానికి పిలుస్తాను" అని బెదిరించింది. రూజ్వెల్టు ఆగ్రహాన్ని అణచుకోలేక పోయాడు. "చూడు, భోజనాలవేళ నేను కులాసాగా కాలక్షేపం చెయ్యాలను కుంటాను గాని రాజకీయ కార్యాలు నిర్వర్తించను" అని అరిచాడు.

ఈ సంభాషణ అంతా వింటూవున్న ఆబ్రే స్మిత్, తెల్లపోయి పకపక నవ్వాడు. ప్రెసిడెంటు అతణ్ణిచూసి, "ఏమిటి నీ వుద్దేశం ఆబ్రే?" అని కఠినంగా అడిగాడు. అప్పుడు ఆబ్రే స్మిత్ తానుకూడా ప్రెసిడెంటుతో చాలా ముఖ్యమైన వ్యవహారాన్ని గురించి మాట్లాడడానికి, భోజనం మిషతో వచ్చానని బయటపెట్టాడు. రూజ్వెల్టు కాస్సేపు, కోపభారంతో ఏమీ మాట్లాడలేదు. కాని, అతి శీఘ్రంగా ఆ పరిస్థితిలోని హాస్యస్థితిని

గమనించి తానే ఫలితాలు చెప్పి, ఆల్ స్మిత్ వచ్చినదని యేమిటో చెప్పమని దానినంతా శాంతంగా శ్రద్ధగా విన్నాడు.

యుద్ధం తీవ్రమైనకొద్దీ, ప్రెసిడెంటు యుద్ధ కార్యాలలో ఎక్కువగా నిమగ్నుడైన కొద్దీ రూజ్వెల్టూ, ఎలియనారూ ఒకరినొకరు చూసుకోవడం క్రమంగా తగ్గిపోవడం జరిగింది. ఒక్కొక్కప్పుడు ఆమె వైట్‌హౌసులో వుందో లేదో కూడా అతడికి తెలియదు. ఒకొక్కప్పుడు మిస్ టల్లీ మధ్యవర్తిత్వం లేకుండా రూజ్వెల్టుతో టెలిఫోనులో మాట్లాడడంకూడా ఆమెకు సాధ్యమయేది కాదు. అతడి చివరి రోజుల్లో, అతడు వాంస్ప్రింగ్స్‌లో వున్నప్పుడు వాషింగ్టన్ నుంచి ఏవో చిన్న విషయాలను గురించి అతడికి టెలిఫోనుచేసి రూజ్వెల్టుకు ఆమె చికాకు కలిగించింది కూడా.

జీవితభారం వల్లనూ, దైనందిన కార్యక్రమాలలో కలిగే శ్రమవల్లనూ, జబ్బుల వల్లనూ అప్పుడప్పుడు కలిగే నలతలు ఎలావున్నా యీ దంపతులు తమ జీవితం అంతా ఒకరి సౌఖ్యాన్ని మరొకరు కాంక్షిస్తూ, ఒకరినొకరు సంపూర్ణంగా ప్రేమిస్తూ, ఒకరికొకరు అత్యంత విశ్వాసనీయులై వున్నారనడంలో సందేహం ఏమీలేదు. ఒకసారి, యుద్ధపు రోజులలో ఆమె ఇంగ్లండు వెళ్ళింది. మళ్ళీ తిరిగిరావడంలో, ఆమె ప్రయాణానికి రాజకీయ ప్రాముఖ్యతయిచ్చి సదుపాయం కలిగించాలా, ప్రెసిడెంటు భార్య గనుక అవసర సదుపాయం కలిగించాలా, ఎలా చెయ్యాలని ప్రయాణపు ఏర్పాట్లు చేసేశాఖకు సందేహం కలిగింది. వెంటనే, రూజ్వెల్టును అడిగారు. "ఆమెను ఎలా పంపిస్తారో అదంతా నాకనవసరం. ముందు పంపించడం అవసరం" అని ప్రెసిడెంటు జవాబు ఇచ్చాడు. దానినిబట్టి, ఆమె తన సమీపంలో వుండాలని అతడు ఎంతగా వాంఛించేవాడో స్పష్టమౌతుంది.

## సంతానం

రూజ్వెల్టు దంపతులకు ఆరుగురు బిడ్డలు పుట్టారు. ఈ బిడ్డల సంతతి, మొత్తం పదిహేడు మంది మనుమలూ, మనుమరాండ్రూ వున్నారు. ఒక మునిమనుమరాలు వుంది. వీరి సంతతిలో మొట్టమొదటి బిడ్డ అన్నా ఎలియనార్ 1906 లో పుట్టింది. తరువాత, పెద్దకొడుకు జేమ్సు 1907 లో.

పుట్టాడు. తరువాత 1909 లో పుట్టిన ఫ్రాంక్లిన్ అనే కొడుకు, ఎనిమిది నెలలు మాత్రమే పెరిగి పోయాడు. తరువాత 1910 లో ఎలియట్ పుట్టాడు. తరువాత 1914 లో ఫ్రాంక్లిన్ పుట్టాడు. కడసారి కొడుకు జాన్ ఆస్పిన్‌వాల్ 1916లో పుట్టాడు.

అన్నా రెండుసార్లు పెళ్ళి చేసుకుంది; జేమ్సు రెండుసార్లు పెళ్లి చేసుకున్నాడు; ఎలియట్ మూడుసార్లు; జాన్ ఒకసారి; ఫ్రాంక్లిన్ రెండుసార్లు. ఈ బిడ్డలు మొత్తం ఆరుసార్లు విడాకులు ఇచ్చారన్నమాట. తమ పిల్లలు, ఇలా విడాకులు ఇస్తూ మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకోవడం, రూజ్వెల్టు దంపతులకు చాలా మనస్తాపాన్ని కలిగించింది. విడాకులదాకా వచ్చే టప్పటికి, ఆ దంపతులను విడిపోకుండా చెయ్యడానికి రూజ్వెల్టు తాను చెప్పగలిగిన దంతా చేప్పేవాడు; చెయ్యగలిన దంతా చేసేవాడు.

ఎలియనార్ తనబిడ్డలను పెద్దపులి తన బిడ్డను కాపాడినంత జాగ్రత్తగా కాపాడేది. కాని, తనబిడ్డలు వివాహ విషయంలో సరిగా కన్యను ఎన్నుకోకపోవడం, ఎన్నుకున్న కన్యతో సుఖంగా కాపురం చెయ్యలేక విడాకులు యివ్వడం, కొంతవరకు చిన్నప్పుడు వారిని పెంచడంలో తాను లోపం చూపడ మేమోనని ఆమె బాధపడుతుంది. బహుశా, తాను చాలా కఠినశిక్షలో వారి మానసిక ప్రవృత్తులు బాగా వికసించకుండా చేశానేమో అని ఆమెబాధ. పిల్లలను పెంచడం బాధ్యత అంతా ఆమెపైననే పడింది. రూజ్వెల్టుకు పిల్లలను అదుపులో పెట్టడం ఎంతమాత్రం చేతనయేది కాదు.

ఎప్పుడైనా బిడ్డలను ఆమె శిక్షించినట్లయితే, రూజ్వెల్టు ఆబిడ్డను తన దగ్గరకి తీసుకొని బుజ్జగించి మంచి మాటలు చెప్పి, తల్లి కోపపడిన ఫలితం ఏమీ దక్కకుండా చేశేవాడు. ఆమె బిడ్డలంతా కూడా, యీనాడు ఆమెను గురించి మాట్లాడేటప్పుడు ఆమె అంటే చాలా ప్రేమనూ, జాలినీ చూపుతారు. తమను చాలా ముద్దుగా దయతో పెంచేదనీ, తాము తప్పుచేస్తేమాత్రం ఎంతమాత్రమూ సహించేది కాదనీ చెపుతారు.

రూజ్వెల్టు బిడ్డలంతాకూడా తామంతా ప్రత్యేక గౌరవాలు, ప్రత్యేక హోదాలు గల ఒక పెద్ద కుటుంబానికి చెందిన బిడ్డలనే భావంతో

పెరిగారు. వాళ్ళని మరీ గారాబంచేసి పాడుచేసిన వ్యక్తి ఎవరైనావుంటే, ఆ వ్యక్తి వాళ్ల నాయనమ్మ శారాయే. న్యూయార్కు, వాషింగ్టన్, హైడ్ పార్కులలో బసలు ఎక్కువగా మారుతూ వుండడంవల్ల తనకు "వాయిల్లు యిది, నా వూరు యిది" అనేభావం కలగకుండా పోయిందని రూజ్వెల్టు పెద్దకొడుకు జేమ్సు అన్నాడు. బిడ్డలకు ఖర్చు పెట్టుకోడానికి ఎక్కువ డబ్బుయిచ్చే మామూలు ఆ కుటుంబంలో లేదు. ఎప్పుడైనా చిల్లరడబ్బులు వాళ్ళకు యివ్వడంకూడా మంచిది కాదని, వాళ్ల నాయనమ్మ భావించేది.

అయితే, పిల్లలను స్కూలుకు పంపించేటప్పుడు వాళ్లకి పుష్కలంగా డబ్బుయిచ్చి పంపించేవారు. కాలేజిలో చదువు అయిన తరువాత, తన బిడ్డలు తమకు కావలసిన డబ్బును తామే సంపాదించు కోవాలని రూజ్వెల్టు అభిప్రాయం. జేమ్సు గ్రోటన్ స్కూలులో చదువు పూర్తి చేసుకున్న తరువాత చేతి ఖర్చులకు అతడికి డబ్బు ఏమీ యివ్వలేదు. కాలేజిలో చదువు రోజులలో తన చదువుకు వినియోగించ వలసిన కాలంలో, తన పొట్ట పోసుకోవడం కోసం చిల్లర ఉద్యోగాలు చేస్తూవుంటే తన చదువు ఎంతమాత్రమూ సాగటంలేదని, హార్వర్డ్ కాలేజిలో చదువుతూవున్న రోజులలో జేమ్సు తన తండ్రికి వ్రాసిన వుత్తరం ఇప్పటికీ వుంది.

రూజ్వెల్టు బిడ్డలలో, అన్నామీద అతడికి బహుశా ఎక్కువ అభిమానం వుండేది. రాజకీయాలలో రూజ్వెల్టుకు ఆమె ఎక్కువ సన్నిహితురాలుగా వుండేది.

ఎలియనార్‌కు ఎక్కువ అభిమానపాత్రమైన బిడ్డ బహుశా ఎలియట్ అయివుంటాడు. దానికి కారణం అతడు చిన్నతనమంతా ఏవో జబ్బులతో బాధపడుతూ వుండటమే.

రూజ్వెల్టుకు చిన్న పిల్లలంటే చాలా ఇష్టం. తన బిడ్డలను అతడు చాలా ఎక్కువగా ప్రేమించాడు. తన బిడ్డలను చూసి మురిసిపోవడమే కాకుండా, చాలా గర్వపడేవాడుకూడా. మామూలుగా అందరు తండ్రుల లాగనే బిడ్డల పట్ల అతడు ప్రవర్తించకుండా రూజ్వెల్టుకు రెండు ఆటంకాలు కలిగాయి. ఒకటి అతడి పక్షవాతపు జబ్బు, రెండవది అతడి

అధ్యక్ష పదవి. జబ్బు పడక పూర్వం పిల్లలను తీసుకొని వెళ్ళి, ఈత నేర్పడం, గుర్రపు సవారి చెయ్యడం మొదలగు కేళీవిహారాలను జరిపే వాడు. జబ్బురాగానే ఇవన్నీ కట్టిపెట్టవలసి వచ్చింది. అధ్యక్షుడైన తరువాత తన బిడ్డలతో ఎక్కువగా కబుర్లు చెప్పడానికి గాని, వినోదాలతో వారితో కాలక్షేపం జరిపడానికి గాని, వాళ్ళ మంచి చెడ్డలను కనుక్కోడానికి గాని అతడికి వ్యవధి వుండేది కాదు. అయితే మామూలు కుటుంబపు కులాసా కబుర్లూ, వాదోపవాదాలూ, భోజనాల వేళ జరుగుతూ వుండేవి. తన బిడ్డలు దూరపు ప్రదేశాలలో వున్నప్పుడు, రూజ్వెల్టు వారికి చాలా అనురాగంతో వుత్తరాలు వ్రాసేవాడు. కూతురు అన్నా, పెద్దకొడుకు జేమ్సు, రూజ్వెల్టు కార్యాలయంలో శెక్రటరీలుగా కష్టించి పని చేశారు.

రూజ్వెల్టు ఏదైనా కార్య కలాపపు ఉత్సవాలలో పాల్గొన్నప్పుడు అతడి కొడుకులలో ఎవరో ఒకరు అతని ప్రక్కన చెయ్యివూత యిచ్చి తప్పనిసరిగా నిలబడేవారు.

రూజ్వెల్టు బిడ్డలను గురించీ, వారి జీవితాలను గురించీ యీ గ్రంథంలో విశేషించి చెప్పడానికి తావు లేదు. కాని, అతడి కొడుకులు నలుగురూకూడా, యుద్ధకాలంలో ఘనమైన ప్రశంసార్హమైన కీర్తిలో తమ బాధ్యతలను నిర్వహించారని మాత్రం చెప్పక తప్పదు. రూజ్వెల్టు నాలుగో కొడుకు ఫ్రాంక్లిన్, ఇంగ్లండులో పుట్టివుంటే, యుద్ధంలో సాటి సైనికుని ప్రాణాలను రక్షించడానికి చూపిన సాహసానికి అతడికి విక్టోరియా క్రాస్ బహుమతి వచ్చి వుండేది.

తన తండ్రి ఫలానా అని తెలిస్తే, తనకు ప్రత్యేక గౌరవం లభిస్తుం దేమోనని, మారు పేరుతో వుద్యోగం సంపాదించి, పనిచేశాడు జాన్.

రూజ్వెల్టు బిడ్డలందరిలోకీ కొంటెవాడు ఎలియట్. కాలేజికి వెళ్ళి చదువుకోవడం ఇష్టంలేక, కావాలని పట్టుబట్టి అతడు స్కూలులో పరీక్ష తప్పాడు. చిన్నతనంలోనే చదువునుంచి బయటపడి, ఏదో వృత్తిలో చేరి తన ప్రజ్ఞను ప్రదర్శించాలని అతడు ఉబలాట పడేవాడు. ఒకసారి అతడు రాజకీయాలలో తన తండ్రికి విరుద్ధంగా పని చేశాడు. వ్యాపారంలో

అతడు అనేక సార్లు బోల్తా కొట్టడం, రూజ్వెల్టు కుటుంబపు గౌరవానికి ఏమాత్రమూ తగి వుండలేదు. అయితే అతడు అప్రయోజకుడు కాడు. ప్రస్తుతం అతడు హైడ్ పార్కు ప్రాంతంలోని వాల్ కిల్ పొలాలలో వ్యవసాయం చేయిస్తున్నాడు.

జేమ్సుకు రాజకీయాలలో పాల్గొనాలని మొదటి నుంచీ ఆసక్తి వుంది. రాజకీయ రంగంలో పైకి రావాలని ప్రయత్నిస్తున్నాడుకూడా.

రూజ్వెల్టు బిడ్డలలో రూజ్వెల్టును ఎక్కువగా పోలినవాడు ఫ్రాంక్లిన్, నిజానికి ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు నోటిలోనుంచి ఊడి పడినట్టుగా వుంటాడు. అతడు 1949లో శోల్ బ్లూంను ఓడించి కాంగ్రెసు ఎన్నికలలో గెలవడం, అతడికి చాలా శుభసూచకమైన రాజకీయ విజయమే. త్వరలోనే మళ్ళీ ఒక రూజ్వెల్టు న్యూయార్కు గవర్నరవుతాడనీ, బహుశా యునైటెడ్ స్టేట్సుకి అధ్యక్షుడే అవుతాడని అందరూ అనుకొనేట్టుగా అతడు రాజకీయాలలో ప్రవేశించాడు.

# రాజకీయరంగ ప్రవేశం

ఇంత సేపు చెప్పిన రూజ్వెల్టు కుటుంబ కథనం నుంచి, అసలు రూజ్వెల్టు కథకు మళ్ళీ వద్దాం.

రూజ్వెల్టు తన 28 వ ఏట 1910లో రాజకీయాలలో ప్రవేశించాడు. ప్రపంచ చరిత్రలో అదొక లెక్కకు రాని సంవత్సరం. ఆ రోజులలో అమెరికాకు టాఫ్ట్ అధ్యక్షుడుగా వున్నాడు. ఆస్ట్రియా-హంగరీ రాజ్యాన్ని ఫ్రాంజ్ జోసఫ్ చక్రవర్తి పరిపాలిస్తున్నాడు. ఆస్క్విత్ ప్రధాన మంత్రిత్వంలో ఇంగ్లండు హాయిగా వున్నది. హిట్లరు పేరు ప్రపంచంలో ఎవరికీ తెలియదు. ముస్సోలినీ ఒకమారు మూల గ్రామంలో కుట్రలు పన్నుతున్నాడు.

ఆ రోజులలో, రూజ్వెల్టు దంపతులు న్యూయార్కులో నివసిస్తున్నారు. వారాంతానికి హైడ్ పార్కు వెళ్ళి, మళ్ళీ న్యూయార్కుకు తిరిగి వచ్చేవారు. ఎండాకాలం కాంపో బెల్లోలో గడిపేవారు. రూజ్వెల్టు తన తల్లిని పూర్తిగా విడిచి పెట్టి, ఆమెను చూడకుండా దూరంగా కాపురం వుండలేకపోయేవాడు. ఇలా జీవితంహాయిగా గడుస్తూ వున్న రోజులవి.

అప్పుడప్పుడు ఈ దంపతులు ఇద్దరూ కలిసి, వాషింగ్టన్ వెళ్ళి అక్కడ ఎలియనార్ మేనత్త ఇంటిలో కొన్ని రోజులు వుండి వస్తూ వుండేవారు. రూజ్వెల్టు తన సొంత పడవలో ఎలియనార్ ను కూచో బెట్టుకొని నోవాస్కొషియా మొదలైన ప్రాంతాలకు జల ప్రయాణాలు చేస్తూ వుండేవాడు. గుర్రపు సవారి చెయ్యడం, వేటకు వెళ్ళడం, టెన్నిస్ ఆడడం, గాఫ్ ఆట ఆడడంలో ఎక్కువ కాలం గడిపేవాడు. గాఫ్ ఆట మీద క్రమంగా అతడి వ్యామోహం ఎక్కువై, చిట్ట చివరకు అతడికి అది ఒక దిన కృత్యంగా పరిణమించింది.

రూజ్వెల్టు చాలా సుందరుడే గాక, అతని నడక, చూపు, మాటలలో ఒక మంచి సోయగం వుండేది. ఆ రోజులలో అతడొక మన్మథుడిలాగ వుండేవాడని అతని సమకాలికులలో ఒకరు చెప్పారు. ఒక ఇంగ్లీషు మిత్రుడు ఆ రోజులలో ఒక రోజున లేడిలాగ రూజ్వెల్టు ఒక చిన్న

వాగును కప్పించి దాటిన వృక్షాన్ని తన జన్మలో మరచిపోలేనని చెప్పాడు.

హార్వర్డ్ కాలేజిని వదలిన తరువాత, రూజ్వెల్టు కొలంబియాలో న్యాయశాస్త్రం చదివాడు. కాని, అతడు అక్కడ డిగ్రీ తీసుకోలేదు. అక్కడికి వచ్చేటప్పటికి అతడికి చదువు మీద విసుగు పుట్టడం ప్రారంభించింది. అయితే 1907లో ప్రభుత్వం పెట్టిన న్యాయశాస్త్రపు పరీక్షలు మాత్రం ప్యాసయి, న్యాయవాది వృత్తిని సాగించడానికి అర్హతను పొందాడు. తరువాత కార్టర్–లెడ్యార్డ్–మిల్ బర్న్ అనే లాయర్ల కంపెనీలో ఉద్యోగంలో చేరాడు. అమెరికాలోని చాలా గొప్ప ధనికుల తరఫున ఈ కంపెనీ కోర్టు వ్యవహారాలు నడుపుతుంది. అయితే, ఆ ధనికులతో రూజ్వెల్టుకు పరిచయం లేదు. అతడి వుద్యోగం, ఆ కంపెనీలో చాలా చిన్న హోదాలో వుండేది. కాని, కొద్ది కాలంలోనే ఆ కంపెనీలో హెడ్ క్లార్కు హోదాను పొంది, మ్యునిసిపల్ కేసులను నిర్వహించవలసిన బాధ్యతను పొందాడు. తరువాత, నౌకాశాఖకు సంబంధించిన కేసులను నిర్వహించే హోదాను పొందాడు. నౌకాశాఖ కేసులంటే అతనికి ప్రత్యేక అభిమానం వుండేది.

రూజ్వెల్టు లాయరు వృత్తినవలంబించడానికి చాలా కారణాలు వున్నాయి. అతడు హార్వర్డులో చదువుతుంటూన్న రోజులలో చనిపోయిన అతడి తండ్రి, అతణ్ణి లాయరు చదువు చదువుకోమని కోరాడు. దానికి కారణం, కుటుంబపు ఆస్తి వ్యవహారాలను చక్కగా నిర్వహించుకోడానికి తగిన న్యాయశాస్త్ర జ్ఞానం అతడికి వుంటుందని. పైగా రూజ్వెల్టు కుటుంబపు హోదాకు, లాయరు వృత్తి గౌరవహాని కలిగించదు. లాయరు వృత్తిలో రూజ్వెల్టు సంపాదించిన అనుభవం అతడికి తరువాతి జీవితంలో చాలా వుపకరించింది. కోర్టులలో వ్యవహారాలను నడపడం, సాక్షులతో ఎలా మెలగాలో తెలుసుకోవడం, అతనికి ప్రపంచ జ్ఞానాన్ని బాగా వృద్ధి చేశాయి.

ఏమయినా, న్యాయవాద వృత్తి పట్ల రూజ్వెల్టుకు ఎక్కువ ప్రీతి మాత్రం పుట్టలేదు. ఎక్కువకాలం అతడా వృత్తిలో వుండలేకపోయాడు.

1910 సంవత్సరం నాటికి, రూజ్వెల్టు హైడ్ పార్క్ ప్రాంతంలో ప్రజాసేవాభిలాషి అనే పేరు సంపాదించాడు. ఆ ప్రాంతంలోని ప్రజలందరూ అతణ్ణి బాగా మెచ్చుకొనే వారు. అక్కడి పెద్ద కుటుంబాల వారూ, రాజకీయ వర్గాలలోని వారూ, అతణ్ణి తమ నియోజక వర్గం (పోకీప్సీ) నుంచి రాష్ట్ర సెనేటుకు సభ్యుడుగా ఎన్నికలలో నిలబెడదామని అనుకున్నారు.

రూజ్వెల్టును సెనేట్‌కు అభ్యర్థిగా నిలబెడదామని వారు అనుకో డానికి తగిన కారణాలు లేకపోలేదు. రూజ్వెల్టు రాజకీయాలలో పైకి వస్తాడని అక్కడి మేయరుకు అనిపించేది. తరువాత, రాజకీయ రంగంలో రూజ్వెల్టు కుటుంబపు పేరుకు పలుకుబడి వుంటుంది. ఏమంటే, అప్పటికి ఇంకా తియొడోర్ రూజ్వెల్టుకు దేశంలో విస్తారమైన పలుకుబడి వుంది. అంతేకాక, తియొడోర్ రూజ్వెల్టు రిపబ్లికన్ పార్టీవాడు కావడంచేత, డెమొక్రాటిక్ పార్టీ తరఫున మరొక రూజ్వెల్టు రాజకీయాలలోకి దిగాడంటే ప్రజలలో విభ్రమ సంరంభం బాగా కలుగుతుంది. రూజ్వెల్టు భాగ్యవంతుడు కావడంచేత, ఎన్నికలకు అయ్యే తన ఖర్చులను తాను పెట్టుకోవడమే గాక, దేశమంతటా డెమొక్రాటిక్ పార్టీ జరిపే ఎన్నికల ప్రచారానికి కావలసిన నిధికికూడా అతడు కొంత డబ్బును యివ్వవచ్చును. ఒకవేళ, ఆ నియోజక వర్గంలో రూజ్వెల్టు ఓడిపోయినా, ఆ నియోజక వర్గంనుంచి తరతరాలుగా రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి గెలుస్తూ వున్నందున డెమొక్రాటిక్ పార్టీకి పెద్ద అప్రతిష్ఠ ఏమీ వుండదు. ఇన్ని ఆలోచనలతో డెమొక్రాటిక్ పార్టీ పెద్దలు అతణ్ణి సెనేట్‌కు అభ్యర్థిగా నిలబెట్టడానికి నిశ్చయించారు.

అయితే, ఎన్నికలలో నిలబడడానికి రూజ్వెల్టు ఎందుకు అంగీక రించాడు? హార్వర్డులో చదువుతూవున్న రోజులనుంచీ రాజకీయాలలో ప్రవేశిద్దామనే కోరిక అతడి మనస్సులో కొట్టుకు లాడుతూనే వుంది. రాజకీయవేత్త అవడం అంటే అతడికి బాగా అభిలాష వుంది. అప్పుడతడు చేస్తూవున్న వృత్తి అతడికి విసుగు పుట్టించింది. అన్నిటికన్నా, పోకీప్సీ నియోజకవర్గంలో రిపబ్లికన్ పార్టీకి ఎదురుగా నిలవడం ఆ పార్టీని బాగా

పవాలు చెయ్యడం. అలాచేసి, గెలిచినట్లయితే తనకు ఒక మహావిజయం చేకూరినట్లే. అంచేత, అదేదో చూదామని అతడికి కుతూహలం పుట్టింది.

రూజ్వెల్టు డెమొక్రాట్ పక్షంవాడు ఎందుకయాడు అనే విషయంలో ఒకమాట చెప్పవలసి వుంటుంది. నిజానికి, ఇంకొక పక్షంలో చేరుదామనే వూహ అతడికి ఎప్పుడూ కలగకపోవడమే అతడు డెమొక్రాట్ అవడానికి పెద్దకారణం. పైగా, హైడ్ పార్కు రూజ్వెల్టు కుటుంబం మొదటినుంచీ డెమొక్రాటిక్ పక్షం వైపునే వుండేవారు. రూజ్వెల్టుతండ్రి ఒక్కడుమాత్రం డెమొక్రాటిక్ పక్షాన్ని వదలిపెట్టాడు.

రూజ్వెల్టు, తియొడోర్ రూజ్వెల్టు అంటేనూ, అతడి విశాలభావాలు అంటేనూ చాలా గౌరవం చూపించేవాడు. కాని, తియొడోర్ రూజ్వెల్టు అవలంబించిన విదేశ విధానమూ, దిగుమతి సుంకముల విధానమూ అంటే మాత్రము రూజ్వెల్టుకు ప్రతికూలాభిప్రాయాలు వుండేవి.

ఏమయినా, డెమొక్రాటిక్ పార్టీ బలాన్ని చేకూర్చుకొని ముందుకు వస్తూవున్న రోజులలో, డెమొక్రాటిక్ పక్షం అంటే అభిమానమూ, ఆ పక్షపు రాజకీయాల పట్ల అంగీకార భావమూ గలిగి, రూజ్వెల్టు ఆ పక్షపు అభ్యర్థిగా ఎన్నికలలో పోటీచెయ్యడం అతడి అదృష్టమని చెప్పక తప్పదు.

# సెనెటర్

రూజ్వెల్టు సెనేట్ ఎన్నికల పోటీలో చాలా కష్టపడి ప్రచారం చేశాడు. అతడు ఎన్నికలలో పోటీచెయ్యడానికి నిశ్చయించిన నాటినుంచి, ఎన్నికలు జరిగేలోపల ప్రచారానికి సరిగ్గా నాలుగు వారాల వ్యవధి మాత్రమే వుంది. రూజ్వెల్టు చాలా తీవ్రమైన ప్రచారం చెయ్యవలసి వచ్చింది. దానికి తగినట్టుగానే, అతడు బ్రహ్మాండమైన ప్రచారం చేశాడు. అతడు సాగించిన ప్రచారంలాంటి ప్రచారాన్ని, ఆ నియోజకవర్గం అంతకు ముందెప్పుడూ కనీ వినీ ఎరుగదు. ఒక మోటారుకారు అద్దెకు తీసుకొని దాని పైకప్పును మడిచివేసి, అందరికీ కనపడేలాగ ఆ కారులో కూచొని రూజ్వెల్టు తన నియోజక వర్గంలోని అన్నిమూలలకీ వెళ్ళి ప్రచారంచేశాడు. పట్టణంలో, పల్లెల్లో, పొలాలలో ఎక్కడ మనుష్యులు కనపడితే అక్కడల్లా కారు ఆపి, అతడు తన ప్రచారాన్ని గురించి ఉపన్యాసాలు చేశాడు.

న్యూయార్క్ రాష్ట్రంలో అంతకుముందెవరూ మోటారులో కూర్చొని ఎన్నికల ప్రచారం చెయ్యలేదు. ఇది చాలా కొత్తపద్ధతి. ఇదిచూసి ప్రజలు విస్తుపోయారు. రూజ్వెల్టు కూడా పరిమితిలేని వుత్సాహంతో, ప్రచారం సాగించాడు. తన వుత్సాహాతిరేకంలో అతడొకసారి తన నియోజకవర్గపు సరిహద్దునుదాటి మరొక నియోజకవర్గానికి చెందిన గ్రామంలో తనను ఎన్నుకోమని ఉపన్యసించడం కూడా జరిగింది.

ప్రచారం తీవ్రంగా జరిగింది. ప్రత్యర్థి పోటీకూడా చాలా తీవ్రంగా వుంది. స్వల్పమైన 1140 ఓట్ల మెజారిటీతో రూజ్వెల్టు గెలిచాడు. ఈ గెలుపు ప్రజలందరినీ విభ్రాంతుల్ని చేసింది. దాదాపు 55 సంవత్సరాలు 1856 నుంచి 1911 వరకూ, మధ్యలో ఒక్కసారి 1888 లో తప్ప, యీ నియోజకవర్గంలో రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి తప్ప మరొక అభ్యర్థి గెలవలేదు. 1888 లో కూడా రిపబ్లికన్ అభ్యర్థి ఓడిపోవడానికి కారణం, అప్పుడు ఆ అభ్యర్థికి పోటీగా ఇద్దరు నిలవడంవల్ల ఓట్లు చీలిపోవడమే. అలాటి నియోజక వర్గంలో, డెమొక్రాటిక్ పార్టీ తరఫున రూజ్వెల్టు గెలవడం చాలా విశేషమే.

ఆ ఎన్నికలో గెలవడం రాజకీయాలలో స్థిరమైన, శాశ్వతమైన ప్రవేశాన్ని రూజ్వెల్టుకు కలిగించింది. ఒకవేళ ఆ ఎన్నికలో ఓడిపోయినట్లయితే రూజ్వెల్టు ఏమిచేసి వుండేవాడో!

సెనేట్ సభ్యుడుగా ఎన్నుకోబడడంతో రూజ్వెల్టు పేరు ఒక్కసారిగా ఆ రాష్ట్రమంతా మారుమ్రోగి పోయింది. అంతేకాదు, కొత్తగా సెనేటర్ గా ఎన్నుకోబడిన కొద్ది రోజులలోనే అతడు మరొక విజయాన్ని సాధించాడు. ఆ రోజులలో సెనేటుకు పార్టీ అభ్యర్థులను నిలబెట్టడం నిర్ణయం అంతా డెమొక్రాటిక్ పార్టీ కార్యవర్గం చేతులలో వుండేది. ఆ కార్యవర్గానికి నాయకుడు చార్ల్స్ మర్ఫీ. పార్టీ అభ్యర్థులను నియమించడంలో సంపూర్ణాధికారం అతడిదే. వాషింగ్టన్ తరఫున సెనేట్ సభ్యుడి స్థానం ఖాళీ అవుతోంది. ఆ స్థానానికి విలియం షీహాన్ అనే వ్యక్తిని నిలబెట్టాలని మర్ఫీ నిర్ణయించాడు. ఆనిర్ణయాన్ని రూజ్వెల్టు ప్రతిఘటించాడు. మర్ఫీ నిర్ణయానికి ఎదురు తిరగడం చాలా సాహసం. షీహాన్ అభ్యర్థిత్వాన్ని బలపరచడానికి పార్టీ సభ్యుల సమావేశం టామనీహాల్ లో

జరుగుతూవున్న సమయానికి, ఆ పార్టీ సభ్యులలో సంస్కరణ వాదులను కొంతమందిని తన యింట్లో సమావేశానికి పిలిచారు రూజ్వెల్టు దంపతులు. తత్ఫలితంగా షీహాన్ నియామకానికి కావలసినన్ని ఓట్లు టామనీహాల్ సభలో రాలేదు. పది ఓట్లు తక్కువ వచ్చాయి. అయినా, పార్టీ కార్య వర్గం షీహాన్‌ను నిలబెట్టడానికి పట్టుపట్టింది. కాని, రూజ్వెల్టుకూడా తన పంతాన్ని మరీ బిగించాడు. పార్టీ సభ్యులలో 64 సార్లు ఓటింగు జరిగినా షీహాన్‌కు రావలసినన్ని ఓట్లు రాలేదు. రూజ్వెల్టు నెగ్గాడు. షీహాన్ తన అభ్యర్థిత్వాన్ని విరమించుకున్నాడు. రూజ్వెల్టు వర్గానికీ, తక్కిన వర్గానికీ అనుకూలుడైన అభ్యర్థిని పెట్టడానికి రాజీ కుదిరింది. ఈ విజయంతో రూజ్వెల్టుకు చాలా పలుకుబడి, పేరూ వచ్చాయి.

ఈ ఉదంతంవల్ల రూజ్వెల్టుకు స్వతహాగా గల లక్షణాలు నాయక త్వమూ, సాహసమూ, పురాతన సాంప్రదాయాలను ఎదిరించడమూ అని స్పష్ట పడుతున్నది.

ఈ ఉదంతం మినహాగా అతడు సెనేట్ సభ్యుడుగా వున్న మొదటి రెండు సంవత్సరాల పరిమితి అయిపోగానే 1912 లో మళ్ళీ అతడు సెనేట్ ఎన్నికకు పోటీచేసి, ఎక్కువ మెజారిటీతో గెలిచాడు. రెండోసారి సెనేట్‌కు ఎన్నుకోబడిన అతి శీఘ్రకాలంలోనే అతడు నౌకాశాఖ అసిస్టెంటు సెక్రటరీగా ప్రెసిడెంటు విల్సన్‌చే నియమింపబడినాడు. అప్పటికి అతడికి 30 సంవత్సరాల వయస్సు. అప్పటికే అతడు అందరి దృష్టినీ ఆకర్షించాడు. అతడు చాలా గర్విష్ఠిగా వుండేవాడని చాలామంది అంటారు. కాని, అది గర్వంకాదనీ, బిడియంవల్ల అందరితోటీ ఎక్కువగా మాట్లాడేవాడు కాదనీ ఎలియనార్ అంటుంది. ఏమయినా, చాలామంది దృష్టిని అతడు ఆకర్షించాడు. మళ్ళీ ఇంకొక రూజ్వెల్టు పైకి వస్తున్నాడని అందరూ చెప్పుకోవడం ఆరంభించారు.

ఆ రోజులలో రూజ్వెల్టు, రాబర్ట్ వాగ్నర్, ఆల్ స్మిత్, లూయి హో మొదలైన ప్రముఖులతో బాగా స్నేహం సంపాదించాడు. స్త్రీలకు ఓటుహక్కు యివ్వాలనీ, రైతులకు ప్రభుత్వ సహాయం యివ్వాలనీ వాదించి కొంతవరకు పేరు సంపాదించాడు.

రూజ్వెల్టుకు ఆ రోజులలో రాజకీయాలలో ఏ విషయాన్ని గురించీ ప్రబలంగా నిశ్చితాభిప్రాయాలు ఏమీ వుండేవి కావు. కాని, ఆ భిప్రాయాలు ఏర్పడటానికి ముందు కావలసిన విషయ పరిజ్ఞానంకోసం తన సహచరులను ప్రశ్న పరంపరలను గుప్పించి ప్రతి విషయాన్ని గురించీ విపులంగా తెలుసుకొనే వాడు.

ఆ రోజులలోనే రూజ్వెల్టు అమెరికాకు ప్రెసిడెంటు అవుతాడని అనుకున్న ఒక వ్యక్తి వున్నాడు. అతడి పేరు తామస్ లిం . అతడు పోకీప్సీ వాస్తవ్యుడు. రూజ్వెల్టు అధ్యక్షుడవుతాడని పందెం వేశాడు. ఆ పందెం రెండు షాంపేన్ సీసాలు. ఆ రెండు సీసాలు భద్రంగా దాచిపెట్ట బడినవి. ఆ పందెం వేసినది 1911 లో. ఇరవై రెండు సంవత్సరాల తరువాత ఆ రెండు సీసాలు పెద్ద పండుగలాగా జరిగిన వైభవంలో, రూజ్వెల్టు అధ్యక్షుడుగా ఎన్నుకోబడినవాడు, తెరువబడినవి.

## నౌకాశాఖ అసిస్టెంటు సెక్రటరీ

1912లో బాల్టిమోర్‌లో జరిగిన డెమొక్రాటిక్ పార్టీ మహాసభకు రూజ్వెల్టు హాజరయాడు. ఆ సభకు అతడు ప్రతినిధిగా వెళ్ళలేదు. అధ్యక్ష పదవికి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిని నిర్ణయించడానికి ఆ సభ జరిగింది. ఆ అభ్యర్థిత్వానికి వుడ్రో విల్సన్‌ను నిర్ణయించాలనేవారి పక్షంలో రూజ్వెల్టు పని చేశాడు. ప్రతినిధిగా సభకు వెళ్ళకపోవడం చేత సభలో ఓటుచేసే హక్కు రూజ్వెల్టుకు లేదు. పైగా ప్రతినిధులు వ్యక్తిగతంగా గాక, ఒక్కొక్క ప్రాంతానికి చెందినవారంతా కలిసి ఒక అభ్యర్థికి ఓటు చెయ్యాలనే నియమం ఆ రోజులలో పాటింప బడేది. ఆ సంవత్సరం న్యూయార్కు ప్రాంతపు ప్రతినిధులంతా చాంప్ క్లార్కుకు ఓటు చెయ్యాలని నిశ్చయించుకున్నారు. అయినా, ఈ నిశ్చయాన్ని ధిక్కరించి వుడ్రో విల్సన్ కోసం రూజ్వెల్టు పనిచేశాడు. వీలైనంత మంది ప్రతినిధులతో మాట్లాడి, వారిందరినీ విల్సన్ వైపుకు త్రిప్పాడు. పార్టీ పెద్దలలో చీలికలు పుట్టాయి. అభ్యర్థిని ఎవరిని నిర్ణయించాలనే ప్రతిపాదనమీద 46 సార్లు ఓట్లు తీసుకోవడం జరిగింది. చిట్టచివరకు విల్సన్

నియామకత్వం జరగాలనే ప్రతిపాదనే నెగ్గింది. అంతకు పూర్వం ఎప్పుడూ కూడా అమెరికా రాజకీయ సమావేశాలలో ఆ సమావేశంలో పెచ్చరిల్లినంత ఉద్రేకాలు కనపడలేదు. ఈ విజయంతో రూజ్వెల్టు మహదానందం పొందాడు.

ఆనాడు ఎలియనార్ కాంపోబెల్లోలో వుంది. "విల్సన్‌ను అభ్యర్థిగా నిలబెట్టడానికి నిర్ణయం ఇవ్వాళ మధ్యాహ్నం జరిగింది. అదొక గొప్ప విజయం. నేను ప్రస్తుతం ఏమి చేసేది ఇంకా తేలలేదు," అని రూజ్వెల్టు ఎలియనార్‌కు టెలిగ్రాం పంపించాడు.

బాల్టిమోర్‌లో యీ సమావేశంలో పాల్గొనడానికి రూజ్వెల్టు వచ్చినప్పుడు అతడితో పాటు ఎలియనార్ కూడా బాల్టిమోర్ వచ్చింది. కాని, అతడు విల్సన్ కోసం ప్రచారం చేసే గొడవలో ఊపిరి తిరక్కుండా తిరుగుతూ వుంటే, తాను అక్కడ వుండటం అనవసరమని ఆమె కాంపోబెల్లో వెళ్ళి పోయింది.

బాల్టిమోర్ మహాసభ జరిగిన రోజులలో జీవితాంతంవరకూ నిలిచి పోయిన కొన్ని కొత్త స్నేహాలు రూజ్వెల్టుకు కలిశాయి. బాల్టిమోర్‌లోని పత్రికాధిపతి వాన్ లియర్ బ్లాక్ అనే ప్రముఖునితో రూజ్వెల్టుకు పరిచయం అప్పుడే కలిగింది. 'ఒక్కొక్క మనిషి జీవితంలో ఒక్కొక్క సంఘటన జరగక పోతేనూ, మరొక ఫలాని మనిషితో స్నేహం ఏర్పడక పోతేనూ అతడి జీవితం మరొకలాగ సాగేది గాని, ప్రస్తుతం సాగుతున్నట్టుగా వుండేది కాదు', అని స్పష్టంగా ఏ వ్యక్తి జీవితాన్ని గురించీ చెప్పలేము. కాని, బ్లాక్‌తో రూజ్వెల్టుకు స్నేహం కలగక పోతే, రూజ్వెల్టుకు పక్షవాతపు జబ్బు వచ్చి వుండేది కాదేమో అని మాత్రం అనుకోడానికి చాలా అవకాశం వుంది. ఏమంటే, బ్లాక్‌కు చెందిన ఓడలో కొన్నాళ్ళు విహారం సలిపిన తరువాతనే, రూజ్వెల్టుకు పక్షవాతపు జబ్బు వచ్చింది. బ్లాక్‌తో స్నేహం రూజ్వెల్టుకు ఒక విధంగా సహాయకారి అయింది కూడాను. ఏమంటే, 1920 సంవత్సర ప్రాంతంలో రూజ్వెల్టు తగినంత సంపాదన లేక యిబ్బంది పడుతున్న రోజులలో రూజ్వెల్టుకు ఇన్సూరెన్సు ఉద్యోగం యిచ్చి, కొంత ఆదాయం వచ్చే ఉపాధి కల్పించిన వాడు బ్లాక్.

మొట్టమొదటిసారి రూజ్వెల్టును చూసినప్పుడు బ్లాక్ "ఇంతవరకు, ఇంతటి అందమైన పురుషుణ్ణి నేను మరొకణ్ణి చూడలేదు," అని ఆశ్చర్యపోయాడట.

జోసెఫస్ డేనియల్స్‌తో రూజ్వెల్టు పరిచయం చేసుకొన్న మొట్టమొదటిసారిని గురించి, అప్పుడక్కడ వున్న ఒక పెద్దమనిషి ఇలా చెప్పాడు. "చాలా సుందరుడైన ఒక పురుషుడు విల్సన్ ప్రధాన కార్యాలయంలోకి వచ్చి తాను విల్సన్ పక్షాన ఓటు చెయ్యకపోయినా, అతడి కోసం పని చెయ్యడానికి సంసిద్ధుణ్ణని చెప్పాడు. పత్రికా ప్రచారశాఖకు చెందిన జాన్ జెంకిన్స్ ఆ పురుషుణ్ణి డేనియల్స్‌కు పరిచయం చేశాడు. డేనియల్స్ మొదట్లో ఆ పురుషుడి పేరును సరిగ్గా వినలేదు. తనపేరు రూజ్వెల్టు అని ఆ పురుషుడు రెండోసారి చెప్పుకోవలసి వచ్చింది."

తరువాత విల్సన్ ప్రెసిడెంటు అవగానే నౌకాశాఖా మంత్రి పదవిని డేనియల్స్‌కు ఇచ్చాడు. ఉపమంత్రి పదవిని డేనియల్స్ రూజ్వెల్టుకు యిచ్చాడు. ఈ విషయంలో ఒక చిన్న ఉదంతం వుంది. రూజ్వెల్టుకు అసిస్టెంటు సెక్రటరీ పదవిని ఇస్తానని డేనియల్స్ ఒక ప్రముఖ రాజకీయ నాయకుడు ఎలిహు రూట్‌తో చెప్పాడట. అప్పుడు రూట్‌ని "ఆ పని చెయ్యడానికి నీకు భయంలేదా?" అని డేనియల్స్ అడిగితే, రూట్ చెప్పిన జవాబు ఇది: "రూజ్వెల్టులు ఎప్పుడూ మరొకరి వెనకాల వుండేవాళ్ళు కారు. అందరికన్న ముందు తాను వుండకోరుతారు."

తరువాత డేనియల్స్ ప్రెసిడెంటు విల్సన్ దగ్గరకు వెళ్ళి, "నౌకాశాఖ అసిస్టెంటు సెక్రటరీ పదవికి ఫలానివాణ్ణి నియమిద్దామని మీరు యింకా అనుకొని వుండకపోతే, నా దృష్టిలో ఒక వ్యక్తి వున్నాడు" అని చెప్పాడు. అప్పుడు విల్సన్, "ఎవ రతడు" అని అడిగాడు. "ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు. నేను దక్షిణ రాష్ట్రాలవాణ్ణి గనుక, నాకు ఉపమంత్రిగా ఉత్తర రాష్ట్రాలలో నుంచి వచ్చిన వ్యక్తిని నియమిస్తే మంచి దనుకుంటాను" అని డేనియల్స్ చెప్పాడు.

అప్పుడు ప్రెసిడెంట్ విల్సన్ అన్న మాట లివి: "రూజ్వెల్టును నీవు బాగా ఎరుగుదువా? అత డా పదవికి తగినవాడేనా?"

'నౌకాశాఖ అసిస్టెంటు శెక్రటరీగా వుంటావా అని రూజ్వెల్టును డేనియల్స్ అడిగితే, రూజ్వెల్టు ఇలా జవాబు చెప్పాడు: "అంతకన్న ఎక్కువ సంతోషం కలిగించేది ఏదీ నాకు మరొకటి కనపడడం లేదు. కొత్త మంత్రిమండలితో, కొత్త పరిపాలనతో కొంత సంబంధం పెట్టు కోవడం నాకు ఇష్టమే. నౌకాదళాన్ని గురించి నేను ఎక్కువగా చదివాను. నౌకాశాఖ ఉపమంత్రిగా వుండటం నాకు చాలా యిష్టం."

రూజ్వెల్టుకు ఆ పదవిని యిద్దామని డేనియల్స్ ఎందుకు అనుకున్నాడు? రూజ్వెల్టును మొట్టమొదటిసారి చూసినప్పుడే, అతడంటే డేనియల్స్‌కు చాలా యిష్టం కుదిరింది. అమెరికాకు అధ్యక్షుడుగా వున్న థియొడోర్ రూజ్వెల్టు బంధువు ఒకడు తనకు తాబేదారుగా పనిచెయ్యడం తన కొక ఘనత అని అతడు అనుకొని వుంటాడు. పైగా రూజ్వెల్టు తన పనిని చక్కగా చెయ్యగలడని అతడికి విశ్వాసం కుదిరింది.

రూజ్వెల్టుకు నౌకాశాఖ ఉపమంత్రి పదవిని ఇవ్వడానికి ప్రెసిడెంట్ విల్సన్ ఎందుకు అంగీకరించాడు? దానికి ప్రధాన కారణం డేనియల్స్ మెతకమనిషీ, శాంతి ప్రియుడూ కావడం. ఆ శాఖలో నౌకాదళాన్ని గురించి బాగా తెలిసినవాడూ, నౌకాధిపతులతో వ్యవహారాలు చక్కగా నెరపగలవాడూ మంత్రివర్గంలో ఒకడు వుండాలి. దానికి రూజ్వెల్టు చక్కగా తగివుంటాడు.

అసలు డేనియల్స్ నౌకాశాఖ మంత్రిగా నియమింపబడటమే ఇలవని తలంపుగా జరిగింది. అతడిని పోస్టుమాస్టర్ జనరల్‌గా నియమించుదామని విల్సన్ మొదట్లో అనుకున్నాడు. కాని, డేనియల్స్ చాలా మెతకమనిషీ, ఎవరి మనస్సునూ నొప్పించలేనివాడూ అవడంచేత పోస్టు మాస్టరు ఉద్యోగాలకోసం దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ తనను పీక్కుతినే పాత పరచయస్థులందరికీ జవాబు చెప్పలేక సతమతమవుతాడని డేనియల్స్‌కు విల్సన్ పోస్టుమాస్టర్ జనరల్ పదవి ఇవ్వకుండా, నౌకా శాఖ మంత్రిత్వాన్ని ఇచ్చాడు.

రూజ్వెల్టు పైకి వస్తూవున్న యువకుడు. అలాంటి యువకులు, సమర్థతా, అదృష్టమూ కూడా కలవారు, ఒకే కాలంలో చాలామంది వుండరు. అప్పటికప్పుడే, చాలామంది రాజకీయ నాయకులు రూజ్వెల్టుమీద

కన్ను వేశారు. రూజ్వెల్టును డేనియల్స్ తన గుప్పిట్లోకి తీసుకోకముందే, అర్థికశాఖా మంత్రి విలియం మెక్ ఆడూ రూజ్వెల్టును ఆర్థికశాఖా ఉప మంత్రిగా గాని, న్యూయార్కు రేవు కలెక్టరుగా గాని వుండమని అడిగాడు. కాని, రూజ్వెల్టుకు నౌకాశాఖ అంటే వెర్రి అభిమానం వుంది. ముప్ఫయి సంవత్సరాల వయస్సులో అప్పటికప్పుడే రూజ్వెల్టు నౌకాదళాన్ని గురించి 9,878 గ్రంథాలూ, కరపత్రాలూ పోగుచేసి పెట్టుకున్నాడంటే, నౌకాదళం అంటే అతడికి గల ప్రేమ వ్యక్తమౌతుంది. వాటిలో ఒక్కటి తప్ప, తక్కినవన్నీ అతడు చదివాడట.

ఈ విధంగా రూజ్వెల్టు అమెరికా ప్రభుత్వ నౌకాశాఖ ఉపమంత్రి అయాడు. అంత చిన్నవయస్సులో, అంటే 32 ఏళ్ళ వయస్సులో ఆపదవిని పొందినవ్యక్తి అంతకుపూర్వం మరొకడు లేడు. 1910 లో తన బంధువర్గం లోనూ, మిత్రవర్గంలోనూ తప్ప మరెవరికీ రూజ్వెల్టు అంటే తెలియదు. 1913 నాటికి దేశంలోని ఒక ముఖ్యమైన ప్రభుత్వ పదవిలోకి రూజ్వెల్టు వచ్చాడు. అతడు 1913 మార్చి 17 తేదీన తన పదవీ ప్రమాణాన్ని చేశాడు. ఆనాటికి అతడి వివాహం అయి సరిగ్గా ఎనిమిది సంవత్సరాలు.

ఆనాడు అతడు తన తల్లికి ఇలా ఉత్తరం వ్రాశాడు: "అమ్మా! ఇవ్వాళ నేను పదవిప్రమాణం స్వీకరించాను. అంటే, ఒక విధంగా సముద్రంలో పడ్డానన్నమాట. సుమారు ఒకగంటనుంచి కాగితాల మీద సంతకాలు పెడుతున్నాను. వాటిల్లో ఏముందో దేవుడికే తెలియాలి. నమ్మకంమీద సంతకాలు పెట్టేస్తున్నాను. అదృష్టం బాగుంటే జైయిలులోకి వెళ్ళనక్కరలేకుండా పని జరిగిపోతుంది.

"నాకీ ఉద్యోగపుపని అంతా కొత్తగా వుంది. కొన్ని రోజులు విధి విరామం లేకుండా ఒక యంత్రంలాగ కష్టపడితేనే గాని, యీ ఉద్యోగపు మర్మాలన్నిటినీ పూర్తిగా గ్రహించలేను. ఏ మయినా సరే, అది సాధించి తీరుతాను."

ఉపమంత్రి పదవి వచ్చిన తరువాత రూజ్వెల్టు దంపతులు వేరే పెద్దయింటిలోకి మారారు. చాలా సంవత్సరాలు వాళ్ళు యీ యింట్లోనే

వున్నారు. ఈ ఇంటిలోకి మారినప్పుడు కూడా, దానిలోని ఏర్పాట్లన్నీ రూజ్వెల్టు తల్లి ద్వారా పర్యవేక్షణలోనే జరిగాయట.

ఏడు సంవత్సరాలు, అంటే 1920 దాకా, రూజ్వెల్టు ఈ ఉపమంత్రి పదవిలో వున్నాడు. అతడు తన పదవిని సమర్థంగా నిర్వహించ లేదని ఎవరూ అనజాలరు. అతడు తన ప్రజ్ఞను చూపడానికి అతడికి కలిగిన మొదటి నిజమైన అవకాశం ఇది. అతడు నిజంగా తనప్రజ్ఞను చూపించాడు. పదవిని స్వీకరించిన వెంటనే అతడు చేసినపని, నౌకాదళాధిపతు లందరితోటీ పరిచయం కలిగించుకొని వారందరితోటీ చక్కని సంబంధాలను పెట్టు కోవడం. ఇటువంటే నౌకాదళాధిపతు లందరికీ అభిమానం ఏర్పడింది. ఏమంటే, నౌకాశాఖ మంత్రి డేనియల్స్ నౌకాదళాధిపతులు చెప్పిన ఏ మాటలనూ నమ్మేవాడు కాదు.

నౌకాదళంలో ఈతి చేతకాని నావికులు ఎంతోమంది వుండేవారట ఆ రోజులలో. అంతటి పరిస్థితిని చక్కబరచి, నౌకాదళంలో వున్నవారంతా అన్నివిధాలా ఆ దళానికి తగినట్టుగా వుండేటట్టు చెయ్యడానికి రూజ్వెల్టు పూనుకున్నాడు.

నిజంగా రూజ్వెల్టు నౌకాదళం కోసమే పుట్టాడని చెప్పవలసి వస్తుంది. 1914 లో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభ మయేటప్పటికి, అతడు నౌకాదళాన్ని అన్నివిధాలా సవరించి, మంచి తయారీలో పెట్టాడు. అంతేకాదు, నౌకాదళానికి విమానాలశాఖ అవసరాన్ని కూడా అతడు ముందుగానే గ్రహించాడు.

1914 లో ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే, అమెరికా యుద్ధంలోకి దిగకపోయినా రూజ్వెల్టుమాత్రం తన ఉత్సాహ ఉద్రేకాలతో మిత్రమండలి పక్షం వహించాడు. మిత్రమండలి గెలుపు తథ్యమని బాహాటంగా అందరిదగ్గరా అనేవాడు. ఒక ఉత్తరంలో రూజ్వెల్టు తన తల్లికి ఇలా వ్రాశాడు: "జర్మనీ చక్రవర్తి అమెరికామీద యుద్ధం ప్రకటించనందుకు నాకు చాలా కోపంగా వుంది. తటస్థంగా వుండటం నాకు చాలా కష్టంగా వుంది. బహుశా, యీ యుద్ధం అయేలోపల తటస్థ విధానానికి వ్యతిరేకమైన పనిని దేనినో ఒకదాన్ని నేను చేసేస్తానేమోనని నాకు భయంగా వుంది."

ప్రపంచయుద్ధం తీవ్రరూపం దాల్చినకొద్దీ, రూజ్వెల్టుకు కార్యభారం కూడా ఎక్కువైంది. రోజంతా పనిచెయ్యడం అతడికి అలవాటు అయింది. 1917నుంచీ అంటే అమెరికా యుద్ధంలోకి ప్రవేశించిన తరువాత, రూజ్వెల్టు బాధ్యతలన్నీ ముఖ్యంగా యుద్ధసామగ్రి సేకరణ, కంట్రాక్టులు యివ్వడం, కార్మికులతో తగాదాలు లేకుండా చూడడం. ఈ పనులవల్ల అతడికి విశేషమైన అనుభవం చేకూరింది.

అయితే యుద్ధ కార్యక్రమాలలో కూడా ఇతడు కల్పించుకోక పోలేదు. యుద్ధ చర్యలలో రెండు ముఖ్యమైన ఏర్పాట్లకు ఇతడి సూచనలే కారణం. అవేమిటంటే, జర్మన్ యు-బోట్లు సరిగా పనిచెయ్యకుండా వాటి యుద్ధ కార్యాలను భగ్నం చెయ్యడానికి యు-బోట్లను వెన్నాడి వాటిని ముంచివేసే నౌకలను, ఎక్కువ వేగంగా నడిచగల వాటిని ఉపయోగించడం ఒకటి; జర్మను నౌకాదళంలో అత్యధికభాగం వాటి రేవులనుంచి బైటకు రాకుండా 240 మైళ్ల పొడుగున ఉత్తర సముద్రంలో బాంబులను పడవేసి వుంచడం రెండు.

రూజ్వెల్టు ఉపమంత్రి పదవి స్వీకరించిన నాలు రోజులలోపలనే బ్రూక్లిన్‌లోని నౌకాశాఖ నిర్మాణ కేంద్రంనుంచి కార్మికుల ప్రతినిధులు కొంతమంది రూజ్వెల్టు దగ్గరకువచ్చి, "నౌకాశాఖ కార్మికులకు సంబంధించిన అన్ని విషయాలకూ ఉపమంత్రి పదవిలోవున్న మీరు జవాబుదారీ అన్నసంగతి మీకు తెలుసుకదా?" అని అడిగారు. "నాకు తెలియదు. కాని, మీకేం కావాలి?" అన్నాడు రూజ్వెల్టు.

చాలా నౌకా నిర్మాణ కేంద్రాలలో పనివారి జీతాలను నిర్ణయించే అధికారాలను ఒక నౌకాశాఖ అధికారుల బోర్డు చెలాయిస్తోందనీ, ఆ బోర్డు నిర్ణయాలు కార్మికులకు చాలా అన్యాయం చేస్తున్నాయనీ ఆ ప్రతినిధులు చెప్పారు.

నౌకా కేంద్రాలలో పనివారలకు జీతాలను నిర్ణయించే అధికారాలను సంపూర్ణంగా తన అధికారంలో వుండేటట్టు డేనియల్స్‌చేత మూడురోజులలో ఒక వుత్తరువు చేయించాడు రూజ్వెల్టు. తరవాత, కార్మికులంతా సమష్టిమీద బేరమాడి తమ జీతాల నిర్ణయంలో పాల్గొనే పద్ధతిని అతడు అమలులోకి తెచ్చాడు. ఈ విధానంవల్ల ఏడున్నర సంవత్సరాలకాలం

ఆ మొసకాలోని ఒక్క నౌకానిర్మాణ కేంద్రంలోనూ ఒక్క తగాదాకూడా రాలేదు.

రూజ్వెల్టు ఎప్పుడూకూడా చట్టాన్ని తు. చ. తప్పకుండా అక్షరాలా పాటించడమంటే ఏవగించుకొనేవాడు. విచక్షణ వుపయోగించి, పనిజరిగే మార్గాన్ని చూసి దాని ప్రకారం పోవాలనే మతం అతడిది. అనుకున్న పని సాగేటట్టు చూడడానికి సాంప్రదాయాలకూ, నియమాలకూ విరుద్ధంగా నడుచుకోవడంలో అత డెప్పుడూ శంకించలేదు. తన ఉపమంత్రి పదవి కాలంలో 999 సంవత్సరాలు, జైలుకు వెళ్ళవలసినన్ని నియమాలను తాను ఉల్లంఘించానని అతడే ఒకసారి చెప్పాడు.

డేనియల్సుకూ, రూజ్వెల్టుకూ మధ్య ఉన్న పొత్తునుగురించి, తరువాత చాలా విమర్శలు వచ్చాయి. కాని, డేనియల్సుపట్ల రూజ్వెల్టు ఎప్పుడూ విశ్వాసంలేకుండా ప్రవర్తించలేదు. పైగా డేనియల్సు తన జీవితాంతం వరకూ రూజ్వెల్టును ప్రేమించాడు. అయితే, కొన్ని సందర్భాలలో డేనియల్సు ప్రవర్తనను చూసి రూజ్వెల్టు చాలా విసుక్కునే వాడు.

డేనియల్సు చాలా నైతిక మనిషి; ఏవో ఆశయాలు కలవాడు. అంతకుపూర్వం మానవజాతి కని విని యెరుగని ప్రపంచయుద్ధం జరుగుతోందనే మాటను అలెను ఒక్క నిమిషంకూడా గ్రహించేవాడుకాదు. అంచేత, యుద్ధపు తీవ్రతను గమనించి తదనుగుణమైన చర్యలను ఎప్పటికప్పుడు అమలు జరుపవలసిన బాధ్యత అంతా రూజ్వెల్టు భరించవలసి వచ్చింది. యుద్ధం పూర్తి అయ్యే లోపల యునైటెడ్ స్టేట్సుకూడా ఆ యుద్ధంలో చేరక తప్పదని రూజ్వెల్టు విశ్వసించాడు; అలా జరుగవలసిన అవసరం వుండదని డేనియల్సు అనుకొనేవాడు.

రూజ్వెల్టు తన పదవిని జయప్రదంగా నిర్వహించడానికి ఒక పెద్ద కారణం ఏమిటంటే, నౌకాదళాధిపతు లంతా రూజ్వెల్టు తమపక్షం మనిషి అని గ్రహించడం. వారు ఒకొక్కప్పుడు ఏదైనా ఒక ముఖ్య విషయాన్ని గురించి మంత్రి నిర్ణయం కావాలంటే డేనియల్సు షికారుగానికి ఎక్కడకో వెళ్ళినదాకా ఆగి, అప్పుడు వచ్చి రూజ్వెల్టుచేత ఆ నిర్ణయానికి అంగీకారం వుత్తరువు మూలకంగా తీసుకొని వెళ్ళేవారు. ఇలా జరిగినప్పుడు డేనియల్సుకు

చాలా కోపం వచ్చేది. కాని, రూజ్వెల్టుకు, అతడికీ తగాదామాత్రం ఎప్పుడూ రాలేదు.

రూజ్వెల్టుకు రాజకీయాలు బాగా నేర్పినవాడు డేనియల్స్ అని చెప్పక తప్పదు. తగాదాకోరులైన సెనేటర్లను లోబరచుకోవడంలోనూ, నౌకాశాఖకు కావలసిన ధనాన్ని సెనేట్ కమిటీలచేత మంజూరు చేయించుకోవడంలోనూ డేనియల్స్ చాలా ఘటికుడు.

అసిస్టెంటు సెక్రటరీగావున్న ఏడు సంవత్సరాలలోనూ, తరువాత తన జీవితంలో చాలా ఎక్కువగా ఉపయోగించిన అనుభవాన్ని రూజ్వెల్టు బాగా సంపాదించుకున్నాడు.

# రాజకీయాలు : మొదటి ఓటమి

అసిస్టెంటు శెక్రటరీగా రాజ్య కార్యాలు నిర్వహిస్తూనే రూజ్వెల్టు రాజకీయాలలో బాగా జోక్యం కలిగించుకొని రాజకీయ జ్ఞానాన్నీ, అనుభవాలనూ, ప్రజ్ఞనూ సంపాదించాడు.

చాలా మందికి తెలియదుగాని, న్యూయార్కు సెనేట్ ఎన్నికకు 1914 లో డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా నియమించబడడానికి పార్టీ ఎన్నికలలో రూజ్వెల్టు ఓడిపోయాడు. అతడి ప్రథమ ఓటమి, కడపటి ఓటమి కూడా ఇదే. దానికి కారణాలు కూడా చాలా వున్నాయి. ఉప మంత్రి పదవిలో కార్య భారం వల్ల ఎన్నికల ప్రచారానికి అతనికి తగినంత వ్యవధి లేకపోయింది. కేంద్రశాసన సభలో సెనేటర్ గా వుండటానికి తగినంత వయస్సు అతనికి లేదని ఓటర్లలో చాలమంది ఉద్దేశం. అప్పు డతనికి 32 సంవత్సరాలే. షీహాన్ ఎన్నికను ప్రతిఘటించినందుకు అతనిని దెబ్బకొడదామని డెమొక్రాటిక్ పార్టీ పెద్దలంతా అతనికి విరుద్ధంగా కూడి పనిచేశారు. ఈ ఓటమి వల్ల రూజ్వెల్టు ఏమాత్రం నిరుత్సాహపడ లేదు. అతనికి అప్పటికి దేశంలో వున్న ప్రతిష్ఠకూడా ఏమీ లోపించ లేదు. "ఫరవా లేదు. ముందుకి ఒక మార్గం వేశాము," అని అతడ న్నాడు.

కాని, తరువాత నాలుగేళ్ళకు రూజ్వెల్టు శక్తిని పార్టీ పెద్దలు పూర్తిగా గ్రహించి, న్యూయార్కు గవర్నరు ఎన్నికకు పోటీ చెయ్యమని అతణ్ణి అర్థించే స్థితికి వచ్చారు. కాని, వారి అభ్యర్థనను రూజ్వెల్టు నిరాకరించాడు.

ఈ పాటికి రూజ్వెల్టు వ్యక్తిత్వం ఒక రూపానికి వచ్చింది. ఈ రూపమే చిరకాలం ప్రజల మనస్సులలో హత్తుకొని పోయింది. ఈ రోజులలో కొన్నాళ్ళపాటు రూజ్వెల్టు మీసాలు కూడా పెంచాడు. ఆ రోజులలో అతనిని చూసినవారంతా అతణ్ణి "నిజమైన మగ రాయడు" అనేవారు. అతడి అందానికి ముగ్ధులు కానివా రెవ్వరూ లేరు. ఆ రోజులలో అతణ్ణి చూసిన మార్గరెట్ ఆక్స్ ఫర్డ్ అనే ఒకామె చాలా రోజుల తరువాత ఒక స్నేహితురాలితో "నేను చూసినంతలో అతడి కోర

దగిన పురుషుడు రూజ్వెల్టును మించినవాడు నాకు కనిపించ లేదు," అని చెప్పింది.

యుద్ధం తీవ్రరూపం దాల్చి, అమెరికాకూడా యుద్ధంలోకి దిగిన తరువాత, రూజ్వెల్టు నౌకాదళంలో చేరా లనుకున్నాడు. యుద్ధ చర్యలలో పాల్గొన లేదని అతడిని గురించి అప్పటి కప్పుడే విమర్శలుకూడా ప్రారంభమయాయి. అప్పుడు 1917 లో అతడికి 35 ఏళ్ళు: ఉపమంత్రి పదవిని వదలి వేసి దళంలో చేరదామని అతడు చాలా పట్టు పట్టాడనీ, అప్పుడు మంత్రి డేనియల్స్ యీసంగతిని ప్రెసిడెంటు విల్సన్‌కు చెప్పగా "తను ఇప్పుడు చేస్తున్న పనిని మించిన గొప్ప యుద్ధకార్యం మరొకటి లేదని ఆ యువకుడికి చెప్పు," అని ప్రెసిడెంట్ విల్సన్ అన్నాడని డేనియల్స్ ప్రకటించాడు. అమెరికాలో ప్రెసిడెంటే సర్వ సైన్యాధ్యక్షుడు. అతని వుత్తరువును రూజ్వెల్టు ఎలా ధిక్కరించ గలడు?

అయితే, ఒక పరిశీలనా సంఘపు నాయకుడుగా 1918 లో రూజ్వెల్టు యుద్ధరంగానికి వెళ్ళి అక్కడి పరిస్థితులను స్వయంగా చూసి వచ్చాడు. మంత్రి పదవిలో వున్న వ్యక్తి సైనిక హోదా ఏమీ లేకుండా యుద్ధరంగానికి వెళ్ళి రావడం అమెరికా చరిత్రలో అంతకు పూర్వం జరుగలేదు. లండనులో విందులలో విన్న విషయాలూ, ఫ్రాన్సులో ప్రధాన మంత్రితో మాట్లాడినప్పుడు తెలుసుకున్న సంగతులూ, యుద్ధరంగంలో కందకాలను చూసినప్పుడు గ్రహించిన అంశాలూ యుద్ధ గమనాన్ని గురించి అతడికి విశేషంగా విజ్ఞానాన్ని కలిగించాయి.

తరువాత, యుద్ధ విరామపు సంధి జరగగానే నౌకాశాఖ కంట్రాక్టులను ముగించి వెయ్యడానికి అతడు మళ్ళీ యూరప్ వెళ్ళాడు. అప్పుడు తనతో ఎలియనార్‌ను కూడా తీసుకొని వెళ్ళాడు. మళ్ళీ వచ్చేటప్పుడు శాంతి సంధిపై సంతకం పెట్టడానికి ఫ్రాన్సు వెళ్ళిన ప్రెసిడెంట్ విల్సన్‌తో పాటు జార్జి వాషింగ్‌టన్ అనే నౌకలో యీ దంపతు లిద్దరూ అమెరికాకు ప్రయాణం చేశారు. నానా జాతి సమితి ప్రణాళికను రచించినప్పుడు తాను ఉపయోగించిన వ్రాత బల్లను ప్రెసిడెంట్ విల్సన్ రూజ్వెల్టుకు బహుమతిగా యిచ్చాడు. అది ఇప్పుడు హైడ్ పార్కు లైబ్రరీలో వుంది.

1920 లో రూజ్వెల్టు నౌకాశాఖ ఉపమంత్రి పదవికి రాజీనామా ఇచ్చాడు. వైస్ ప్రెసిడెంటు పదవికి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా నియమింప బడినాడు.

# 1920 పోటీ: తదనంతరం

డెమొక్రాటిక్ పార్టీ మహాసభ శాన్‌ఫ్రాన్సిస్కోలో సమావేశ మైంది. ఆ సమావేశ పరిస్థితులు చాలా విషాదయుతంగా వున్నాయి. ప్రెసిడెంట్ విల్సన్ పక్షవాతం వచ్చి మంచంపట్టాడు. విల్సన్ సంతకం పెట్టిన శాంతి సంధిని సెనేట్ నిరాకరించింది. ఎనిమిది సంవత్సరాల డెమొక్రాటిక్ పరిపాలనకు ప్రతికూల శక్తులన్నీ పైకిలేవ నారంభించాయి.

నానాజాతి సమితిని సమర్థిస్తూ విల్సన్ విధానాన్ని బలపరచవలసినదా, వద్దా అనే ప్రశ్నమీద పార్టీ మహాసభకు వచ్చిన ప్రతినిధులలో రెండు చీలికలు ఏర్పడ్డాయి. అధ్యక్ష పదవికి పోటీచెయ్యడానికి విల్సన్‌ను ఆర్థిక శాఖామంత్రిగా వున్న మెక్ ఆడూ లాంటి మహామహులు నిరాకరించి నందువల్ల చిట్టచివరకు జేమ్స్ ఎం. కాక్స్ ఒక అభ్యర్థిగా నిలచాడు. అల్ స్మిత్ కూడా ఒక అభ్యర్థిగా నిలచాడు గాని అతడికి తగినంతబలం లేదు. మహాసభ ప్రతినిధులలో కొందరు విల్సన్ విధానాలకు అనుకూలం గానూ, కొందరు ప్రతికూలంగానూ వున్నందున ప్రతికూలురు కోరుతున్న కాక్స్‌ను అధ్యక్ష పదవికి అభ్యర్థిగా ఎన్నుకుంటే, అనుకూలురి లోంచి ఒకణ్ణి ఉపాధ్యక్ష పదవికి ఎన్నుకోవాలనీ, అలా చేస్తే ఉభయులనూ రాజీ పరచినట్లవుతుందనీ పార్టీ పెద్దలు ఎత్తువేశారు. అలాంటి అభ్యర్థిగా వైస్ ప్రెసిడెంటుకి రూజ్వెల్టుతప్ప మరొకడు లేడు. కాని, రూజ్వెల్టును వైస్ ప్రెసిడెంటు పదవికి పోటీ చెయ్యడానికి అభ్యర్థిగా డెమొక్రాటిక్ పార్టీ ఎన్నుకుంటుందని ఎవరూ అనుకోలేదు. నిజానికి, ఈ ఎన్నిక అయేసరికి అందరూ ఆశ్చర్యపడిపోయారు. అతడి ఎన్నిక ప్రకటన అయినప్పుడు మహాసభలో హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి.

ఎన్నికలకు పూర్వం రూజ్వెల్టుకీ, కాక్స్‌కీ పరిచయం లేదు. వీరిద్దరూ మొదటిసారి శాన్‌ఫ్రాన్సిస్కో మహాసభలోనే కలుసుకున్నారు. పార్టీలో

అభ్యర్థిత్వపు ఎన్నికలు అయిన తరువాత, అసలు పదవికి ఎన్నికలలో యిద్దరూ కలిసి ప్రబలంగా ప్రచారం చేశారు. ఈ ప్రచారంలో రూజ్వెల్టు ఒక్కడూ 800 ఉపన్యాసాలు చేశాడట.

కాని, ఈ ఎన్నికలలో రూజ్వెల్టూ, కాక్సూ కూడా ఓడిపోయారు. రిపబ్లికన్ పార్టీ అభ్యర్థులు గెలిచారు. ఎన్నికల ఫలితాలు బయటపడే వరకూ కూడా తన పార్టీయే గెలుస్తుందని రూజ్వెల్టు అనుకున్నాడు. అధ్యక్షుని ఎన్నికలలో స్త్రీలు ఓటుచెయ్యడం అమెరికాలో ఇదే మొదటిసారి: రూజ్వెల్టు ఎన్నికల ప్రచారంలో ఎలియనార్ అతనితోటి చాలా చోట్లకు ప్రచారం నిమిత్తం వెళ్లింది కూడాను.

ఈ ఎన్నికల ప్రచారంలో రూజ్వెల్టు ఉపన్యాసాలలో ప్రాంతీయ సమస్యలను గురించి కాక, దేశీయ సమస్యలను గురించి విపులంగా చర్చించడం ప్రారంభించాడు.

ఈ ఎన్నికల ప్రచారంవల్ల, రూజ్వెల్టు జీవితంలో ఏర్పడిన మరొక ఘట్టం ఏమిటంటే, తన ఆఫీసు అంటూ ఒకటి ఏర్పాటు చేసుకోవడం. మిస్సీ లిహాండ్, మిస్ టుల్లీ, స్టీఫెన్ ఎర్లీ, మార్విన్ మెకింటైర్ మొదలైన వారంతా యితని కొలువులో యీ సందర్భంలోనే చేరారు. హెన్రీ మోర్గెంతోతో అతడికి స్నేహం యీ రోజులలోనే ఏర్పడింది.

ఎన్నికలలో ఓడిపోగానే రూజ్వెల్టు కొన్నాళ్ళు బాగా విశ్రాంతి తీసుకున్నాడు. మనిషి చాలా చిక్కాడు. నిరాశ పొందలేదు గాని, తన జీవిత పరిసరాలలో కొంతమార్పు కోసం తహతహ లాడాడు. కొంతకాలం లూయిశానాలో హాల్ రూజ్వెల్టుతో కలసి వేటాడడానికి వెళ్లాడు. తరువాత, వాషింగ్టన్‌కు తిరిగివచ్చి, నౌకాశాఖ వ్యవహారాలలో బకాయి వున్న పనులను ముగించి, న్యూయార్కు వెళ్లి మళ్లీ వ్యాపారంలోనూ, లాయరు వృత్తిలోనూ ప్రవేశించాడు.

పూర్వం తాను స్థాపించిన లాయరు కంపెనీ వ్యవహారాలతోపాటు, వాన్ లియర్ బ్లాక్‌కు చెందిన ఒక ఇన్సూరెన్సు కంపెనీలో ఏడాదికి 25,000 డాలర్ల జీతంమీద ఆ కంపెనీకి వైస్-ప్రెసిడెంటుగాను,

న్యూయార్కులో ప్రతినిధిగాను ఉద్యోగంలో చేరాడు. అంత పెద్ద జీతాన్ని అతడు సంపాదించడం అదే మొదటిసారి.

**1921** సంవత్సరపు మొదటి నెలలలో రూజ్వెల్టు తన జీవితాన్ని చాలా హాయిగా గడిపాడు. ప్రభుత్వ బాధ్యతలు లేకుండా సాధారణ పౌరుడుగా అతడు జీవితాన్ని బాగా అనుభవించినది యీ రోజులలోనే. డబ్బు సంపాదించడానికి అనేక కొత్త ప్రయత్నాలు చెయ్యడం, పుస్తకాలు విశేషంగా చదవడం, కొత్త కొత్త మిత్రులను కలుసుకోవడం ఈ రోజులలో అతడు చేసినపని.

అయితే, అతడు రాజకీయాలను మరచిపోలేదు; రాజకీయాలు అతన్ని మరచిపోలేదు. బ్రహ్మాండమైన ఒక మహాదశకు ముందు కొంత విరామంలో ఇతడు జీవితాన్ని ఆనందంతో అనుభవిస్తున్నాడని మిత్రులంతా ఆ రోజులలో అనుకునేవారు.

# ఘోరవిపత్తు

**1921** ఆగస్టులో రూజ్వెల్టు కాంపొబెల్లోలో వున్న తన కుటుంబాన్ని కలుసుకోవడానికి వాన్ లియర్ బ్లాక్ కు చెందిన విహార నౌకలో వెళ్ళాడు. అక్కడికి వెళ్ళి దారుణమైన మహారోగం చేతిలోపడి జీవితాంతం వరకు అవిటి వాడయిపోయాడు.

1931 లో పక్షవాతం వాతబడక పూర్వం రూజ్వెల్టు అనేక జబ్బులను చవి చూచినవాడే. ఒకొక్కప్పుడు అతడు తన మిత్రులంతా ఆశ్చర్య పోయేటంత ఎక్కువగా శ్రమపడ గలిగేవాడు; ఒకొక్కప్పుడు ఏ పని చెయ్యడానికీ ఓపిక లేక బాధపడేవాడు. ఎక్కువగా శ్రమించి ఏమైనా పనులు చేసిన తరువాత అతడి శరీరం ఏదో ఒక చిన్నజబ్బుకు లొంగిపోయేది.

చిన్న చిన్న జబ్బులు గాక, అతడు 1921 కి పూర్వం పడ్డ జబ్బులలో ముఖ్యంగా చెప్పదగినవి 1912 లో టైఫాయిడ్ జ్వరం ఒకటి. ఆ జ్వరం వల్ల రెండోసారి తాను సెనేట్ ఎన్నికకు నిలచినప్పుడు తన ఉపన్యాసాలను అతడు స్వయంగా చెప్పలేక పోయాడు. అతడికి బదులు ఉపన్యాసాలన్నిటినీ లూయీ హౌ చెయ్యవలసి వచ్చింది. 1915లో నడుమునొప్పితో చాలా రోజులు బాధపడ్డాడు. 1913 లో పొట్ట జబ్బువల్ల చాలా బాధ పడడమూ, తరువాత కడుపులో క్రిమికి వాచి, ఆ క్రిమికను ఆపరేషను చేసి తీసివెయ్యడమూ కూడా జరిగింది. 1916 లో కంఠంలో జబ్బుతో బాధపడ్డాడు. 1918 లో యూరపు వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు, రెండు శ్వాస కోశములకూ న్యూమోనియా వచ్చి ఓడలోనుంచి ఇవతలికి పలకకట్టు మీద మోయించుకొని, పెద్ద జ్వరంతో అతడు ఇల్లు చేరాడు.

ఇలాటి జబ్బులన్నీ సాధారణంగా ఎవరికైనా వస్తాయి. కాని, వరసగా యిన్ని జబ్బులను అతడు అనుభవించడాన్నిబట్టి అతడు ఎక్కువగా శ్రమపడుతున్నాడనీ, రోగాన్ని ప్రతిఘటించే శక్తి అతడికి ఎక్కువగా లేదనీ స్పష్ట మవుతున్నది. ఆ రోజులలో అతడి శరీరం 170 పౌనుల బరువు వుండేదట. ఆరడుగుల రెండంగుళాల ఆకారమైన మనిషికి ఆ బరువు సాధారణంగా చాలదు.

ఒక విచిత్రం ఏమిటంటే, పక్షవాతం వాతబడి జీవితాంతంవరకూ అవిటివాడు కాకపూర్వం కొద్ది రోజులు చాలా మంచి ఆరోగ్యదశను అనుభవించాడు. ఒక విషాదకరమైన అంశం ఏమిటంటే, తను ఆ జబ్బు రాకపూర్వం తన కుటుంబంలో ఎవరికో ఒకరికి పిల్ల పక్షవాతం (Infantile Paralysis) వస్తుందనే భయం ఒకటి అతడికి వుంటూ వుండేది.

# పాడు జబ్బు

మానవ జాతిని అతి క్రూరంగా బాధపెట్టే జబ్బులలో పోలియో మైలైటిస్ (పిల్ల పక్షవాతం) ఒకటి. ఇది మెదడుకీ, వెన్నుపూసకూ వచ్చే ఒక దారుణమైన జబ్బు. ఇది ఒకరకపు విషపు రసివల్లగాని, అనేక విషపు రసులవల్లగాని కలుగుతుంది. కండరములను కదల్చుటకు పనిచేసే నరములను చచ్చుపడజేసి పక్షవాతాన్ని తెచ్చి పెడుతుంది యీ జబ్బు.

ఈ రోగం ఎలా వ్యాపిస్తుందో, ఒక ప్రత్యేక వ్యక్తికి ఇది ఎలా కలుగుతుందో, ముఖ్యంగా చిన్నపిల్లలకే యిది ఎందుకు వస్తుందో, ఇది ఎక్కువగా ఎండాకాలంలో ఎందుకు ప్రబలంగా వ్యాపిస్తుందో ఇప్పటికీ ఎవరికీ తెలియదు. ఈ వ్యాధిని గురించిన పరిశోధన అంతా ఇంకా ప్రథమావస్థలోనే వుంది. దాని తత్వం ఇంకా ఒక మాయగానే వుంది. కొంతమందికి యీ జబ్బు అంకురించి అది పూర్తిగా బయట పడేందుకు కొన్ని రోజులు మాత్రమే పడుతుంది; కొంతమందికి కొన్ని వారాలు పడుతుంది. ఈ జబ్బు ప్రథమావస్థలో దీనిని ఫలానా జబ్బు అని నిరూపించడం చాలా కష్టం. ఏమంటే, దీని ప్రధాన లక్షణాలు అనేక చిన్న చిన్న జబ్బుల మామూలు లక్షణాలను పోలివుంటాయి. అందుచేత, వైద్యులు రోగాన్ని వెంటనే కనిపెట్ట లేరు. ఈ రోగం సాధారణంగా తలనొప్పి, గొంతుకమంట జ్వరములతో ప్రారంభిస్తుంది. కొన్ని లక్షలమంది ప్రజలు తమకు యీ జబ్బు వచ్చిందని తెలియకుండానే దాని చిన్నమోపును అనుభవించి ప్రమాదం లేకుండా బయటపడి వుంటారు.

ఈ జబ్బు ఉధృతంగా వచ్చినప్పుడు రోగికి వికారం పుట్టడం, మెడ కొయ్యబారడం, ఎక్కువ జ్వరం, శరీరంలో ఏదో ఒకచోట చాలా

తీవ్రమైన నొప్పి వుంటాయి. అయితే, యీ జబ్బు శరీరంలోని రెండు భాగాలలో ఒకదానిమీదగాని, రెండిటి మీదగాని దాడిచేస్తుంది. అవేమిటంటే మెదడు; వెన్నుపూస. మెదడుకి యీ జబ్బువచ్చినవారు సాధారణంగా బ్రతకరు. అయితే, మెదడుకి యీ జబ్బువచ్చి బ్రతికి బైటపడిన వారు తమ మానసిక సామర్థ్యాన్ని గాని, మనశ్శక్తులను గాని కోల్పోకుండానే వుంటారు. నరాలకు ఈ జబ్బువచ్చినప్పుడు ఎంతభాగం నరాన్ని అది చచ్చుపడ చేస్తుందో అంతవరకు శరీరంలోని ఆ భాగం ఎందుకూ పనికిరాకుండా పోతుంది. ఒకొక్కప్పుడు ఒక కాలులో కొంత భాగమే చచ్చుపడవచ్చును. ఒకొక్కప్పుడు ఒక చేతిలో మణికట్టుక్రింద వ్రేళ్లుమాత్రమే చచ్చు పడవచ్చును. జబ్బు పూర్తిగా నయమై, దాని ఫలితంగా శరీరంలో ఏ భాగం అవిటి పడుతుందో స్పష్టంగా తేలినతరువాత, ఆ జబ్బు ఫలితాన్ని గ్రహించ వలసిందే గాని, ఏ డాక్టరూ కూడా చికిత్సచేస్తూ వున్న రోజులలో యీ జబ్బువల్ల శరీరంలోని ఫలానిభాగం, ఫలాని మేరవరకు చచ్చుపడుతుందని ఎంతమాత్రమూ గట్టిగా చెప్పలేడు.

ఇప్పుడు, ఈ రోగాన్ని గురించి యీ మాత్రమేనా తెలియవచ్చింది గాని, రూజ్వెల్టుకు ఈ జబ్బు వచ్చిన రోజులలో డాక్టర్లకు ఈ జబ్బును గురించి చాలా తక్కువగా తెలుసు. పెద్దవాళ్ళకు యీ జబ్బువస్తే డాక్టర్లు చాలా ఆశ్చర్య పడేవారు. ఈ జబ్బు వచ్చినప్పుడు రూజ్వెల్టు వయస్సు 39 ఏళ్ళు.

## అశనిపాతము

1921 ఆగస్టు 10 తేదిన రూజ్వెల్టు తన భార్యను పిల్లలను ఒక పడవలో ఎక్కించుకొని నీటిమీద కొంతసేపు కులాసాగా గడపడానికి వెళ్లాడు. ఆ పడవను అతడు తన కొడుకులకు పడవనడపడం నేర్పడానికి ఉపయోగించే వాడు. కొంతసేపు పడవమీద తిరిగిన తరువాత, యీ కుటుంబం కాంపోబెల్లోకు తిరిగి వచ్చారు. అక్కడ ఒడ్డుమీద కొన్ని చోట్ల చెట్లు తగలబడి పోతూవుంటే కుటుంబం అందరూ కలసి ఆ మంటలను ఆర్పడానికి ప్రయత్నం చేశారు. తరువాత, ఒళ్లు చల్లబడుతుందని ఆ సమీపంలో వున్న సరస్సులో రూజ్వెల్టు స్నానం చేశాడు. తరువాత,

మళ్ళీ యీతకొట్టాలని బుద్ధిపుట్టి సముద్రంలో కొంతసేపు యీతకొట్టాడు. కొంతసేపు అయిన తరువాత, యింటికి వెళ్ళి ఒక అరగంటసేపు వుత్తరాలు చూసుకున్నాడు. ఉన్నట్టువుండి హఠాత్తుగా అతడికి విపరీతమైన చలితో ఒళ్ళంతా గజగజ వణక నారంభించింది. పనిమాని, పడుకోమని భార్య బలవంత పెట్టగా అతడు పడుకున్నాడు. ఇది అతడిని జీవితాంతంవరకు అవిటి వాణ్ణిగా చేసిన పక్షవాతపు జబ్బు ప్రారంభమైన రీతి.

ఎప్పుడు, ఎక్కడ, ఏవిధంగా అతడి శరీరంలోకి పోలియోమైలైటిస్ జబ్బు రసి ప్రవేశించిందో ఎవరికీ తెలియదు. తన కాళ్ళకు ఏదో ముప్పువచ్చిందని మొట్టమొదటిసారి రూజ్వెల్టు గ్రహించడం, అతడి తొడలలో కొంతభాగం మెత్తగా చచ్చుపడడం.

మరునాడు ఆగస్టు 11 తేదీన రూజ్వెల్టుకు జ్వరం చాలా ఎక్కువగా వచ్చింది. ఎడమ కాలులో భరించలేనంత నొప్పి ప్రారంభమైంది. పరిస్థితిని చూసి, ఎలియనార్ వెంటనే కర్తవ్యాన్ని గ్రహించింది. పిల్లల్ని సమీపంలో మరొక చోటికి పంపించి వేసింది. సమీపంలోనే మెయిన్‌లో వున్న డాక్టర్ ఇ. హెచ్. బెన్నెట్ కోసం కబురు పంపించింది. ఉదయం 10 గంటలకు డాక్టర్ వచ్చాడు. రూజ్వెల్టును పరీక్ష చేశాడు. రూజ్వెల్టు నడవగలుగు తున్నాడు గాని, వెన్నులోనూ, కాళ్ళలోనూ విపరీతమైన నొప్పితో బాధపడుతున్నాడు. ఇదంతా చూసి డాక్టరు అయోమయ స్థితిలో పడ్డాడు.

ఆగస్టు 12 నాటికి నడవడంలో బాధ ఎక్కువ అయింది. మరొక డాక్టరును కూడా పిలిచి అతడిసలహా తీసుకుంటే మంచిదని ఎలియనారూ, డాక్టర్ బెన్నెట్టూ భావించారు. ఆ సమయానికి ఫిలడెల్ఫియాలో ప్రసిద్ధి పొందిన డాక్టర్ డబ్ల్యు. డబ్ల్యు. కీన్ ఆ సమీపంలో వున్నట్టు తెలిసి అతణ్ణి పిలిచారు. డాక్టర్ కీన్ రూజ్వెల్టును పరిశీలించేసి, "రక్తం కొంత ముద్దకట్టి వెన్నుపూసలో చేరినందున రోగిని అటూ యిటూ కదలలేకుండా చేసింది" అని చెప్పాడు. ఎవరూకూడా ఇది పక్షవాతం అని అనుకోలేదు. అది ఒక తీవ్రమైనజబ్బు అనీ, దానినుంచి రూజ్వెల్టు కోలుకోవడానికి కొన్ని మాసాలు పడుతుందనీ డాక్టర్ కీన్ భావించాడు. కాని, తరువాత రోజురోజుకీ కోలుకోవడానిక బదులు, రూజ్వెల్టు పరిస్థితి యింకా

చెడిపోయింది. డాక్టర్ కీన్ తన మొదటి అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. వెన్నుపూసలో ఎక్కడో రంధ్రం ఏర్పడిందని మరో కొత్త అభిప్రాయాన్ని ప్రకటించి 600 డాలర్లకు బిల్లు పంపాడు. ఈ లోపల రూజ్వెల్టు మూత్రకోశమూ, మలాశయము లోపలిభాగం పక్షవాతం పాల పడి పోయాయి.

ఇంతసేపూ ఎలియనార్ ఊరుకోలేదు. పోలియోమైలైటిస్ రోగ చికిత్సలో ప్రసిద్ధిపొందిన డాక్టర్ రాబర్ట్ లవెట్‌ను బోస్టన్‌నుంచి పిలిపించాలని పట్టుపట్టింది. ఆగస్టు 25 తేదీన డాక్టర్ లవెట్ వచ్చి రూజ్వెల్టును చూసి, రోగాన్ని ఫలానా అని నిర్ధారణ చేశాడు. ఇన్ని రోజులూ కూడా రూజ్వెల్టు భరించరాని బాధతో అల్లాడిపోయాడు. అప్పటికప్పుడే పక్షవాతం చేతులకూ, వీపుకూ, కాళ్ళకూ ప్రాకింది.

ఆ సమయంలో రూజ్వెల్టు తల్లి శారా యూరప్‌లోవుంది. అప్పుడే ఇంటికి తిరిగి రావడానికి సన్నాహాలు చేసుకుంటూ వుంది ఆమె. అంచేత, రూజ్వెల్టుకు పరిచర్యచేసే బాధ్యత అంతా పూర్తిగా ఎలియనార్ మీదనే పడింది. చాలా సమర్థతతో, భూదేవిలాగ గొప్ప ఓపికతో ఆమె పరిచర్య చేసింది.

శారా అమెరికాకు తిరిగివచ్చినప్పుడు ఓడ దగ్గరకి వచ్చి ఆమెను కలుసుకోడానికి అప్తులెవరూ లేరు. దూరపు బంధువు లెవరో వెళ్లారు.

రూజ్వెల్టుకు పక్షవాతం వచ్చిందంటే అతని భార్య నమ్మలేక పోయింది. కాని, నమ్మక తప్పలేదు. ఆ రోగాన్ని ఎదుర్కొనక తప్పలేదు. చివరకు దానితో పోరాడి, అతడికి పరిచర్య చెయ్యక తప్పలేదు.

లూయీ హో రూజ్వెల్టు యింటిలోనే అతిథిగా వుండి, ఎలియనార్‌తోపాటు అతడికి పరిచర్య చేస్తున్నాడు. రూజ్వెల్టు జబ్బును గురించి ఎక్కువమందికి తెలియనియ్యవద్దనీ, రూజ్వెల్టుకు పక్షవాతం వచ్చిన సంగతి కొంతకాలం వరకూ పత్రికలవారికి తెలియనియ్యకూడదనీ హో పట్టుపట్టాడు.

సెప్టెంబరునెల సగం గడిచిన తరువాత, రూజ్వెల్టును న్యూయార్కుకు తీసుకొని వెళ్ళ వచ్చునని డాక్టర్ లవెట్ అనుమతి యిచ్చాడు. చాలా వరకు రూజ్వెల్టు యీ జబ్బునుంచి కోలుకుంటాడని అతడు తన

అభిప్రాయాన్ని తెలియ జేశాడు. రూజ్వెల్టును న్యూయార్కు తీసుకొని వెళ్ళడానికి అతడి మేనమామ ఫ్రెడరిక్ ప్రత్యేకంగా ఒక రైలు పెట్టెను తీసుకొని వచ్చాడు.

తండ్రిని మంచపు కట్టుమీద పడుకోబెట్టి రైలు పెట్టెలోకి తీసుకొని వెళ్ళడం చూసి, రూజ్వెల్టు కడసారి కొడుకు ఫ్రాంక్లిన్ ఎనిమిదేళ్ళవాడు చాలా గాభరా పడ్డాడు. తమ తండ్రికి చాలా జబ్బుగా వుందని అంతకు ముందే రూజ్వెల్టు బిడ్డలందరికీ తెలుసు. అయితే, అతడి జబ్బు ఏమిటో వారెవరికీ తెలియదు. ఒకసారి ఆ బిడ్డలందరినీ చర్చికి వెళ్ళకుండా ఇంటి దగ్గరే వుండమని చెప్పినప్పుడు తమ తండ్రి స్థితి చాలా ప్రమాదంగా వుందని వారంతా గ్రహించారు.

"నాన్నకి చాలా జబ్బుగా వుందనీ, అది బహుశా గుండె జబ్బు అయివుంటుందనీ మా అన్నయ్య చెప్పాడు. కాని, మంచపు కట్టుమీద పడుకోబెట్టి ఆయన్ను రైలు ఎక్కించడానికి తీసుకొని వెడుతూవుంటే, మా నాన్న నన్ను చూసి నవ్వుమొహంతో చేతులు ఎత్తి అటూ ఇటూ ఊపాడు. అందేత, మా నాన్న స్థితి ఎక్కువ ప్రమాదంలో లేదని నేను గ్రహించాను," అని ఫ్రాంక్లిన్ చెప్పాడు.

న్యూయార్కు చేరగానే రూజ్వెల్టును ప్రెస్బిటేరియన్ హాస్పిటలులో చేర్చారు. రూజ్వెల్టుతో కలసి చిన్నప్పుడు చదువుకున్న డాక్టర్ జార్జి డ్రేపర్ రూజ్వెల్టు చికిత్సను బాధ్యత వహించాడు. అతడు డాక్టర్ లవెట్‌తో కలిసి చాలాకాలం పని చేసినవాడు; చాలా సమర్థుడు. రూజ్వెల్టును బ్రతికించిన ఘనత ఎలియనార్, హో లతోపాటు డాక్టర్ డ్రేపర్‌కు కూడా కొంతభాగం చెందుతుంది.

అది కూడా రూజ్వెల్టు అదృష్టాలలో ఒకటే. సమర్థతా, వైద్యప్రజ్ఞా, మైత్రీ గల డాక్టర్ డ్రేపర్ గనుక వైద్యం చెయ్యడానికి రూజ్వెల్టుకు దొరకక పోతే, బహుశా రూజ్వెల్టు ఆ రోగంనుంచి విముక్తి పొందేటంతగా చికిత్స పొందేవాడు కాదేమో.

క్రమంగా రూజ్వెల్టు కోలుకోవడం ఆరంభించాడు. వీపులోను, చేతులలోను వున్న పక్షవాత చిహ్నాలన్నీ పోయాయి. మూత్ర కోశం, మలాశయం మామూలుగా పని చెయ్యడం ప్రారంభించాయి. కాళ్ళు

మాత్రం మామూలుగా నడవగల స్థితికి రాలేదు. డాక్టర్ల పుస్తకంలో రూజ్వెల్టును గురించి 1921 అక్టోబరు 28 న ఇలా వ్రాసి వుంది: "ఇంతకంటె నయం అయే లక్షణాలు కనిపించడం లేదు."

పత్రికలకు చెప్పకుండా రూజ్వెల్టు జబ్బు సంగతిని ఇక దాచకూడదని సెప్టంబరు 16 తేదీన హోవ్ నిర్ణయించాడు. ఆ రోజున న్యూయార్కు టైమ్సు పత్రిక ఆ వార్తను మొదటి పేజీలో ప్రకటించింది. దానిలో రూజ్వెల్టు రెండు కాళ్ళూ చచ్చు పడిపోయాయనీ, అయితే జీవితాంతం దాకా ఆ అవిటితనం వుండదని ఒక డాక్టరు అభిప్రాయ పడుతున్నాడనీ ఆ పత్రిక ప్రకటించింది.

డాక్టర్ లవెట్ మాత్రం కొంతకాలం తరువాత రూజ్వెల్టు కాళ్ళు బహుశా మామూలు పరిస్థితికి రావచ్చునని ఆశించాడు. కాని, అలా జరుగలేదు.

రూజ్వెల్టు లేచి నిలుచోలేకపోవడమూ, నడవలేక పోవడమూ మాత్రమేగాక, అసలు సర్గ్గా కూచోగలగడం కూడా సాధ్యం కాదని డాక్టర్ డ్రేపర్ అభిప్రాయ పడ్డాడు.

కాళ్ళలో నొప్పి పూర్తిగా పోకపోవడమూ, కాళ్ళ నరాలను కదల్చలేక పోవడమూ, నడుములో వెన్నెముకకు రెండు ప్రక్కలా కండ తగ్గిపోయి గుంటలు పడటమూ, పృష్ఠభాగాలు పూర్తిగా కృశించి పోవడమూ చూసి డాక్టర్ డ్రేపర్ అలా అనుకున్నాడు. అప్పటికి రూజ్వెల్టు తన చేతులను కదల్చ గలగడమే గాక, కలంతో సంతకం పెట్టగలిగేటంత వరకు చేతులను ఉపయోగించుతున్నాడు.

ఆ రోజులలో రూజ్వెల్టును కూచోబెట్టడానికి డాక్టర్ డ్రేపర్ ఎంతమాత్రమూ అంగీకరించేవాడు కాదు. అతని భయం ఏమిటంటే, కూచోబెట్టడానికి ప్రయత్నించడంలో, కూచోలేక, ఇక తన జీవితంలో తాను కూచోనని తెలిస్తే రూజ్వెల్టు బెంబేలు పడిపోయి, జీవితంమీద నిరాశ పొందుతాడని. అంచేత, స్వతహాగా తాను కూచోలేననే సంగతి హఠాత్తుగా రూజ్వెల్టు గ్రహించకుండా, మొట్టమొదటిసారి అతణ్ణి కూచోబెట్టడానికి శరీరం బాగా అనుకొని వుండేటట్టుగా, శరీరానికి ఏ విధమైన అసౌకర్యమూ కలుగకుండా వుండే పద్ధతిలో ఒక కుర్చీని తయారు

చేయించి, దానిలో రూజ్వెల్టును కూచోబెట్టాలని డాక్టర్ డ్రేఫర్ ఆలోచించాడు.

రూజ్వెల్టు చాలా ఉత్సాహి, ధైర్యశాలి అయినప్పటికీ, భావోద్రేకం ఎక్కువగా కల వాడవడం చేత, తన జీవితాంతం వరకూ తానిక కూర్చోడంకూడా అసంభవమనే విషయాన్ని అతడు హఠాత్తుగా గాక క్రమేపి గ్రహించేటట్టు చెయ్యడం చాలా అవసరమని డాక్టర్ డ్రేఫర్, డాక్టర్ బెన్నెట్‌కు ఒక వుత్తరంలో వ్రాశాడు.

చికిత్స పొందుతూ వున్న కాలమంతా కూడా రూజ్వెల్టు చెప్ప నలవికాని శారీరక, మానసిక బాధలను అనుభవించాడు.

తన జన్మలో తాను మళ్ళీ మామూలుగా నడవలేనని రూజ్వెల్టుకు ఎప్పుడు తెలిసింది? కఠోరమైన యీ స్థితిని తనకు తానే గ్రహించాడా? లేక ఎవరైనా అతడికి చెప్పారా? తన వెన్నెముక, చేతులు కూడా కొంత కాలం ప్రమాద స్థితిలో వున్నాయనీ, బహుశా తాను ఎప్పటికీ కూచో లేననీ, తనచేతులను ఉపయోగించలేననీ అతడు ఎప్పుడైనా సంకోచించాడా? తన జీవితమంతా ఇకమీదట నడుముకి దట్టీలు కట్టి, కాళ్ళకు వణకకుండా బంధములు కట్టుకోవాలనే సంగతిని అతడికి మొట్టమొదట ఎవరు చెప్పారు. సాధారణంగా కఠోరమైన వార్తలను వినినప్పుడు, వాటిని భరించడానికి తగిన శక్తిని ప్రకృతి చాలామందికి కలిగిస్తుంది. పైగా, జబ్బుగా వున్న న్నాళ్ళూ అతడు మానసికంగా బహు దుర్బల స్థితిలో వున్నందువల్లనూ, శారీరక బాధలను అతడు గమనించకుండా చెయ్యడానికి డాక్టర్లు అతడికి మత్తుమందులను ఎక్కువగా వాడినందువల్లనూ తన జబ్బును గురించిన కఠోర విషయాలను తెలుసుకున్నప్పుడు వాటిని భరించడం అతడికి సాధ్యమై వుంటుంది. ఏమయినా, దైవం అతడి పట్ల అనుగ్రహం చూపాడు. రూజ్వెల్టు కూచోగలిగాడు!

హాస్పిటలులోనుంచి విడుదల పొందగానే రూజ్వెల్టును హైడ్ పార్కులో వుండమని అతడి తల్లి కోరింది. కాని అతడూ, అతడిభార్యా కూడా న్యూయార్కులోని అద్దెయింటిలోనే వుంటామని పట్టుబట్టారు. తరువాత, తాను బాగా కోలుకుంటూ వున్న రోజులలో అతడు అప్పు డప్పుడు హైడ్‌పార్కులో చాలా రోజులు వుండేవాడు. అతడు

న్యూయార్కులోనే కాపురం వుండడానికి నిశ్చయించడంలో, అత్తా కోడళ్లకు మధ్య అభిప్రాయ భేదాలు వచ్చి ఉభయులూ కొంతకాలం తీవ్రంగా పోట్లాడుకోవడం కూడా జరిగింది. రూజ్వెల్టు సంరక్షణనూ, అతడి భవిష్యత్తునూ తనచేతిలో పెట్టుకోవాలంటే, తన చేతులో పెట్టుకోవాలని ఉభయులూ తీవ్రమైన ప్రయత్నాలు చేశారన్నమాట. ఒకరినొకరు కర్కశ పదాలతో దూషించుకోలేదు గాని, తనమాట నెగ్గాలని అత్తగారూ, తన మాట నెగ్గాలని కోడలూ బాగా పట్టుబట్టినమాటమాత్రం వాస్తవం.

తనకు వచ్చిన ఉపద్రవాన్ని పూర్తిగా గ్రహించి, తన మిగిలిన జీవితమంతా ఒక అవిటివాడుగా హైడ్ పార్కులో రూజ్వెల్టు గడపాలని శారా ఉద్దేశం. తన జబ్బునుంచి కోలుకోవడానికి ఆటంకం రానంతవరకు, తన ఆరోగ్యస్థితికి తగినంత వరకు రూజ్వెల్టు ప్రపంచ కార్యక్రమాలలో పాల్గొనాలని ఎలియనార్ ఉద్దేశం. జబ్బుపడ్డాడు గనుక, ఇక జీవితాంతం వరకు అతడే పనీ చెయ్యలేడనే మాటకు ఆమె ఎంతమాత్రమూ ఒప్పుకొనేది కాదు. రాజకీయాలలో అతడు మళ్ళీ ప్రవేశించి, ఏదో ఒక వ్యాపృత్తిలో పడితే, అతడి ఆరోగ్యంకూడా చాలావరకు బాగుపడుతుందని ఆమెభావించింది. అదే నిజమైంది. అత్తగారితో పోరాటంలో ఆమె జయించింది.

ఒకమనిషి ప్రాణాంతకమైన జబ్బుకు గురి అయి, ఒకరోజున కోలుకొని మరొకరోజున ప్రాణాలు పోవడానికి సిద్ధమై, అటూ యిటూ కొట్టుకులాడుతూవుంటే, ఆ మనిషిని అత్యంతంగా ప్రేమించి, ఆ మనిషిమీదే ప్రాణాలు పెట్టుకున్న వ్యక్తి ఎంత బాధ పడుతుందో దానిని అనుభవించిన వారే గ్రహించగలరు. అలాటి అనుభవం గలవారంతా ఎలియనార్ అనుభవించిన బాధను గ్రహించగలరు.

రూజ్వెల్టుకు పరిచర్య చేసినన్నాళ్ళూ ఎలియనార్ చూపిన ఓపిక, ధైర్యమూ అప్రతిమానములు. ఒక్కసారి మాత్రం ఆమె తన కష్ట దశను తలచుకొని గుండె బ్రద్దలయి ఏడ్చింది. తన జీవితంలో తాను బెంబేలు పడ్డ పరిస్థితి అది ఒక్కటే అని ఆమె చెప్పింది. రోగం తప్ప రోగంవల్ల కలిగే మానసిక ఆందోళనను రోగితోపాటు అతని అర్ధాంగి అయిన ఎలియనార్ కూడా అనుభవించింది. కష్టాన్ని అనుభవించే శక్తిని సంపాదించుకొని, దంపతులిద్దరూ కష్ట దశలోనుంచి బయట పడ్డారు.

# రోగవిముక్తి ప్రారంభదశ

1922 వసంత కాలం వచ్చేసరికి రూజ్వెల్టు నడవలేకపోయినప్పటికీ రోగంనుంచి చాలా వరకూ కోలుకున్నాడు. రోగం ఆరంభమైన ఒక ఏడాదికి 1922 ఆగస్టు నాటికి రూజ్వెల్టు కూచొని తన పనులను చూసుకొనే స్థితికి రావడమే గాక, చంక కర్రల సహాయంతో అటూ ఇటూ నడవగల స్థితికి వచ్చాడు. అంత మటుకు అతడు కోలుకోవడం కేవలం అతడు మనో దార్ఢ్యంవల్ల సాధించిన విజయమే.

నడవడం అంటే మామూలు నడక కాదు. ఈ జబ్బు పడ్డ తరువాత రూజ్వెల్టు మళ్ళీ తన జీవితాంతంలోపల మామూలుగా నడవడ మనేది జరుగ లేదు. జబ్బు వచ్చిన క్షణంనుంచీ ఆఖరి వరకూ, నడుమునుంచి పాదముల వరకూ అతడికి శరీరం లేనట్టే లెక్క. కాళ్ళలోని ముఖ్యమైన కండరాలు శాశ్వతంగా చచ్చు పడిపోయాయి. అంతేకాదు, ఎవరో ఒకరిని ఆనుకోకుండా గాని, ఏదో ఒక ఆధారం వూతలేకుండా గాని అతడు నిలుచోలేక పోయాడు కూడాను. దట్టీలు కట్టుకున్నప్పటికీ ఊత లేకుండా నిలుచోడం సాధ్యం కాలేదు. దట్టీలు కట్టుకోవడమే అతడికి ఒక పీడగా వుండేది. తనంతట తాను వాటిని కట్టుకోలేక పోయేవాడు; విప్పలేక పోయేవాడు. దట్టీలంటే అతడికి ఒక అసహ్యం వేసేది. కాని, అవి లేకుండా అతడు ఏమీ చెయ్యలేకపోయేవాడు.

కుర్చీలో కూచోడమన్నా, కుర్చీలో నుంచి లేవడమన్నా అతడికి ఎవరో ఒకరు వూతయివ్వాలి. లేక, తనంతటతానే అలా కూచోడానికి గాని, లేవడానికి గాని ప్రయత్నించేస్తే చాలా బాధపడి విపరీతమైన శ్రమను లోనయే వాడు. కుర్చీలో నుంచి లేవాలంటే, ముందు రెండు చేతులతోటీ ఒక కాలును ముందుకుచాపి దట్టీలను సవరించుకొని, తరువాత రెండో కాలును చాపి, దట్టీలను సవరించుకొని రెండు చేతులతోటీ కుర్చీని గట్టిగా పట్టుకొని తన శక్తినంతనూ నడుములో కేంద్రీకరించి లేవవలసి వచ్చేది. ప్రతిరోజూ కూచున్నప్పుడూ, లేచి నిలుచున్నప్పుడూ ప్రతిసారీ కూడా ఇంత బాధను అతడు జీవితాంతంవరకూ అనుభవించాడు. ఈ మాత్రం లేచి నిలుచోడమూ, ఏదైనా వూత చూసుకొని ఒకొక్క కాలునే

ముందుకు సాచి నాలుగడుగులు వెయ్యడమూ అతనికి డాక్టర్ డ్రేపర్ నేర్పాడు.

చాలావరకు కోలుకున్న తరువాత, అతడు కొన్నాళ్ళు యీత కొట్టడానికి కూడా ప్రయత్నించాడు. తన యింటికి సమీపంలో వున్న ఒక చిన్న చెరువుకి అతడు ప్రాకి వెళ్ళేవాడు. మెల్లగా గట్టుమీదనుంచి నీళ్లలోకి జారి చేతులతో యీతకొట్టి మళ్ళీ గట్టుదగ్గరికి వచ్చేవాడు. అప్పుడు, అతనిని ఎవరైనా పరిచారకులు మెల్లగా గట్టుమీదకి లాగేవారు. "నీళ్లవల్లనే నాకు యీ ముప్పు వచ్చింది, నీళ్ళవల్లనే యీ ముప్పు తొలగి పోవాలి" అని అతడు, తాను జబ్బుపడ్డనాడు చేసిన సముద్ర స్నానాన్ని తలుచుకొని అంటూ వుండేవాడు. కొంతవరకు అతడినోస్యం నిజమే అయింది.

కాలయాపనకు అతడు తన ఇంటి వరండాలో పడక కుర్చీలో కూచొని ఓడల నమూనాలను తయారుచేస్తూ వుండేవాడు. అలాటప్పుడు చేతిలోని కత్తిగాని, కత్తెరగాని క్రిందపడితే, దానిని మళ్ళీ తీసుకోలేక బహు యాతన పడేవాడు. ఆ నమూనాలను నీళ్లలో నడిపించడానికి, పడవ ఎక్కి హడ్సన్‌నదిలో అటూ యిటూ తిరిగేవాడు. పడవలోనే కూచుని, తన కొడుకులకు అతడు ఈతకొట్టడం నేర్పాడు. పోస్టుబిళ్ళలను పోగుచేసుకోవడం, కర్రసామానులు చెక్కడం, తన పుస్తకాలకు పట్టీ వ్రాయడం మొదలైన పనులతో కాలాన్ని వెళ్ళించేవాడు. ఏమయినా సరే, నిరాశను మాత్రం తనదగ్గరకు రానిచ్చేవాడు కాదు. తన జీవితంలో మళ్ళీ తాను మామూలుగా నడవలేననే మాటను ఎంతమాత్రమూ ఒప్పుకొనేవాడు కాదు.

ఎంతబాధలో వున్నా అతడు ఎవరిమీదా కోపగించుకొనేవాడు కాదనీ, ఎవరిమీదా విసుక్కునేవాడు కాదనీ అంటారుగాని, ఆ మాట నిజంకాదు. ఒకొక్కప్పుడు అతడు చాలా చికాకు పడేవాడు. ఒకటి రెండు సార్లు అతడు తన కూతురు అన్నామీద చాలా కోపం తెచ్చుకున్నాడు. అప్పుడామె తన తండ్రిని ఆ స్థితికి తెచ్చిన ఆ దారుణమైన జబ్బును తలచుకొని, దుఃఖంతో ఆ గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయేది. కాని, మొత్తంమీద అతడు చాలా సహనంతో, వీలైనంత వరకు ఓపికతో, భవిష్యత్తును గురించి ఆశతోనే వుండేవాడు.

ఒక్క నిమిషంకూడా అతడు నిరాశను ఎప్పుడూ చూపలేదు. తన చికిత్సా విషయంలో డాక్టరుతోపాటు రోగాన్ని గురించీ, దాని చికిత్సా విధానాలను గురించీ కబుర్లుచెప్పి వైద్య విధానంలో కొత్త పరిశోధనపట్ల చాలా శ్రద్ధ చూపించేవాడు.

నలభై సంవత్సరాల వ్యక్తి, ఆనాటి పురుషులలో బహు సుందరుడైన వ్యక్తి, ఉత్సాహంతోనూ, శక్తి సామర్థ్యాలతోనూ ఊగులాడుతున్న వ్యక్తి, హఠాత్తుగా ఆవిటి తనాన్నిపొంది, తన గదిలో అటూ యిటూ చంటి పిల్లాడిలాగ నేలమీద ఒక మూలనుంచి మరొకమూలకు ప్రాకుతూ వుంటే చూసి, తన కడుపు తరుక్కుపోయిందని రూజ్వెల్టు బంధువు వొకడు చాలా వగచేవాడు. గదిలో ఒక మూలనుంచి, మరొక మూలకు ప్రాకడం నేర్చుకున్న తరువాత మేడమెట్లను ప్రాకి పైకి ఎక్కడానికి ప్రయత్నించేవాడు. ఒకొక్క మెట్టుమీదకే తన చేతుల ఆసరాతో తన శరీరాన్ని యీడ్చుకొని, చెమటలు ఊడ్చుకుంటూ ఆయాసంతో వగర్చుతూ రూజ్వెల్టు పైకి వెడుతూవుంటే, నాలుగేసిమెట్లు ఒకమాటు గంతువేస్తూ మేడయెక్కే మనిషి అవస్థ ఇలా అయిందికదా అని ఎవరికైనా దుఃఖం పొర్లుకు వచ్చేది. ఇలా చేసేటప్పుడు, తన కుటుంబం అందరినీ మాడమనేవాడు. తాను, మెట్టు మెట్టుకీ ఎక్కినప్పుడల్లా ఏవో మాటలు చెపుతూ ఆ మాటలకు బదులు చెప్పమని తన బంధువులను ప్రోత్సహించేవాడు. తాను రోగపు ఫలితాలనుంచి విముక్తుణ్ణవుతాననీ, మళ్ళీ ఆ రోగపు ఫలితాల నుంచి స్వాతంత్ర్యాన్ని పొందుతున్నాననీ ధ్రువపరచడమే, అతడింత యాతనను అనుభవించడానికి కారణం అయివుంది.

పక్షవాతపు జబ్బుపడిన తరువాత కదలికకు రూజ్వెల్టుకు నాలుగు పద్ధతులు వుండేవి. ఒకటి నడుముకి దట్టీలుకట్టుకొని చేతిలో ఒకబెత్తం పట్టుకొని ఎవరినైనా ఆనుకొని నడవడం; రెండు: నడుముకీ కాళ్ళకూ దట్టీలు కట్టుకొని చంకకర్రల సహాయంతో నడవడం; మూడు: చక్రాల కుర్చీలో కూచొని త్రోయించుకొని ఒకచోటినుంచి మరొకచోటికి వెళ్ళడం; నాలుగు: ఎవరిచేతనైనా మోయించుకోవడం. మోయించుకోవడం అంటే అతడు చాలా అసహ్యించుకొనేవాడు. ప్రజాసమూహం ఎదుట రూజ్వెల్టును మొయ్యడం అనేది ఎప్పుడూ జరగకూడదని, లూయీ హో

శాసించాడు. ఇంటిలో వున్నప్పుడు మాత్రం అతడు కొన్నివేలసార్లు ఒక చోటినుంచి మరొకచోటికి మోయించుకున్నాడు. అధ్యక్షుడుగా వున్నప్పుడు, భోజనాలగదికి అతిథులకన్న ముందుగా రూజ్వెల్టు పరిచారకులు మోసుకొనివెళ్ళి అతడికుర్చీలో కూచో పెట్టేవారు. కాని, అతడు ఎక్కువగా చక్రాల కుర్చీని ఉపయోగించేవాడు. ఒక కుర్చీలోకి అతణ్ణి అతి చాకచక్యంతో ఎవరికీ తెలియకుండా మార్చడంలో అతడి నౌకర్లు మంచి ప్రజ్ఞను సంపాదించారు.

ఈవిధంగా ఒకచోటినుంచి మరొకచోటికి వెళ్ళడం నేర్చుకొని, అతడు మెల్లగా తను ఉద్యోగంచేస్తున్న ఇన్సూరెన్సు కంపెనీకి వెళ్ళి రోజూ కొన్ని గంటలసేపు అక్కడ పనిచెయ్యడం సాగించాడు. కొంతకాలం తన లాయరు కంపెనీలో వుద్యోగం మానివేశాడు. ఏమంటే, ఆ ఆఫీసు చాలా ఎత్తైన మెట్లుగల మేడలోవుంది. అక్కడికి వెళ్ళి, ఆ మెట్లు ఎక్కడం అంటే సాధారణమైన పనికాదు.

క్రమంగా అతడికి ఆత్మ విశ్వాసం ఎక్కువకావడం ఆరంభించింది. త్వరలోనే చంకకర్రలను అవతల పారవేసి, మళ్ళీ రాజకీయ జీవితంలో ప్రవేశిస్తానని అతడు అనసాగాడు.

1923 వసంతకాలంలో, ఒక పడవలో ఫ్లోరిడా సముద్రంలో చాలా రోజులు గడిపాడు. అది అతడికి చాలా వుత్సాహాన్ని కలిగించింది. మళ్ళీ, శీతాకాలంలో మరొకసారి అలాగే సముద్రయానం చేశాడు.

ఆ సముద్రయానం వల్లనూ, సముద్రపు ఒడ్డున ఇసుకలో మెల్లగా నడవడంవల్లనూ, ఈతకొట్టడంవల్లనూ తన కాళ్ళకు కొద్దిగా బలంకలుగుతోందని అతడు తనతల్లికి ఉత్తరం వ్రాశాడు.

తన జబ్బును గురించి, రూజ్వెల్టు ఒక వ్యాసం వ్రాశాడు. దానిలో, పోలియోమైలైటిస్ జబ్బుపడినవాళ్ళందరికీ చికిత్సకాలంలో ఎలా ప్రవర్తించవలసిందో సలహాలు ఇచ్చాడు. కొద్దిగా శరీర వ్యాయామం చెయ్యడమూ, చర్మాన్ని తోమించుకోవడమూ, శరీరానికి సూర్యరశ్మి తగిలేటట్లు ఎండలో పడుకోవడమూ, వెచ్చని నీళ్ళలో ఈత కొట్టడమూ మంచిదనీ, అధిక శ్రమ, చన్నీళ్ళ స్నానము, గట్టిగా వొళ్ళు పట్టించుకోవడమూ, ఎక్కువ క్రొవ్వు పట్టే ఆహారం తినడమూ మంచిదికాదనీ అతడు వ్రాశాడు.

# వాంస్ప్రింగ్స్

ఒక దానికొకటి సంబంధంగల అనేక సంఘటనలు, విడివిడిగా, ఒక దాని కొకటి సంబంధం లేనట్టుగా జరిగి, తరువాత అన్నీ కలిసి ఒక అద్భుత ఫలితాన్ని కలిగిస్తాయి. మాట వరసకి ఈ క్రింది సంఘటనలు చూదాం. (1) జార్జియా రాష్ట్రంలో, వాంస్ప్రింగ్స్ అనే చోట ఒక ఉష్ణజలకుండం వుంది. (2) వేడి నీళ్ళలో ఈత కొట్టడం వల్ల, తన రోగులలో ఒకడికి చాలా మేలు కలిగిందని డాక్టర్ లవెట్ కనుక్కున్నాడు. (3) జార్జి ఫాస్టర్ పీబాడీ అనే పేరుగల న్యూయార్కులోని ఒక బ్యాంకరుతో రూజ్వెల్టుకు స్నేహం కలిసింది. (4) వాంస్ప్రింగ్స్ లోని ఉష్ణ జలకుండం వున్న ప్రాంతాన్ని అక్కడ వున్న ఒక పాత హోటలుతో సహా పీబాడీ కొని, తన మిత్రుడైన టాం లాయ్ లెస్ అనే అతడికి అద్దెకు యిచ్చాడు. (5) లూయీ జోసెఫ్ అనే కుర్రాడికి రెండు సంవత్సరాల క్రితం పోలియోమైలైటిస్ జబ్బు వచ్చిందనీ, వాంస్ప్రింగ్స్ ఉష్ణ జలాలలో స్నానం చెయ్యడం వల్ల ఆ కుర్రాడికి చాలా మేలు కలిగిందనీ లాయ్ లెస్, పీబాడీకి, వుత్తరం వ్రాశాడు.

ప్రతి మానవుని జీవితానికీ ఏదో విధమైన సంబంధంవుంది. లేకపోతే, లూయీ జోసెఫ్ అనే కుర్రాడు ఎవడు? అలాటి పేరుగల కుర్రాడు ఒకడు వున్నాడని కోటికి ఒకడికి కూడా తెలిసి వుండదు. కాని, ఆ కుర్రాడి వల్ల, రూజ్వెల్టు జీవితంలో మరొక ఘట్టం ప్రారంభ మైంది. తనకు లాయ్ లెస్ వ్రాసిన ఉత్తరాన్ని పీబాడీ, రూజ్వెల్టుకు చూపించాడు. మొదట్లో, ఆ వేడినీళ్ళ వల్ల జోసెఫ్‌కు పెద్ద మేలు కలుగలేదట. కొన్ని మాసాలపాటు రోజూ ఆ నీళ్ళలో కూచున్నందువల్ల, ఆ కుర్రాడు ఆ ఉష్ణ జలకుండంలో లేచి నిలబడ గలిగాడట. ఒక సంవత్సరం తరువాత, చేతికర్ర ఊతగా, ఆ కుర్రాడు నేలమీద నడవ గలిగాడట. అది, ఆ వుత్తరంలోని సమాచారం. ఆ వుత్తరాన్ని చదివిన వెంటనే, తక్కిన పనులన్నిటికీ స్వస్తి చెప్పి, రూజ్వెల్టు వాంగ్‌స్ప్రింగ్స్‌కు ప్రయాణం కట్టాడు.

వాంస్ప్రింగ్స్‌లోని జలకుండంలో నీటి వేడిమి, 78 డిగ్రీలు వుంటుంది. ఆ జలకుండానికి నీరు, కుండంలోపల వున్న బుగ్గద్వారా,

పాతాళంలోనుంచి వస్తుంది. ఆ నీరు చాలా మందంగా వుంటుంది. దాని నిండా భూలవణాలు వుంటాయి. అంత వేడి నీళ్ళలో ఎక్కువ సేపు నానితే కలిగే నీరసం కలుగకుండా, రోగులు దాదాపు రెండు గంటలసేపు ఆ జలకుండంలో వుండవచ్చును.

మొట్టమొదటిసారి వెళ్ళినప్పుడు రూజ్వెల్టు వాంస్ప్రింగ్సులో ఆరు వారాలు వున్నాడు. అంతకు పూర్వం మూడుసంవత్సరాలలో కోలుకున్న దానికన్న, యీ ఆరు వారాలలోనూ అతడు ఎక్కువ కోలుకున్నాడు. నీటిలో యీత కొట్టడం మొదలైన వ్యాయామం తాను చెయ్యడమే కాక, అక్కడ ఈ నీటిలో స్నానానికి వచ్చిన యితర రోగులకు కూడా అతడు నీటిలో చేసే శరీర పరిశ్రమ పద్ధతులను అనేకం నేర్పాడు.

మొదటిసారి అతడు ఇక్కడకు వెళ్ళడాన్నిగురించి అతడు అనుకున్న దానికన్న ఎక్కువ ప్రచారం జరిగింది. మళ్ళీ వసంత కాలంలో అతడక్కడకు వెళ్ళేటప్పటికి దాదాపు అరడజను మంది అవిటి వాళ్ళు, ఆహ్వానమూ, ఎరుకాలేకుండా అక్కడకు వచ్చి, రూజ్వెల్టు రాకకోసం ఎదురు చూస్తున్నారు. ఇదంతా, అక్కడి హోటలులో కొత్త సమస్యల్ని తెచ్చి పెట్టింది. ఆరోగ్యం బాగా పొందిన వాళ్ళు, రోగం పూర్తిగా వదలని వారితో కలిసి మెలిసి వుండడానికి భయపడుతున్నారు. అప్పుడు రూజ్వెల్టు, రోగులు భోజనం చెయ్యడానికి హోటలులో వేరే ఏర్పాట్లు చెయ్యడమే కాకుండా, వారు స్నానం చెయ్యడానికి ప్రత్యేకం ఒక కుండాన్ని కట్టించాడు. అతడికి డాక్టర్ రూజ్వెల్టు అనే పేరు వచ్చేసింది. అక్కడ వున్న ఒక డాక్టరు సహాయంతో, రోగుల చికిత్సకు ఒక కేంద్రాన్ని ఏర్పాటుచేసి, దానిని నిర్వహించే బాధ్యతను తను పెట్టుకున్నాడు.

తన పూర్ణారోగ్యానికి రూజ్వెల్టు కేవలం వాంస్ప్రింగ్స్ ఉష్ణ జలకుండం మీదనే ఆధారపడలేదు. దారుణమైన వ్యాధివల్ల బాధపడుతూ, దానినుంచి విముక్తి పొందాలని ఆశించే వ్యక్తులు ప్రతివారు చెప్పిన చిటకా వైద్యాలనూ ఎలా పాటిస్తారో అందరికీ తెలిసిన సంగతే.

పక్షం వాతంవచ్చి, కాళ్ళు అవిటిపడిన వారికి నడవడం నేర్పుతానని చికిత్స ప్రారంభించిన డాక్టర్ విలియం మెక్డొనాల్డ్ అనే వైద్యుడి దగ్గరకు

రెండుసార్లు వెళ్ళి కుర్చీలోనించి లేచి, మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ మరొక కుర్చీదాకా నడిచే ప్రజ్ఞను రూజ్వెల్టు సంపాదించాడు.

అయితే, అతడి ఆశలన్నీ వాంస్ప్రింగ్స్ మీదే వుండేవి. మాటిమాటికీ అక్కడకు వచ్చాడు. కొన్నాళ్ళు అక్కడ ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. తరువాత, ప్రత్యేకం ఒక ఇల్లు కట్టించుకున్నాడు. దానికి అతడు "లిటిల్ వైట్ హౌస్" అని పేరుపెట్టాడు. ఎప్పుడో తను ప్రెసిడెంటు అయి వైట్‌హౌస్‌లో వున్నప్పుడు, తాను యిక్కడకు వచ్చినప్పుడల్లా యీ వాంస్ప్రింగ్‌లోని ఇల్లు నిజంగా చిన్న వైట్‌హౌస్‌గా వుంటుందని అతడు ఆయింటికి ఆపేరు పెట్టినప్పుడు బహుశా అనుకుని వుండడు.

క్రమక్రమంగా రూజ్వెల్టు వాంస్ప్రింగ్స్‌ను ఎక్కువగా అభిమానించసాగాడు. ప్రతిసంవత్సరమూ శీతాకాలంలో అత డిక్కడకువచ్చి నివసించసాగాడు. ఎంచేతనో గాని, ఎలియనార్ మాత్రం వాంస్ప్రింగ్స్ చికిత్సపట్ల ఎక్కువ వుత్సాహం చూపలేదు.

1926 నాటికి రూజ్వెల్టుకు వాంస్ప్రింగ్స్ ఉష్ణజలకుండం వల్ల కలిగే ప్రయోజనాలు, ఎన్నోరోజులుగా తాను కోరినవే నని రూజ్వెల్టు గ్రహించాడు. అప్పటికి అతడిచేతిలో 23 మంది రోగులు వున్నారు. ఆ ఉష్ణజలాల ప్రయోజనాలను గురించి పరిశోధన చెయ్యడానికి కొంతమంది డాక్టర్లతో ఒక పరిశీలన సంఘాన్ని నియమించడం మంచిదని అతడు ఉద్దేశపడ్డాడు. వెంటనే ప్రముఖవైద్యులతో ఒక కమిటీ నియమించబడింది. ఆ కమిటీ నిర్ణయాలు చాలా అనుకూలంగా వున్నాయి.

అప్పుడు ఆ వాంస్ప్రింగ్స్ ప్రాంతాన్ని ఒక చికిత్సా కేంద్రంగా ఏర్పాటు చెయ్యడానికి, అక్కడి జలకుండాలతోనూ, హోటలుతోనూ, సుమారు 1200 ఎకరాలభూమిని వెయ్యడానికి రూజ్వెల్టు నిశ్చయించాడు. జార్జియా వాంస్ప్రింగ్స్ ఫౌండేషన్ అనే పేరుతో, లాభాలు సంపాదిద్దామనే ఉద్దేశం లేకుండా, చికిత్సా కేంద్రంగా పని చెయ్యడానికి ఒకసంస్థ ఏర్పాటు చెయ్యబడింది. అప్పటినుంచీ ఆ కేంద్రం పనిచేస్తూనే వుంది. రూజ్వెల్టు తన ఆస్తిలో చాలా భాగాన్ని 2,00,000 డాలర్లను, యీ సంస్థాపనకు ఇచ్చాడు.

# ఆ మరణాంత వేదన

దారుణమైన అవిటితనంవల్ల, రూజ్వెల్టు అనుభవాలు ఎలా మారాయి? కాళ్ళువుండి మామూలుగా నడవగల మనిషి, కాళ్ళులేని అవిటివాడి అవస్థ ఎలావుంటుందో గ్రహించలేడు.

నాట్యం చెయ్యడం, ఫుట్‌బాల్ ఆడడం, సైకిలు త్రొక్కడం, నడిచి ప్రయాణం చెయ్యడం మొదలైనవి, అవిటివాడు కలలోనైనా ఊహించలేని దుర్ఘట కార్యాలు. అవిపోగా, రెండుమూడు అంగుళాల కన్న ఎక్కువ ఎత్తువున్న మెట్లు ఎక్కలేక పోవడమూ, చిన్నపిల్లను ఎవరినైనా ముద్దుపెట్టుకోవా లనిపించి నప్పుడు వంగలేక పోవడమూ, నేలమీద కాళ్లు మడిచి కూచోలేక పోవడమూ, ప్రక్కనున్న వస్తువును దేన్నైనా అందుకోవాలంటే ప్రక్కకు వంగలేక పోవడమూ—ఇవన్నీకూడా మనిషికి అమితమైన ఆక్రోశాన్ని కలిగిస్తాయి.

అన్నిటికన్న మరీ జాలి కలిగించేదీ, అనుభవించే వాడికి అమితమైన మనోవేదనను పుట్టించేదీ ఏమిటంటే, అవయవాలు సరిగ్గా లేనివాడు తను చేద్దామనుకున్న పనులలో ఇరవయ్యోవంతు కూడా చెయ్యలేక పోవడం.

ఒక చోటినుంచి మరొక చోటికి వెళ్లాలంటే అతడుపడే అవస్థ, ఒక స్థలంనుంచి మరొకస్థలానికి కదలాలంటే అతడు అనుభవించే అసౌకర్యము, దుస్తులు మార్చాలంటే అతడుపడే బాధ, ఎవరికైనా జాలి కలిగించక మానవు.

రైలులో ప్రయాణంచేస్తూ చేతులెత్తి ప్రజలను పలకరించి నప్పుడు కొన్ని లక్షలమంది రూజ్వెల్టును చూసివుంటారు. అతడు తన రైలుపెట్టెలో కూచొని ఉపన్యాసా లిస్తూవుంటే ఎన్నోసార్లు లక్షలాదిగా ప్రజలు విన్నారు. ఇలా జరిగిన ప్రతిసారీ, అతడు ఎంత శ్రమను లోనయేవాడో చాలా తక్కువమందికి తెలుసు.

రైలులో ప్రయాణంచేస్తూ వున్నప్పుడు, అతని కార్యదర్శులలో ఒకడువచ్చి "పది నిమిషాలలో మనం ఫలానివూరు చేరుకుంటాము" అని చెపుతాడు. అప్పుడు రూజ్వెల్టు తాను చేస్తున్న పనిని నిలిపివేసి, నౌకరుచే పంట్లాము విప్పివేసి, దట్టీలు కట్టించుకుని మళ్ళీ పంట్లాము తొడుక్కొని,

రైలుపెట్టెలోని ఇవతలి ఖాళీజాగాలోకి వచ్చేవాడు. ఈలోపల రైలు, స్టేషనువద్ద ఆగేది. అక్కడ చేరిన జనసమూహానికి వుపన్యాసం చెప్పి, మళ్లీ రూజ్వెల్టు లోపలికి వెళ్ళి తన కుర్చీలో కూచొని పంట్లాంవిప్పి దట్టీలను వూడదీసి మళ్లీ పంట్లాం తొడుక్కొని, తనపని చూసుకొనేవాడు. ఇలాగ ఒకరోజులో రైలు ఎన్నిచోట్ల ఆగితే అన్నిసార్లు చేసేవాడు.

అనేకచోట్ల, ఏవైనా సభలు, సమావేశాలు జరిగినప్పుడు రూజ్వెల్టు తన కారులో రావడం చాలామంది చూసివుంటారు. అతడు కారులోనుంచి దిగడం చూసిన వారంతా విపరీతంగా జాలిపడి వుంటారు. మొట్టమొదట అతడికాళ్ళు కారులోనుంచి బయటకు సాచడం కనిపిస్తుంది. తరువాత, ఆ కాళ్లను ఒక్కసారి ముందుకు చేతులతో సవరించడం కనిపిస్తుంది. తరువాత రెండు చేతులతోనూ కారును గట్టిగా పట్టుకొని తన శరీరాన్ని అతడు ఒక్కవూపులో పైకి ఎత్తడం కనిపిస్తుంది. తరువాత, ప్రక్కన ఎవరినైనా ఆనుకుని అతడు నిలబడడం కనిపిస్తుది. ఇదంతా జరుగుతున్నప్పుడు మొదట్లో అతడిముఖం చాలా బిగించుకొని పోయినట్టు కనిపిస్తుంది. కాని జనాన్ని చూడగానే అతడు, చిరునవ్వుతో వారివైపు చూస్తాడు. అప్పుడతడి ముఖంలో తేట కనపడుతుంది.

ఎక్కడైనా వుపన్యాసాలు చేసేటప్పుడు, అతడు ఎత్తుగా పెట్టిన బల్లను గట్టిగా ఆనుకునేవాడు. ఆ బల్ల అతడి బరువుకు ఆగగలదోలేదో ముందుగా తణిఖీ చేసేవారు.

ఇరవై సంవత్సరాల కాలంలో అతడు అయిదారుసార్లు మాత్రం నిలబడి వుపన్యాసా లిచ్చేటప్పుడు జారిపడడం తటస్థించింది. మొట్టమొదటి సారి అధ్యక్ష పదవికి ఎన్నికల ప్రచారం చేసేటప్పుడు, జార్జియాలో అతడు ఆనుకున్నబల్ల అతని బరువుకు ప్రక్కకుజారగా అతడు పడిపోయాడు. అతని పరిచారకులు వెంటనే అతణ్ణి లేవదీశారు. లేచిన తక్షణమే, తను పడ్డప్పుడు తన వుపన్యాసం ఎక్కడ ఆగిందో, అక్కడనుంచి మళ్ళీ ప్రసంగించడం సాగించాడు. సభలోవున్న జనులు అదిచూసి బ్రహ్మాండంగా హర్షధ్వానాలు చేశారు.

నిద్ర పోతూవున్నప్పుడు తప్ప మిగతా సమయాలలో అతడు ఒక్కడూ వుండడానికి వీలులేకపోవడం రూజ్వెల్టుకు చాలా వేదనను

కలిగించేది. ఎల్లప్పుడూ ఎవరో ఒకరు తన ప్రక్కన వుండడం, అతడికి అవసరమైన ఏకాంతత్వము ఏ మాత్రమూ లేక అతడు మానసికంగా బాధ పడేవాడు. తనతో మాట్లాడడానికి ఎవరైనా వచ్చినప్పుడు, వారు మాట్లాడిన సంగతులు అయిపోగానే ఎక్కువసేపు కూచోకుండా వాళ్ళని పంపించి వెయ్యాలంటే తాను కుర్చీలోనుంచి లేచినట్లయితే సరిపోయేది. కాని, తాను అలా లేవలేక పోవడంవల్ల, కొంతమంది వచ్చిన పని అయిపోయినా చాలా సేపు కూచుని అతడిపనిని సాగనియ్యకుండా విసిగించేవారు.

అవిటితనం వల్ల అతడికి కొన్ని ప్రత్యేకపు లక్షణాలు ఏర్పడ్డాయి. ఇష్టంవచ్చిన చోటికల్లా వెళ్ళి అన్ని సంగతులూ స్వయంగా చూడలేక పోవడంవల్ల, ఎవరైనా లోకాభి రామాయణం చెపుతూవుంటే కుతూహలంతో వినేవాడు. శరీరంలో అణిగిపోయిన వుద్రేకోత్సాహాలను ప్రదర్శించడానికి ఎక్కువగా మాట్లాడడం ఒకమార్గం అవుతుంది. అది రూజ్వెల్టుకు పట్టుబడింది. అంతేకాక, కదలకుండా ఒకేచోట వుండేవానికి కాలం ఎంత మెల్లగా గడిచేదీ ఎంత శీఘ్రంగా గడిచేదీ వ్యత్యాసం బాగా తెలుస్తుంది. కాలపు నడకను గురించిన జ్ఞానం రూజ్వెల్టుకు చాలా ఎక్కువగా వుండేది. సరిగ్గా ఏ గంటకు, ఏనిమిషానికి ఏ పని జరగాలో అతడు బాగా పట్టుపట్టి జరిపించేవాడు. ప్రతిరోజూ ప్రతిపూటా తన భోజనానికి, ఒక్క సెకండు కూడా తేడా లేకుండా ఒకే వేళకు కూచునేవాడు. అంతేకాక, ఒక నిమిషానికీ మరొక నిమిషానికీ మధ్య ఎంతసేపో అతడికి బాగా తెలుసు.

మరొక విశేషం ఏమిటంటే, చిన్న చిన్న జబ్బులు ఏవివచ్చినా అతడు కొంత గాభరా పడేవాడు. మామూలు పడిశెమువచ్చినా అతణ్ణి చాలా సముదాయించవలసి వచ్చేది. జబ్బు మనుష్యుల దగ్గరవుండడం అంటే అతడు భరించలేక పోయేవాడు.

కాలం గడచినకొద్దీ అవిటితనం తనలో ఒకభాగమైపోగా, రూజ్వెల్టు తన జబ్బునుగురించి ఎక్కువ ఆలోచించడం మానివేశాడు. మానసికంగా తన అవిటితనాన్ని గురించి ఏ బాధపడినా బాహ్య ప్రవర్తనలో మాత్రం అవిటితనం తన తత్వంలో ఒక భాగమైనట్టుగా ఆతడు ప్రవర్తించేవాడు. అంతేకాదు. తన దైనందిన కార్యక్రమాలలో ప్రతి

స్వల్ప విషయంలో నూతన అవిటితనం కళ్లకుకట్టి కనిపిస్తూవున్నా తనకు ఏ విధమైన అవిటితనమూ లేనట్టే అతడు ప్రవర్తించేవాడు. ఎవరూ నమ్మజాలరుగాని, తన అవిటితనాన్ని గురించి అతడు ఏ ప్రస్తావనలోనూ ఒక్కసారికూడా పైకి అనలేదట.

తన జబ్బునుగురించీ జబ్బుకు కారణాలైన సంఘటనలను గురించీ అతడు ప్రస్తావించే వాడుకాదు. ఆ ప్రస్తావన అతని దగ్గర ఎవరూ తెచ్చేవారు కారు. అవిటి తనం వచ్చిన తరువాత గాఫ్ ఆటపేరు అతడు ఒక్కసారికూడా ఉచ్చరించలేదు. దానికి కారణం తన జన్మలో మళ్ళీ ఆ ఆటను ఆడలేననే భావమే అయివుంటుంది. తను పక్షవాతం వాతపడిన కాంపో బెల్లోకు 1933 దాకా ఒక్కసారికూడా మళ్లీ వెళ్లలేదు. మామూలు మనిషి ఏ యే పనులు చేస్తాడో, అవన్నీ చెయ్యడానికి మామూలు మనిషిలాగ జీవించడానికీ అతడు అన్ని విధాలా ప్రయత్నించే వాడు. తన పట్ల ఎవరైనా జాలిచూపడాన్ని అతడు ఎంతమాత్రమూ సహించే వాడు కాదు.

తన దుర్దశను ప్రెసిడెంటు రూజ్వెల్టు నిర్లక్ష్యంతో చూసినా యితరులు అలా చేసేవారు కారు. మొట్టమొదటిసారి అతణ్ణి చూసినవారూ ఒకచోటినుంచి మరొక చోటికి వెళ్లడానికి అతడుపడే బాధను చూసిన వారూ, చాలా ఆవేదన పడేవారు. రూజ్వెల్టు నడవలేడని బాగా తెలిసి, కూచుని వుండగా అతడిని ఎన్నోసారులు కలుసుకున్న పత్రికా విలేఖరులు కూడా, అతడు చక్రాలకుర్చీలో కూచొని త్రోయించుకుంటూ గదిలోకి వచ్చినప్పుడుగాని, చక్రాల కుర్చీని తానే త్రోసుకుంటూ వచ్చినప్పుడు గాని, ఇద్దరు ముగ్గురు మనుష్యులచేత మోయించుకుంటూ వచ్చినప్పుడుగాని చూసినట్లయితే, చాలా బాధపడేవారు. అతడు ఇలా వచ్చినప్పుడు, చాలా చిన్నమనిషిలాగ కనిపించేవాడు. పైగా, యునైటెడ్ స్టేట్సు ప్రెసిడెంటు అంతటి మహావ్యక్తి, ఒక చోటినుంచి మరొక చోటికి కదలలేని దుర్దశకు లోనయాడంటే అది ఎవరికైనా చాలా మనోవేదనను కలిగించి తీరుతుంది. అయితే, గదిలోకివచ్చి కూచున్న కొద్ది నిమిషాలలో, రూజ్వెల్టుముఖం ప్రసన్నతతో వికసించేది. అది చూసినప్పుడు, గదిలోని పత్రికా విలేఖరుల ముఖాలు వికాసంతో కళకళ లాడేవి.

రూజ్వెల్టు అవిటి వాడనీ, నడవలేడనీ, చక్రాల కుర్చీలోగాని, ఒక చోటినుంచి మరొక చోటికి వెళ్ళలేడనీ, అతడిని చూసిన వారికి తప్ప, తక్కిన వారికి, కోటాను కోట్ల ప్రజలకు తెలియదు. పత్రికలు యీవిషయాలను ప్రకటించేవి కావు. అతడి ఫోటోగ్రాఫ్‌లన్నీ నడుము పైభాగంనుంచే తీయబడేవి. అతడు చనిపోయిన దాకా, అతడు చక్రాల కుర్చీని వుపయోగించే వాడన్న మాట పత్రికలలో ప్రకటించబడలేదు.

యూరప్‌లోని వివిధరాజ్యాల ప్రధానోద్యోగులకు కూడా ప్రెసిడెంటు రూజ్వెల్టు అవిటి వాడని తెలియదు.

## అవిటితనపు అవస్థలు

రాజకీయాలలో ప్రవేశించి నప్పటినుంచీ, రూజ్వెల్టు అనవసరమైన శ్రమను ఎక్కువగా పడవలసి వచ్చేది. తన శరీరావస్థలో పెద్ద లోపం ఏమీ లేదని చూపడానికి, అతడు అనవసరంగా ఎక్కువ శ్రమకు లోనయేవాడు.

శారీరక దుర్దశ వల్ల, అతడు దుర్దశకు లోనైన వారి పట్ల ప్రత్యేకాభిమానం చూపేవాడనీ, ప్రత్యేకంగా ఆర్థిక దుర్దశలో వున్న వారిని బాగు చేద్దామనే పట్టుదల అతడికి తన శారీరక దుర్దశ వల్లనే కలిగిందనీ, అంచేతనే అతడు వామ పక్ష రాజకీయాలను అవలంబించాడనీ కొందరు అంటారు.

రూజ్వెల్టు తాను దట్టీలు ధరించడం వల్ల, తాను అధినేత అయిన దేశానికి, ఆర్థికంగా పురోగమించకుండా దట్టీలు కట్టాడనీ తాను అవిటివాడు కావడం వల్ల దేశంలోని ఆర్థిక వ్యవస్థకు అవిటితనాన్ని తెచ్చిపెట్టాడనీ, ఒక విలేఖరి అతణ్ణి విమర్శించాడు,

రూజ్వెల్టు శత్రువులంతా, ఏమాత్రం కారణం లేకుండానే, అతడి జబ్బును ఒక ఆధారంగా తీసుకొని, అప్పుడప్పుడు అతడు ప్రాణాపాయ స్థితిలో వున్నాడని ప్రచారం చేసేవారు.

పక్షవాతంతో అతడు సాగించిన పోరాటాన్ని, అతడు సాధించిన విజయాన్నీ చూసి, ఆ జబ్బు వచ్చిన అనేకులు మనోధైర్యాన్ని తెచ్చుకొని,

తాముకూడా చాలా వరకూ కోలుకొని సాధారణ జీవితాలను గడప గల మని ఆశ పడే వారు.

తాను పక్షవాతంనుంచి చాలావరకు కోలుకోవడం వల్ల, అతడికి భయం అనేది పోయి ఆత్మ విశ్వాసం ఎక్కువైంది. తన శక్తిని అతడు బాగా కూడబెట్టుకొని, దీక్షతో పనులు చెయ్యగలిగాడు. అవిటితనం వల్ల అతడి భావనాశక్తి సునిశితమైన రూపాన్ని పొందింది.

## పోలికలు

ఏదో ఒక అవిటితనంవల్ల జీవితమంతా బాధ పడిన మహామహులు, మానవజాతి చరిత్రలో ఎంతో మంది కనిపిస్తారు. అన్ని రంగాలలోను ఇలాటి మహామహులు వున్నారు. ముఖ్యంగా కళాకారులలో అవిటివారు ఎక్కువగా వున్నట్టు కనిపిస్తుంది. బహుశా, శారీరకమైన అవిటి తనం వల్ల, మనిషి మానసిక, భావ శక్తులు ఎక్కువ విజృంభిస్తాయేమో !

మహాకవి మిల్టన్, గ్రుడ్డివాడు; సంగీత సాహిత్య నిర్మాత బీతోవెన్, చెవిటివాడు; సుప్రసిద్ధ చరిత్రకారుడు గిబ్బన్ పెద్ద వరబీజంతో అవస్థ పడేవాడు. జూలియస్ సీజర్, మూర్ఛల రోగంతో బాధ పడ్డాడు. నీచ్ పిచ్చితో చచ్చిపోయాడు. ఇక క్షయ వ్యాధితో బాధపడినవారు లెక్క లేదు. వాల్టేర్, కాంత్, కీట్స్, డాస్టోవిస్కీ, మోలియర్, షిల్లర్, డెస్కార్టిస్, స్పినోజా, సిసిరో మొదలైన వారు క్షయ వ్యాధి పీడితులలో లెక్కకు వస్తారు. టాలీరాండ్ కుంటివాడు. కెయిజర్ చక్రవర్తికీ, లార్డ్ హాలిఫాక్సుకీ ఒక చెయ్యి చచ్చుపడి పోయింది.

అయితే, ఒక దారుణ యుద్ధ కాలంలో, ప్రపంచానికంతకూ మహా నాయకుడుగా పరిగణింపబడే ఘనతను పొందిన అవిటి మనిషి, ప్రెసిడెంటు రూజ్వెల్టు మినహాగా మరెవరూ లేరు.

## దేవుడు చేసిన మేలు

కొన్ని సందర్భాలలో, పక్షవాతపు జబ్బు రూజ్వెల్టుకు దేవుడు చేసిన ఒక మేలుగా పరిణమించింది. చిత్రంగా కనిపిస్తుంది గాని, అవిటి తనం వల్ల రూజ్వెల్టు అంగ సౌష్టవాన్ని పొందాడు! పక్షవాతం రాక

పూర్వం, రూజ్వెల్టు చాలా బక్క పలచగా వుండేవాడు. పక్షవాతం తరువాత, అతని బలమంతా అతడి మెడ, చేతులు, రొమ్ములలో కేంద్రీకృతమైంది. ముఖం విశాలమై, బాగా కండ పట్టింది. నడుముపైన, అతడి శరీరమంతా, ఒక మహా బలశాలి శరీరంలాగా రూపొందింది. అయితే జబ్బు వల్ల అతడి పాదవు రెండు అంగుళాలు తగ్గిపోయింది. ఒకసారి అతడు, కాళ్ళు చచ్చు పడిపోయిన తరువాత, కేవలం తన చేతుల సామర్థ్యం వల్ల, 237 పౌనుల బరువుగల సొర చేపను పట్టి ఒడ్డుకు లాగాడు. ఇది ఎంత కష్టమైన పనో, చేపల్ని పట్టేవారికి తెలుస్తుంది.

జబ్బువల్ల అతడి ఊర్ధ్వ కాయం విస్తరిల్లి, చక్కని రూపు పొందింది. అలాటి వ్యక్తి నడవలేడంటే, అతణ్ణి చూసినవారందరికీ ఆశ్చర్యం కలుగుతుంది.

అవిటితనం వల్ల అతడికి కలిగిన సదుపాయం ఏమిటంటే, తనకు ఇష్టం లేని పనులను చెయ్యకుండా వుండడానికి అతడికి అదొక సాకుగా ఉపయోగ పడేది. విందులను వినోదాలను విసర్జించి ఆ కాలంలో అతడు ఎంతో పని చేసుకోడానికి అవకాశం లభించింది. "కాళ్ళను వుపయోగించి కాలాన్ని వృధా చెయ్యను గనుక, నేను ఉపయోగకరమైన పనులను ఎక్కువగా చెయ్యగలను," అని రూజ్వెల్టు తన కొడుకు జేమ్సుతో ఒక సారి చెప్పాడు.

జబ్బు వల్ల, రూజ్వెల్టు మానసిక ప్రవృత్తి బాగా వికాసాన్ని పొందింది. బాధ పడడం అంటే ఏమిటో అతడు బాగా గ్రహించాడు. అంచేత, బాధ పడే వారి పట్ల అతడు సానుభూతి చూపించగలిగాడు. మనోనిశ్చయాన్నీ ప్రసన్నతనూ పొందాడు. కాళ్ళను నిలబెట్టలేక పోవడం వల్ల, మనస్సును నిలబెట్టడం సాధ్యం చేసుకున్నాడు.

తనను నిలబెట్టుకోవడానికి ధైర్యం అవసరమని గ్రహించి సందున, దేశాన్ని నిలబెట్టడానికి ప్రజలకు ధైర్యం కలిగించడం అవసరమని అతడు గ్రహించాడు. పక్షవాతవు జబ్బు, రూజ్వెల్టుకి దేవుడి వరప్రసాదం అని చెప్పవచ్చును. అతడు తన మనస్సును తాను లోబరచుకో గలిగి, యితరుల మనస్సును కూడా లోబరచుకున్నాడు.

తన జబ్బును తాను జయించాడు కనుక, దేన్నైనా తాను జయించగలనని అతడికి గొప్ప ఆత్మ విశ్వాసం కలిగింది. "ఓడి పోయినాకూడా, తాను ఓడి పోయానని అతడు అనుకోడు," అని హారీ హాప్కిన్సు ఒకసారి రూజ్వెల్టును గురించి అన్నాడు.

ఘోరమైన జబ్బువల్ల బాధ పడుతూ వున్నందున ప్రజాభిమానాన్ని సంపాదించి, అతడు అధ్యక్షుడు కాగలిగాడనీ, పక్షవాతపు జబ్బు రాకపోతే, అతడు ఎన్నటికీ అధ్యక్ష పదవిని పొందగలిగేవాడు కాదనీ చాలామంది అంటారు. కాని, అది నిజంకాదు. జబ్బు పడక పూర్వమే, అతడు కేవలం తన ప్రజ్ఞవల్ల పెద్ద స్థానాలను పొందాడు. పైగా పక్షవాతం పడ్డ వాళ్ళు అనేక మంది లక్షలాదిగా వున్నారు. వీరిలో ఎవరూ ప్రెసిడెంటు కాలేదు.

జబ్బు పడక పోయినట్లయితే, రూజ్వెల్టు ప్రెసిడెంటు అయేవాడా, అని ఒక మిత్రుడు అడిగితే, ఎలియనార్ ఇలా చెప్పింది : "అతడు తప్పకుండా అధ్యక్షుడయేవాడు. కాని, మరొక తరహా ప్రెసిడెంటుగా వుండేవాడు."

## పునర్జన్మ.

రూజ్వెల్టు మళ్ళీ రాజకీయాలలో ప్రవేశించడం, 1924లో ప్రెసిడెంటు పదవికి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా ఆల్ఫ్రెడ్ స్మిత్ పేరును ప్రతిపాదించడంతో జరిగింది. తరువాత నాలుగైదు సంవత్సరాలు అతడి రాజకీయ జీవితం అంతా, ఆల్ఫ్రెడ్ స్మిత్ రాజకీయ జీవితంతో పెనవేసుకొని నడిచింది.

ఈ నాడు, ఆల్ స్మిత్ పేరునే అందరూ విస్మరించారు. అప్పటికీ ఇప్పటికీ, మానవ జాతిలో మరొక కొత్త తరం పైకి వచ్చింది. వారెవరికీ ఆల్ స్మిత్ సంగతే తెలియదు. అది చాలా విచారకరమైన విషయం.

రాజకీయంగా రూజ్వెల్టు, స్మిత్ లకు చాలా దగ్గరి సంబంధాలు కలిగి వున్నా, వారిద్దరి మధ్యా ఎక్కువ అన్యోన్యత మాత్రం ఎప్పుడూ పొసగలేదు. స్మిత్ మీద రూజ్వెల్టుకు వున్న అభిమానంకన్న, రూజ్వెల్టుమీద స్మిత్ కు

ఎక్కువ అభిమానం వుండేది. 1912 నుంచీ రూజ్వెల్టు అంటే స్మిత్‌కు అభిమానం వుండేది. రూజ్వెల్టు చాలా పైకివస్తాడని స్మిత్ అనుకునేవాడు. గవర్నరు పదవికి పోటీచెయ్యడానికి 1918 లో రూజ్వెల్టు నిరాకరించి నప్పుడు, స్మిత్‌కు మొట్టమొదటి రాజకీయ అవకాశం లభించింది. స్మిత్ చాలా ఉద్రేకాలుగల మనిషి; అంచేత రూజ్వెల్టు అతడికి దూరంగా వుండేవాడు. పైగా, స్మిత్ అంటే రూజ్వెల్టు తల్లికి ఎక్కువ సరిపడేదికాదు. ఆరోజులలో ఇంకా రూజ్వెల్టు భావాలనూ, ప్రవర్తననూ తన ఇష్టప్రకారం దిద్దాలని రూజ్వెల్టు తల్లి ప్రయత్నించేదట. అటువైపు, స్మిత్ బంధువులూ మిత్రులూ రూజ్వెల్టు చాలా గర్విష్ఠి అనుకొనేవారు.

రూజ్వెల్టు చేసిన గొప్ప నిర్ణయాలలో ముఖ్యమైనది, రాజకీయాలలో మళ్ళీ ప్రవేశించడం. అతని జీవితంలో గొప్పమార్పుకి అదే కారణం. ఈ నిశ్చయాన్ని రూజ్వెల్టు చెయ్యడానికి, ఎక్కువగా ఎలియనార్ ప్రోత్సాహమే కారణం. అతడికి ఎక్కువ ప్రోత్సాహం కలిగించడానికి, ఎలియనార్ తానుకూడా రాజకీయాలలో ప్రవేశించింది. ఆమె తరువాత, రూజ్వెల్టును ఎక్కువగా ప్రోత్సహించిన వాడు లూయీ హో.

జీవితాంతం వరకూ ఏ ఇబ్బందీ లేకుండా అవిటివాడుగా హైడ్ పార్కులో జీవితం గడపడాన్ని నిరాకరించి, తన సంపూర్ణ ఉత్సాహంతో రూజ్వెల్టు రాజకీయ రంగంలోకి ప్రవేశించాడు. రాజకీయాలలో ప్రవేశించమని ప్రోద్బలం చెయ్యడమే కాక, అతడు అవిటివాడనే భావం అతడికి తోచకుండా చెయ్యడానికి న్యూయార్కులోని తమ యింట్లోనూ, హైడ్ పార్కులోనూ, ఎలియనార్ చాలా పాటుపడింది. జబ్బుమనిషి ఇంట్లో వున్నాడనే భావం లేకుండా చెయ్యడానికి, రూజ్వెల్టు కొంచెం కోలుకోవడం ప్రారంభించగానే, ఇంటిలోని నర్సులను పంపించివేసి, జబ్బుమనిషి కోసం చేసే ఏర్పాట్లన్నిటినీ ఆమె తీసివేసింది.

ప్రజలకు చాలామందికి ప్రత్యక్షంగా కనిపించలేక పోయినా, 1924 కు పూర్వం రూజ్వెల్టు రాజకీయాలలో జోక్యం కలిగించుకుంటూనే వుండే వాడు. రాజకీయాలను విడిచిపెట్టి, వ్యాపారంలోకి దిగిన ఆల్‌ఫ్రెడ్ స్మిత్‌ను రాజకీయాలలోకి మళ్ళీ లాగినవాడు రూజ్వెల్టే. ఆ రోజులలో న్యూయార్కు గవర్నర్ పదవికి పోటీ చేద్దామని విలియం రాండాల్ఫ

హోర్స్ట్ ఉద్యుక్తు డవుతున్నాడు. హోర్స్ట్‌ను ఓడించ గలవాడు, స్మిత్ ఒక్కడేనని రూజ్వెల్టు భావించాడు. స్మిత్, రూజ్వెల్టుమాట విన్నాడు. హోర్స్ట్‌ను ఓడించి, బ్రహ్మాండమైన విజయాన్ని పొందాడు. న్యూయార్క్ తరఫునే సెనెటర్‌గా ఎన్నికకు పోటీ చెయ్యమని రూజ్వెల్టును స్మిత్ కోరాడు. కాని, తాను సంపూర్ణంగా కోలుకోలేదని గ్రహించి రూజ్వెల్టు, స్మిత్ కోరికను నిరాకరించాడు.

1924 ఫిబ్రవరిలో, రూజ్వెల్టూ, ఎలియనారూ, అధ్యక్ష పదవికి పోటీ చెయ్యమని స్మిత్‌ను కోరారు. స్మిత్ అంగీకరించాడు. తన ఎన్నికల ప్రచారానికి మేనేజరుగా వుండమని రూజ్వెల్టును స్మిత్ అడిగాడు. రూజ్వెల్టు అంగీకరించాడు. న్యూయార్కులోని డెమొక్రాటిక్ పార్టీ నాయకత్వాన్ని స్మిత్‌కు కట్టబెట్టాలనే తీర్మానాన్ని ఎలియనార్ బలపరిచింది. డెమొక్రాటిక్ పార్టీ మహాసభలో తనపేరు ప్రతిపాదించమని రూజ్వెల్టును స్మిత్ కోరాడు. ఎన్నికల ప్రచారపు మేనేజరు అధ్యక్ష పదవికి అభ్యర్థిని ప్రతిపాదిస్తూ మహాసభలో ఉపన్యసించడం, అంతకుపూర్వం ఎప్పుడూ జరగలేదు. అయినా, అలా చెయ్యడానికి రూజ్వెల్టు అంగీకరించాడు. ఉపన్యాసాన్ని తయారు చేశాడు.

డెమొక్రాటిక్ పార్టీ మహాసభ న్యూయార్కులో 1924 జూన్ 26 న జరిగింది. రూజ్వెల్టు తన ఉపన్యాసాన్ని చదివాడు. ఏడు సంవత్సరాల అనంతరం, రూజ్వెల్టు చేసిన ప్రధాన ఉపన్యాసం ఇదే. వేదికమీదకు అతణ్ణి అతని అనుచరులు చక్రాలకుర్చీలో కూచోబెట్టి మోసుకు వెళ్లారు. చంక కర్రల సహాయంతో నిలబడి, ఎత్తైన బల్లను ఆనుకుని రూజ్వెల్టు తన ఉపన్యాసాన్ని చదివాడు. అతడు, ఉపన్యాసం చదువుతూ వున్నంతసేపూ, అతడికొడుకు జేమ్సు, పదిహేడేళ్ళ వాడు, తండ్రిని పట్టుకొని నిలుచున్నాడు. డెమొక్రాటిక్ నేషనల్ కమిటీ ఛైర్మన్‌గా వున్న కార్డెల్ హాల్, రూజ్వెల్టు ప్రక్కనే నిలబడివున్నాడు. రూజ్వెల్టును వేదిక ఎక్కించేటప్పుడు, న్యూయార్కునుంచి వచ్చిన ప్రతినిధులు గొప్ప ఉత్సాహంతో హర్షధ్వానాలు చేశారు. ఉపన్యాసం చాలా చక్కగా నడిచింది. ఉపన్యాసం ముగించి రూజ్వెల్టు కూచున్న తరువాత సభికులు 73 నిమిషాల సేపు విరామం లేకుండా హర్షధ్వానాలు చేశారు. ఆ సభాధ్యక్షుడు ఎంత

ప్రయత్నించినా హర్షధ్వానాలు ఆగలేదు. చిట్టచివరకు, రూజ్వెల్టు తన చిన్న కొడుకు సహాయంతో, చేయిపైకి ఎత్తి ఆగమని సభికులకు సూచనలు చెయ్యగానే ఒక్క క్షణంలో సభ అంతా నిశ్శబ్దమై పోయింది.

అయితే, స్మిత్‌కు విజయం లభించలేదు. పార్టీ అభ్యర్థిగా అతణ్ణి మహాసభ ఎన్నుకోలేదు. స్మిత్, మెక్ ఆడూ, ఇద్దరూ ఒకరితో ఒకరు పోటీలుపడి ఇద్దరూ ఓడిపోయారు. చిట్టచివరకి, పార్టీ అభ్యర్థిగా జాన్ డబ్ల్యు డేవిస్ ఎన్నుకోబడినాడు. తన అభ్యర్థి ఓడిపోవడంతో ఎన్నికల ప్రచారంలో రూజ్వెల్టు ఎక్కువగా పాల్గొనలేదు.

అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానికి కాల్విన్ కూలిడ్జినీ వుపాధ్యక్ష పదవికి చార్ల్స్ డాస్‌నూ రిపబ్లికన్ పార్టీ నిలబెట్టింది. ఎన్నికలలో డెమొక్రాటిక్ పార్టీ ఓడిపోయింది. చాలా ఎక్కువ ఓట్లతో కూలిడ్జి అధ్యక్షపదవికి ఎన్నుకోబడినాడు.

రూజ్వెల్టు ప్రతిపాదించిన స్మిత్, పార్టీ అభ్యర్థిగా ఎన్నుకోబడక పోయినప్పటికీ ఆ మహాసభలో చేసిన ఉపన్యాసంవల్ల రూజ్వెల్టు ప్రతిష్ఠ చాలా హెచ్చింది. దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ వచ్చిన ప్రతినిధులందరూ అతడిపట్ల గౌరవభావాన్నీ, అభిమానాన్నీ ప్రదర్శించారు. దేశంలోని అన్ని ప్రతినిధివర్గాల గౌరవభావాన్ని ప్రశంసాభావాన్నీ పొందిన నాయకుడు అతడొక్కడే ఆ మహాసభలో కనిపించాడు.

ఆ మహాసభ ముగిసిన కొద్దిరోజుల తరువాత న్యూయార్కు-గవర్నరుపదవికి పోటి చెయ్యడానికి ఎన్నికలలో నిలబడమని రూజ్వెల్టుకు ఆహ్వానంవచ్చింది. కాని, చంకకర్రలు లేకుండా నడవగలస్థితికి వచ్చే వరకూ, తాను యే పదవికీ ఎన్నికలలో పాల్గొననని రూజ్వెలు ఆ ఆహ్వానాన్ని నిరాకరించాడు.

## ఇతర రంగాలలో ప్రవేశం

ఆ రోజులలో పరిస్థితులు అనుకూలించినంతవరకూ, రూజ్వెల్టు ఇతర రంగాలలో ప్రవేశించాడు. అయితే ఆ ప్రయత్నాలన్నీ సంపూర్ణమైన

పట్టుదలతో చేసినవికావు. అతని ప్రాణమంతా అతడి కాళ్ళమీద ఉండేది. నాలుగైదు ప్రజాసంస్థల కార్యక్రమాలలో అతడు పాల్గొన్నాడు.

1925 జనవరిలో బెసిల్ ఓ'కన్నార్ అనే ఒక మిత్రునితో కలసి మరొక లాయరు కంపెనీని స్థాపించాడు. ఈ కంపెనీ ఆఫీసుకూడా అతడు పనిచేసే ఇన్సూరెన్సు కంపెని వున్న భవనంలోనే పెట్టాడు. అంచేత రెండో కంపెనీకి మరొకచోటికి వెళ్ళవలసిన బాధ తప్పించుకున్నాడు. ఆ రోజులలో అతడుచేసిన ఇన్సూరెన్సు వ్యాపారం అంతకుపూర్వం చేసినదానికి రెట్టింపు అయింది. వేరే రెండుమూడు రకాల ఇతర వ్యాపారాలుకూడా అతడు చేశాడు కాని, అవి అంతగా లాభించలేదు.

ఆ రోజులలో రూజ్వెల్టు డబ్బుకోసం కొంత ఇబ్బందిపడినట్టు కనిపిస్తుంది. అతడి జబ్బుకి చాలా డబ్బు ఖర్చు అయింది. తల్లిని అడిగి తీసుకోవడం అతడికి ఇష్టం మనస్కరించినట్టు లేదు. అంచేత 1925 లో తను తయారుచేసిన నౌకల నమూనాలను వేలంవేశాడు. దానివల్ల 4,537 డాలర్లు వచ్చింది. ఈ విషయాన్ని పత్రికలు వెంటనే ప్రకటించాయి.

చాలామందికి తెలియదుగాని, రూజ్వెల్టు కొన్నాళ్ళు టెలిగ్రాఫ్ అనే జార్జియాలోని ఒక పత్రికలో ఒక శీర్షికకు వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు. ఆ శీర్షికను మొదట్లో వాంస్ప్రింగ్స్‌లోని తామస్ లాయ్‌లెస్ వ్రాసేవాడు. కాని అనారోగ్య కారణాలవల్ల అతడు దానిని మానుకోవలసి వచ్చింది. అతడికి బదులుగా తాను వ్రాస్తానని రూజ్వెల్టు "రూజ్వెల్టు చెప్పేది" అనే శీర్షికతో కొన్ని వ్యాసాలను ఉచితంగా వ్రాశాడు. ఆ వ్యాసాలు ఎక్కువగా పన్నులను గురించీ ప్రభుత్వోద్యోగులను గురించీ విమర్శనలు; చదవడానికి అంత బాగుండేవి కావు. ఒక విశేషం ఏమిటంటే, రూజ్వెల్టు అధ్యక్షుడయిన తరువాత అతణ్ణి పదవినుండి తొలగించాలని ఆందోళనచేసిన పత్రికలలో టెలిగ్రాఫ్ ఒకటి.

తరువాత కొన్నాళ్ళు న్యూయార్కులోని బీకన్ అనే, పత్రికకు వ్యాసాలు వ్రాసేవాడు. అవి కొంత బాగుండేవి. ఆ వ్యాసాలను పునర్ముద్రించుకోవడానికి, దేశంలోని అనేక ప్రాంతాలనుంచి పత్రికలు అనుమతికోరేవి. పత్రికలలో వ్యాసాలు వ్రాసినందువల్ల వచ్చిన అనుభవాన్నిబట్టి అతడు గ్రహించినదేమంటే, రోజు. కొకసారి కాదు

గదా, వారానికి రెండుసార్లుకూడా ప్రజా వ్యవహారాలమీద వ్యాసాలు వ్రాయడం సులభమైన పనికాదని.

1925–1928 ల మధ్య, రూజ్వెల్టుమీద ఎలియనార్‌కు ఎక్కువ పెత్తనం లభించింది. ఆ రోజులలో ఆమె రాజకీయాలలో పాల్గొనడం కూడా బాగా ఎక్కువైంది. రోజురోజుకీ, అతడికి పరిచయం చెయ్యడానికి కొత్తవాళ్లను ఎవరో ఒకర్ని ఆమె తీసుకొని వస్తూనే వుండేది. ఉపాధ్యాయులు, సంఘ సేవకులు, శాస్త్ర పరిశోధక విద్యార్థులు, పత్రికా సంపాదకులు, రచయితలు మొదలైన అనేకవర్గాలకు చెందిన అనేకమందిని రూజ్వెల్టు ఆ రోజులలో తన భార్య ద్వారానే పరిచయం చేసుకున్నాడు. మొదట్లో ఆ మనుష్యులు ఆవేశంతప్ప మరేమీలేనివారని అతడు అనుకునేవాడు. క్రమేపీ వారందరికీ నూతన భావాలు వున్నాయని అతడు గ్రహించాడు. కొద్దికాలంలోనే అతడు కొత్త మిత్రులను, సంగతులు తెలుసుకోవడానికి కొత్త ఆధారాలను సంపాదించాడు. నూతన భావాలు అతడి మనస్సులో స్థావరం ఏర్పరచుకోసాగాయి.

రూజ్వెల్టు ఎప్పుడూకూడా రాజకీయాలనువిడిచి, వాటికిదూరంగా పోలేదు. వాంస్ప్రింగ్స్‌లో వున్నా అతడి మిత్రులు చాలామంది అతడిని, జార్జియారాష్ట్రానికి గవర్నరుగా ఎన్నికలలో నిలవమని ప్రోత్సహించారు. కాని అతడు అంగీకరించలేదు. న్యూయార్కు డెమొక్రాటిక్ మహాసభలో అల్‌ఫ్రెడ్ స్మిత్ ఓడిపోయిన తరువాత, డెమొక్రాటిక్ పార్టీ ప్రముఖులకు అతడు సుమారు వెయ్యి వుత్తరాలు వ్రాశాడు. సభ్యులందరూ ఐకమత్యం పెంపొందించుకోవాలనీ, 1925లో జరగబోయే మహాసభనాటికి, పార్టీ ఒక ప్రధాన కార్యప్రణాళికను తయారుచేసుకోవాలనీ అతడు ఉద్ఘాటించేవాడు.

మరొక విశేషం ఏమిటంటే, అతడు జబ్బుపడి కోలుకుంటూవున్న రోజులలో, అతడి రాజకీయ మిత్రు లెవరూకూడా అతణ్ణి వదలిపెట్టలేదు. నాయకుడు అధికారంలో వున్నప్పుడు అతణ్ణి అంటిపెట్టుకొని వుండటంలో గొప్ప ఏమీలేదు. నాయకుడు పడిపోయినప్పుడు అతణ్ణి వదలక పోవడంలోనే గొప్పవుంది. 1920 లో అతని పక్షానవున్న రాజకీయ మిత్రులంతాకూడా, 1928లో కూడా అతని పక్షాన్నే వుండడం అతడి గొప్పతనాన్ని చాటుతుంది.

# హూస్టన్‌పార్టీ మహాసభ

1928లో డెమొక్రాటిక్ పార్టీ మహాసభ హూస్టన్‌లో జరిగింది. ఈ సభలోకూడా, అధ్యక్షపదవికి ఆల్‌ఫ్రెడ్ స్మిత్‌ను అభ్యర్థిగా నియమించాలనే ప్రతిపాదనను రూజ్వెల్టే చేశాడు. 1926నుంచీకూడా ఆల్‌ఫ్రెడ్ స్మిత్ అభ్యర్థిత్వం కోసమే రూజ్వెల్టు కృషిచెయ్యడం ఆరంభించాడు. మహాసభ చాలా గందరగోళంగా జరిగింది. అయినప్పటికీ అభ్యర్థిత్వపు ఎన్నికలో స్మిత్ గెలిచాడు. న్యూయార్కు మహాసభలో రూజ్వెల్టు ఉపన్యసించినప్పుడు సమ్మోహితులైనట్లుగా యీసారి సభలో ప్రతినిధులు సమ్మోహితులు కాలేదు. కాని, ఈ ఉపన్యాసంతో, రూజ్వెల్టు మళ్ళీ రాజకీయరంగిలోకి సంపూర్ణంగా ప్రవేశించాడని స్పష్టమైంది. ఈసారి సభలో, వేదికమీద అతడు చంకకర్రలు లేకుండా, బెత్తం చేతపట్టుకొని దానిని ఆని నడవగలిగాడు. ఆ సభలో అతడుచేసిన ఉపన్యాసం, ఒక పెద్దమనిషి కొందరు పెద్దమనుష్యులతో మాట్లాడినట్లు చాలా చక్కగావుందని న్యూయార్కు టైమ్సు పత్రిక వ్రాసింది.

హర్షధ్వానాలు అయిపోయిన తరువాత, డెమొక్రాటిక్ పార్టీ అధ్యక్షుడుగా వుండమని ప్రతినిధులు రూజ్వెల్టును కోరారు. కాని అతడు ఆ పదవిని నిరాకరించాడు.

# గవర్నరు పదవికి పోటీ

1928 సెప్టెంబరులో, శీతాకాలం అంతా అక్కడే గడిపే వుద్దేశంతో రూజ్వెల్టు వాంస్ప్రింగ్స్‌కు వెళ్లాడు. అక్కడి జలకుండంపైన ఒక కప్పు కట్టబడింది. శీతాకాలంలో కూడా, రోగులు ఆకుండంలో స్నానం చెయ్యడానికి వసతి ఏర్పరచబడింది. రూజ్వెల్టు చాలావరకు కోలుకున్నాడు. ఒకసారి అతడు, ఏ ఆధారాన్నీ అనుకోకుండా కొన్ని అడుగుల దూరం నడిచాడుకూడా.

తనకున్న వ్యవధి నంతటినీ వాంస్ప్రింగ్స్‌లోనే గడిపినట్లయితే, దట్టీలు లేకుండా తాను నిలబడగలనని ఆశించాడు. కాని, ఈ ఆశమాత్రం ఎన్నటికీ ఫలించలేదు. దానికి కారణం, బహుశా, అతడు వాంస్ప్రింగ్స్‌లో

ఎక్కువకాలం గడపక పోవడమే. దానికి కారణం, న్యూయార్కు గవర్నరు పదవికి పోటీచెయ్యడానికి రూజ్వెల్టును అల్ స్మిత్ ఒప్పించడమే. అంటే ఒక విధంగా, రూజ్వెల్టు తన కాళ్లను మళ్ళీ ఉపయోగానికి తెచ్చుకోలేక పోవడానికి కారకుడు అల్ స్మిత్ అని చెప్పవలసి వస్తుంది.

1928 అక్టోబరులో గవర్నరు పదవికి పోటీలో దిగినప్పటినుంచి అసువులను విడిచే వరకూ, రూజ్వెల్టు ఒక్కక్షణంకూడా తీరికలేని మనిషి అయిపోయాడు.

పార్టీ అభ్యర్థిగా ఎన్నుకోబడిన అల్ఫ్రెడ్ స్మిత్ ఆ రోజులలో అధ్యక్ష పదవికి పోటీచేస్తున్నాడు. అప్పుడతడు న్యూయార్కు గవర్నర్‌గా వున్నాడు. అతని స్థానంలో గవర్నరుగా వుండటానికి మనిషి కావాలి. గవర్నర్ పదవికి పోటీచెయ్యమంటే, రూజ్వెల్టు కాదన్నాడు. ఏ అభ్యర్థీ దృష్టిలో లేకుండా, ఎవరో ఒకర్ని అభ్యర్థిగా ఎన్నుకోడానికి న్యూయార్కు రాష్ట్రపు డెమొక్రాటిక్ పార్టీ మహాసభ జరుగబోతోంది. లెఫ్టినెంట్ గవర్నర్ పదవికి పోటీచెయ్యడానికి హెర్బర్ట్ హెచ్. లేమన్ అంగీకరించాడు; కాని గవర్నరు పదవికి అభ్యర్థి కనపడలేదు. గవర్నరు పదవికి పోటీచెయ్యమని రూజ్వెల్టును స్మిత్ ఒత్తిడి చెయ్యడంలో చాలా ముఖ్య కారణాలు వున్నాయి. న్యూయార్కు రాష్ట్ర శాసనసభలోని 47 ఓట్లు తనకు వస్తేనేగాని తాను అధ్యక్ష పదవిని గెలవలేనని స్మిత్ అనుకున్నాడు. ఆ ఓట్లను తనకు ఇప్పించగల వ్యక్తి రూజ్వెల్టేనని అతడి విశ్వాసం. రూజ్వెల్టుకు ప్రజలలో ఎక్కువ పలుకుబడి వుండడమేకాక, డెమొక్రాటిక్ పార్టీలోని అన్ని ముఠాలలోను అతడి మాటకి చెలామణీ వుంది.

రూజ్వెల్టుమాత్రం నిజంగా పోటీచెయ్య దలచలేదు. దానికి కారణాలు మూడు కనిపిస్తాయి. వాంస్ప్రింగ్స్‌లో చికిత్సను పూర్తిచేసు కుందామని కోరడం ఒకటి; తాను అసలు ఎన్నికలలో ఓడిపోతానేమో అనే భయం రెండు; అధికారంకోసం పెద్ద ప్రయత్నం చెయ్యడానికి అదును ఇంకా రాలేదనే భావం మూడు.

పైగా పోటీకి అంగీకరించవద్దని లూయీ హౌ సలహా ఇచ్చాడు. హౌ అలా సలహా ఇవ్వడానికి కారణం ఆ సంవత్సరం అధ్యక్షపదవికి ఎన్నికలలో హెర్బర్ట్ హూవర్ గెలుస్తాడని రెండుసార్లు అతడు

అధ్యక్షుడుగా ఉంటాడనీ, అంచేత 1932 దాకా రూజ్వెల్టు గవర్నరు పదవికి పోటీ చెయ్యకూడదనీ 1932 లో గవర్నరు పదవికి పోటీచేస్తే 1936 నాటికి అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానికి రూజ్వెల్టుకు మంచి అదునుగా ఉంటుందనీ హౌ ఊహించాడట. కాని, అలా జరగలేదు. హౌ అనుకున్నప్రకారం జరిగినట్లయితే అమెరికాదేశపు చరిత్ర మరోలాగ ఉండేది!

స్మిత్ మాత్రం రూజ్వెల్టును వదలలేదు. తప్పకుండా గవర్నరు పదవికి పోటీ చెయ్యమని రూజ్వెల్టును కోరుతూ స్మిత్ ఒక టెలిగ్రాంను 1928 సెప్టెంబరు 27 న పంపించాడు. దానికి జవాబు అక్టోబరు 1 న పంపాడు రూజ్వెల్టు. కాని, స్మిత్ తన పట్టుదలను వదలలేదు.

అక్టోబర్ 2 వ తేదీన రూజ్వెల్టు వాంస్ప్రింగ్‌లో ఉన్నాడు. ఆనాడు అతడితో టెలిఫోనులో మాట్లాడాలని స్మిత్ ప్రయత్నించాడు. పగలంతా రూజ్వెల్టు టెలిఫోనులో మాట్లాడడానికి నిరాకరిస్తూనే వచ్చాడు. "ఒప్పుకో" అని తనకూతురు అన్నా పంపిన టెలిగ్రాంకు, "నీ వీపు బ్రద్దలుకొట్టాలి" అని జవాబు పంపించాడు. చిట్టచివరకు రాత్రి మళ్ళీ టెలిఫోను వచ్చింది. రూజ్వెల్టు టెలిఫోను ఉన్న ఒక దుకాణానికి చాలా దూరస్థలంలో ఉన్నాడు. టెలిఫోను దగ్గరకు వెళ్ళకన్నాడు. కాని, రూజ్వెల్టు వచ్చి టెలిఫోనులో మాట్లాడేదాకా తాను టెలిఫోను వదలనని అవతలివైపున స్మిత్ మొండికివేశాడు. చిట్టచివరకు రూజ్వెల్టు టెలిఫోనుదగ్గరకు వెళ్ళాడు. తాను ఎన్నికలో నిలబడనంటే నిలబడనని అతడు పట్టుదలతో చెప్పాడు. వాంస్ప్రింగ్స్ నిధికి 25,000 డాలర్లను ఇస్తాననీ దాని అభివృద్ధి విషయమై బెంగ పెట్టుకోవద్దనీ జాన్ రాస్కాబ్ అనే ఒక మోటారుకంపెనీ యజమాని రూజ్వెల్టుకు చెప్పాడు. ఆ సమయంలో టెలిఫోనులైను చెడిపోయింది. అర్ధరాత్రివేళ వాంస్ప్రింగ్స్‌లో టెలిఫోనుద్వారా మళ్లీ సంభాషణలు ప్రారంభమయాయి. రూజ్వెల్టు తాను గవర్నరుపదవికి పోటీ చెయ్యనని నిక్కచ్చిగా చెప్పాడు. "మహాసభ నిన్ను అభ్యర్థిగా పెట్టినాకూడా నువ్వు పోటీ చెయ్యవా?" అని స్మిత్ అడిగాడు. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి రూజ్వెల్టు తటపటాయించాడు. స్మిత్ కోరినదదే. వెంటనే టెలిఫోను మూసివేశాడు.

మరునాడు ఉదయం పత్రికలలో న్యూయార్కు గవర్నరుపదవికి పోటీ చెయ్యడానికి అభ్యర్థిగా రూజ్వెల్టును న్యూయార్కు రాష్ట్రపు డెమొక్రాటిక్ పార్టీ మహాసభ ఎన్నుకున్నదని ప్రకటన జరిగింది. అప్పుడు తాను ఒక అభ్యర్థినని రూజ్వెల్టు ఆరోగ్యాన్ని గురించి భయపడ్డారు.

రూజ్వెల్టు జీవితంలోకల్లా అత్యంత సౌఖ్య ప్రదమైన మాసాలలో ఒకటి అతడు గవర్నరు పదవికి పోటీలో ప్రచారంచేసిన నెల. సంతోష మైన ఉత్సాహంలో అతడు ఎన్నికల ప్రచారాన్ని సాగించాడు. ఆ రోజులలో అతడు తన జబ్బుమాటను పూర్తిగా మరిచిపోయాడు. "ఇంకా ఆరుమాసాలు ఇలా ప్రచారంలో పాల్గొన్నానంటే బెత్తం పట్టుకోవలసిన అవసరంకూడా లేకుండా నేను నిలబడగలను" అని అతడే ఆ రోజులలో ఒకసారి అన్నాడు.

తరువాత 17 సంవత్సరాలు తన జీవితాంతంవరకూ తనకు అపరిమిత సేవచేసిన జడ్జి రోసెన్‌మాన్‌ను, రూజ్వెల్టు యీ ప్రచారపు రోజులలోనే కలుసుకున్నాడు. ప్రచారంలో రూజ్వెల్టు ఉపన్యాసాలన్నీ స్మిత్ అభ్యర్థిత్వాన్ని గురించిన మాటలతో నిండిపోయాయి. "తానుకూడా ఒక అభ్యర్థి అనే సంగతిని జ్ఞాపకం తెచ్చుకొని తన ఎన్నికను గురించి కూడా కొంత ప్రచారం చేసుకోమను" అని రూజ్వెల్టు మిత్రులు చాలా మంది అతడికి కబుర్లు పంపించారు. అప్పుడు రూజ్వెల్టు తన అభ్యర్థిత్వాన్ని గురించి మాట్లాడుతూ, కార్మిక సమస్యలనుగురించి ప్రసంగించాడు. ఈ ప్రసంగాన్ని తయారుచెయ్యడంలో రోసెన్‌మాన్ అతడికి సహాయపడ్డాడు. అప్పటినుంచీ 1945 దాకా రూజ్వెల్టు ఉపన్యాసాలను తయారు చెయ్యడంలో రోసెన్‌మాన్ సహాయపడుతూనే ఉన్నాడు. అతడిచెయ్యి పడనిదే రూజ్వెల్టు ఉపన్యాసం ఒక్కటికూడా తయారుకాలేదు.

ఎన్నికల నాటిరాత్రి రూజ్వెల్టు చూపిన స్థయిర్యం చాలా ప్రశంసనీయ మైనది. రాత్రి ఎన్నికల ఫలితాలు ఒకొక్క చోటనుంచే రావడం సాగే టప్పటికి రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి హూవర్, స్మిత్‌ను బాగా ఓడిస్తున్నాడని స్పష్టం అయిపోయింది. న్యూయార్కు రాష్ట్రంలో కూడా హూవర్‌కే ఎక్కువ వోట్లు పడ్డాయి. గవర్నరు ఎన్నికలో కూడా రూజ్వెల్టుకూ, అతడి ప్రత్యర్థి ఆల్బర్ట్ ఆటింజర్‌కూ పోటీ చాలా తీవ్రంగా జరిగింది. మొదట్లో

వచ్చిన వోట్ల లెఖ్ఖలలో ఆటింజర్ కే ఎక్కువ ఓట్లు వచ్చాయి. రూజ్వెల్టు ఓడిపోయినట్లే అని అందరూ నిశ్చయించారు. అర్థరాత్రి వచ్చిన పత్రికలన్ని కూడా రూజ్వెల్టు ఓడిపోయాడనే ప్రకటించాయి. అర్థరాత్రి దాటిన తరువాత, రూజ్వెల్టు సలహాదార్లు చాలా మంది ఇక లాభంలేదని, యిళ్ళకు వెళ్లిపోయారు కూడాను.

అయినా రూజ్వెల్టు మాత్రం తాను ఓడిపోయానని ఒప్పుకోకుండా, రాత్రంతా దూరదూరాన్నుంచి వస్తూవున్న ఓట్ల లెఖ్ఖలన్నిటినీ కూడుతూ కూచున్నాడు. లెక్కపెట్టడంలో ఎక్కడైనా పొరపాటు జరిగిందేమో, సరిగ్గాచూసి ఓట్లు లెక్కపెట్టడంలో చాలా జాగ్రత్తగా వుండమని రాష్ట్రం లోని అన్నిప్రాంతాల షెరీఫులకు ఉదయం ఆరు గంటలదాకా రూజ్వెల్టు టెలిఫోను చేస్తూ కూచున్నాడు. రూజ్వెల్టు, ఆ పని చెయ్యకపోతే, బహుశా ఓడిపోయేవాడేమో. రూజ్వెల్టు ఓడి పోయాడని నిశ్చయించుకొని, అతడి తల్లి శారా, భార్య ఎలియనార్ ఇంటికి వెళ్ళి పడుకున్నారు. మరునాడు ఉదయం పత్రికలు అధ్యక్ష పదవికి పోటీచేసిన ఆల్ఫ్రెడ్ స్మిత్ కు న్యూయార్కు రాష్ట్రంలో 1,03,481 ఓట్లు తక్కువచ్చాయనీ, అతడు ఓడిపోయాడనీ రూజ్వెల్టు 25,564, ఓట్లను ఎక్కువగా తెచ్చుకొని, న్యూయార్కు గవర్నరుగా ఎన్నుకో బడినాడనీ ప్రకటించాయి. 25,000 వోట్లతో, రూజ్వెల్టు ఆ ఎన్నికలలో గెలవకపోతే, అమెరికా చరిత్ర, రూజ్వెల్టు చరిత్ర, ఎలావుండేవో !

# గవర్నర్ రూజ్వెల్టు

1928నుంచి 1932దాకా రూజ్వెల్టు న్యూయార్కు గవర్నర్ గా చేసినపనిని ఒక్కమాటలో చెప్పాలంటే, రూజ్వెల్టు గొప్ప గవర్నర్ కాదు గాని, మంచి గవర్నర్ అని చెప్పాలి. రూజ్వెల్టుకు పూర్వం న్యూయార్కు గవర్నర్ గా వున్న స్మిత్, పరిపాలనాశాఖలోవున్న కశ్మలాన్ని శుభ్రంగా తుడిచివేసి, ఎన్నో సాంఘిక సంస్కరణలకు దారి చూపించాడు. అంచేత స్మిత్ ప్రారంభించిన పనులను కొనసాగించడం మినహాగా, రూజ్వెల్టు కొత్తగా చేయవలసినపని ఏమీ లేకపోయింది. రూజ్వెల్టు గవర్నరుగావున్న రోజులలో అతడుచేసిన పనిని చూస్తే, ప్రెసిడెంటుగా అతడుసాధించిన

ఘనకార్యాలను ప్రాతిపదిక ఎక్కడా కనపడదు. గవర్నరుగా విశేషప్రజ్ఞను చూపని రూజ్వెల్టు, ప్రెసిడెంటుగా మహాకార్యాలను సాధించగలడని ఎవరూ అనుకొనివుండరు.

ప్రెసిడెంటుపదవి తరువాత, అమెరికాలోని అత్యున్నతపదవి న్యూయార్కు గవర్నరుపదవి. న్యూయార్కు గవర్నరుహోదాకు పై హోదా ప్రెసిడెంటు ఒక్కడిదే. అప్పటివరకు రూజ్వెల్టుపొందిన పెద్దపదవి అదే.

ఎన్నికల ఫలితం తరువాత, రూజ్వెల్టుకూ, స్మిత్‌కూ నడిచిన సంబంధాలు చిత్రమైనవి. న్యూయార్కు రాష్ట్ర పరిపాలన, పేరుకు రూజ్వెల్టు గవర్నరైనా, తన యిష్టప్రకారం జరుగుతుందని స్మిత్ భావించాడు. రూజ్వెల్టు ఎక్కువకాలం వాంస్ప్రింగ్‌లో గడపుతాడనీ, పేరుకుమాత్రమే అతడు గవర్నర్‌గా వుంటాడనీ స్మిత్ భావించాడు. కాని, రూజ్వెల్టు మాత్రం అలా అనుకోలేదు. అంచేత, స్మిత్‌కు పాపం చాలా ఉక్రోషం వచ్చింది. "నువ్వు గవర్నరు అవడానికి కారణం నేను, నామాట ఏమిటి?" అన్నట్టుగా అతడు రూజ్వెల్టుపట్ల ప్రవర్తించాడు. రూజ్వెల్టు మంచి తెలివితేటలు, ఓపిక, పట్టుదల చూపించాడు. వీరిద్దరికీ మొట్ట మొదటి పేచీ ఉద్యోగాలు యివ్వడంలో వచ్చింది. తాను గవర్నరుగావున్నప్పుడు తాను నియమించిన ప్రధానోద్యోగులందర్నీ ఆ పదవులలో వుంచగుని స్మిత్ కోరాడు. అంటే పరిపాలనా నిర్వహణ తన చేతిలో వుంచుకోవాలని అతడు కోరాడన్నమాట, దానికి రూజ్వెల్టు అంగీకరించలేదు. తన ఇష్టంవచ్చిన వారిని పెద్ద వుద్యోగాలలో వేసుకుంటానని రూజ్వెల్టు స్పష్టంగా చెప్పివేశాడు ఇలా చెయ్యడంలో స్మిత్‌పట్ల రూజ్వెల్టు అన్యాయంగా ప్రవర్తించాడని కొందరు అంటారు. కాని, స్మిత్‌కు రూజ్వెల్టు వాగ్దానాలు ఏమీ చెయ్యలేదు. పైగా న్యూయార్కులో స్మిత్‌కువచ్చిన వోట్లకంటె చాలా ఎక్కువ వోట్లు రూజ్వెల్టుకు వచ్చినవి. అంచేత రూజ్వెల్టును తాను గెలిపించానని చెప్పడానికి స్మిత్‌కు ఎంత మాత్రమూ ఆస్కారంలేదు,

గవర్నరు పదవిని స్వీకరించిన కొత్తలో రూజ్వెల్టును జాగ్రత్తగా కనిపెట్టినవారు, అతడిలో తాము అనుకోని శక్తి సాహసాలు చాలా ఉన్నాయని గ్రహించారు. గవర్నరుగా పదవి స్వీకరించినవెంటనే అతడు ప్రవేశపెట్టిన బడ్జెటును శాసనసభ నిరాకరించింది. కాని, శాసనసభ

నిర్ణయాన్ని త్రోసి రాజన్నాడు రూజ్వెల్టు. రూజ్వెల్టు నిర్ణయాన్ని మళ్ళీ కాదనడానికి శాసనసభకు సాహసం లేకపోయింది. అంచేత ఒక రాజ్యాంగ ప్రతిష్టంభన ఏర్పడింది. చిట్టచివరకు యీ విషయం కోర్టు కెక్కింది. కోర్టు తీర్పులో రూజ్వెల్టు గెలిచాడు. ఇన్నాళ్ళ తరువాత ఇప్పుడిది ఒక స్వల్ప విషయంగా కనిపిస్తుంది గాని ఆ రోజులలో న్యూయార్కు ప్రజలందర్నీ ఉద్రిక్తుల్ని చేసిన మహాసమస్య అది. క్రమమైనా, అక్రమమైనా తనుచేసిన పనివల్ల ప్రజలందర్నీ ఉద్రిక్తుల్ని చెయ్యగల ప్రజ్ఞ రూజ్వెల్టుకు ఉంది.

జీవితాంతంవరకూ తనకొలువులో ఉండిపోయిన అనేక సుప్రసిద్ధ వ్యక్తులు రూజ్వెల్టుచుట్టూ యీ కాలంలోనే చేరారు. అప్పటికప్పుడే మిస్సీ లిహాండ్, మిస్ టుల్లీలు రూజ్వెల్టు ఇంటిలో స్థిరపడిపోయారు. రోసెన్‌మాన్ అతడి ముఖ్య సలహాదార్లలో ఒకడయాడు. రాష్ట్ర ప్రభుత్వ కార్మిక శాఖాధిపతిగా ఫ్రాన్సెస్ పెర్కిన్స్‌ను రూజ్వెల్టు నియమించాడు. వ్యవసాయిక సలహా సంఘానికి అధిపతిగా హెన్రి మోర్గంతో నియమించబడినాడు.

హారీ హాప్కిన్సు రూజ్వెల్టువద్దకు చేరిందికూడా ఈ కాలంలోనే. రూజ్వెల్టును ఇంతకాలమూ ప్రతిఘటిస్తూ అతనికి వ్యతిరేకంగా పని చేస్తూ ఉన్న అనేకమంది రిపబ్లికనులు యీ రోజులలోనే రూజ్వెల్టుతో స్నేహం చేసుకొని జీవితాంతంవరకూ అతని మిత్రులయారు. వారిలో ముఖ్యులు: జనరల్ డొనవన్: జాన్ జి. వైనాంట్; హెన్రీ ఎల్. స్టిమ్సన్; ఎఫ్. ఎచ్. లాగార్డియా.

1930 లో తనపదవి మొదటి పరిమితి ముగియగానే, గవర్నరు పదవికి రూజ్వెల్టు మళ్ళీ పోటీచేశాడు. అతడికి ప్రత్యర్థిగా పోటీ చెయ్యడానికి రిపబ్లికనులు వెతికివెతికి చార్ల్స హెచ్. టట్టిల్ అనే వ్యక్తిని పట్టుకున్నారు. రూజ్వెల్టు తన ప్రచారపు ఉపన్యాసాలలో ఒక్కసారి కూడా టట్టిల్ పేరును ప్రస్తావించలేదు. టట్టిల్ అనే మనిషి ఒకడున్నాడని తాను గుర్తించినట్లు అతడు ఎక్కడా కనపడలేదు. ఈ సారి ఎన్నికలలో అతడు బ్రహ్మాండమైన విజయాన్ని పొందాడు. 1928 లో 25,000 ఎక్కువ వోట్లతో గెలిస్తే 1930 లో అతనికి 7,25,000 ఓట్లు ఎక్కువగా వచ్చాయి. న్యూయార్కు రాష్ట్రపు చరిత్రలో ఏ ఎన్నిక

లోనూ ఏ అభ్యర్థికీ అంత యెక్కువగా అదివరకెన్నడూ ఓట్లు రాలేదు. అంతేకాదు. అంతకుముందు డెమొక్రాటిక్ అభ్యర్థికి ఎవరూ ఓటు వెయ్యని ప్రాంతాలలోకూడా ఎక్కువ ఓట్లు రూజ్వెల్టుకే పడ్డాయి. ఇంత గొప్ప విజయానికి కారణం, కేవలం రూజ్వెల్టు వ్యక్తిత్వమే. ఈ విజయం వల్ల కలిగిన రెండు ఫలితాలు ఏమిటంటే: దేశంలోని ప్రముఖులలో రూజ్వెల్టు ఒకడయాడు. అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానిక 1932 లో డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా వుండడానికి అతణ్ణి మించినవాడెవడూ లేకుండా పోయాడు.

అధ్యక్షుడయిన తరువాత రూజ్వెల్టు అమలులోకి తెచ్చిన అనేక ఆర్థిక విధానాలకు ప్రాతిపదికలను అతడు న్యూయార్కు గవర్నరుగా ఉన్నప్పుడు అవలంబించిన విధానాలలో చూడవచ్చును.

1929 లో న్యూయార్కు స్టాక్ ఎక్స్చేంజి విపరీతంగా దెబ్బ తిన్నది. దేశమంతటా ఆర్థిక మాంద్యస్థితి నానాటికీ తీవ్రతర మౌతున్నది. దేశానికి ఇదొక తీవ్రమైన సమస్య. ఈ సమస్యా పరిష్కారానికి మార్గాలను వెతకడంలో రూజ్వెల్టు చాలా దీర్ఘంగా ఆలోచించసాగాడు. అనేక కొత్త విషయాలను అతడు చాలా చకచకా నేర్చుకొన్నాడు.

దేశంలోని యీ దారుణ ఆర్థిక మాంద్య పరిస్థితిని చక్కజెయ్యడానికి ఆ రోజులలో ప్రెసిడెంట్ హూవర్ అవలంబించిన విధానాలు వేరు; రూజ్వెల్టు ఆలోచించిన విధానాలు వేరు.

> దేశం అంటే మనుష్యులు. దేశంలోని సామాన్య ప్రజలు, తమ తప్పేమీ లేకుండానే, తమ జీవనం సాగించుకొనేందుకు వృత్తులు ఏమీ లేకుండా బాధ పడుతున్నారంటే, ధర్మం క్రింద కాకుండా విధికీత్యా, వారికి జీవనోపాధి కల్పించడం ప్రభుత్వ బాధ్యత.
> రూజ్వెల్టు అవలంబించిన విధానం ఇది.

ఈ మాటలు అతడు చెప్పినప్పుడు, ఆనాడు అతనిని ఒక విప్లవవాది అని ధనిక వర్గాలవారు దూషించారు. ఈనాడు, ఆ మాటలు ప్రభుత్వ పరిపాలనా విధానంలో ఒక సూత్రమైపోయాయి.

ఆ మాటలు చెప్పి రూజ్వెల్టు ఊరుకోలేదు. కార్యాచరణకు పూనుకున్నాడు. న్యూయార్కు రాష్ట్ర శాసనసభ సమావేశాన్ని జరిపించి, నిరుద్యోగులకు సహాయం చేసే నిమిత్తం ధనాన్ని మంజూరు చేయించాడు. అమెరికాలో, మొట్టమొదట యీ పని చేసిన శాసనసభ, న్యూయార్కు శాసనసభే.

ఈ పని జరగడంతో, రూజ్వెల్టు వామ పక్ష వాది అనే ప్రచారం ప్రబలి పోయింది.

రూజ్వెల్టు అందరిచేత మంచివాడనిపించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడనీ, ఏ విషయంలోనూ గట్టిగా పనిచెయ్యడం లేదనీ అతడి విరోధులు ప్రచారం ప్రారంభించారు.

ఇంతలో అధ్యక్ష పదవి ఎన్నికల ప్రచార కాలం ఆసన్నమైంది. దానికి తోడు న్యూయార్కు మేయర్ జేమ్స్ వాకర్ సమస్య ఒకటి రూజ్వెల్టును ఎదుర్కొన్నది.

ఈ ఉదంతం ఏమిటంటే: ఆ రోజులలో న్యూయార్కు మేయరు జేమ్సు వాకర్. అతడు డెమొక్రాటిక్ పార్టీ పెద్దలలో ఒకడు; పార్టీ పెద్దలలో చాలా పలుకుబడి కలవాడు. ఆల్ఫ్రెడ్ స్మిత్‌కు చాలా సన్నిహితుడు. అతడు లంచగొండి అవునో కాదో చెప్పడం సాధ్యంకాదు. కాని, అతనిక్రింది వుద్యోగులంతా విపరీతమైన లంచగొండులుగా తయారయారు. న్యూయార్కు మేయరు ఆఫీసు అంతా లంచగొండితనంతో మురిగిపోతున్నది. రాష్ట్రమంతా దీనిని గురించి విపరీతమైన ఆందోళన బయలుదేరింది. పత్రికలు చాలా తీవ్రమైన ప్రచారం సాగించి, వాకర్‌ను పదవి నుంచి బర్తరఫ్ చెయ్యాలని ఒత్తిడి చెయ్యడం ఆరంభించాయి. గవర్నరుగా వున్న రూజ్వెల్టు, ఏమిచెయ్యడానికీ వీలులేని సంకటస్థితిలో పడ్డాడు, మాట్లాడక వూరుకుంటే లాభంలేదు. వాకర్‌ను బర్తరఫ్‌చేస్తే, అతడు డేమొక్రాటిక్ పార్టీ పెద్దలందరి ఆగ్రహానికీ గురికావాలి. దానికి తగినట్టు, డెమొక్రాటిక్ పార్టీలోని కన్సర్వేటివ్ వర్గానికి చెందిన పెద్దలంతా అప్పటికే రూజ్వెల్టుకు ప్రతికూలురయారు. ఈ విషయంలో తన కర్తవ్యాన్ని నిర్ణయించుకోవడానికి రూజ్వెల్టుకు చాలారోజులు పట్టింది.

చిట్టచివరకు దేశంలో ఆందోళన మరీ ఎక్కువ అయింది. అప్పుడు రూజ్వెల్టు వాకర్‌ను బహిరంగంగా అనేక ప్రశ్నలతో విచారణ చెయ్యడం ప్రారంభించాడు. చిట్టచివరకు తనను రూజ్వెల్టు బర్తరఫ్ చేస్తాడని గ్రహించి వాకర్ తన పదవికి రాజీనామా ఇచ్చేశాడు. ఈ విధంగా, తన ప్రతిష్ఠకూ వాకర్ పక్షంవారిలో తన పలుకుబడికీ ముప్పు లేకుండా రూజ్వెల్టు ఆ సమస్యను పరిష్కరించాడు.

గవర్నరు పదవిలో రూజ్వెల్టు చాలా కార్యాలను సాధించాడు. ప్రజల సౌకర్యాల కొరకు ఏర్పడిన సంస్థల నన్నిటినీ, బస్సు సర్వీసు, నీటి సప్లయి, విద్యుచ్ఛక్తి సప్లయి మొదలైన వాటిని, ప్రభుత్వమే నిర్వహించాలని వాదించాడు. కార్మికులు వారానికి 54 గంటలు పనిచెయ్యాలనడం చాలా అన్యాయమని అన్నందుకు అతణ్ణి ఆ రోజులలో 'కమ్యూనిస్టు' అని అన్నారు కూడాను.

గవర్నరైన తరువాత రూజ్వెల్టు, న్యూయార్కు రాష్ట్రంలో ఆదాయపు పన్నును నూటికి 50 వంతులు ఎక్కువ చేశాడు. అతడు పదవి స్వీకరించినప్పుడు, రాష్ట్ర ప్రభుత్వపు ఖజానాలలో చాలాడబ్బు మిగులు వుంది. అతడు గవర్నరు పదవినుంచి విరమించే టప్పటికి 10 కోట్ల డాలర్ల లోటు తేలింది. ఇంతడబ్బు ఖర్చుకావడానికి ప్రధాన కారణం, నిరుద్యోగులకు ఆర్థిక సహాయంచేసే విధానాన్ని అమలు జరపడమే.

గవర్నరుగా వున్నప్పుడు అతడు ఒక ప్రత్యేకమైన చర్యను అలవాటు చేసుకున్నాడు. అదే దిన చర్య, అతడు అధ్యక్షుడైన తరువాత కూడా సాగింది. గవర్నరుగా వుండగా అతడు రోజుకు రెండు సార్లు పత్రికా విలేఖరులతో గోష్ఠి జరిపేవాడు.

తనకు ప్రతికూలంగా వున్న శాసనసభతో ఎలా మెలగవలసిందీ, గవర్నరు పదవిలో వున్నప్పుడే అతడు చక్కగా నేర్చుకున్నాడు. గవర్నరుగా వుండి, రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకూ వెళ్ళి అన్ని వర్గాల ప్రజల మంచి చెడ్డలనూ జాగ్రత్తగా పరిశీలించినందువల్ల, నిరుద్యోగులు పడే అవస్థలను గురించీ, దీనదశలో వున్న ప్రజల బాధలను గురించీ స్వయంగా సమస్త వివరాలనూ తెలుసుకో గలిగాడు.

# అధ్యక్ష పదవికి పోటీ

అమెరికాకు ప్రెసిడెంటు అవుదామనే కోరిక రూజ్వెల్టుకు చిన్నప్పటినుంచీ వున్నట్టుంది. ప్రెసిడెంటు అవడానికి తనకు మంచి అవకాశం వుందని, రూజ్వెల్టు 1907 లో లాయరు కంపెనీలో పని చేసినప్పుడు తనతోటి గుమాస్తా ఒకడితో చెప్పాడట. ఒకసారి లండన్ టైమ్సు పత్రికా విలేఖరితో రూజ్వెల్టు ఇలా చెప్పాడు: "ఇరవై సంవత్సరాలుగా, ప్రెసిడెంటు అవుదామనే కోరిక నాకు వుంది. అంచేత, అధ్యక్షుడు కాబోయే వ్యక్తి ఎలా ప్రవర్తించాలో అలా ప్రవర్తించవలసిన అవసరం నాకు కలిగింది."

కాని మధ్యలో వచ్చిన పక్షవాతపు జబ్బు, ఆ ఆశకు పంగనామం పెట్టేసింది. మళ్ళీ 1928 దాకా, అతడుగాని, అతడి మిత్రులుగాని అధ్యక్ష పదవిని గురించి తలపెట్టడానికికూడా వీలులేక పోయింది.

అయితే, ఆల్ ఫ్రెడ్ స్మిత్‌ను డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా నిలబెట్టడానికి నిర్ణయం జరిగిన హూస్టన్ మహాసభ అనంతరం అధ్యక్ష పదవిని గురించి రూజ్వెల్టు ఆలోచించ సాగాడని అతడి కొడుకు జేమ్సు చెపుతున్నాడు.

1922 లో రూజ్వెల్టు, తన మిత్రుడు జాన్ డబ్ల్యు డేవిస్‌తో మాట్లాడుతూ "1924 లో అధ్యక్ష పదవికి నువ్వు అభ్యర్థివిగా వుంటావు" అని జోస్యం చెప్పాడట. అప్పుడు డేవిస్ "నువ్వే వుండవచ్చును" అన్నాడట. దానికి రూజ్వెల్టు, "1932 లోపల నేను తయారు కాలేను" అన్నాడట.

ఏమయినా, 1930 ప్రాంతానికి అధ్యక్ష పదవికి పోటీ చేసే ప్రధాన అభ్యర్థులలో పరిగణింపబడవలసిన ఒక ముఖ్య వ్యక్తి అయినాడు రూజ్వెల్టు. రెండోసారి గవర్నరు పదవికి పోటీ చెయ్యడానికి ప్రచారం ప్రారంభించక పూర్వమే చాలా చోట్ల బహిరంగ సభలలో "ఈ సారి కాబోయే ప్రెసిడెంటు" అని రూజ్వెల్టును ప్రజలు ఉత్సాహంతో హర్షధ్వానాలు చెయ్యడం సాగించారు. గవర్నరు పదవిని రెండోసారి గెలిచిన తరువాత, యీ ప్రచారం చాలా బలంగా సాగిపోయింది. ఆ రోజులలో ఇతర్లే

అధ్యక్ష పదవికి అభ్యర్థిగా నిలబెట్టాలని గట్టిగా వాదించిన వారిలో, ముఖ్యులు సెనెటర్ బర్టన్ వీలర్; సెనెటర్ డేవిడ్ వాల్ష్. వీరిద్దరూ కూడా యుద్ధకాలంలో అమెరికా యుద్ధంలో దిగకూడదని వాదించి, రూజ్వెల్టుకు తీవ్ర విరోధులయారు.

క్రమక్రమంగా డెమొక్రాటిక్ పార్టీలో చాలా మంది ప్రముఖులు రూజ్వెల్టు పక్షం వహించ నారంభించారు. రూజ్వెల్టుకు అనుకూలంగా ప్రచారం బాగా ప్రబల నారంభించింది.

దేశమంతటా, డెమొక్రాటిక్ పార్టీ ప్రతినిధులను రూజ్వెల్టుకు అనుకూలంగా త్రిప్పడంలో జేమ్సు ఫార్లే చాలా కృషి చేశాడు. రూజ్వెల్టు అభ్యర్థిత్వాన్ని గురించి ప్రచారం చెయ్యడానికీ, ప్రచారానికి కావలసిన డబ్బును పోగు చెయ్యడానికీ, ఒక కమిటీ ఏర్పాటు చేయబడింది. మొట్ట మొదట ఆ కమిటీలో సభ్యులైన పదహారు, పదిహేడు మంది సభ్యులలో ముఖ్యులు ఫ్రాంక్ డి. వాకర్; లారెన్స ఎ. స్టెయిన్‌హార్ట్; జేమ్స్ జెరార్డ్ మొదలైన వారే కాక, రూజ్వెల్టు తల్లి శారా కూడా ఒక సభ్యురాలే.

ఎలియనార్ రూజ్వెల్టు, ఆ కమిటీలో సభ్యురాలుగా చేరలేదుగాని ఆ కమిటీకి విశేషంగా సహాయం చేసింది. రూజ్వెల్టు స్వయంగా చాలా కృషి చేశాడు. తనకు ఉపయోగ పడతాడనుకున్న ప్రతి డెమొక్రాట్ తోనూ, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. వీలైనంతవరకు అందరితోనూ సాయిలాపాయిలాగా వుండడానికి ప్రయత్నం చేశాడు. రెండోసారి తాను గవర్నరుగా వున్న రెండు సంవత్సరాలలోనూ, అతడు సుమారు అయిదు వేల వుత్తరాలు వ్రాశాడు.

క్రమేపీ, రూజ్వెల్టు కమిటీలో ఎక్కువమంది సభ్యులు చేర నారంభించారు. వుడిన్ అనే సభ్యుడు 10,000 డాలర్లనూ, ఫ్రాంక్ వాకర్ 5000 డాలర్లనూ, హెన్రీ మోర్గంతో 5000 డాలర్లనూ, రూజ్వెల్టును గురించిన ప్రచారానికి విరాళాలు ఇచ్చారు. ఈ ప్రచారంలో పాల్గొని తనకు సహాయం చేసిన చాలా మందికి రూజ్వెల్టు తాను ప్రెసిడెంటు అయిన తరువాత పెద్ద పెద్ద వుద్యోగాలిచ్చాడు. కమ్మింగ్స్‌కు అటర్నీ జనరల్ పదవీ, హారీ డర్నింగ్‌కు న్యూయార్కు కస్టమ్స్ కలెక్టర్ పదవీ, రాబర్ట్

గోర్‌కు పోర్ట్‌రికో గవర్నర్ పదవీ, డబ్ల్యు. ఎ. జూలియన్‌కు కోశాధికారి పదవీ, కార్డెల్ హల్‌కు విదేశ వ్యవహారాల మంత్రి పదవీ కాక, చాలా మందికి రాయబారుల పదవులను ఇచ్చాడు. తన ఎన్నికల ప్రచారంలో సహాయం చేసిన వారికి ఇలా పదవులను ఇవ్వడం ఇతర దేశాలవారికి వెగటుగా కనిపిస్తుంది. కాని, ఇది యునైటెడ్ స్టేట్సు రాజకీయ సాంప్రదాయాలకు ఏ మాత్రమూ భిన్నం కాదు. పైగా, ఇలా వుద్యోగాలను ఇవ్వడంలో, రూజ్వెల్టు అసమర్థులెవరకీ పదవులను కట్టబెట్టలేదు.

రూజ్వెల్టును అధ్యక్ష పదవికి అభ్యర్థిగా నిలబెట్టడానికి, డెమొక్రాటిక్ పార్టీలోని చాలా పలుకుబడి గల పెద్దలు కొందరు అనుకూలించలేదు. అధ్యక్షుడు కాదగిన తాహతు రూజ్వెల్టుకు లేదని వారి వాదం. పైగా, అతడు వామపక్ష రాజకీయ వాది అని వారు అయిష్టం వెల్లడించారు. రూజ్వెల్టుకు వున్నదంతా, ఘరానా కుటుంబపు పేరు, చక్కని మందహాసము, మంచి మాటలు ప్రయోగించడం తప్ప మరేమీ లేదని ఒక పార్టీ పెద్ద రూజ్వెల్టును నిరాకరించాడు. డెమొక్రాటిక్ పార్టీ అధ్యక్షుడు రాస్కాబ్ రూజ్వెల్టును అభ్యర్థిగా నిలబెట్టడానికి తనకు ఎంత మాత్రమూ ఇష్టంలేదన్నాడు.

అన్నిటికన్న ముఖ్యమైనది ఆల్‌ఫ్రెడ్ స్మిత్ ధోరణి. 1928 లో పార్టీ అభ్యర్థిగా ఎన్నికలలో పోటీచేసి ఓడిపోయిన స్మిత్, ఇంకా పేరుకి పార్టీ నాయకుడుగానే ఉన్నాడు. అతడి ధోరణి ఎలా వుంటుందో కనుక్కోమని అతడి దగ్గరకు ఎడ్వర్డ్ ఫ్లిన్‌ను పంపించాడు రూజ్వెల్టు. తాను అధ్యక్ష పదవికి యీసారి పోటీ చెయ్య దలచలేదనీ, రూజ్వెల్టును నిలబెట్టాలని ఎవరికైనా వుంటే తన అభ్యంతరం ఏమీ లేదనీ స్మిత్ చెప్పాడట. తరువాత, హెర్బర్ట్ లేమన్ వెళ్ళి అడిగినప్పుడుకూడా స్మిత్ అదే సమాధానం చెప్పాడట.

అయితే రూజ్వెల్టూ, స్మిత్తూ కలుసుకొని చాలా కాలం అయింది. ఇద్దరి మధ్యా భేదాభిప్రాయాలు కూడా చాలా ఎక్కువ అయాయి. గవర్నరు అయిన తరువాత తను చెప్పినట్టు వినకుండా రూజ్వెల్టు తనను దగా చేశాడని స్మిత్ చెప్ప నారంభించాడు.

తరువాత, స్మిత్ కూడా ఒక అభ్యర్థి అయాడు. రూజ్వెల్టుతో తీవ్రమైన పోటీ చేశాడు కూడాను. అంచేత స్మిత్ తనను దగా చేశాడని రూజ్వెల్టు భావించాడు.

ఆర్థిక మాంద్యం చాలా తీవ్రమై, రిపబ్లికన్ పార్టీ పరిపాలన పట్ల ప్రజలకు అసహ్యాం ఎక్కువైన కొద్దీ, డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థులు గెలిచే సూచన కనపడి, ఆ సభ్యులు చాలా మంది అభ్యర్థిత్వం కోసం పోటాపోటీలు పడ నారంభించారు. నాయందరిలోకీ చాలా బలం సంపాదించిన వాడు రూజ్వెల్టు.

అభ్యర్థిగా తన నియామకత్వాన్ని బలపరిచిన వారి పట్లనూ, తన పక్షాన పని చేసినవారి పట్లనూ రూజ్వెల్టు తన జీవితాంతం వరకూ కృతజ్ఞత కనపరిచాడు. వారిలో చాలమంది, చాలా కాలం అతడి ప్రాణ స్నేహితులుగా వున్నారు కూడాను. 1932 కు పూర్వం తన పక్షాన పని చెయ్యని ఏ డెమొక్రాటిక్ పార్టీ సభ్యుడికీకూడా, అతడెంత పలుకుబడి గలవాడైనా, ఎంత సమర్థుడయినా సరే, ఏ పెద్ద వుద్యోగాన్నీ రూజ్వెల్టు ఎప్పుడూ ఇవ్వలేదు. కాక్స్, డేవిస్, యంగ్ మొదలైన పార్టీ ముఖ్యులతో అతడు స్నేహంగానే వున్నాడు. కాని, వారికి పెద్ద పదవిని దేనినీ ఇవ్వలేదు.

1932 నాటికి తనకు ప్రతికూలంగా పని చేసిన వ్యక్తి ఎవడైనా వుంటే, అతడెంత పలుకుబడి కలవాడైనా సరే అతడికి ఏ విశిష్టమైన పదవినీ రూజ్వెల్టు ఇవ్వలేదు.

అయితే, పార్టీ పెద్దలలో చాలామందిని రూజ్వెల్టు ఇలా కించన చెయ్యడానికి కారణం వ్యక్తిగతమైన తన అయిష్టతే కాక, వారు చాలా వరకు పాత పద్ధతులను కట్టుబడి అభివృద్ధి కార్యక్రమాలను ఆమోదించని వారు కావడం ఒకటి.

1932 జనవరినాటికి, డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థులలో రూజ్వెల్టు ముఖ్యుడనే సంగతి స్పష్టపడిపోయింది. చాలా రాష్ట్రాలలోని ప్రాథమిక ఎన్నికలలో రూజ్వెల్టు గెలిచాడు. 1932 జూన్‌లో డెమొక్రాటిక్ పార్టీ మహాసభ చికాగోలో జరిగింది. ఆ నాటికి రూజ్వెల్టు ఒక ప్రబలుడైన

అభ్యర్థి అయాడు. అయితే అతడి అభ్యర్థిత్వాన్ని ప్రతిఘటించడానికి ప్రతికూల శక్తులుకూడా చాలా ప్రబలంగా ఆయత్తమై వున్నాయి.

# ఆరోగ్య స్థితి

అధ్యక్ష పదవికి రూజ్వెల్టును అభ్యర్థిగా నిలబెట్టాలని అతడి పక్షాన ప్రచారం తీవ్రంగా సాగుతున్న రోజులలో, అతని ప్రతికూల పక్షంవారు అతణ్ణి గురించి అనేక విధాలుగా వ్యతిరేక ప్రచారం సాగించారు.

రూజ్వెల్టు ఇంకా జబ్బు మనిషిగానే వున్నాడనీ, పక్షవాతం అతటి మెదడుకకూడా సంక్రమించి అతడికి పిచ్చి ఎక్కిందనీ ప్రచారం చెయ్యడానికికూడా అతడి ప్రత్యర్థులు వెనుదియ్యలేదు.

నిజం చెప్పాలంటే, ఆ రోజులలో రూజ్వెల్టు చాలా చక్కని ఆరోగ్యాన్ని అనుభవిస్తున్నాడు. గంటలు తరబడి, రోజుల తరబడి, విశ్రాంతి అవసరం లేకుండా పని చేస్తున్నాడు. ఆ రోజులలో అతడు తన జీవితాన్ని 5,60,000 డాలర్లకు ఇన్స్యూరు చేశాడు. ఈ ఇన్స్యూరెన్సును 22 కంపెనీలు పంచుకున్నాయి. దానిని బట్టి, అతడి ఆరోగ్యంలో ఏ లోపమూ లేదని స్పష్టమౌతున్నది. ఆ ఇన్స్యూరెన్సు డబ్బును తన తదనంతరం, వాంస్ప్రింగ్స్‌లోని చికిత్సా కేంద్రానికి ఇవ్వాలని అతడు విల్లు వ్రాశాడు.

రెండోసారి గవర్నరు పదవిలో వుండగా, అతడు కొందరు డాక్టర్లచే తనను పరీక్ష చేసి, తన స్థితిని గురించి ఒక ప్రకటన చెయ్యమని కోరాడు. ముగ్గురు గొప్ప డాక్టర్లు, డాక్టర్ శామ్యూల్ లాంబెర్ట్, డాక్టర్ రస్సెల్ హిబ్స్, డాక్టర్ ఫాస్టర్ కెన్నెడీ అనేవారు అతణ్ణి పరీక్షించి, రూజ్వెల్టు ఆరోగ్యంలో ఏమీ లోపంలేదని ప్రకటించారు.

పైగా, ఎన్నికల ప్రచారంలో రూజ్వెల్టు ఊరూరూ తిరగడం, ఉపన్యాసాలివ్వడం చూసినవారెవరూ రూజ్వెల్టు ఆరోగ్యంలో లోపం వుందని ఎన్నడూ అనుకోజాలరు.

# మేధావుల కూడలి (BRAIN TRUST)

మేధావుల కూడలికి తండ్రి, రూజ్వెల్టు. దాని సమ్మేళన కర్త, రోసెన్‌మన్. దాని అధిపతి, రేమండ్ మోలే.

ఎన్నికల ప్రచారం బాగా సాగడం ఆరంభించేసరికి తనకు సమర్థుల సహాయం ఎక్కువగా కావాలని రూజ్వెల్టు గ్రహించాడు. రోజు రోజూ అతడు కొత్త విషయాలను గురించి ఉపన్యసించ వలసిన అవసరం ఎక్కువ అవుతున్నది. ఆ ఉపన్యాసాలను తయారు చెయ్యడం, రోసెన్‌మన్‌కు ఒక్కడికీ తలకు మించిన పని అయిపోయింది. ఒక చోటనుంచి మరొక చోటికి ప్రయాణాలు చెయ్యడంతో ఫార్లేకు సరిపోతున్నది. హోవు హమేషా రూజ్వెల్టు సమీపంలో వుండడంతో సరిపోతున్నది.

దేశీయ సమస్యలను బాగా అర్థం చేసుకున్న నిపుణులను కొంత మందిని తీసుకు రమ్మని రూజ్వెల్టు రోసెన్‌మన్‌ను కోరాడు. దేశంలోని పెద్ద పెద్ద వ్యాపారస్తులూ, రాజకీయవాదులూ, రూజ్వెల్టుకు ప్రతికూల పక్షంలో చేరారు గనుక, కొత్తవారిని యూనివర్సిటీలనుంచి తీసుకు రావడం మంచిదని రోసెన్‌మన్ సూచించాడు. కొంతమంది సమర్థుల్ని పోగుచెయ్యమని రూజ్వెల్టు చెప్పాడు. తన ప్రచారంలో, దేశీయ సమస్య లన్నిటిని గురించి తాను ఉపన్యసించడానికి వీలుగా, ఉపన్యాసాలను తయారు చెయ్యడానికీ, ఆ ఉపన్యాసాలను తయారు చెయ్యడంలో ఒక్కొక్క సమస్యను సమగ్రంగా చర్చించడానికీ అవసరమైన విషయా లన్నిటినీ క్రోడీకరించాలని రూజ్వెల్టు ఊహ. అలా చెయ్యడానికి సమర్థు లైన ప్రతిభావంతులను పోగుచెయ్యమని అతడు కోరాడు. ఆ విధంగా ఒక మేధావుల కూడలి తయారైంది. ఒకసారి రూజ్వెల్టు చెప్పిన ఒక ఉపన్యాసాన్ని తయారు చెయ్యడానికి 25 మంది నిపుణులు పని చేశారట.

ఈ విధంగా రూజ్వెల్టు ప్రక్కన రెండు కూడ్లులు చేరాయి. ఒకటి రాజకీయవాదుల కూడలి; మరొకటి మేధావుల కూడలి. పైకి, యీ రెండు వర్గాలవారు అన్యోన్యత వున్నట్లు ప్రవర్తించేవారు. కాని, రాజకీయవాదులు, యూనివర్సిటీలనుంచి వచ్చిన ప్రొఫెసర్లతో నిండిన మేధావుల కూడలిపట్ల కొంత అనుమానంతో ప్రవర్తించేవారు. కాలం

గడిచినకొద్దీ, ఉపన్యాసాలను తయారు చెయ్యడము తప్ప, రాజకీయాలను నడపడంలో యీ మేధావుల కూడలి చెయ్యగలిగినదేమీ లేదని రాజకీయ వాదులు నిశ్చయించుకున్నారు. తరువాత, రూజ్వెల్టు అధ్యక్ష పదవిని గెలిచి, యీ మేధావులలో ఒక్కొక్కరికే పెద్ద పదవులను ఇచ్చి, పరిపాలనా వ్యవహారాలను వారి చేతిలో పెట్టడం ఆరంభించినప్పుడు, రాజకీయ వాదుల కూడలిలో కలవరం ప్రారంభమైంది.

మొదట్లో యీ మేధావుల కూడలికి "ప్రీవీ కౌన్సిల్" అని రూజ్వెల్టు పేరు పెట్టాడు. కాని, వీరంటే లూయీ హౌకి ఎంతమాత్రం కిట్టేదికాదు. అంచేత, ఒకరోజున హేళన పూర్వకంగా, వీరిని ఉద్దేశించి "మేధావుల కూడలి" అనే పదాన్ని అతడు ప్రయోగించాడు. ఆ ప్రక్కనే వున్న న్యూయార్కు టైమ్సు పత్రికావిలేఖరి ఆ పదాన్ని పట్టుకున్నాడు. వెంటనే ఆ మాట పత్రికలోకి ఎక్కిపోయి, దేశమంతా ప్రాకిపోయింది.

ప్రెసిడెంటు పదవిలో వున్న వ్యక్తులంతా కూడా, కొంతమంది మేధావులను తమ దగ్గర వుంచుకొని, వారి సహాయాన్ని పొందినవారే. ఎవరో ఒక మేధావి సహాయంలేకుండా, ఏ ప్రెసిడెంటూ గడపలేకపోయాడు. కాని, రూజ్వెల్టు అనుసరించిన పద్ధతిలో ఒక నూతనత్వం వుంది. పరిపాలనా కార్యాలలో, నిపుణులకు జోక్యం కల్పించి, వారి విజ్ఞానాన్ని పరిపాలనా కలాపానికి సమన్వయ పరచడమే, ఆ నూతనత్వం.

## చికాగో మహాసభ

డెమొక్రాటిక్ పార్టీ మహాసభ 1932 జూన్‌లో చికాగోలో జరిగింది. ఆ సభ చాలా కల్లోల పరిస్థితులలో జరిగింది. అధ్యక్షపదవికి పార్టీ అభ్యర్థులుగా ఎన్నికకు తొమ్మిదిమంది పేర్లు సూచించబడినవి. కేవలం విధిబలం లేకపోతే రూజ్వెల్టు పూర్తిగా ఓడిపోయేవాడు. పార్టీ పెద్దలు చిట్టచివరివరకూ అతణ్ణి ప్రతిఘటించారు. అతడు పురాతన సాంప్రదాయాలను విచ్ఛిన్నంచేసే సంస్కారాలను ఆమోదిస్తున్నాడని వారి వాదన. రూజ్వెల్టు కాక మరి ముగ్గురు అభ్యర్థులకు మంచి బలం ఉంది. చిట్టచివరకు హ్యూయీ లాంగ్ రూజ్వెల్టుపక్షం అవలంబించకపోతే రూజ్వెల్టు చాలా దారుణంగా ఓడిపోయేవాడే. పైగా, మహాసభ

సమావేశంలో ప్రతినిధులను తమవైపు త్రిప్పే చాకచక్యం రూజ్వెల్టు తరఫున ప్రచారం చేసినవారికి ఎక్కువగా లేదు. కాని, జేమ్స్ ఫార్లే రూజ్వెల్టు లిద్దరూకూడా విశేష ప్రజ్ఞను కనపరచి ప్రతినిధులను తమవైపు త్రిప్పుకోడానికి బాగా పనిచేశారు. నిజానికి రాజకీయపు ఎత్తులను వెయ్యడంలో వారు ప్రథమ పాఠాలను చికాగో మహాసభలోనే నేర్చుకున్నారని చెప్పవచ్చును.

రూజ్వెల్టుకు ప్రధాన ప్రత్యర్థి ఆల్‌ఫ్రెడ్ స్మిత్. అతడు రూజ్వెల్టు అభ్యర్థిత్వాన్ని ఆపగలననే విశ్వాసంతో చికాగోకు వచ్చాడు. అతడి వుద్దేశం ఏదో ఒక విధంగా మహాసభలో ఒక ప్రతిష్టంభన తెచ్చిపెడదామని. అప్పటికప్పుడే చాలామంది ప్రతినిధులు రూజ్వెల్టు పేరు చెపితే మండిపడుతున్నారు. రూజ్వెల్టును గెలవకుండా చెయ్యడానికి, ఒకరి గొంతుకను మరొకరు కొయ్యడానికి కూడా వారు సంసిద్ధులై ఉన్నారు. రూజ్వెల్టు ఎన్నికను పడకుండా చేస్తే అందరిమధ్యా ఒక విధమైన రాజీ కుదిరి అందరికీ అనుకూలుడైన మరొక అభ్యర్థి నెవరినైనా నిలబెట్టవచ్చునని వారి ఆశ.

చికాగోలో ఎంత కలవరం జరుగుతూవున్నా, రూజ్వెల్టు మాత్రం చికాగోకు వెళ్ళలేదు. న్యూయార్కులోనే ఉండి, చికాగోలో నడపవలసిన తంత్రాన్ని అంతనూ నడిపాడు. గంటలకొలదీ టెలిఫోనులో ఫార్లేతోను, ఫ్లిన్‌తోను, తక్కిన ఉపనాయకులతోను మాట్లాడాడు.

చికాగోకు వెళ్ళకుండా ఉండటం రూజ్వెల్టు వేసిన రాజకీయపు టెత్తులలో చాలా గొప్పది. దానివల్ల అతడి ఘనత హెచ్చింది.

మొట్టమొదటి ఓటింగులో రూజ్వెల్టుకు 666 ఓట్లు వచ్చాయి. అసలు రావలసినవి 770. అంటే, రావలసిన వాటికన్న 104 తక్కువ వచ్చాయన్నమాట. తీవ్ర వాదోపవాదాలు జరిగిన తరువాత, మళ్ళీ రెండుసార్లు ఓటింగు జరిగింది. అప్పటికి రూజ్వెల్టు బలం 682 ఓట్లదాకా పెరిగింది. రూజ్వెల్టుకు హార్‌స్ట్ గనుక అనుకూలించినట్లయితే, కాలిఫోర్నియాలో ప్రతినిధుల ఓట్లు రూజ్వెల్టుకు వస్తాయి. అప్పుడు రూజ్వెల్టు గెలవగలడు. కాలిఫోర్నియాలో ఉన్న హార్‌స్ట్‌కు ఫార్లే టెలిఫోనుచేసి రూజ్వెల్టు గనుక గెలవక పోయినట్లయితే, స్మిత్ గెలుస్తా

నని చెప్పాడు. రూజ్వెల్టు అంటే హార్స్టుకు ఎంతమాత్రమూ ఇష్టం లేక పోయినా స్మిత్ అంటేమటుకు పరమద్వేషం ఉంది. హార్స్టు గత్యంతరం లేక రూజ్వెల్టు పక్షం అవలంబించాడు. నాలుగోసారి ఓట్లు లెక్క పెట్టి నప్పుడు రూజ్వెల్టుకు 945 ఓట్లు వచ్చాయి. టెక్సాస్ రాష్ట్రపు ప్రతి నిధుల ఓట్లను రూజ్వెల్టుకు ఇప్పించినందుకు జాన్ గార్నర్‌ను వైస్ ప్రెసిడెంటు పదవికి అభ్యర్థిగా ఎన్నుకోవడం జరిగింది.

ఈ ఉదంతంతో ఆల్ఫ్రెడ్ స్మిత్ అమెరికా రాజకీయాలనుంచి క్రమక్రమంగా అంతర్ధానం పొందాడు.

చికాగో మహాసభ తరువాత, న్యూయార్కు గవర్నరు పదవికి తన తరువాతి గవర్నరుగా లేమన్‌ను రూజ్వెల్టు ప్రతిపాదించినప్పుడు స్మిత్ సంతోషించాడు. అంతటితో రూజ్వెల్టు స్మిత్‌లమధ్య అన్యోన్యత క్రమ క్రమంగా సన్నగిలిపోయింది.

చికాగో మహాసభ జరుగుతూ వుండగానే తన అభ్యర్థిత్వం ఆమో దించబడిన వెంటనే రూజ్వెల్టు విమానంలో చికాగోకువచ్చి అభ్యర్థిత్వాన్ని అంగీకరిస్తూ, మహాసభకు కృతజ్ఞత తెలుపుతూ ఉపన్యసించాడు. అభ్యర్థి త్వాన్ని అంగీకరిస్తూ మహాసభ యెదుట అంతకు పూర్వం ఏ అభ్యర్థీ ఉపన్య సించలేదు. దానితో రూజ్వెల్టు ఘనత మరీ హెచ్చిపోయింది. "నూతన ఆర్థిక విధానం (New Deal)" అనే మాటను మొట్ట మొదట అతడు ఉపయోగించినది యీ ఉపన్యాసంలోనే.

## ప్రచారం

అధ్యక్ష పదవి ఎన్నికకు రూజ్వెల్టు చేసిన ప్రచారం అపురూపమైన దని చెప్పాలి. అతడి ప్రచారంలో రిపబ్లికన్ పార్టీ సభ్యుల నెవరినీ అతడు విమర్శించలేదు. రిపబ్లికన్ పార్టీ నాయకులను మాత్రమే విమర్శించాడు. అందుచేత రిపబ్లికన్ పార్టీకి చెందినవారు ఎంతోమంది అతని పక్షాన ఓటు చేశారు. ముఖ్యమైన ప్రాంతాలలో మాత్రం సంచారం చెయ్యమని తన సలహాదార్లు చెప్పినా రూజ్వెల్టు ఏడు రాష్ట్రాలుతప్ప మిగతా అన్ని రాష్ట్రాలలోను ఎన్నో ప్రాంతాలలో సంచారం చేశాడు. ఆ సంచారంలో అతడు 27,000 మైళ్ళు ప్రయాణంచేశాడు. ఇలా చెయ్యడంలో అతడి

వుద్దేశం తాను జబ్బుతో లేవలేని మనిషిని కాదనీ, మంచి ఆరోగ్యంతో వున్నాననీ ప్రజలకు ప్రత్యక్షంగా చూపడమే.

రూజ్వెల్టు ప్రత్యర్థి అప్పటికి అధ్యక్షుడుగా వుండి రెండోసారి అధ్యక్షుడు కాగోరిన హెర్బర్ట్ హూవర్. చాలా మందికి తెలియదు గాని, మొదట్లో రూజ్వెల్టూ, హూవరూ చాలా ఎక్కువ స్నేహంతో సంచరించారు. మొదటి ప్రపంచ యుద్ధపు రోజులలో, వీరిద్దరూ వాషింగ్టన్‌లో ఒక క్లబ్బులో కలుసుకుంటూ వుండేవారు. ప్రతి ఆదివారమునాడు రాత్రి హూవర్ కుటుంబమూ, రూజ్వెల్టు కుటుంబమూ కలిసి విందారగించి, ఒకరి అభిప్రాయాలను మరొకరు తెలుసుకుంటూ వుండేవారు. ఆ రోజులలో హూవర్ ఏ పార్టీలోను చేరలేదు. అతణ్ణి డెమొక్రాటిక్ పార్టీలో చేర్చుదామని రూజ్వెల్టు ప్రయత్నించాడు. కాని హఠాత్తుగా ఒకనాడు హూవర్ రిపబ్లికన్ పార్టీలో చేరిపోయాడు. అప్పటినుంచీ వీరిద్దరిమధ్యా స్నేహ సంబంధాలు క్రమేపీ సన్నగిలి పోయాయి.

1932 లో రూజ్వెల్టు అధ్యక్షపదవిని సులువుగా గెల్చుకున్నాడని ఈనాడు చాలామంది అనుకుంటారు గాని, అది నిజంకాదు. డెమొక్రాటిక్ పార్టీకి ప్రచారానికి కావలసిన డబ్బులేదు. ఎన్నికల ప్రచారానికి రిపబ్లికనులు ఆ సంవత్సరం 26,70,000 డాలర్లు ఖర్చుపెడితే, డెమొక్రాటిక్ పార్టీ 11,70,000 డాలర్లే ఖర్చుపెట్టింది. అయితే రూజ్వెల్టు ఆత్మవిశ్వాసం మాత్రం చాలా గొప్పగా పనిచేసింది. అభ్యర్థిగా ఎన్నుకోబడక పూర్వమే, ఎన్నికల ప్రచారానికి అతడు ఎన్నో ఉపన్యాసాలను తయారుచేసిపెట్టాడు. అతడి మేధావుల కూడలికూడా చాలా బాగా పనిచేశారు. అప్పుడు వీరు తయారుచేసిన ఉపన్యాసాలు, ఆ ఎన్నికల ప్రచారానికే గాక, తరువాత 1935 వరకు అనేక సందర్భాలలో వుపయోగించడానికి కూడా పనికి వచ్చాయట !

అప్పుడు రూజ్వెల్టు నిర్వచించిన నూతన ఆర్థిక విధానపు ప్రధాన ప్రణాళిక ఇది : దేశంలోని నిర్మాణ కార్యక్రమాలను బాగా విస్తరింప జేసి, నిరుద్యోగులకు పని కల్పించడం; ముసలివారికి పించనులు ఏర్పాటు చెయ్యడం; ప్రజోపయోగ సంస్థలపై ప్రభుత్వపు అధికారాన్ని ఎక్కువగా

పెట్టడం; పంటలలో దేశానికి సరిపోగా మిగిలిన వాటిని పెట్టుబడి చెయ్యడంలో ప్రభుత్వపు కంట్రోలును అమలు జరిపి, వ్యవసాయదారులకు ప్రభుత్వం సహాయం చెయ్యడం; ఫిలిప్పీన్ దీవులకు స్వాతంత్ర్యాన్ని ఇవ్వడం; ప్రభుత్వ పరిపాలనా వ్యయాన్ని నూటికి 25 వంతులు తగ్గించి, ప్రభుత్వ వ్యయం ఆదాయాన్ని మించకుండా చూడడం.

అంతేకాదు. శాన్ ఫ్రాన్సిస్కోలో ఉపన్యసిస్తూ 1932 సెప్టెంబర్ 23 న రూజ్వెల్టు ఇలా చెప్పాడు: "హాయిగా జీవించడానికి అనువైన మార్గాలను వెతుక్కొని, వాటిని అన్వేషించి, సుఖజీవనాన్ని సాగించడానికి ప్రతి వ్యక్తికీ హక్కు వుంది. ఆ హక్కును ఉపయోగించుకోని వారు కొందరు వుండవచ్చును. కాని, వారికి ఆ హక్కును లేకుండా చేసేవారు ఎవరూ ఉండకూడదు. సుఖజీవనంకోసం పాటుపడడానికి తగిన అవకాశాలు నేడు మనదేశంలో అందరికి సమానంగా లేవు. వ్యక్తిత్వం అనే పేరుతో నేడు మనదేశంలోని జనాభాలో సగంమందిని, కొద్దిమంది పరిశ్రమల యజమానులు ఫ్యాక్టరీలలో పెట్టి నిర్జీవులనుగా చేస్తున్నారు. అలా జరగడానికి ఎంతమాత్రమూ వీలులేదు."

ఈ ఉపన్యాసంతో, ఫ్యాక్టరీలలోనూ, గనులలోనూ, రేవులలోనూ, తోటలలోనూ పని చేస్తున్న నిర్భాగ్య ప్రజలంతా రూజ్వెల్టును ఒక దేవుడని భావించారు. దేశంలోని 140 లక్షల నిరుద్యోగుల దృష్టి ఒక్కసారిగా రూజ్వెల్టు వైపు మళ్ళింది. హూవర్ కన్న 70 లక్షల ఎక్కువ వోట్లతో రూజ్వెల్టు అధ్యక్ష పదవిని గెలుచుకున్నాడు. ఇంత గొప్ప మెజారిటీతో, డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థి ఎవడూ అంతకు పూర్వం అధ్యక్ష పదవిని గెలవలేదు. ప్రజల వోట్లు అలా వుండగా, దేశంలోని వివిధ శాసనసభలనుంచి వచ్చిన వోట్లు రూజ్వెల్టుకు మరీ గొప్ప విజయాన్ని ఇచ్చాయి. ఏమంటే, హూవర్‌కు 59 వోట్లు వస్తే, రూజ్వెల్టుకు 472 వోట్లు వచ్చాయి.

ఆ సంవత్సరం, ఆ విధంగా ఎన్నుకోబడిన రూజ్వెల్టు ఆనాటినుంచీ పన్నెండు సంవత్సరాలపైగా అధ్యక్ష పదవిలో వుండిపోతాడని మాత్రం ఆ రోజులలో ఒక్కమనిషికూడా అనుకొని వుండడు.

# వామపక్షవాది

రూజ్వెల్టు పూర్వ సాంప్రదాయ వాది కాదనీ, వామపక్ష వాది అనీ, 1932 ఎన్నికల ప్రచారం బాగా స్పష్టపరిచింది. నిరుద్యోగ సమస్యతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న దేశానికి తరణోపాయం చూపిస్తానని రూజ్వెల్టు వాగ్దానం చేశాడు. అతడు అమలు జరిపిన కార్యక్రమా లన్నిటికీ అదే లక్ష్యంగా పెట్టుకున్నాడు. ప్రజాక్షేమం కోసం పాటుపడే ప్రభుత్వ విధానానికి అతడు పునాదులు వేశాడు. అతడు అమెరికా ప్రజలకు చేసిన యీ మేలుకు, అతడిని నిందించే వారు ఎందరో తయారయ్యారు.

ఘరానా కుటుంబంలో పుట్టిన పురుషుడు, సామాన్య ప్రజల క్షేమం కోసం పాటు పడడమనేది మానవ చరిత్రలో కదాచితుగా జరిగే సంఘటన. రాజభోగా లనుభవించే కుటుంబాలలో పుట్టి, దౌర్భాగ్య ప్రజల విమోచన కొరకు పాటుపడిన మహా పురుషులు మానవ చరిత్రలో చాలా కొద్దిమంది కనిపిస్తారు. పురాతన కాలంలో ఇలాంటి మహాపురుషు లెవరున్నారంటే గౌతమ బుద్ధుడు, మిరాబో, గ్రాచి, కేవర్, పెరిక్లిస్ మాత్రమే కనిపిస్తారు. అధునాతన కాలంలో, రూజ్వెల్టును పోలిన మహాపురుషుడు ఇండియా ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూ ఒక్కడే కనిపిస్తాడు. రాజ భోగాలు అనుభవించే కుటుంబంలో పుట్టి, సోషలిష్టు రాజకీయాలను అవలంబించి, పీడిత ప్రజల నాయకుడై, సునిశిత మేధా ప్రజ్ఞను విడనాడని నెహ్రూకూ, రూజ్వెల్టుకూ చాలా పోలికలు వున్నాయి. వీరిద్దరికీ గల ఒక విచిత్రమైన పోలిక ఏమిటంటే, నెహ్రూ పధ్నాలుగు సంవత్సరాలు తన జీవితాన్ని ఖైదులో గడిపితే, రూజ్వెల్టు పక్షవాతపు జబ్బు కారణంగా, దట్టీల నిర్బంధంలో జీవితం గడిపి. కారాగారవాసంవల్ల నెహ్రూ అలవరచుకున్న ధీరోదాత్త లక్షణాలను అలవర్చు కున్నాడు. అంతేకాక, ఇండియాకు రాజకీయ స్వాతంత్ర్యాన్ని నెహ్రూ తెచ్చి పెట్టినట్లే, అమెరికాకు ఒక విధమైన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని రూజ్వెల్టు తెచ్చి పెట్టాడు.

ఒక విధంగా రూజ్వెల్టుకూ హిట్లరుకూ కూడా కొంత విధికృతమైన సంబంధం వుంది. అమెరికాలో రూజ్వెల్టు అధికారానికి రావడానికి అయిదు వారాల పూర్వమే జర్మనీలో హిట్లరు అధికారానికి వచ్చాడు. ఉభయులూ, 1945లో కొద్ది వారాల తేడాలో ఒకేకాలంలో చనిపోయారు. హిట్లరు తెచ్చిపెట్టిన మహాయుద్ధమే లేకపోతే, మూడోసారి, నాలుగోసారి, అధ్యక్ష పదవికి రూజ్వెల్టు పోటీచేసి వుండేవాడు కాదు. రూజ్వెల్టు హిట్లరుకు ప్రబల శత్రువై, హిట్లరు సంపూర్ణ పతనానికీ, విధ్వంసనానికీ జరిగిన యుద్ధ చర్యలకు ప్రధాన ద్రష్ట అయాడు.

## శాంతికాలపు అధ్యక్షుడు

అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన రూజ్వెల్టు అధ్యక్షపదవీ స్వీకారం చేసేలోపల దేశంలోని ఆర్థిక వ్యవస్థ సంపూర్ణంగా కూలిపోయింది. నిరుద్యోగుల సంఖ్య 170 లక్ష లయింది. వ్యవసాయదారులు అడుగంటి పోయినారు. ప్రజల దౌర్భాగ్యం కనివిని యెరుగనంత దారుణరూపం దాల్చింది. ప్రజలంతా భీతావహులై ముందుగతి ఏమిటో తెలియక నిశ్చేష్టితులై పోయారు.

అలాటి పరిస్థితులలో అమెరికాదేశపు 32 వ ప్రెసిడెంటుగా ఫ్రాంక్లిన్ డిలానో రూజ్వెల్టు 1933 మార్చి 4 వ తేదీన పదవీ స్వీకారం చేశాడు. అప్పటికి అతిడి వయస్సు 51 సంవత్సరాలపైన 33 రోజులు.

అమెరికా అధ్యక్షుడుగా రూజ్వెల్టు సాధించిన ఫలితాలనూ, అతిడు అవలంబించిన మార్గాలనూ విపులంగా వ్రాయాలంటే కొన్ని గ్రంథాలు వ్రాయవలసి ఉంటుంది. అతడి పరిపాలనా కాలాన్ని అంతనూ ప్రధానంగా తొమ్మిది భాగాలుగా చెయ్యవలసి ఉంటుంది. అవేమిటంటే: 1. బ్యాంకుల ప్రతిష్టంభన; మొదటి నూరు రోజులు; 2. నూతన ఆర్థిక విధానాన్ని అమలు జరపడంలో ప్రథమదశ; 3. నూతన ఆర్థిక విధానాన్ని శాశ్వతమైన చట్టంగా అమలులోకి తేవడం; 4. సుప్రీం కోర్టుతో పోరాటం; 5. విదేశ వ్యవహారాలతో ఎక్కువ సంబంధం; 6. మూడవ సారి ఎన్నికకు పోటీ; 7. యుద్ధ సన్నాహాలు; 8. యుద్ధ విజయం; 9. శాంతి స్థాపనకు ప్రయత్నాలు.

మరొక దృష్టితో చూస్తే రూజ్వెల్టు అధ్యక్షపదవీ కాలాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చును. అవేమిటంటే: ప్రపంచంలో చాలాభాగం శాంతి ననుభవించిన రోజులు, 1933–39; యూరప్ అంతా యుద్ధంలోఉండి అమెరికా యుద్ధంలో చేరని రోజులు 1939–41; అమెరికాతో సహా ప్రపంచమంతా కూడా యుద్ధంలో పాల్గొన్న రోజులు 1941–45.

ఇక, అధ్యక్షపదవిని గురించి ప్రతివారూ ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. అవి ఏమిటంటే: అమెరికా ప్రెసిడెంటే అమెరికా సర్వసేనాధ్యక్షుడు. ఫెడరల్ కోర్టు జడ్జీలను, ఇంకా అనేక మంది ఇతర ప్రధానోద్యోగులనూ అతడే నియమిస్తాడు. దేశపు విదేశాంగ నీతిని అతడే నిర్ణయిస్తాడు. అమెరికా పార్లమెంటు (కాంగ్రెసు) ఆమోదించిన చట్టాలను అతడు త్రోసి రాజనగలడు. చట్టంతో సమానమైన అధికార ప్రాబల్యం, అతడు చేసిన ఉత్తరువు లన్నిటికీ ఉంటుంది.

అమెరికన్ జాతి కంతకూ ప్రెసిడెంటే ప్రధాన నాయకుడు. అంతే కాదు. అతడు ప్రెసిడెంటుగా ఉన్నన్నాళ్ళూ, తన పార్టీకి కూడా అతడే నాయకుడు. ప్రజలందరికీ సమాన హక్కులుగల పరిపాలనా బాధ్యతతో పాటు, ప్రజలలో కొందరికి మాత్రమే సంబంధించిన ఒక రాజకీయ పార్టీకి నాయకత్వము కూడా ఒకే వ్యక్తిచేతిలో ఉండడం అతడికి చాలా చిక్కులను కలిగిస్తూ ఉంటుంది. ప్రెసిడెంటుకు గల పెద్ద బాధ్యత పరిపాలనను నిర్వహించడంకాదు; తన పరిపాలనపట్ల అత్యధిక సంఖ్యాకులు అనుకూలురై ఉండేటట్లు చూడటం, మంచి అధ్యక్షుడి ఆశయం ఏమిటంటే ప్రజలకు ఏమి కావాలో తెలుసుకొని దానిని వారికి చేకూర్చడం, తనకున్న అపారమైన అధికారబలాన్ని సమర్థంగా ఉపయోగించడం అతడు తెలుసుకొని ఉండాలి.

రూజ్వెల్టులో ఉన్న గొప్పతనం అదే. తనకున్న అధికారాలను బహు చాకచక్యంతో అతడు వినియోగించాడు.

1933 నుంచి 1945 వరకు రూజ్వెల్టు నివసించిన వైట్ హౌసును గురించికూడా ఇక్కడ ప్రస్తావించక తప్పదు. అమెరికా ప్రెసిడెంటు, అయిన ప్రతివ్యక్తీ ఆ భవనంలో నివసిస్తాడు. అది ప్రభుత్వ భవనం.

దానిపేరు వైట్ హౌస్. బయటినుంచి చూస్తే ఆ భవనం చాలా దర్జాగా కనిపిస్తుంది. లోపల చూస్తే అది చాలా పాతకాలపు ధోరణిలో పాడు బడుతున్న ఇల్లులాగ ఉంటుంది. ఈ నాటి మహాభవనాలలోని గదులతో పోలిస్తే వైట్ హౌసులోని గదులు చాలా ఇరుకుగా కనిపిస్తాయి. రూజ్వెల్టు ఆ యింటిలో ప్రవేశించగానే పరిచారకులు వంటయింటిలోని బొద్దింకలను తోలలేక చచ్చినంత అయారట. 1891 వరకూ అంత పెద్ద భవనంలోనూ ఒకే ఒక పాకీదొడ్డి ఉండేదట. తియొడోర్ రూజ్వెల్టు అధ్యక్షుడయి, ఆ యింటిలో ప్రవేశించినప్పుడు దాని నిండా ఎలుకలు ఉన్నాయట. ఫ్రాంక్లిన్ రూజ్వెల్టు తరువాత అధ్యక్షుడయిన ట్రూమన్ ఆ భవనం కూలిపోయే స్థితికి వచ్చిందని గ్రహించాడు. ఇప్పుడా భవనాన్ని ఒక్కొక్కవైపే పడగొట్టి కొత్తగా కట్టడం జరుగుతున్నది. ఇంకొక విచిత్రమేమిటంటే, రూజ్వెల్టు అధ్యక్షుడయినదాకా వైట్ హౌసులో లైబ్రరీ అనేది పేరుకుకూడా లేదు. 1930 లోనే యీ విషయాన్ని అమెరికాలోని ప్రచురణకర్తలు గ్రహించి, సిగ్గుపడి, పుస్తకాలను పంపడం ఆరంభించారు. తరువాత క్రమేపీ ఎక్కువ పుస్తకాలు చేరాయి. కాని, వాటిని పెట్టడానికి తగిన స్థలంలేక గ్లాసు బీరువాలలో చావిళ్ళలోనూ, అరుగులమీదనూ పెట్టారు. ప్రత్యేకం ఒక లైబ్రరీ భవనాన్ని యీ మహా భవనంలో కట్టడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

## నూరు రోజులు

అధ్యక్ష పదవిని స్వీకరించిన వెంటనే రూజ్వెల్టు నిర్వర్తించ వలసిన మొదటి విధి దేశంలోని ప్రజలకు ఆత్మ విశ్వాసాన్ని కలిగించడం; ఆర్థిక ప్రతిష్టంభనలో పడిపోయిన దేశాన్ని లేవనెత్తి, దానికాళ్ల మీద అది నిలబడేటట్టు చెయ్యడం. పదవీ స్వీకరణ చేసినప్పుడూ, ఆ తరువాత రేడియో ద్వారాను దేశ ప్రజలను సంబోధిస్తూ రూజ్వెల్టుచేసిన ఉపన్యాసాలను విని, మనకు తరణోపాయం చూపగల నాయకుడు నేడు పరిపాలనా బాధ్యతను వహించాడనే ధైర్యాన్ని పొందారు. దేశమంతాకూడా ఒక్క సారి "అమ్మయ్య" అని బాధా నివారణ సూచకంగా నిశ్వసించింది.

1933 మార్చి 9 తేదిన కాంగ్రెసు సమావేశాన్ని జరిపాడు రూజ్వెల్టు. ఈ సమావేశం జూన్ 16 దాకా నూరు రోజులు జరిగింది. అందుకే అతడి పరిపాలనలో మొదటి నూరురోజులు అని యీ ఘట్టానికి పేరు వచ్చింది.

విదేశాల నాణెముల మారకపు రేటును నిర్ణయించడానికీ, దేశంలోని బంగారం విదేశాలకు ఎగుమతి చేయబడకుండా ఉత్తరువు చెయ్యడానికీ, దేశంలోని ఏ బ్యాంకినయినా ఎంత కాలమైన మూసివెయ్యడానికీ, రూజ్వెల్టుకు అధికారం ఇచ్చే బ్యాంకింగు ఆక్టును, కాంగ్రెసు ఒక్కరోజులో ప్యాసు చేసింది. అంతేకాదు. ఆ చట్టంమీద కాంగ్రెసులో ఒకచర్చగాని, ఒక ఓటింగుకాని, ఒక కమిటీ పరిశీలనగాని, ఏమీ జరగలేదు. రూజ్వెల్టు ఎలా సూచించాడో అలా ఆ చట్టం ఆమోదించ బడింది.

రూజ్వెల్టు ఎప్పుడూకూడా కాంగ్రెసుతో కలసి పని చెయ్యడానికే ప్రయత్నించాడు. పరిస్థితుల తీవ్రతవల్ల నైతేనేమి, అతని పలుకుబడివల్ల నైతేనేమి, అతడిలోవున్న విశ్వాసంవల్లనైతేనేమి, అతను చెయ్యమన్న చట్టాలన్నిటినీ కాంగ్రెసు ప్యాసుచేసింది.

బ్యాంకింగు ఆక్టును కాంగ్రెసు ఆమోదించగానే ప్రభుత్వోద్యోగుల జీతాలను నూటికి 15 వంతులు తగ్గించాలనే చట్టాన్ని కాంగ్రెసుకు పంపించాడు రూజ్వెల్టు. యుద్ధంలో పాల్గొన్నవారికి ఇచ్చే పింఛనులు ఎక్కువగా తగ్గించడమూ అదనపు లాభాలపైన పన్నులు వెయ్యడముకూడా ఆచట్టం ద్వారానే జరిగాయి. ఆ దెబ్బతో, అప్పటికి మూసివేసిన బ్యాంకులన్నీ ఒక్కొక్కటే తెరవడం ఆరంభించాయి. మద్యనిషేధ చట్టాన్ని రద్దు చెయ్యాలనే బిల్లును మార్చి 13 న రూజ్వెల్టు ప్రవేశపెట్టాడు. మూసివేయబడిన స్టాక్ ఎక్స్ఛేంజ్ మార్చి 15 తేదిన మళ్ళీ తెరవబడింది.

వరసవరసన ఒక నెలలోపల వ్యవసాయదార్లకు ప్రభుత్వం సహాయం చెయ్యాలనే చట్టమూ, నిరుద్యోగ యువకులకు వృత్తి చూపించాలనే చట్టమూ, టెన్నెసీనదీ లోయలో, వ్యవసాయ, నీటిసరఫరాయి, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలను సాగించడానికి ప్రణాళికను నిర్మించిన చట్టమూ, ఒకటేమిటి రెండేమిటి, అనేక చట్టాలు గబగబ తయారుచేసి కాంగ్రెసుకు పంపించాడు రూజ్వెల్టు. ప్రజాహిత నిర్మాణ కార్యాలకు 330 కోట్ల డాలర్లను ఖర్చు పెట్టాలనే చట్టంకూడా వాటిలో ఒకటి. అంతేనా!

బంగారపు ప్రమాణంతో దేశపు నాణెముల చెలామణీకి గల సంబంధాన్ని రద్దుచేసే చట్టంకూడా వాటిలోదే. ఇదంతాచూసి, ప్రజలూ, ప్రముఖులూ కూడా నిర్ఘాంత పోయారు.

తాను చేసిన పనులన్నిటికీ, అవలంబించిన కార్యక్రమాలన్నిటికీ, ప్రతిపాదించిన చట్టాలన్నిటికీ రూజ్వెల్టు ఆశించినదొక్కటే. అది ప్రాణావశిష్టమై పడిపోయిన తన దేశానికి బలాన్నిచ్చి, మళ్ళీ దానిని పైకి లేవతియ్యడం. అలా చెయ్యడం మంచి కావచ్చు; చెడుకావచ్చు. కాని, నూరు సంవత్సరాలలో ఎవరూ చెయ్యలేని పనిని నూరు రోజులలో చేశాడు. ఆవిధంగా దేశపు ఆర్థిక వ్యవస్థలో బ్రహ్మాండమైన మార్పును తెచ్చి పెట్టాడు.

తన కళ్ళ యెదుట, తనవల్ల బ్రహ్మాండమైన మార్పులు జరుగుతూ వుంటే, అతడు మాత్రం చలించకుండా, ఆత్మ విశ్వాసంతో, తన చర్యలవల్ల సత్ఫలితాలు కలుగుతాయనే నమ్మకంతో తన కార్యక్రమాలను అనుల్లు జరుపుతుంటూ పోయాడు.

ఏమయినా, ఆ మొదటి నూరు రోజులూ, వివాహానంతరం జరిగే మనుగుడుపుల లాంటివి. మనుగుడుపులముచ్చట తీరిన తరువాత వియ్యాలవారికి చిన్నచిన్న తగాదాలు ప్రారంభమైనట్లే, తన పదవి కాలంలో మొదటి సంవత్సరం పూర్తి అయేసరికి, రూజ్వెల్టుకి అన్ని వేపులనుంచీ ప్రతిఘటన, విమర్శనలు, చిక్కులు బాగా పొడసూప నారంభించాయి. కోట్లకొలది ప్రజలు అతణ్ణి దైవసమానుడుగా భావిస్తూ వున్నప్పటికీ, అతడు ప్రతిపాదించిన సంస్కరణలను సహించ జాలనివారంతా ఏకమై, తీవ్రంగా అతణ్ణి ప్రతిఘటించ నారంభించారు.

# నూతన ఆర్థిక విధానం

రూజ్వెల్టు నూతన ఆర్థిక విధానాన్ని ప్రతిపాదించి ఇంకా ఇరవై సంవత్సరాలు కాలేదు. ఈ ఇరవై ఏళ్ళలోనూ దానిని గురించి అమెరికాలో చెలరేగిన తీవ్ర ఘర్షణలను యీనాడు అందరూ మరిచి పోయారు. కాని, ఆనాడు అమెరికా రాజకీయ వాతావరణమంతా భగ్గున మండిపోయింది. రోడ్లమీద పనిలేకుండా ముష్టి యెత్తుకుంటూ తిరిగే

కు(రాళ్ళందరినీ తీసుకొని వెళ్ళి, కొన్ని సమష్టి కేంద్రాలలో వారిచేత పనిచేయించాలనే ప్రతిపాదన మహా క్రూరమైన చర్య అని మిన్ను బ్రద్దలయేటట్టు ప్రచారం చేసినవారు ఆ రోజులలో ఎందరో వున్నారు.

ఇక, ఆ రోజులలో పత్రికా విలేఖరులు అవలంబించిన ధోరణి చాలా చిత్రమైనది. నూతన ఆర్థిక విధానం ఒక ఫాసిస్టు విధానమని చాలా చక్కని వ్యాసాన్ని ఒక రచయిత్రి వ్రాసింది. నూతన ఆర్థికవిధానం తీవ్రమైన కమ్యూనిస్టు విధానంతప్ప మరేమీ కాదని అనేక హేతువులను చూపిస్తూ మరొక చక్కనివ్యాసం వ్రాశాడు, ఒక రచయిత. నూతన ఆర్థికవిధానం కమ్యూనిస్టువిధానమూ కాదు, ఫాసిస్టువిధానమూ కాదని చాలా సబబైన హేతువులతో మరొకవ్యాసం వ్రాశాడు. ఇంకొక రచయిత!

తాను పదవిని స్వీకరించక ముందే తన మంత్రులుగా ఎవరెవరిని నియమించాలో రూజ్వెల్టు నిర్ణయించుకున్నాడు. పోస్టుమాస్టర్ జనరల్ పదవికి జేమ్స్ ఫార్లే; యుద్ధశాఖ మంత్రిగా జార్జి డెర్న్; విదేశ వ్యవహారాల మంత్రిగా కార్డెల్ హాల్; ఆర్థిక శాఖామంత్రిగా విల్ ఉడిన్; వ్యవసాయ శాఖామంత్రిగా హెన్రి వాలెస్; కార్మిక శాఖామంత్రిగా మిస్ పెర్కిన్స్; దేశీయ శాఖామంత్రిగా హెరల్డ్ ఐక్స్ మొదలైన వారిని నియమించాడు. వీరిలో వాలెస్, వుడిన్, ఐక్స్లు రిపబ్లికనులుగా ఉన్నవారు. స్త్రీని మంత్రిగా నియమించిన మొట్టమొదటి ప్రెసిడెంట్ రూజ్వెల్టే.

మంత్రులలో నూతన ఆర్థిక విధానంపట్ల పూర్తి విశ్వాసంగలిగి దానికొరకు ప్రచారం చేసినవారు ఇద్దరే. వారు: ఐక్స్, పెర్కిన్స్. మంత్రి మండలిలో నూతన ఆర్థిక విధాన వాదులు చాలా తక్కువమంది ఉన్నారు. ఇంతవరకూ రూజ్వెల్టుకు అనేక భావాలను కలిగించినవారూ, అనేక భావాలకు దోహదమిచ్చినవారూ క్రమక్రమంగా వెనుకబడి పోయారు. హౌ జబ్బుపడి మంచమెక్కాడు. క్రమంగా కృశించి చనిపోయాడు. అయితే రూజ్వెల్టును ప్రెసిడెంటును చేశాననే సంపూర్ణ సంతృప్తితో అతడు మరణించాడు.

అయితే, ఆ రోజులలో పురాతన సాంప్రదాయ వాదులచేత విప్లవకారులని నిందింపబడిన అనేకమంది నూతన ఆర్థిక విధాన వాదులు

యీ నాడు పురాతన సాంప్రదాయవాదులు అనేకమందిచేత చాలా గౌరవనీయులుగా భావింపబడుతున్నారు.

నూతన ఆర్థికవిధానం ఏమిటి? రూజ్వెల్టు పదవీ స్వీకరణ చేసిన వారం పదిరోజులలో ప్రవేశపెట్టిన వ్యవసాయదారుల సహాయచట్టము, దేశీయ పరిశ్రమల పునరుద్ధరణ చట్టములు రెండూ అతడు అవలంబించిన నూతన ఆర్థిక విధానానికి ప్రాతిపదికలని చెప్పవచ్చును. మొదటిచట్టము వ్యవసాయ పద్ధతులలో నూతన విధానాలను ప్రవేశపెట్టి వ్యవసాయ దారులను ఉద్ధరించడానికీ, రెండవచట్టము పరిశ్రమ పద్ధతులతో నూతన విధానాలను ప్రవేశపెట్టి పరిశ్రమలను ఉద్ధరించడానికీ ఉద్దేశింపబడినవి.

వ్యవసాయ ఉత్పత్తిని తగ్గించి, వ్యవసాయ పంటల ధరలను హెచ్చించి, కొన్ని పంటల ధరలను హెచ్చుస్థాయిలో ఉంచడానికి వ్యవసాయ దారులకు ప్రభుత్వం ధనసహాయం చెయ్యడానికి వ్యవసాయ సహాయ చట్టంలో ప్రతిపాదింపబడినది. ఈ చట్టంమీద వచ్చినంత విమర్శ రూజ్వెల్టు చేసిన ఏ చట్టంమీదనూ రాలేదు. ఏమంటే, పందిమాంసం ఎక్కువగా తయారు కావడానికి వీలులేకుండా కొన్ని కోట్ల పందిపిల్లలు నాశనం చేయబడినవి. ఈ చట్టం రాజ్యాంగవిధాన సూత్రాలకు విరుద్ధమని 1936 లో సుప్రీంకోర్టు తీర్పుచెప్పినప్పుడు రూజ్వెల్టుకూడా ఆనందించి ఉండాలి. తరువాత 1938 లో మరొక వ్యవసాయ సహాయచట్టాన్ని రూజ్వెల్టు తయారుచేశాడు. నేటి అమెరికా వ్యవసాయవిధానం ప్రధానంగా యీ రెండవచట్టపు ప్రధాన సూత్రాలను అనుసరించే జరుగు తున్నదని చెప్పవచ్చును. ఏమంటే, కొన్ని పంటలను సాగుచెయ్యడానికి యీనాటికీ అమెరికాలోని వ్యవసాయదార్లకు ప్రభుత్వం విశేషంగా ధన సహాయం చేస్తున్నది. ఆ సహాయం లేకపోతే వ్యవసాయదారులు ఒక రోజుకూడా మనలేరు. పంటలధరలను ప్రభుత్వమే ఇప్పటికీ నిర్ణయించి అవసరమైనచోట రైతులకు సహాయం చేస్తున్నది.

పరిశ్రమల పునరుద్ధరణ చట్టంలో కొన్ని ప్రమాదకరమైన ప్రతి పాదనలు ఉన్నాయని చెప్పక తప్పదు. ఏమంటే, పరిశ్రమలన్నీ ప్రభుత్వ యాజమాన్యంక్రింద జరిగే విధానాలకు అనువైన సూచనలు దానిలో ఉన్నాయి. ఆ చట్టాన్నికూడా రాజ్యాంగ సూత్రాలకు విరుద్ధమని సుప్రీం

కోర్టు తీర్పుచెప్పింది. అయితే, ఆ చట్టంలోని ప్రతిపాదనలు కొన్నిమాత్రం శాశ్వతంగా ఆచరణలో ఉండిపోయాయి. అవేమిటంటే: ఫాక్టరీలలో చిన్న బిడ్డలచేత పని చేయించకూడదనడం; కార్మికులు తమ ప్రతినిధుల ద్వారా, సమష్టిగా తమ అందరికీ వర్తించే పని సౌకర్యాలను గురించీ జీత బత్తెములను గురించీ యజమానులతో బేరమాడడానికి హక్కు పొందడం. ఇది ఒక చారిత్రాత్మకమైన ప్రతిపాదన. ఏమంటే నేడు అమెరికాలోని కార్మికసంఘాల బలానికి పునాది ఇదే.

ఆనాడు రూజ్వెల్టు ప్రతిపాదించిన రూపంలోనే, ఈ నాటికీ అమలులోవున్న చట్టం, టెనెస్సీలోయ ప్రాజెక్టు. టెనెస్సీనది ఏడురాష్ట్రాల గుండా ప్రవహిస్తూ, వరదలతో విశేష భాగాన్ని ఏటేటా ధ్వంసం చేస్తూంది. ఆ నది నీటిని ఒక పెద్ద రిజర్వాయరులోకి పట్టించి, ఆ నదీ లోయ ప్రాంతం అంతటా వ్యవసాయానికీ, తోటలకూ నీరు సప్లయిచేస్తూ, విద్యుచ్ఛక్తిని అక్కడ వుద్భవింపజేసి పరిసర ప్రదేశాలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చెయ్యడమే ఆ ప్రాజెక్టు పరమార్థం. ఈ ప్రాజెక్టు యీనాడు సంపూర్ణంగా అమలులోకి వచ్చింది. కొన్ని లక్షల జనులు సుఖజీవనం చేస్తున్నారు.

ఇంకొక విశేషం ఏమిటంటే, యీ ప్రాజెక్టువల్ల చేకూరిన విద్యుచ్ఛక్తి విశేషంగా లభించకపోతే, ఏటం బాంబును తయారు చెయ్యడం సాధ్యమయేదికాదు. దీనిలో మరొక చిత్రం ఏమిటంటే, ఏటంబాంబు నిర్మాణ సంఘానికి అధ్యక్షుడైన డేవిడ్ లిలియెంతాల్, అంతకు పూర్వం టెనెస్సీలోయ ప్రాజెక్టు సంఘానికి అధ్యక్షుడుగా వున్నాడు.

మొదటి నూరురోజులు అయిపోయిన తరువాత నిరుద్యోగులకు వృత్తి చూపించి, వారి మనుగడకు సహాయపడడానికి వుద్దేశింపబడిన కార్యక్రమం అమలులోకి వచ్చింది. ఈ కార్యక్రమాన్ని అమలు జరుపడానికి 50 కోట్ల డాలర్లు అంటే పెద్ద మొత్తంగా కనిపించదు గాని, ఆనాడు యింత మొత్తం నిరుద్యోగులకోసం ఖర్చు పెట్టడమంటే చాలామంది నిర్ఘాంతపడి రూజ్వెల్టును విపరీతంగా విమర్శించారు. కాని, ఈ డబ్బు మంజూరు అయిన కొద్ది రోజులలో 30 లక్షలమంది స్త్రీ, పురుషులకు నిర్మాణ కార్య క్రమములలో పను లివ్వబడినవి. ఆ నిర్మాణ కార్య క్రమముల ఫలితంగా, ఆ నాటికీ యీ నాటికీ అమెరికా స్వరూపమే మారి

పోయింది. ఈ కార్యక్రమాల ఫలితంగా, పదివేల స్కూలు భవనాలు, ఎన్నో వంతెనలు, ఆటలాడుకొనే రంగస్థలాలు, పోస్టాఫీసు భవనాలు, విమానాశ్రయాలు, ఈతలు కొట్టడానికి తటాకాలు, ఎన్నో రోడ్లు వేయ బడినవి. వీటన్నిటితోటీ దేశపు స్వరూపం మారిపోవడమే కాకుండా, ప్రజల జీవితంలో ఒక నూతన వుత్సాహం వుదయించింది.

ఆ రోజులలో రూజ్వెల్టు ప్రవేశపెట్టిన సంస్కరణ చట్టాలన్నిటినీ, అతడి ప్రతికక్షులు బహు తీవ్రంగా విమర్శించి ప్రతిఘటించారు. ఆనాడు అతడు అమలు జరిపిన సంస్కరణ కార్యక్రమాలన్నీ, యీనాడు అమెరికా జాతీయ జీవనంలో ఒకభాగమై, దైనందిన జీవితంలో ఒక నిత్యావసరాలై పోయాయి. కాని, ఆనాడు యీ ప్రతిపాదనలను, విప్లవ ప్రతిపాదనలని విమర్శించని వారులేరు. ఈనాడు ఆ సంస్కరణలలో ఒక్కటీ కొత్తదని పించడంలేదు. ముసలితనంలోనూ, నిరుద్యోగావస్థలోనూ వ్యక్తులకు జీవిత దుర్భటం కాకుండా ఇన్సూరెన్సు పద్ధతిని అమలు జరిపినవాడు రూజ్వెల్టు. అంతవరకూ, యీ విధానం అమెరికాలో లేదంటే, యీ నాడు అందరూ ఆశ్చర్య పడవచ్చును.

## ప్రతిఘటన

రూజ్వెలు అమలు జరిపిన నూతన ఆర్థిక విధానంవల్ల, దేశంలోని వ్యాపారవర్గంలో అత్యధిక సంఖ్యాకులు అతడికి ప్రతికూలురయి పోయారు. దేశంలోని పత్రికలలో నూటికి 80 వంతులు అతడిని కఠినంగా విమర్శించ నారంభించాయి. భాగ్యవంతులు, సుఖజీవులు, పురాతన సాంప్రదాయ వాదులు అతడికి శత్రువులై పోయారు.

అలాటి ప్రతికూల శక్తులు ఏర్పడడానికి కారణం, ప్రభుత్వ ఆదాయాన్ని మించిన డబ్బును రూజ్వెల్టు ఖర్చుపెట్టడంవల్ల బడ్జెటులోటు ఎన్నటికీ పూర్తికాక, దేశపు ఆర్థిక వ్యవస్థ ధ్వంసమౌతుందనే భయం ఒకటి. ధనికులు చెల్లించవలసి వస్తున్న పన్నులు రోజు రోజుకూ పెరిగి పోవడంవల్ల వారికి కలిగిన ఆగ్రహం మరొకటి. "ధనికులమీద ఎక్కువ పన్నులు వెయ్యాలి" అనేది రూజ్వెల్టు అవలంబించిన విధానానికి ప్రధాన సూత్రం.

నూతన ఆర్థిక విధానాన్ని రూజ్వెల్టు సంపూర్ణంగా అమలు జరిపి నట్లయితే, దేశంలో విప్లవం వచ్చి అమెరికా సాంఘిక వ్యవస్థ సమూలంగా కూలిపోతుందని చాలామంది నిజంగా విశ్వసించారు.

స్వేచ్ఛగా ఎవరికి తోచిన వృత్తినీ, వ్యాపారాన్నీ, వారు తమ శక్తి, పెట్టుబడి సత్తాలను బట్టి పెంపొందించుకొనే అవకాశాలు ప్రతి వ్యక్తికీ వుండాలని అమెరికను ప్రజలందరూ ప్రబలంగా వాంఛిస్తారు. రూజ్వెల్టు అమలులోకి తెచ్చిన నూతన ఆర్థిక విధానంవల్ల, యీ వుత్సాహం పూర్తిగా నశిస్తుందనీ, స్వేచ్ఛావ్యాపారానికి ప్రజలకు వుండే అవకాశాలు పూర్తిగా ధ్వంసం చేయబడుతాయనీ ఆనాడు ఎంతో మంది అనుకున్నారు.

రూజ్వెల్టు ఆరోజులలో దేశీయ కార్యక్రమాలకోసం వ్యయంచేసిన డబ్బు, యీనాడు చాలా చిన్న మొత్తంగా కనిపిస్తుంది. కాని, ఆనాడు అది చాల పెద్ద మొత్తం. రూజ్వెల్టుకు పూర్వం, ఏ ప్రెసిడెంటూకూడా అంత పెద్ద మొత్తాలను ఖర్చు పెట్టలేదు. అయితే, అతడి పరిపాలనా కాలంలో ప్రభుత్వం చేసిన అప్పులలో విశేష భాగం, రెండవ ప్రపంచ యుద్ధ కార్యక్రమాలకుగాను అయిన ఖర్చులే. 1940లో అమెరికా ప్రభుత్వం 420 కోట్ల డాలర్లు అప్పుపడివున్నది. 1946 నాటికి 2700 కోట్ల డాలర్ల అప్పు పెరిగింది. ఈ నాడు అమెరికా, రక్షణ కార్యక్రమాలకు వెచ్చించే డబ్బు, 1934 లో రూజ్వెల్టు ప్రభుత్వ కార్యక్రమాలన్నిటికీ వెచ్చించిన దానికి రెట్టింపు వున్నది. 1945 నుంచి 1950 నాటికి విదేశాలకు అమెరికా చేసిన ధన సహాయమే 2400 కోట్ల డాలర్లు. ఇది, 1938 లో రూజ్వెల్టు ప్రభుత్వ పరిపాలనా కార్యక్రమలన్నిటికీ ఖర్చు పెట్టినదానికి మూడురెట్లు.

రూజ్వెల్టు చేసిన వ్యయం వల్ల దేశపు ఆర్థిక వ్యవస్థ ధ్వంసమైందా? 1949 లో అమెరికా జాతీయ ఆదాయం, 2200 కోట్ల డాలర్లు. అంతకు పూర్వం ఏ సంవత్సరంలోనూ, అమెరికా జాతీయ ఆదాయం, దీనిలో సగాన్ని మించి లేదు. ఈ నాడు దాదాపు ఆరుకోట్ల ప్రజలకు, వృత్తి, వుద్యోగాలు వున్నవి. "పది సంవత్సరాలనాడు కేవలం దుస్సాధ్య మనిపించేటంత సంపదతో నేటి అమెరికా ప్రజలు సుఖజీవనం గడుపు తున్నారు" అని ఒక అమెరికన్ ప్రముఖుడు అన్నాడు.

పెద్ద పరిశ్రమల యజమానులు రూజ్వెల్టును తీవ్రంగా ద్వేషించారు. కాని, నిజంగా వారతనికి కృతజ్ఞులై ఉండాలి. ఏమంటే ఆర్థికవ్యవస్థ కూలిపోకుండా అమెరికాను నిలబెట్టినవాడు అతడే. రోడ్డుమీద అన్ని వేపులనుంచీ వచ్చిన బండ్లు ఒకదానితో ఒకటి ఢీ కొనకుండా పోలీసువా డెంత అవసరమో ఆర్థికవ్యవస్థ పోటీలతో భిన్నభిన్నం కాకుండా చెయ్యడానికి కంట్రోళ్ళుకూడా అంత అవసరమే.

అధ్యక్షపదవికి నాలుగుసార్లు అత్యధిక సంఖ్యాకులైన ప్రజల వోట్లతో గెలుపొందినా, రూజ్వెల్టును చాలామంది తీవ్రంగా ఎందుకు ద్వేషించారో అర్థం చేసుకోవచ్చును. బ్రతికి వున్నప్పుడు అతడిని ద్వేషించిన వారికన్న చనిపోయిన తరువాత అతడి పేరునుకూడా విన సహించనంత తీవ్రంగా అతణ్ణి ద్వేషించేవారు యీ నాడు కూడా చాలా మంది ఉన్నారు. రూజ్వెల్టును ఆ రోజులలో విపరీతంగా ద్వేషించిన వారు, ఒక్కసారికన్న అతడు అధ్యక్షుడుగా ఉండడని ఊహించ నారంభించారు. కాని, వారి కలలన్నీ భగ్నమైపోయాయి.

## రూజ్వెల్టు భావాలు

నూతన ఆర్థిక విధానాన్ని అమలు జరపడంవల్ల కలిగిన ఫలితాలనూ, దానివల్ల వచ్చిన ప్రతిఘటననూ చూసి రూజ్వెల్టు ఏమనుకొనేవాడు! అతడి పరిపాలనను గురించి పరిశీలన చేసేవారంతా దృష్టిలో ఉంచుకొనవలసిన ముఖ్యవిషయం ఏమిటంటే: పరిస్థితులవల్ల అతడు ఆ విధానాన్ని అవలంబించాడు. కాని, తన ఊహాజనితమైన ఏదో విధానాన్ని అతడు అవలంబిస్తే తదనుగుణంగా పరిస్థితులు మారలేదు.

రూజ్వెల్టు విప్లవకారుడు కాడు. అప్పటికి ఉన్న వ్యవస్థను కాపాడాలనే వుద్దేశమే గాని, దానిని విచ్ఛిన్నం చెయ్యాలనే ఉద్దేశం అతడికి ఎన్నటికీ లేదు. అయితే, సంఘంలో క్రమానుగతమైన మార్పును సాధించడమూ కొద్దిమంది చేతులలో ఉన్న సంపదను అనేకులకు ఉపయోగపడే టట్టు చెయ్యడమూ విప్లవం సాధించడమనుకొన్నట్లయితే రూజ్వెల్టును విప్లవకారుడని చెప్పవచ్చును.

పెట్టుబడిదారీ విధానంలో సంస్కరణలు తెచ్చిపెట్టినందువల్ల, సోషలిజం అమెరికాలో స్థావరం యేర్పరచుకోనకుండా అమెరికన్ ధనికులను రూజ్వెల్టు కాపాడాడని చెప్పవచ్చును.

1929 లో అమెరికాలో ప్రారంభించిన వ్యాపార, ఆర్థిక మాంద్యాలు, అంతవరకూ స్థిరపడిపోయిన ఒక ఆర్థిక వ్యవస్థకు అవసాన దశలని రూజ్వెల్టు గ్రహించాడు. అంచేత, నూతన ఆర్థికవ్యవస్థ నొకదానిని దేశంలో నెలకొల్పితేగాని దేశానికి విముక్తిలేదని అతడు విశ్వసించాడు. దీనదశలోవున్న పౌరులకు వృత్తి పనులను కల్పించే బాధ్యత ప్రభుత్వాని దనే సిద్ధాంతాన్ని మొట్టమొదటిసారి అమెరికాలో ఆచరణకు తెచ్చినవాడతడే.

“ముసలివారిని రక్షించ జాలనట్టి ప్రభుత్వమూ, పనిపాటలు చేసి జీవనం సాగించ దలచినవారికి పనిపాటలు కల్పించనట్టి ప్రభుత్వమూ, దారిద్ర్యమనే చీకటిలో అనేక కుటుంబాలు దారిగానక కొట్టుకులాడుతూ వుంటే వారికి దారి చూపలేని ప్రభుత్వమూ ఒక ప్రభుత్వం కాదు,” అని రూజ్వెల్టు స్పష్టంగా ప్రకటించాడు.

నూతన ఆర్థిక విధానంవల్ల ఏర్పడిన ఫలితాలు ఏమిటంటే: ప్రభుత్వ నిర్బంధాలు దౌర్జన్యంతో అమలు జరపవలసిన అవసరం లేకుండా, ఒక నిర్ణీత ఆర్థిక విధానాన్ని అమలు జరుపడానికి ప్రాతిపదిక పడింది; క్రమంగా సంస్కరణలను అమలులోనికి తేవడానికి అది సహాయపడింది. నూతన అవకాశాలపట్ల, నూతన జీవితంపట్ల ప్రజలకు ఉత్సాహాన్ని రేకెత్తించి, దేశంలోని నైరాశ్యాన్ని పోగొట్టింది.

ఆనాడు ప్రపంచంలో ఏర్పడిన ఆర్థికమాంద్యపు ఫలితాలను పరిశీలిస్తే, స్వేచ్ఛగా వ్యాపారం చేసుకొనేహక్కు యునైటెడ్ స్టేట్సులోని ప్రజలు అనుభవించినంతగా, ఈనాడు మరేదేశంలోని ప్రజలూ అనుభవించడం లేదు. హిట్లరు జర్మనీకి సర్వనాశనం తెచ్చిపెట్టాడు. ముస్సోలినీ ఇటలీని అధఃపాతాళ లోకానికి తీసుకుపోయాడు. జపాను నాయకులు జపానుకు నామరూపాలు లేకుండా చేశారు. చైనా నరక కూపంలోబడి విముక్తి గానక కమ్యూనిజం అలవరచుకున్నది.

ఇలాటి పరిస్థితులు ఏమీ లేకుండా, అమెరికా ఆర్థిక వ్యవస్థ కొన్ని సంస్కరణలతో స్థిరంగా నిలబడివుంది. దానిని అంతవరకు రక్షించినవాడు రూజ్వెల్టే అని చెప్పాలి.

అంతమాత్రం చేత రూజ్వెల్టు నూతన ఆర్థిక విధానాన్ని విమర్శించిన వారంతా కపటులనీ, దుష్టులనీ చెప్పడానికి వీలులేదు. అల్లకల్లోలంగా, ఆకస్మికంగా అతడు తెచ్చిపెట్టిన సంస్కరణలను వారు విశ్వసించలేక పోయారు. డబ్బునూ, సూత్రాలనూ కూడా నిర్లక్ష్యంచేసి అతడు సంస్కరణలను ప్రతిపాదించడాన్ని వారు సహించలేక పోయారు. ఉడికీ ఉడకని అన్నాన్ని విస్తరిలో వడ్డించినట్టుగా, పూర్తిగా అవగాహన చేసుకోకుండానే అతడు కొత్త సూత్రాలను నిర్వచించడం, భవిష్యత్తును గురించి వారు భీతిల్లడానికి కారణమైంది.

రూజ్వెల్టు అవలంబించిన నూతన ఆర్థిక విధానం కొన్ని సంస్కరణలకు దారిచూపిందే గాని, ఆనాటి సమస్యలన్నిటినీ పరిష్కరించిందని చెప్పడానికి వీలులేదు. దానివల్ల 30 లక్షల మందికి నిరుద్యోగ బాధ వదిలినా, దేశంలో ఇంకా 93 లక్షలమంది నిరుద్యోగులు మిగిలి వున్నారు. నిరుద్యోగ సమస్యను పూర్తిగా అంతమొందించినది రెండవ ప్రపంచ యుద్ధము.

నూతన ఆర్థిక విధానంవల్ల అమెరికాలోని బ్యాంకులు కూలిపోకుండా ఒక నూతన బ్యాంకింగ్ విధానం అమలులోకి వచ్చింది. నివసించడానికి యోగ్యమైన అనేక గృహాలు నిర్మింప బడినవి.

స్వేచ్ఛా వ్యాపారాన్నీ, వ్యక్తిగత వ్యాపారాన్నీ కాపాడడమే కాకుండా, అమెరికాలోని ప్రజారాజ్య విధానాన్ని తాను కాపాడ గలిగానని రూజ్వెల్టు విశ్వాసం. పెట్టుబడిదారీ విధానాన్నీ, ప్రజారాజ్య విధానాన్నీ రక్షించిన వాడు తానేనని రూజ్వెల్టు నిజంగా నమ్మాడు.

"ప్రజారాజ్య విధానాన్ని ఇంతకు పూర్వంకంటె గట్టి పునాదుల మీద నిలబెట్టి, దానిని కూలద్రొయ్యడానికి మరే ఇతర విధానమూ ప్రయత్నించకుండా తగిన రక్షణలు కల్పించడమే రూజ్వెల్టు పరమాశయం," అని అతడి సన్నిహితు డొకడు చెప్పాడు.

# ఉత్సాహం

తను పుట్టినప్పటినుంచీ పరిపాలనా భారాన్ని నిర్వహిస్తూ వున్నట్టుగా, అమిత ఉత్సాహంతో రూజ్వెల్టు తన అధ్యక్ష పదవీ కారలే క్రమాలను నిర్వహించడం ఆరంభించాడు. ఆ పదవిని అతడు బాగా ప్రేమించాడు. వైట్ హౌసును తన సొంత యింటిలాగ భావించి, ఏ క్రొత్తా లేకుండా ఆ యింటిలో నివసించిన అధ్యక్షు డతడే. దేశంలో పరిస్థితులు ఎంత నిరుత్సాహకరంగా కనిపించినా, అతడుమాత్రం నిరుత్సాహ పడేవాడు కాడు. అబ్రహాం లింకన్ తరువాత మరే అధ్యక్షుడూ నిర్వహించనంత కార్యభారాన్ని నిర్వహిస్తూ వున్నా, అతడు కార్య భారంలో క్రుంగిపోకుండా, విసుపు కనిపించకుండా మహా కులాసాగా కనిపించేవాడు.

1931 లో రూజ్వెల్టును చూసిన డాక్టర్ ఫాస్టర్ కెన్నడీ, 1935 లో వైట్ హౌసుకు వచ్చి రూజ్వెల్టును చూసి ఆశ్చర్య పోయాడు. ఆ నాలుగేళ్ళలోనూ రూజ్వెల్టు ఆరోగ్యం మరీ బాగుపడింది. రూజ్వెల్టుతో అతడిలా అన్నాడు: "నిన్ను చంపగలశక్తి దేనికీ ఉన్నట్టులేదు. బయటికి తీసుకొని వెళ్ళి నిన్ను తుపాకితో కాల్చవలసిందే!"

"ఆ పని చెయ్యలేరు. అరుగో, నాకు కాపలా ఎంతమంది వున్నారో చూడండి," అని రూజ్వెల్టు డాక్టరును ఇలా అడిగాడు: "డాక్టర్, నా కళేబరం యింకా కొంతకాలం నిలబడగలదంటారా."

"నీ కళేబరం నిలబడుతుంది గాని, నీ సంస్కారణలవల్ల దేశం యింకా ఎక్కువ రోజులు నిలబడలేదని చాలామంది ధనికులు భావిస్తున్నారు" అని డాక్టరు జవాబు చెప్పాడు. ఆ మాటకు రూజ్వెల్టు విరగబడి నవ్వాడు.

ఒకటి రెండు సంవత్సరాలు జరిగిన తరువాత, డాక్టర్ కెన్నడీ రూజ్వెల్టును మళ్ళీ ఇంకొకసారి చూడడం తటస్థించింది. అప్పుడుకూడా రూజ్వెల్టు ఆరోగ్యం చాలా బాగుందని అతడు గ్రహించాడు. ఆ మాటను అతడు రూజ్వెల్టుకు చెప్పగా, రూజ్వెల్టు అన్నమాట లివి: "ఇదంతా నా భార్యచేసిన సహాయపు చలవ."

# రెండోసారి ప్రెసిడెంటు పదవి

రాస్కాబ్, ఆల్ఫ్రెడ్ స్మిత్ మొదలైన పార్టీ పెద్దలు చాలా తీవ్రంగా ప్రతిఘటించినా, రెండోసారికూడా అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానికి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా రూజ్వెల్టును మహాసభ ప్రతినిధులు బ్రహ్మాండమైన హర్షధ్వానాలతో ఎన్నుకున్నారు.

రెండోసారి అధ్యక్షపదవికి తన అభ్యర్థిత్వాన్ని ఆటంకాలు లేకుండా చూసుకోవడంలో, రూజ్వెల్టు మొదటిసారి అభ్యర్థి అయినప్పటి నుంచీ కూడా జాగ్రత్త వహించాడు. రిపబ్లికనుపార్టీ తరఫున అధ్యక్ష పదవికి లాండన్, వైస్ ప్రెసిడెంటు పదవికి నార్స్ ఎన్నుకోబడ్డారు. ఆనాటి ఎన్నికల సంరంభాన్ని యీనాడు దృష్టికి తెచ్చుకొని చూస్తే, రూజ్వెల్టు తప్ప మరొకడు అధ్యక్షుడుగా ఎన్నుకోబడుతాడని ఎవరైనా ఎందుకు అనుకున్నారా అని ఆశ్చర్యం కలుగక మానదు. అమెరికా చరిత్రలో ఎన్నడూ కని విని యెరుగనంత ఎక్కువ వోట్లతో ఈ ఎన్నికలో రూజ్వెల్టు గెలుపొందాడు. అంతేగాక, సెనేట్‌లోను, హౌస్ ఆఫ్ రిప్రెజెంటేటివ్స్‌లోను డెమొక్రాటిక్ పార్టీ బలం చాలా పెరిగి పోయింది. సెనేట్‌లో 21 మంది రిపబ్లికనులు ఉంటే, 75 మంది డెమొక్రాట్లు వున్నారు. హౌస్‌లో 89 మంది రిపబ్లికనులు ఉంటే, 334 మంది డెమొక్రాట్లు వున్నారు.

అమెరికన్ ప్రజలకు రూజ్వెల్టు ఒక దేవుడయిపోయాడని ఆ రోజులలో అమెరికాకు వచ్చిన ఒక బ్రిటిషు ప్రముఖుడు చెప్పాడు.

“అధికారాన్ని చేజిక్కించుకొని స్వార్థాన్ని పెంపొందించుకో జూచినవారందరికీ, నా పరిపాలనలో తీవ్ర సంకటాలు కలిగాయి. ఇదే నా మొదటి అధ్యక్షపదవిలో నేను సాధించినది. రెండోసారి అధ్యక్ష పదవిలో అలాంటి స్వార్థశక్తుల్ని నేలమట్టం చెయ్యడమే నా ఆశయం,” అని రూజ్వెల్టు ప్రకటించాడు.

రెండవసారి అధ్యక్షుడుగా పదవి స్వీకరిస్తూ 1937 జనవరి 20 తేదీన రూజ్వెల్టు చేసిన ప్రసంగంలో ముఖ్యాంశాలు ఇవి :

"చాలీచాలని రాబడితో ఏ క్షణాన అయినా కూలిపోయే పరిస్థితులలో జీవనం సాగిస్తున్న లక్షలకొలది కుటుంబాలు నా కళ్ళకు కనిపిస్తున్నాయి.

"అర్ధ శతాబ్దంనాడే పశుజీవనంక్రింద పరిగణింపబడిన పరిస్థితులలో ఎన్నో లక్షలమంది ప్రజలు ఫాక్టరీలలోనూ, పొలాలలోనూ పనిచెయ్యడం నా కళ్ళకు కనిపిస్తోంది.

"విద్య సంపాదించడానికీ, విహారం అనుభవించడానికీ, తమ యిష్టం వచ్చినట్లుగా హాయిగా జీవయాత్ర చెయ్యడానికీ, అవకాశాలు లేక కృశిస్తూ వున్నవారు లక్షలాదిగా నా కళ్ళకు కనిపిస్తున్నారు.

"ఫాక్టరీలలోను, పొలాలలోను ఉత్పత్తి అయిన సరకులను కొనడానికి శక్తిలేక అల్లాడుతున్న లక్షలాది దౌర్భాగ్యులనూ, వారి దారిద్ర్యంవల్ల హతాశులైన అనేక కుటుంబాలనూ నేను నా కళ్ళయెదుట చూస్తున్నాను.

"సరియైన తిండి, బట్ట, వసతి లేక మన దేశంలోని ప్రజలలో మూడవవంతు మంది హీనస్థితిని అనుభవించడం నా కళ్ళకు స్పష్టంగా కనిపిస్తోంది."

బ్రహ్మాండమైన మెజారిటీతో ఎన్నిక గెలిచినా, రెండవసారి అధ్యక్షపదవి ప్రారంభమైన కొద్దిరోజులలోనే అతడు అంతకుపూర్వం ఎన్నడూ ఎరగనంతటి ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చింది. అంతే కాదు; అతడి ప్రతిష్ఠకు భంగకరమైన ఓటమినికూడా అతడు పొందాడు. అతడి అధ్యక్షపదవీకాలంలో కల్లా ఏమాత్రం జయప్రదంకాని సంవత్సరాలు 1937, 1938. మొదటి సంవత్సరాలలో అతడు పొందిన విజయమే దీనికి కారణం కావచ్చును.

పైగా ఒక బ్రిటిషు ప్రముఖుడు చెప్పినట్టుగా, దేశం ప్రతిష్టంభన పరిస్థితులలో ఉండగా దానిని వుద్ధరించిన వ్యక్తిపట్ల దేశం కొంత స్థిర పరిస్థితులలోకి రాగానే ఏదో ఒక విముఖ్య రాకమానదు. దానికి మామూలు ఉదాహరణ చెప్పాలంటే, రోగంనుంచి కోలుకోవడం ఆరంభించిన వ్యక్తి వైద్యుడి సలహాలను విమర్శించడం ఒక పరిపాటే కదా!

సుప్రీంకోర్టు పోరాటంలో రూజ్వెల్టు ఓడిపోయాడు; రెండోసారి అధ్యక్షపదవి మధ్యలో సెనెట్‌లోను, హౌసులోను రిపబ్లికనులు ఎక్కువ స్థానాలను సంపాదించుకున్నారు. ఇవి అతడికి పెద్ద పరాజయముల క్రిందనే లెక్క.

# సుప్రీంకోర్టుతో పోరాటం

సుప్రీంకోర్టుతో రూజ్వెల్టు సాగించిన పోరాటం, సుప్రీంకోర్టు అధికారం గొప్పదా, ప్రెసిడెంటు అధికారం గొప్పదా అనే విషయాన్ని తేల్చి, తన అధికారానికి ఎదురులేదని చూపడానికి అతడు చేసిన ప్రయత్నమే.

రూజ్వెల్టు అధ్యక్షపదవికి రాకపూర్వమే సుప్రీంకోర్టులో జడ్జీలుగా వున్న వ్యక్తులు, ప్రజాభీష్టంపైన దేశానికంతకూ పరిపాలకుడుగా ఎన్నుకోబడిన వ్యక్తి ప్రజలమేలును వుద్దేశించి చేసిన చట్టాలను రాజ్యాంగ సూత్రాలకు విరుద్ధమైనవని త్రోసివెయ్య గలరా? ఇదే రూజ్వెల్టుకూ, సుప్రీంకోర్టుకూ మధ్యవచ్చిన తీవ్ర సమస్య. ప్రజలుకోరిన చట్టాలను అమలు జరుపకుండా తొమ్మిదిమంది వ్యక్తులు (సుప్రీంకోర్టు జడ్జీలు) అడ్డుపడడం న్యాయమా? ఇది ప్రజారాజ్యం అవుతుందా?

ఏమంటే, రూజ్వెల్టు మొట్ట మొదటిసారి అధ్యక్షుడయిన కొత్తలో ప్రతిపాదించిన చట్టాలలో, పదకొండు చట్టాలను రాజ్యాంగ విధానానికి ప్రతికూలమైనవని, సుప్రీంకోర్టు త్రోసివేసింది.

ఈ జడ్జీలను ఏమి చెయ్యాలో రూజ్వెల్టుకు తోచలేదు. వీరంతా 60 సంవత్సరాల వయస్సుకు పైబడినవారే. వారిలో వాన్ డెవాంటర్, 77; బ్రాండీస్ 80; మెక్ రేనాల్డ్స్ 75; సదర్లాండ్ 74; హ్యూస్ 74; బట్లర్ 70; కార్డోజో 66; స్టోన్ 65; రాబర్ట్స్ 61. వీరిలో రూజ్వెల్టు విధానాలకు తీవ్రప్రతికూలభావం చూపిస్తున్నవారు వాన్ డెవాంటర్, మెక్ రేనాల్డ్స్, సదర్లాండ్, బట్లర్.

వీరిని తనదారికి తెచ్చుకోవడమా, తనదారికి అడ్డంలేకుండా తొలగించిడమా? రూజ్వెల్టుకు ఏమీ తోచలేదు. చిట్టచివరకు ఒక యెత్తు

వేశాడు. 70 సంవత్సరాల వయస్సువచ్చిన ఆరుమాసాలలో పూర్తిజీతం మీద ఉద్యోగంనుంచి ప్రతిజడ్జీ విరమించాలనీ, అలా విరమించని ప్రతిజడ్జికి బదులుగా మొత్తం జడ్జీలసంఖ్య 15 అయేవరకూ మరొక జడ్జీని నియమించే అధికారం తనకు ఉండాలనీ ప్రతిపాదిస్తూ, 1938 ఫిబ్రవరి 5 న అతడొక చట్టాన్ని ప్రవేశపెట్టాడు. ఆచట్టం గనుక ప్యాసయినట్లయితే, సుప్రీంకోర్టు జడ్జీలలో అతడికి అనుకూలురైనవారు ఎక్కువగా వుండేటట్టు కొత్తవారిని నియమించవచ్చును.

తానున్న పరిస్థితులలో గత్యంతరంలేక, యీవిధంగా చట్టాన్ని ప్రవేశపెట్టవలసిన అగత్యం రూజ్వెల్టుకు కలిగిన మాట వాస్తవమే. అయినా, అతడు యీ చట్టాన్ని ప్రవేశపెట్టడంవల్ల అతడిలో చాలా అసహ్యమైన గుణాలుకూడా వున్నాయని స్పష్టపడిపోయింది. చాలామందికి ఇది నీచప్రవర్తనగా తోచింది.

ఈ చట్టాన్ని రూజ్వెల్టూ, అతడి అటర్నీజనరల్ హోమర్ కమ్మింగ్సూ చాలా రహస్యంగా తయారు చేశారు. ఇలాటి చట్టం ఒకటి తయారవుతోందని, కాంగ్రెసులో ఎవరికీ తెలియదు. చట్టం కాంగ్రెసులో ప్రతిపాదించబడేటప్పటికి దేశమంతా ఒక్కసారి హాహాకారాలతో రూజ్వెల్టును నిందించ నారంభించింది.

అసలు యీ పోరాటంలోని అంతరార్థం న్యాయ శాస్త్రరీత్యా పరిశీలిస్తే, ఇది :

1. రాజ్యాంగ విధానాన్ని దేశపు ప్రజలు తయారు చేసుకున్నారు. రాజ్యాంగవిధానం ప్రకారం ప్రభుత్వ శాఖలను ఏర్పాటుచేసి, ఆ శాఖలకు వివిధాధికారాలను ప్రజలే ఇచ్చారు. ఈ రాజ్యాంగ విధానమే దేశంలోని చట్టాలన్నిటిలోకీ ప్రధానమైనది; ప్రథమమైనదీను.

2. రాజ్యాంగ విధాన ప్రకారం పరిపాలన సక్రమంగా జరిగేటట్టు చూడడానికి సుప్రీంకోర్టు జడ్జీలంతా ప్రమాణం చేశారు.

3. కాంగ్రెసు చేసిన చట్టాలలో ఏదైనా, దేశంలోని ప్రధాన చట్టమైన రాజ్యాంగవిధానానికి వ్యతిరేకంగా ఉన్నప్పుడు దానిని సుప్రీంకోర్టు ఆమోదించ జాలదు.

ఇది ఒకవైపు వాదము. దానికి ప్రతివాదం ఇది :

1. రాజ్యాంగ విధానాన్ని దేశపు ప్రజలు తయారు చేసుకున్నారు. రాజ్యాంగ విధానం ప్రకారం ప్రభుత్వ శాఖలను ఏర్పాటుచేసి, ఆ శాఖలకు వివిధాధికారాలను ప్రజలే ఇచ్చారు. ఈ రాజ్యాంగ విధానమే దేశంలోని చట్టాలన్నిటిలోకీ ప్రధానమైనదీ; ప్రథమమైనదీను.

2. రాజ్యాంగ విధాన ప్రకారం పరిపాలన సక్రమంగా జరిగేటట్లు చూడడానికి ప్రెసిడెంటు ప్రమాణం చేశాడు.

3. దేశంలో ప్రధాన చట్టమైన రాజ్యాంగ విధానానికి ప్రతికూలంగా సుప్రీంకోర్టు ఏదైనా ఒక నిర్ణయాన్ని చేసినప్పుడు ఆ నిర్ణయాన్ని ప్రెసిడెంటు ఆమోదించ జాలడు. ఆ నిర్ణయం చెల్లనేరదని అతడు స్పష్టంగా ప్రకటించ వచ్చును.

రూజ్వెల్టు కాపట్యం లేకుండా ప్రవర్తించి, కాంగ్రెసుతో సంప్రతించి, ఏదో చర్యకు దిగినట్లయితే ఫలితం వేరుగా వుండేది. తమకు తెలియకుండా, రహస్యంగా రూజ్వెల్టు ఒక పన్నాగం పన్నాడన్న భావం ప్రజలకు వుండేదికాదు.

"సుప్రీంకోర్టును సాగనంప వలసిన అవసరం వచ్చింది. ఆ పని నేను చెయ్యబోతున్నాను," అని రూజ్వెల్టు స్పష్టంగా చెప్పినట్లయితే, ప్రజలు అర్థంచేసుకొని వుండేవారు. చట్టాలను చెల్లనేరవని కోర్టులు ప్రకటించడం శాసన నిర్మాణాధి కారాన్ని కోర్టులు తమ చేతులోకి తెచ్చుకోవడమేననీ, అలాటిస్థితి ఎక్కువకాలం సాగకుండా ఏమయినా చర్య తీసుకోవాలనీ చాలామంది భావించారు. కాని, అలా చెయ్యడానికి రూజ్వెల్టు అవలంబించిన పద్ధతినిమాత్రం వారు సహించజాలక పోయారు.

ఈ బిల్లు విషయంలో సెనేట్‌కూ, ప్రెసిడెంటుకూ పోరాటం 168 రోజులు జరిగింది. ప్రెసిడెంటు ఎంతో వత్తిడి చేసినప్పడికీ, సెనేట్ కమిటీ ఈ బిల్లును నిరాకరించింది. ఈ పోరాటంవల్ల డెమొక్రాటిక్ పార్టీయే రెండు చీలికలైపోయింది. ఇప్పటికీ ఆ బిల్లును తలచుకున్నప్పుడు ఉగ్రులయేవారు అమెరికాలో చాలామంది ఉన్నారు.

అయితే, చిత్రం ఏమిటంటే, బిల్లును సెనెట్ నిరాకరించినా, రూజ్వెల్టు కోరిక మాత్రం ఫలించింది. ఏమంటే, యీ పోరాటం జరుగుతూవున్న చివరి రోజులలో వాన్ డెవాంటర్ పదవినుంచి విరమించాడు. అప్పుడు రూజ్వెల్టు హ్యూగో బ్లాక్‌ను జడ్జిగా నియమించాడు. 1940 నాటికి బ్రాండీస్, కార్డోజో, సదర్లాండ్, బట్లర్, మెక్ రేనాల్డ్‌లు కూడా వెళ్ళిపోయారు. సుప్రీంకోర్టు పూర్తిగా రూజ్వెల్టు వైపోయింది. 1941 లో సుప్రీంకోర్టు ప్రధాన జడ్జిగా తనకు కొలంబియాలో ఉపాధ్యాయుడుగా వున్న హార్లాన్ స్టోన్‌ను రూజ్వెల్టు నియమించాడు.

## యుద్ధ ప్రయత్నాలు

ఇంతలో యుద్ధమేఘాలు యూరప్‌పైన పూర్తిగా అలముకుని, అమెరికావైపు విస్తరిల్ల నారంభించాయి.

అధ్యక్షుడుగావున్న మొదటి నాలుగేండ్లలో రూజ్వెల్టు దేశీయ వ్యవహారాలపట్ల తీసుకున్నంత శ్రద్ధను విదేశ వ్యవహారాలపట్ల తీసుకో లేదు. రెండవసారి అధ్యక్ష పదవీకాలంలో విదేశ వ్యవహారాలే అతడికి విస్తారం పని కల్పించాయి. 1936 అంతందాకా, లేదా 1937 ఆరంభందాకా అతడు అమెరికానుతప్ప మిగతా ప్రపంచాన్ని గురించి ఎక్కువ ఆలోచించనే లేదని చెప్పాలి. అంతవరకు విదేశ వ్యవహారాలను గురించి అతడు ఆలోచించినదీ, చేసినదీ ఏమిటంటే చైనా వ్యవహారాలను కొంచెం జాగ్రత్తగా పరిశీలించడం, ఫిలిపీన్ దీవుల స్వాతంత్ర్యంకొరకు ఎక్కువ కృషి చెయ్యడం, రష్యాలోని సోవియట్ ప్రభుత్వాన్ని గుర్తించడం, బ్రిటిషు ప్రధాని మెక్డోనాల్డ్, ఫ్రెంచి ప్రధాని హెరియో అమెరికాకు వస్తే వారికి స్వాగతం చెప్పడం. అంతకుమించి అతడు విదేశ వ్యవహారాలపట్ల ఏ విధమైన ప్రత్యేక శ్రద్ధనూ చూపలేదు. తన యావచ్ఛక్తినీ అమెరికాలో నూతన ఆర్థిక విధానాన్ని జయప్రదంగా అమలు జరపడానికే వినియోగించాడు. విదేశ వ్యవహారాలను గురించిన అన్ని నిర్ణయాలనూ విదేశ శాఖామంత్రి వర్గానికే పూర్తిగా వదలివేశాడు.

విదేశ వ్యవహారాలపట్ల రూజ్వెల్టు కొంచెం ఎక్కువ శ్రద్ధ తీసుకొనేటటు చూడమని న్యూయార్కు టైమ్సు పత్రిక ప్రత్యేక విలేఖరిని

1933 లో రూజ్వెల్టు సతి కోరింది. ఆనాటి పరిస్థితి అలావుంటే 1940 లో "విదేశ వ్యవహారాలను గురించి తప్ప రూజ్వెల్టు మరేమీ మాట్లాడడంలేదు," అని అటర్నీ జనరల్ రాబర్ట్ జాక్సన్ అన్నాడు.

ఏడు సంవత్సరాలలో రూజ్వెల్టు అంతగా మార్పు చెందవలసిన అవసరాన్ని పరిస్థితులే తెచ్చిపెట్టాయన్నమాట.

రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కాకముందే అమెరికా ప్రజా రాజ్య విధానానికే గాక, ప్రపంచంలోని ప్రజారాజ్యా లన్నిటికీ ఒక నాయకుడుగా రూజ్వెల్టు ప్రముఖస్థానాన్ని పొందాడు.

యునైటెడ్ స్టేట్సులో అనేకమంది ప్రజలూ, నాయకులూ కూడా యూరప్ వ్యవహారాలలో అమెరికా జోక్యం కలిగించుకో కూడదనీ, తటస్థంగా వుండాలని కోరుతున్నారనీ రూజ్వెల్టుకు తెలుసు. అలాటిభావం అమెరికాలో ప్రబలంగా వుండడానికి ప్రధానకారణాలు ఏమిటంటే, మొదటి ప్రపంచయుద్ధపు ఫలితాలవల్ల కలిగిన అసంతృప్తి, యుద్ధంవల్ల కలిగే నష్టాల పట్ల అయిష్టత, యూరప్ పోట్లాటలలో అమెరికా చిక్కుపడడం పట్ల అనంగీకారము. దేశంలోని రిపబ్లికన్ పార్టీ నాయకులే గాక, డెమొక్రాటిక్ పార్టీ నాయకులలో చాలామందీ, నూతన ఆర్థిక విధాన వాదులలో చాలామందీ కూడా యూరప్‌లోని కల్లోలాలకు అమెరికా దూరస్థంగా వుండాలని వాదించారు.

దేశంలోని పెద్ద పెద్ద పరిశ్రమల యజమానులు చాలా మందికి జర్మనీతో వ్యాపార సంబంధాలు వున్నాయి. దేశంలోని చాలామంది పురాతన సాంప్రదాయ వాదులకు, బహిరంగంగా కాకపోయినా, అంత రంగికంగా ఫాసిజంపట్ల సానుభూతి వుంది. అనేకలక్షలమంది ప్రజలకు పొరపాటు అభిప్రాయాల వల్ల, ముసోలినీ పట్ల చాలా అభిమాన గౌరవాలు వున్నాయి. యూరప్‌యుద్ధం పట్ల అమెరికా తటస్థవిధానం అవలంబించాలని నిర్వచిస్తూ, కాంగ్రెసు అనేకచట్టాలను ప్యాసుచేసింది. దురాశ, పిరికితనము, కర్తవ్యతాజ్ఞాన శూన్యతవల్ల అమెరికన్ ప్రజలూ, నాయకులూ కూడా ప్రజారాజ్య విధాన రక్షణపట్ల తమ బాధ్యతను పూర్తిగా విస్మరించారు.

ఇలాంటి పరిస్థితిలో యూరప్‌లో నియంతలు తమ దురాక్రమణలను విజృంభింపజేసి ముందుకు సాగిపోతున్నారు. చైనాను ఆక్రమించుకోవడంలో జపాను ఔద్ధత్యానికి అడ్డు అనేది లేకుండా పోయింది. హిట్లర్ రైన్‌లాండ్‌ను చేజిక్కించుకున్నాడు; ఆస్ట్రియాను కబళించి వేశాడు; చెకోస్లావేకియాను నలిపి, జీవావశిష్టం చేసి పొట్టను పెట్టుకున్నాడు. స్పెయినులోని ప్రజారాజ్యాన్ని కొంతమంది సైనిక నాయకులు జనరల్ ఫ్రాంకో నాయకత్వాన కూలద్రోసి, నియంతృత్వ రాజ్యాన్ని స్థాపించారు. కళ్ళులేని కబోదికికూడా రెండవ ప్రపంచయుద్ధ జ్వాలలవేడి స్పష్టంగా తగులు తోంది. అయినా అమెరికాలోని గుడ్డి తటస్థవాదులు మాత్రం తమ కళ్ళువిప్పి చూడకుండా తమ తటస్థవిధానాన్నే అనుసరించాలని చూస్తున్నారు.

రూజ్వెల్టు మాత్రం ప్రమాద పరిస్థితులను 1937 లోనే గ్రహించాడు. 1937 అక్టోబరులో ఒక ఉపన్యాసంలో అతడిలా చెప్పాడు: "అంతులేని యుద్ధ చర్యలతో నిండే మిలిటరీ శక్తులకు అవకాశాన్ని యివ్వడమో, దురాక్రమణదారుల చర్యలను అరికట్టి వారు మరీ ముందుకు సాగకుండా చెయ్యడమో నిర్ణయించుకోవలసిన సమయం మనకిప్పు డాసన్నమైంది."

ఒక వైపున ప్రజారాజ్య సూత్రాలకు ఏర్పడిన ముప్పును అమెరికన్ ప్రజలకు వివరించి చెప్పి వారి కర్తవ్యాన్ని వారికి బోధిస్తూ, మరొక వైపున దురాక్రమణ విధానాన్ని అనుసరించ వలదని నియంతలను అర్థించాడు రూజ్వెల్టు.

హిట్లరు తత్వాన్ని రూజ్వెల్టు బాగా అర్థంచేసుకున్నాడు. హిట్లరు వల్ల ప్రపంచ శాంతికీ, ప్రజారాజ్య సూత్రాలకూ ఎంత ప్రమాదం కలుగ నున్నదో అతడు గ్రహించి, తాను గ్రహించిన సత్యాన్ని అమెరికన్ ప్రజలకు విప్పి చెప్పడంలో అతడు ఎంతమాత్రం ఏమరలేదు. హిట్లరు ఒక ఛిద్రకారుడని అమెరికన్ ప్రజలు గ్రహించారు. కాని, అతడివల్ల ఎంత ప్రమాదం కలుగుతుందో చాలామంది ఊహించలేక పోయారు. రాబోయే ప్రమాదాన్ని చాలా అతిశయోక్తులలో చెప్పి, అమెరికన్ ప్రజలను భీతావహుల్ని చెయ్యడానికి రూజ్వెల్టు ప్రయత్నిస్తున్నాడని తటస్థవాదులు అతణ్ణి నిందించ నారంభించారు. కాని, ప్రపంచ పరిస్థితులు ఎలా పరిణ

మించినదీ, యీనాడు చూస్తే సరియైన భావనాశక్తిలేనివాళ్లు. ఆ తటస్థ వాదులేనని స్పష్టంగా తేలిపోయింది.

హిట్లరు తత్వాన్ని రూజ్వెల్టు బాగా అర్థం చేసుకున్నందువల్ల, హిట్లరంటే రూజ్వెల్టు ఏమాత్రమూ భయపడలేదు. ఏ విధంగా దెబ్బకొడితే హిట్లరు సమూలంగా పతనం పొందుతాడో రూజ్వెల్టు బాగా గ్రహించాడు. బ్రిటిషు ప్రధాన మంత్రి నెవిల్లి ఛాంబర్లేనును మోసగించినట్టు, రూజ్వెల్టును హిట్లరు మోసగించలేక పోయాడు.

ఈ రోజులలో జర్మనీకన్న జపాను యునైటెడ్ స్టేట్సుకు ఎక్కువ ఛిద్రకారిగా పరిణమించింది. హిట్లర్ బుకాయింపులతో, మోసంతో ఒక్కొక్క రాజ్యాన్నే కబళించి వేస్తూవుంటే, జపాను స్పష్టంగా, ప్రత్యక్షంగా చైనాలో యుద్ధాన్నే చేస్తూవున్నది. అమెరికాలోని కొంత మంది ప్రముఖులు జపానుకు పెట్రోలునూ, తుక్కు ఇనుమునూ ఎగుమతి కాకుండా ఆపివెయ్యాలని తీవ్రంగా కోరుతున్నారు. రూజ్వెల్టు ఆ విధంగా చేసినట్లయితే జపాను అమెరికాతో యుద్ధానికి దిగేది. (చివరకు జరిగిన దంతే). జపాను దురాక్రమణను అరికట్టడానికి తగినచర్యను అతడు అవలంబించక పోతే, శీఘ్రకాలంలోనే ఆసియా ఖండాన్నంతనూ జపాను ఆక్రమించవచ్చును. ఈ పరిస్థితులలో ఏం చెయ్యాలా అనే సందిగ్ధావస్థలో పడ్డాడు ప్రెసిడెంట్ రూజ్వెల్టు. అతడి సందిగ్ధావస్థను బాగా వినియోగించుకొని జర్మనీ ఇటలీలతో పరస్పర సహకారసంధి చేసుకున్నది జపాను.

జర్మనీ, జపాను, ఇటలీలు మిత్రరాజ్యాలైనవి. రష్యా అటూ యిటూ కాకుండా గోడమీద పిల్లివాటంగా తనకు అనుకూలమైనంత వరకు రెండు వర్గాలతోనూ మైత్రి నటిస్తున్నది. ఫ్రాన్సు, బ్రిటనులు రెండూకలసి జర్మనీకి చెకోస్లావేకియాను కట్టబెట్టాయి. చైనాకు సహాయం అందజెయ్యడానికి ఏకైక మార్గమైన బర్మారోడ్డును మూసివేసి, బ్రిటను జపానును సంతృప్తిపరచడానికి పూనుకున్నది. ఇలాంటి పరిస్థితులలో రూజ్వెల్టు ఒక్కడూ నియంతల దురాక్రమణను అరికట్టడానికి ఏం చెయ్యగలడు!

అయితే, ఆనాటికే అతడు నియంతల ఆశయాలను, పన్నాగాలను బాగా అర్థంచేసుకోవడంవల్ల తదనంతరం అతడు అవలంబించిన చర్యలు జయప్రదం కాగలిగాయి.

ఆ రోజులలో నిజానికి యుద్ధంలోకి దిగాలనే కాంక్ష రూజ్వెల్టుకు లేదు. అయితే, యుద్ధం తప్పదనిమాత్రం అతడు గ్రహించాడు. అమెరికన్ ప్రజలకు యిష్టంవున్నా, లేకపోయినా అమెరికాకూడా యుద్ధంలోకి దిగి తీరవలసి వస్తుందని అతడు విశ్వసించాడు. తదనుగుణంగా అమెరికా సంసిద్ధమై వుండాలని అతడు కోరాడు.

దూరస్థ విధానాన్ని అవలంబించడంవల్ల అమెరికా భద్రతకే ముప్పు రాగలదని అమెరికన్ ప్రజాబాహుళ్యానికి నచ్చ జెప్పడానికి ఆ రోజులలో అతడు శాయశక్తులా ప్రయత్నించాడు. "యుద్ధం చెయ్యకుండానే అక్షరాజ్యాలను ఓడించ గలము," అనే భ్రమ అమెరికాలోని ప్రముఖులకు చాలామందికి వుండేది. అది చాలా పొరపాటు అభిప్రాయమని వారికి పరిస్థితుల తీవ్రతను విశదపరచడానికికూడా రూస్వెల్టు చాలా కృషి చేశాడు. ఆస్ట్రియాను హిట్లరు ఆక్రమించి నప్పుడే, యుద్ధం తప్పదని రూజ్వెల్టు గ్రహించాడు. ఆ రోజులలో అడ్మిరల్ లీహీతో అన్న మాటలివి: "యుద్ధం తప్పకుండా రాబోతున్నది. అప్పుడు నీ అవసరం నాకు చాలా వుంటుంది."

రూజ్వెల్టు చిట్టచివరిదాకా శాంతికోసమే ప్రయత్నించాడనీ, యుద్ధంలో దిగాలనే ఆదుర్దా ఎంత మాత్రమూ చూపలేదనీ, అతణ్ణి యీనాడు దేనికైనా నిందించవలసి వస్తే అది కేవలం అతడు యుద్ధంలో ప్రవేశించడం చాలా తాపీగా చెయ్యడమేననీ హెన్రీ స్టిమ్సన్ యీనాడు కూడా ఉద్ఘాటిస్తున్నాడు.

1939 లో రూజ్వెల్టు అవలంబించిన విధానం, అతడు అవలంబించవలసినంత తీవ్రంగా లేదని అతణ్ణి విమర్శించేవారు యీనాడు చాలామంది కనిపిస్తున్నారు. ఎలాగయినా యుద్ధం చెయ్యకుండా తప్పించుకుందామని అతడు ప్రయత్నించాడని అతడి విమర్శకుల భావన. కాని, దూరస్థవాదుల తీవ్రవిమర్శలు ఆ రోజులలో ఎంత ఎక్కువగా వుండేవో వారు గమనించడం లేదు.

1939 సెప్టెంబరు 1 వ తేదీన జర్మనీ పోలెండుమీద దాడి చేసింది. మానవజాతి కని విని యెరుగని మహోపద్రవానికి అది ప్రారంభమైంది.

ఆ రోజు తెల్లవారు ఝామున 2-50 నిమిషాలకు పారిస్‌నుంచి అక్కడి అమెరికన్ రాయబారి టెలిఫోనులో ప్రెసిడెంటు రూజ్వెల్టుకు ఇలా చెప్పాడు: "జర్మన్ సైన్యాలు పోలెండులోకి నడవసాగినవని పోలెండులోని మన రాయబారి బిడిల్ ఇప్పుడే నాకు తెలియ జేశాడు." ఆ మాటలు విని రూజ్వెల్టు చెప్పిన జవాబు ఇది: "అయితే, అంత పనీ జరిగిందన్న మాట."

# ఏటం బాంబు

1939 అక్టోబరులోనే రూజ్వెల్టు తన దూరాలోచననూ, భావనా శక్తినీ, ధైర్యాన్నీ రుజువుచేసే ఒక గొప్ప నిర్ణయాన్ని చేశాడు. అదేమిటంటే, అక్టోబరు 11 తేదీన అలెగ్జాండర్ శాక్స్ అనే న్యూయార్కులోని ఒక విజ్ఞానశాస్త్ర పరిశోధకుడు రూజ్వెల్టు దర్శనానికి వచ్చి, ఏటంను విచ్ఛిన్నం చెయ్యడానికి జరుగుతున్న కొత్త పరిశోధనలనుగురించి చెప్పాడు. ఏటంను విచ్ఛిన్నం చెయ్యడాన్ని గురించి మూలనున్న ముసలమ్మకు ఏంత తెలుసో రూజ్వెల్టుకూ అంతే తెలుసు. కాని, రూజ్వెల్టు మాత్రం శ్రద్ధగా శాక్స్ చెప్పిన దానిని విన్నాడు. వినడమే కాదు; దాని మీద చర్యకూడా దిగాడు.

డాక్టర్ శాక్స్ కేవలం తన సొంత బాధ్యత మీద రూజ్వెల్టును చూడడానికి వాషింగ్టన్ వచ్చాడు. అప్పటివరకూ ఏటంను విచ్ఛిన్నం చెయ్యడానికి జర్మనులు చేసిన ప్రయత్నాలను అతడు తెలుసుకున్నాడు. ఈ విషయాలన్నిటినీ చెపుతూ వుంటే రూజ్వెల్టు కొంత పరధ్యానంగా వున్నట్లు అతడికి కనిపించింది. "న్యూయార్కునుంచి నా సొంత డబ్బు ఖర్చు పెట్టుకొని ఇక్కడకు వచ్చాను. అంచేత, నే చెప్పేది దయచేసి శ్రద్ధగా వింటారా?" అని అతడు రూజ్వెల్టును మందలించాడు. రూజ్వెల్టు, డాక్టర్ శాక్స్ చెప్పిన విషయాలన్నిటినీ శ్రద్ధగా విన్నాడు.

"అయితే, జర్మనులు మనమీద ఏటంబాంబు వేసి, మనలను నేల మట్టం చెయ్యకుండా జాగ్రత్త పడాలని సూచిస్తున్నా వన్న మాట?" అని రూజ్వెల్టు డాక్టర్ శాక్స్‌ను అడిగాడు. ఈ ప్రశ్నను బట్టి ఏటం బాంబును మరొకరిపైన ప్రయోగించడానికి గాక అమెరికాను రక్షించుకో

డానికి తయారు చెయ్యాలనే ఆలోచనే ప్రథమంలో రూజ్వెల్టుకు వున్నట్టు స్పష్ట మవుతుంది.

వెంటనే రూజ్వెల్టు ఏటం శక్తి విషయంలో పరిశోధనలు చెయ్యడానికి ఉత్తరువులు ఇచ్చాడు. ఇదంతా మిలిటరీ ఆఫీసర్లకు అయోమయంగా వుంది. యుద్ధకార్యాలలో ఏటం శక్తి పరిశోధన ఏమిటని వారంతా విమర్శించారు. కాని, రూజ్వెల్టు మాత్రం తన నిర్ణయాన్ని మార్చలేదు.

1940 జూన్ 15 తేదీ నాటికి ఏటంబాంబును నిర్మించడానికి సమస్తమైన ఏర్పాట్లతోను మన్‌హటన్‌లో బ్రహ్మాండమైన ఫాక్టరీ నిర్మింప బడినది. దానికి అధిపతిగా డాక్టర్ వానివర్ బుష్ నియమింప బడినాడు. అతి శీఘ్రకాలంలోనే అక్కడ పరిశోధనలు ప్రారంభ మయాయి. దాని ఫలితం మనకు తెలుసుకదా !

# మూడవసారి అధ్యక్షపదవి

మూడవసారికూడా అమెరికా అధ్యక్షపదవికి రూజ్వెల్టు ఎన్నుకో బడడం మామూలుగా జరిగిందని అమెరికాలోని యువకులు లక్షలమంది యీనాడు భావిస్తున్నారు. కాని, మూడవసారి అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిలబడతానని 1940 లో రూజ్వెల్టు ప్రకటించినప్పుడు అమెరికాలో రేగిన రాజకీయదుమారం ఎంత దట్టమైనదో యీనాటి యువకులకు తెలియదు.

కాని, మూడవసారి అధ్యక్షపదవికి రూజ్వెల్టు పోటి చేసినట్లయితే, అమెరికాలో ఏ వ్యక్తికూడా ఎనిమిదేళ్ళకు మించి అధ్యక్ష పదవిలో వుండకూడదనే నియమం శాశ్వతంగా ఉల్లంఘించ బడుతుందని ఎంతో మంది భయపడి, రూజ్వెల్టు నిర్ణయాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. ఒకసారి ఆ నియమం ఉల్లంఘించ బడిందంటే, అలా ఉల్లంఘన చేసిన వ్యక్తి అధికార వ్యామోహంతో శాశ్వతంగా ఆ పదవిని చేపట్టాలనుకో చూస్తాడని వారంతా విశ్వసించారు.

మూడవసారి అధ్యక్షపదవికి నిలబడాలనే కోరిక రూజ్వెల్టుకు రెండు కారణాలవల్ల కలిగింది. ఒకటి: తన నూతన ఆర్థిక విధానాన్ని పూర్తిగా అమలు జరుపకోరడం; రెండు: యుద్ధం రాక తప్పదని రూజ్వెల్టు విశ్వసించడం. అమెరికా ప్రపంచయుద్ధంలో పాల్గొనక తప్పదనే భావం

రూజ్వెల్టుకు లేకపోతే, బహుశా అతడు మూడవసారి అధ్యక్ష పదవికి పోటీచేసేవాడు కాదేమో! కాని, మూడవసారి పోటీ చెయ్యడానికి అతడు నిర్ణయించుకున్నందువల్ల, యుద్ధసమస్యపట్ల అవలంబించే విధానాన్ని అతడు స్పష్టంగా వ్యక్తపరచి, ప్రజాభిప్రాయాన్ని తనపట్ల త్రిప్పుకోవలసిన అవసరంకూడా ఏర్పడింది.

రూజ్వెల్టును యీ విషయంలో ప్రతిఘటించినవారు చాలావరకు వ్యక్తిగతంగా అతడంటే కిట్టనివారే. రూజ్వెల్టు నిర్ణయాన్ని ఆమోదించి బలపరచిన వారిలో అధిక సంఖ్యాకులలో చాలామంది ఆ నిర్ణయంపట్ల చాలా బాధపడ్డారు. ఎనిమిది సంవత్సరాలకన్న ఎక్కువకాలం ఒక వ్యక్తి అధ్యక్షుడుగా వుండకూడదనే నియమాన్ని వదలుకోవడం వారికి చాలా మనస్తాపాన్ని కలిగించింది. అయితే, రూజ్వెల్టు పట్ల వుండే ప్రత్యేకాభిమానం వల్లనూ, యుద్ధంవచ్చే పరిస్థితులు కన్పిస్తూ వుండడంవల్లనూ వారు అతడి నిర్ణయాన్ని ఆమోదించగలిగారు. అప్పటికీ చాలామంది విపరీతమైన మనస్తాపాన్ని పొందారనడంలో సందేహం లేదు.

మహాత్మాగాంధి మాంసభక్షణచేస్తే ప్రపంచంలోని ప్రజలు ఎంత మనస్తాపం పొందుతారో, రూజ్వెల్టు మూడవసారి పోటీచేస్తేకూడా అంత మనస్తాపం పొందుతారని 1939 లో ఒక రచయిత 'న్యూ రిపబ్లిక్' అనే పత్రికలో వ్రాశాడు.

మూడవసారి అధ్యక్షపదవిని గురించిన ప్రస్తావన యుద్ధం సమీపించిన కాలంలో ప్రారంభం కాలేదు. అప్పటికి చాలా ముందే ప్రారంభమైంది. "ప్రెసిడెంటు మళ్ళీ ఇంకోసారి ఎన్నికలో పోటీచేస్తాడా?" అని 1937 నుంచే ప్రజలు అడగడం ఆరంభించారు. నూతన ఆర్థిక విధానాన్ని పూర్తిగా అమలు జరపాలంటే 1940 తరువాతకూడా రూజ్వెల్టు అధ్యక్షపదవిలో వుండవలసి వస్తుందని చాలామంది గ్రహించారు.

అయితే, కాలంగడచిన కొద్దీ ప్రజలలో ఉత్సుకత, ఉద్రేకం ఎక్కువ అవడం సాగింది. దానికి కారణం రూజ్వెల్టు తన మనసులోని మాటను పైకి చెప్పకపోవడమే. ప్రజలు ఉద్రేకంతో జుట్టు పీక్కుంటూ వుంటే, రూజ్వెల్టు మాత్రం బెల్లంకొట్టిన రాయిలాగ వూరుకున్నాడు.

దేశంలోని ప్రజలందరికీ పిచ్చియెక్కినా రూజ్వెల్టు తన మనసులోని మాటను పైకి చెప్పకపోవడానికి కారణాలు లేకపోలేదు. తాను మూడోసారి అధ్యక్షపదవికి పోటీ చెయ్యనని అతడు స్పష్టంగా చెప్పివేసినట్లయితే, అతడి అధికార ప్రాబల్యం తగ్గుతుంది. అప్పుడు తన విధానాలను జయప్రదంగా అమలు జరపడానికి, అతడు పదవిలోవున్న రోజులలోకూడా అతడికి సాధ్యంకాదు.

తాను అధ్యక్షపదవికి మూడోసారికూడా పోటీ చేస్తున్నానని ముందుగానే బయటపెడితే, అధ్యక్షుడుగా తన గౌరవానికి కళంకం తెచ్చుకున్నవాడవుతాడు.

అన్నిటికన్న ముఖ్యమైనదీ, మూడవదీ మరొక కారణం ఏమిటంటే, రెండవసారి అధ్యక్షపదవి పరిమితి చాలావరకు తీరిపోయినదాకా, మూడోసారి పోటీ చెయ్యడమా వద్దా అనే విషయాన్ని తనకు తానే ఇదమిత్థం అతడు తేల్చుకోలేక పోయాడు.

రూజ్వెల్టు తనసంగతి అటూ ఇటూ తేల్చక పోవడంవల్ల డెమొక్రాటిక్ పార్టీ తరఫున అభ్యర్థులుగా నిలవదలచిన తక్కినవారు తమ అభ్యర్థిత్వాన్ని గురించి ఏ విధమైన ప్రయత్నమూ చెయ్యడానికి వీలులేని పరిస్థితిలో పడిపోయారు. ఆ విధంగా రూజ్వెల్టు డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థి ఎవడూ పైకిరాకుండా చెయ్యగలిగాడు. 1939 అంతంలో ఎక్కడో మాట్లాడుతూ తన నూతన ఆర్థిక విధానాన్ని కొనసాగించడానికి సర్వవిధాలా ప్రయత్నంచెయ్యని డెమొక్రాటిక్ అభ్యర్థిని ఎవరినీ అధ్యక్షపదవికి సూచించజాలనని అతడు ప్రకటించాడు. డెమొక్రాటిక్ పార్టీలో పలుకుబడిగలవారంతా నూతన ఆర్థిక విధానంపట్ల ఉత్సాహం లేనివారే. అందుచేత, ఎవరూ ముందుకు రాలేకపోయారు. జేమ్స్ ఫార్లే, జాన్ గార్నర్ - వీరిద్దరూ అధ్యక్షపదవికి అభ్యర్థిత్వాన్ని తాము పొందుదామంటే తాము పొందుదామని తీవ్ర ప్రయత్నాలు చేశారు. కాని, వీరిద్దరిలో ఎవరూ కూడా ఆ పదవికి అర్హులు కారని రూజ్వెల్టు భావించాడు.

తన తరువాత అధ్యక్షుడుగా వుండటానికి హారీ హాప్కిన్సును తయారుచేద్దామని రూజ్వెల్టు కొంతకాలం భావించాడు గాని, హాప్కిన్సు ఆరోగ్యం చెడిపోయి మంచమెక్కాడు.

మూడోసారి అధ్యక్షపదవికి పోటీ చేద్దామనే ఊహ రూజ్వెల్టుకు నిజంగా కలిగినది 1939 లోనేనని, అంతకుపూర్వం అతడికి ఆ కోరిక లేదని చెప్పడానికి చాలా నిదర్శనాలు వున్నాయి. దానికి కారణాలు కూడా వున్నాయి. అతడు మూడోసారి పోటీచెయ్యడం ఎలియనార్‌కు ఇష్టంలేదు; రెండుసార్లు అధ్యక్షపదవిలో వుండటంతోటే అతడికి శ్రమ చాలా ఎక్కువ అయింది. పైగా, వాషింగ్టన్ గాలి అతడి ఆరోగ్యానికి అంత బాగా పడలేదు. వాషింగ్టన్ నుంచి వెళ్ళిపోయి హైడ్ పార్కులో కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకుందామనికూడా అతడు అనుకున్నాడు. తాను మూడోసారి పోటీచెయ్యనని రూజ్వెల్టు తన అంతరంగిక మిత్రులలో కొంతమందికి మొదట్లో చాలా స్పష్టంగా చెప్పాడు. అది కొంతవరకు పైకి పొక్కింది. అంచేత, తీరా అతడు మళ్ళీ ఎన్నికలో నిలబడతానని ప్రకటించినప్పుడు అతడు దగాచేశాడని జెమ్సు ఫార్లే మొదలైనవారు అతణ్ణి నిందించారు.

1940 జనవరి 27 తేదీన రూజ్వెల్టు కాలియర్స్ పత్రిక యజమాని విలియం ఎల్. చెనెరీతో ఒక కాంట్రాక్టుమీద సంతకంపెట్టాడు. అదేమిటంటే 1941 జనవరిలో అధ్యక్షపదవినుంచి విరమించిన తరువాత, కాలియర్స్ పత్రికకు సంపాదకుడుగా ఏడాదికి 75,000 డాలర్ల జీతంమీద మూడేళ్ళపాటు రూజ్వెల్టు పని చెయ్యడానికి ఒప్పుకోవడం. రూజ్వెల్టు చేయవలసినపని ఏమిటంటే ఆ పత్రికకు ఏడాదికి 26 వ్యాసాలు వ్రాయడం.

దీనినిబట్టి 1940 జనవరి అంతంవరకు తాను మూడోసారి అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానికి వుద్దేశించలేదనే స్పష్టపడుతున్నది. జర్మను సైన్యాలు ఫ్రాన్సులో జొరబడినదాకా 1940 మే నెలవరకు రూజ్వెల్టు మూడోసారి అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానికి నిశ్చయించుకోలేదనే చెప్పవచ్చును.

రూజ్వెల్టు తన అభిప్రాయాన్ని మార్చుకొని మూడోసారికూడా అమెరికా అధ్యక్షుడుగా వుండడానికి నిశ్చయించడానికి కారణాలు ఏమిటి? యుద్ధంలో అమెరికాకూడా దిగవలసిన కాలం ఆసన్నమైందని అతడు భావించడం ఒకటి; అప్పటివరకూ తనచేతిమీదుగా నడుస్తున్న అమెరికా రక్షణ కార్యక్రమాలను మధ్యలో విడిచిపెట్టడం న్యాయం

కాదని అతడు విశ్వసించడం రెండు; నూతన ఆర్థిక విధానాన్ని సవ్యంగా అమలుజరిపే మరొక డెమొక్రాటిక్ అభ్యర్థి ఎవరూ కనపడకపోవడం మూడు.

## పార్టీ మహాసభ

మూడోసారి అధ్యక్షపదవికి పోటీ చెయ్యడానికి రూజ్వెల్టుకు ప్రోద్బలం కలిగించిన ఆశయాలు ఎంత గొప్పవైనా, అతడు అవలంబించిన పద్ధతులుమాత్రం సక్రమంగా లేవని చాలామంది భావించారు.

ఏమయినా, మహాసభలో పార్టీ అభ్యర్థిగా రూజ్వెల్టు గెలిచాడు. ఫార్లే, గార్నరులు ఓడిపోయారు. వైస్ ప్రెసిడెంటు పదవికి పోటీ చెయ్యడానికి పార్టీ అభ్యర్థిగా హెన్రీ వాలెస్‌ను ఎన్నుకోవాలని రూజ్వెల్టు కోరాడు. అలా కోరడానికి కారణం రూజ్వెల్టు భార్య ఎలియనార్. అంతేకాదు; వాలెస్ గెలవడానికికూడా ఆమే కారణం. లేకపోతే, జెస్ జోన్స్‌ను అభ్యర్థిగా నిలబెట్టాలని రూజ్వెల్టు కొడుకు ఎలియట్ పెద్ద ప్రయత్నం చేశాడు. అతడిని వారించింది ఎలియనార్.

మొట్టమొదట, వైస్ ప్రెసిడెంటుపదవికి కార్డెల్ హల్‌ను నిలబెట్టాలని రూజ్వెల్టు అనుకున్నాడు. . అభ్యర్థిత్వాన్ని అంగీకరించమని హల్‌నూ, అతడిభార్యనూ కూడా రూజ్వెల్టు చాలా బ్రతిమలాడాడు. కాని, హల్ అంగీకరించలేదు.

వాలెస్‌పట్ల రూజ్వెల్టుకు అనురాగద్వేషాలు రెండూకూడా కృష్ణపక్ష శుక్లపక్షాలలాగ వర్తించేవి. మొదట వాలెస్‌ను అభ్యర్థిగా నిలబెట్టడం రూజ్వెల్టుకు యిష్టంలేదు. కాని, తరువాత వాలెస్‌ను వైస్ ప్రెసిడెంటు పదవికి అభ్యర్థిగా నిలబెట్టకపోతే, ప్రెసిడెంటుపదవికి తాను అభ్యర్థిగా పోటీచెయ్యనని మహాసభకు ఉత్తరంవ్రాశేటంత ఉద్రేకస్థితికి వచ్చాడు.

తరువాత, ఎన్నికల ప్రచారకాలంలో రూజ్వెల్టుకూ, వాలెస్‌కూ తీవ్ర మనస్పర్థలు కలిగాయి. దానికికారణం రూజ్వెల్టు ప్రతికూలురు చాలా మందితో వాలెస్ చేతులుకలిపి, రూజ్వెల్టుకు వ్యతిరేకంగా పనిచేస్తున్నట్టు రుజువుపరిచే ఉత్తరాలు చాలా పట్టుపడడమే. ఈ ఉత్తరాలు చాలా వరకు రిపబ్లికన్‌పార్టీ చేతులోపడ్డాయి. ఆ ఉత్తరాలను బహిరంగంగా ప్రకటిస్తానని ఆ పార్టీ బెదిరించింది. కాని, ఎంచేతనో ప్రకటించలేదు.

నిజంగా వాటిని ప్రకటించి నట్లయితే మాత్రం వాలెస్‌కు తీరని అప్రతిష్ఠ కలిగేది. కాని, రూజ్వెల్టుకు మాత్రం చాలా ఆగ్రహం వచ్చింది. అభ్యర్థిత్వా న్నుంచి వాలెస్ ఉపసంహరించుకోవాలని పట్టుపట్టాడు. అలా ఉపసంహ రించుకోడానికి వీలు లేదని తేలినతరువాత, కొంతవరకు తమాయించుకున్నాడు.

ఎన్నికలు అయిపోయిన తరువాత రూజ్వెల్టు బాగాచల్లబడి, వాలెస్‌పట్ల మళ్లీ అనుగ్రహం చూప నారంభించాడు. అతడికి ఎక్కువ బాధ్యతగల పనులను యివ్వడంకూడా చేశాడు. వైస్ ప్రెసిడెంటుగా వాలెస్‌కువున్న అధికారాలు, పనులకన్నా ఎక్కువ అధికారాలను, పనులను అతడికి ఇచ్చాడు.

అధ్యక్షపదవికి రూజ్వెల్టుతో పోటీచెయ్యడానికి రిపబ్లికనుపార్టీవారు తమ అభ్యర్థిగా వెండెల్ విల్కీని ఎన్నుకున్నారు. అమెరికనులలో చాలా పురోగమనవాది విల్కీ. అతడు చాలా ప్రేమించదగిన వ్యక్తి. మంచి సమర్థుడు. ఒక చిత్రం ఏమిటంటే, కొద్ది సంవత్సరాల క్రితంవరకూ అతడు డెమొక్రాటిక్ పార్టీ సభ్యుడే. 1924లో జరిగిన డెమొక్రాటిక్ పార్టీ మహాసభకు అతడొక ప్రతినిధికూడాను. అతడంటే రూజ్వెల్టుకు చాలా యిష్టంకూడా వుండేది. తనప్రత్యర్థిగా విల్కీచూపిన శక్తిసామర్థ్యాలను బట్టి విల్కీఅంటే రూజ్వెల్టుకు గౌరవభావంకూడా వుండేది.

బ్రిటనుగనుక అప్పటికి యుద్ధంలో బాగా దెబ్బతిన్నట్లయితే, రూజ్వెల్టు ఆ ఎన్నికలో ఓడిపోయేవాడే. ఏమంటే, బ్రిటనుకు సహాయం చెయ్యడంలో అతడు అవలబించిన విధానం విఫలమైనట్లు అప్పటికి స్పష్టమయి వుండేదిగనుక. అంటే, నాజీలు బ్రిటనులో ప్రవేశించినట్లయితే, అమెరికాలో రూజ్వెల్టునుకూడా ఓడించివుండేవారు.

మొదట్లో తాను ఎన్నికలప్రచారం అనేది ఏమీ అవసరంలేకుండానే గెలవగలనని వెండెల్ విల్కీ భావించాడు. పైగా, డెమొక్రాటిక్ పార్టీలో చీలికలు తెచ్చిపెట్టి, రూజ్వెల్టును బలహీనపరుద్దామని కూడా అతడు ప్రయత్నించాడు. నిజానికి కొంతమంది ప్రముఖులు రూజ్వెల్టు పక్షంనుంచి చీలిపోయారు కూడా.

అయితే, వెండెల్ విల్కీ నూతన ఆర్థికవిధానంపట్ల అనుకూలభావం కలవాడు. అంతేకాదు. రూజ్వెల్టు అవలంబించిన విదేశవిధానాలలో

చాలా వాటితో అతడు అంగీకారభావం చూపించాడు. అందువల్ల, రూజ్వెల్టును కాదని విల్కీని ప్రత్యేకంగా ఎన్నుకోనవలసిన అవసరం ప్రజలకు కనుపించ లేదు. అయినప్పటికీ, అంతకుముందు ఏ రిపబ్లికన్ అభ్యర్థి సంపాదించనన్ని ఎక్కువ ఓట్లను సంపాదించి మరీ ఓడిపోయాడు విల్కీ. రూజ్వెల్టుకు 2,77,51,597 ఓట్లువస్తే, విల్కీకి 2,2304,755 ఓట్లు వచ్చాయి.

# నూతన ఆర్థికవిధానపు ఆఖరు దశ

అమెరికా యుద్ధసన్నాహాలను చాలావరకు జయప్రదంగా సాగించినది నూతన ఆర్థిక విధానమే. కార్మికులతో ఎక్కువపేచీలు లేకుండా యుద్ధ కార్యాలకు కావలసిన సమస్త సామగ్రిని అమెరికాలోని ఫాక్టరీలు అతి శీఘ్రకాలంలో ఉత్పత్తి చెయ్యగలగడానికి కారణం శాంతి రోజులలో రూజ్వెల్టు వేసిన పునాదులే. నూతన ఆర్థిక విధానాన్నిగురించి జరిగిన ప్రచారంవల్ల, ప్రజలలో కలిగిన ప్రబోధంవల్ల నైతేనేమి, ఆర్థిక సంస్కరణలను గురించి ప్రజలకు కలిగిన చైతన్యంవల్లనేమి యుద్ధ కార్య నిర్వహణకు అన్ని రంగాలలోను కావలసిన సంపూర్ణకృషికి ప్రజలు ఉత్సాహంతో పూనుకోగలిగారు.

యుద్ధం రావడంవల్ల చాలామంది నూతన ఆర్థిక విధానవాదులు యుద్ధ కార్యకృషివల్ల ఆర్థిక సంస్కరణలకు చాలా ప్రతిబంధకం వచ్చిందని వేదనపడ్డారు. అంతేకాదు, యుద్ధంలో ప్రవేశించడంవల్ల అమెరికాలోని ప్రజారాజ్య విధానమే దెబ్బతింటుందేమోనని వారు భయపడ్డారు. స్వేచ్ఛ కోసమని చేసే యుద్ధంఫలితంగా నియంతృత్వం అమెరికాలో స్థావరం ఏర్పరచుకొనే టట్లయితే, ఇక యుద్ధం దేనికొరకు చేసినట్లు? అమెరికా లోని ప్రజారాజ్య విధానానికి ఎక్కువ ముప్పు అమెరికా యుద్ధంలో చేరినందువల్ల వస్తుందా? చేరనందువల్ల వస్తుందా? ఫాసిజంతో యుద్ధం చేసి, చిట్టచివరకు ఫాసిజాన్ని అమెరికాలో తెచ్చిపెట్టుకోవడం జరుగుతుందా? నూతన ఆర్థిక విధానవాదులలో చాలామందికి కలిగిన భయం ఇదే.

యుద్ధంలో అమెరికా చేరే పరిస్థితులు దగ్గరబడిన కొద్దీ రూజ్వెల్టు తన సూత్రాలలో చాలావాటిని క్రమంగా వదలుకోవలసి వచ్చింది. చివరకు నూతన ఆర్థిక విధానమే క్రమంగా మరుగున బడిపోయింది.

అమెరికా యుద్ధంలో చేరేటట్లయితే, అమెరికా తన సర్వశక్తులనూ యుద్ధకృషికి నియోగించాలి. యుద్ధసామగ్రి ఉత్పత్తి జోరుగా జరగాలంటే పరిశ్రమల యజమానులను రూజ్వెల్టు తనతో కలుపుకోవాలి. అంటే, పరిశ్రమల యజమానులకు కొంత లాభాలను చేసుకోడానికి అవకాశం యివ్వాలి. అంచేత, పరిశ్రమల యజమానులకు కిట్టనంతవరకు నూతన ఆర్థిక విధానానికి స్వస్తిచెప్పాలి. అదే రూజ్వెల్టు చేసిన పని.

# ఆరోగ్యం

ఇప్పటికి రూజ్వెల్టుకు అరవయ్యేళ్లు నిండాయి. అడపా తడపా అతడు కార్యభారంలో అలసట చూపుతున్నాడు. ముక్కులోనూ, గొంతులోనూ అప్పుడప్పుడు జబ్బులు వస్తున్నాయి. పడిశంవల్ల అతడు చాలాసార్లు బాధపడేవాడు. ఒకసారి కడుపులో జబ్బువల్ల చాలారోజులు బాధపడ్డాడు. ఇవితప్ప సాధారణంగా అతడి ఆరోగ్యంమాత్రం చాలా బాగా వుండేది. అతడి ఉత్సాహంమాత్రం ఎంతమాత్రమూ తగ్గలేదు. తనసమీపంలో వున్నవారినికూడా ఎక్కువ ఉత్సాహంతో వుండేటట్టు చెయ్యగలిగేవాడు.

ఆ రోజులలో అతడిలో అహంభావము ఒకటీ, తను లేకపోతే పని జరగదనే భావమొకటీ మాత్రం చాలా ఎక్కువగా వృద్ధిపొందాయి. మరొక టేమిటంటే, వయస్సువల్లనూ, కార్యభారపు చింతవల్లనూ అతని ముఖంలో ఒక నూతనమైన కళ నెలకొని అతని ప్రసన్నవదనానికి వన్నె తెచ్చిపెట్టింది. 1932 నుంచీ 1940 లోపల తీసిన రూజ్వెల్టు ఫొటోగ్రాఫ్లను చూస్తే, అతని ముఖంలో ప్రసన్నత ఎంత ఎక్కువగా ప్రస్ఫుటితమైనదీ కనపడుతుంది.

# యుద్ధ ప్రవేశానికి ఆఖరు చర్యలు

మూడోసారి అధ్యక్షపదవికి అభ్యర్థిగా రూజ్వెల్టు ఎన్నిక కాక ముందునుంచే, ప్రపంచ సంఘటనలు తీవ్రరూపం దాల్చాయి. యూరప్లో యుద్ధం మరీ తీవ్రం కావడమూ, ఇండో-చైనాలో జపాను మరీ ముందుకు

చొచ్చుకొనిపోవడంతో యుద్ధంలో అమెరికా ఎంతమాత్రమూ చేర్చ కూడదనే వాదం అమెరికాలో మరీ ప్రబలమైంది.

అమెరికా ఎంత సహాయంచేసినా ఇంగ్లండు యుద్ధంలో గెలవ జాలదనీ, ఇంగ్లండుకు సహాయంచెయ్యడం కేవలం వ్యర్థమౌతుందనీ, యుద్ధంలో అమెరికా దిగాలని కోరేవారు బ్రిటిషువారూ, యూదులూ, రూజ్వెల్టు అనుచరులూ మాత్రమేననీ ఒక ప్రచారం అమెరికాలో బలంగా సాగింది.

ఈప్రచారాన్ని ఖండించడానికి రూజ్వెల్టు నిరంతరమూ కృషి చేశాడు. యుద్ధంలో అమెరికా గెలవజాలదనే పిరికితనాన్ని పోగొట్టడానికి చాలా ప్రచారంచేశాడు. హిట్లరుప్రభ వెలుగుతూ వున్నమాట నిజమే. ఒక దేశం తరువాత మరొక దేశం అతనికి ఆహుతి అవుతున్నమాట నిజమే. కాని, హిట్లరు అజేయుడనీ, హిట్లరిజం అనశ్వరమనీ మాత్రం రూజ్వెల్టు ఒక్కక్షణంకూడా అనుకోలేదు.

డన్కర్క్ వద్ద పలాయనంచేసిన బ్రిటిషువారికి ఆయుధసామగ్రిని సప్లయిచేసి, వారికి సహాయంచెయ్యడానికి రూజ్వెల్టు నిర్ణయించినప్పుడు, బ్రిటిషువారు హిట్లరుతో యుద్ధంచేసి గెలిచే అవకాశాలు చాలాతక్కువ అని రూజ్వెల్టు సహాయదార్లు అతనికి చెప్పారు. కాని, రూజ్వెల్టుమాత్రం ఆమాటలను నమ్మలేదు. "ఎన్ని సంవత్సరాలు కృషి చేస్తేమాత్రం, ప్రపంచం లోని సైనికబలంలో మూడింట రెండువంతుల బలాన్ని మనం ఓడించగలమని ఎవరైనా నమ్మగలరా?" అని హూవర్లాంటి గొప్పపలుకుబడిగల నాయకులే అన్నారు. అయినా, రూజ్వెల్టు ఆ మాటలను వినలేదు. అతడిని భయపెట్టడం ఎవరికీ సాధ్యంకాలేదు.

అతడిలోవున్న ఇంగ్లీషురక్తం, అతడిని ఇంగ్లీషువారికి సహాయపడేటట్లు చేసిందని చాలామంది అనుకుంటారు. కాని, అది నిజంకాదు. అతడికి బ్రిటిషువారంటే ప్రత్యేకమైన అభిమానం ఏమీ లేదు. కొన్ని విషయాలలో అతడికి బ్రిటిషువారంటే కిట్టేదికూడా కాదు. అయితే, బ్రిటనుకు సహాయ పడడంలో అతడు సర్వదా మనస్సులో పెట్టుకున్నది, అమెరికా క్షేమమే.

అన్నివిధాలా యుద్ధసన్నాహాలను రూజ్వెల్టు మొదటినుంచీ చేస్తూవుంటే, యుద్ధం కోరి తెచ్చిపెడుతున్నాడని అతణ్ణి ఆ రోజులలో

నిందించిన అనేకమంది రిపబ్లికనులు ఈ నాడు అతడా రోజులలో యుద్ధ కృషిని తగినంత ముందుగానే ప్రారంభించలేదని అతనిని నిందించడం మాత్రం ఎంత అమాయకులకైనా ఆశ్చర్యాన్నీ, అసహ్యాన్నీ కలిగించకమానదు. రూజ్వెల్టు విద్వేషులు అతడి మరణానంతరం యీ రోజులలోకూడా చేసే ప్రచారం ఎవరికైనా వెగటు పుట్టిస్తుంది.

కాని, 1939 సెప్టెంబరులో యూరప్‌లో యుద్ధం ఆరంభమైనప్పటి నుంచీ రూజ్వెల్టు చేసిన కృషిని పరిశీలిస్తే, యుద్ధంలో ఎప్పటికైనా అమెరికా పాల్గొనవలసిన పరిస్థితి ఏర్పడుతుందని అతడు గ్రహించి, తదనుకూలంగా అమెరికా ప్రజలలో ప్రబోధం కలిగించడానికి కృషిచేసినట్లు స్పష్టం అవుతుంది. అంతేకాదు. ప్రపంచయుద్ధంలో అమెరికాప్రజలుతటస్థభావాలను కలిగివుంటారని ఎంతమాత్రమూ అనుకోవద్దని అతడు అక్షరాజ్యాలను (ఇటలీ, జర్మనీలను) 1939 సెప్టెంబరులో హెచ్చరించాడు. ఆ తరువాత కొద్దివారాలకు, తటస్థవిధానచట్టాన్ని సవరించడానికి కాంగ్రెసు సమావేశాన్ని కూడా జరిపాడు. ఆయుధసామగ్రి ఎగుమతుల నిషేధాన్ని తొలగించి, డబ్బుచెల్లించి ఆయుధసామగ్రి కొనుక్కొనే సౌకర్యాలు విదేశాలకు కల్పించాడు. దీనివల్ల, బ్రిటను, ఫ్రాన్సులు అమెరికాలో ఆయుధసామగ్రిని కొనుక్కొనగలిగాయి.

తరువాత, రూజ్వెల్టు అమెరికాప్రభుత్వ యుద్ధమంత్రివర్గంలోనూ, నౌకామంత్రివర్గంలోనూ మార్పులుచేసి, రిపబ్లికన్ పార్టీ ప్రముఖులిద్దరిని, స్టిమ్సన్, నాక్స్‌లను, మంత్రులుగా నియమించాడు. చర్చిల్‌తో ఎక్కువగా ఉత్తరప్రత్యుత్తరాలను జరుపసాగాడు.

హాలెండుమీద జర్మనీ దాడిజరిపిననాడే ఏడాదికి 50,000 విమానాల ఉత్పత్తి అమెరికాలో జరగాలని ఉత్తరువుచేసి, అమెరికన్ ప్రజలందరినీ చకితులను చేశాడు రూజ్వెల్టు.

ఫ్రాన్సు లొంగిపోయిన నాటినుంచీ, బ్రిటనుకు ఆయుధసామగ్రిని పంపించడం ప్రారంభించడమేకాక, అమెరికా ఉపయోగానికి అట్లాంటిక్ సముద్రతీరానవున్న కొన్ని నౌకా కేంద్రాలను బ్రిటనువద్దనుంచి కౌలుకు తీసుకొని, దానికిప్రతిగా బ్రిటనుకు 50 డిస్ట్రాయరునౌకలను ఇచ్చాడు. ఈ

నిర్ణయాన్ని రూజ్వెల్టు ప్రకటించినప్పుడు కాంగ్రెసు ఆశ్చర్యచకితమై పోయింది.

అమెరికన్ ఆఫీసర్లనూ, టెక్నీషియన్లనూ చాలామందిని రూజ్వెల్టు బ్రిటనుకు పంపించాడు. బ్రిటిషు వైమానికులు చాలామందికి అమెరికాలో శిక్షణ ఇవ్వడానికీ, బ్రిటిషు నౌకలకు రహస్యంగా అమెరికాలో మరమ్మత్తు చెయ్యడానికీ ఏర్పాట్లు చేశాడు.

1941 లో రూజ్వెల్టు మరీ యెక్కువగా యుద్ధ కృషి సాగించాడు. అరువు-కౌలు విధానంలో బ్రిటనుకు ఎక్కువగా యుద్ధ సామగ్రిని సప్లయి చేసే బిల్లును 1941 జనవరిలో కాంగ్రెసులో ప్రతిపాదించాడు. ఆ బిల్లు మార్చి 11 న కాంగ్రెసు ఆమోదాన్ని పొందింది. తరువాత, గ్రీన్ లెండ్ లో సైనిక, నౌకా కేంద్రాలను స్థాపించడానికి డెన్మార్కు నుంచి అనుమతి పొందాడు. దాని తరువాత ఐస్ లెండ్ ను స్వాధీనం పరచుకోవడం జరిగింది. మే 20 న బాంబరు విమాన దళాన్ని ఏర్పాటు చెయ్యడానికి ఉత్తరువు జరిగింది. ఒక వారం తరువాత దేశమంతా "ప్రమాదస్థితి"ని ప్రకటించి దేశరక్షణ కార్యక్రమాలను అమలు జరుపడానికి ప్రత్యేకం ఒక ప్రభుత్వ శాఖ ఏర్పాటు చేయబడింది.

అంతేనా ! అమెరికన్ రేవులలోవున్న అక్షరాజ్య నౌక లన్నిటినీ అమెరికా ప్రభుత్వం నిర్బంధంలో వుంచింది. అమెరికన్ బ్యాంకులలో అక్షరాజ్యాలు నిలవచేసిన డబ్బును, ఒక్క చిల్లిగవ్వకూడా యివ్వడానికి వీలులేదని ఉత్తరువు జరిగింది. జపానుకు ఎగుమతులను పంపరాదనే నిషేధం బాగా అమలులోకి తీసుకు రాబడింది. రష్యామీద జర్మనీ యుద్ధం ప్రకటించగానే, అరువు-కౌలు సహాయం రష్యాకు కూడా ఇవ్వబడింది. ఇదే సహాయం తరువాత చైనాకు కూడా యివ్వబడింది.

ఈ యుద్ధావసర చర్యలన్నీ జరుగుతూ వుండగా, మరొక వైపున యుద్ధ సామగ్రి నిర్మాణంకూడా జోరుగా సాగిపోయింది. దేశంలోని ఫాక్టరీలన్నీ రోజుకు మూడు వంతుల చొప్పున 24 గంటలూ పని చెయ్యడం సాగించాయి.

1941 ఆగస్టు 12 న రూజ్వెల్టు, చర్చిల్ లు సమావేశమై అట్లాంటిక్ ప్రణాళిక ప్రకటన చేశారు. సెప్టెంబరు 11 న ఒక ఉపన్యాసం చేస్తూ,

అమెరికన్ నౌకలను ముంచివేసే కార్యక్రమాలనుంచి జర్మన్ సబ్మెరినులు విరమించక పోయినట్లయితే, జర్మన్ నౌకలకు ప్రమాదం తప్పదని హెచ్చరించాడు రూజ్వెల్టు.

ఇలా జరుగుతూ వుండగానే జపానులో టోజో మంత్రిమండలి పదవిలోకి వచ్చింది. దానితో, జపాను యుద్ధంలో దిగడం తథ్యమనీ, మలయా, డచ్చి, ఈస్టిండీస్, ఫిలిప్పీన్లపైన దాడి చేస్తుందనీ అందరికీ స్పష్టమైంది. జపానునుంచి కొంతమంది రాయబార వర్గంవారు వచ్చి, వాషింగ్టన్లో రాయబారాల మీద ప్రారంభించారు. అవి ఇదమిత్థం తేలలేదు. 1941 డిసెంబరు 6వ తేదీన శాంతియుతంగా సమస్యలను పరిష్కారం చేసుకోవాలని కోరుతూ జపాను చక్రవర్తి హిరోహిటోకు రూజ్వెల్టు ఒక విన్నపంకూడా చేశాడు. 1941 డిసెంబరు 7వ తేదీన జరిగిన సంఘటన ప్రపంచంలో అందరికీ తెలిసినదే. అనాడే జపాను అమెరికామీద యుద్ధం ప్రకటించింది. మూడు రోజుల తరువాత హిట్లరు, ముస్సోలినీలు అమెరికా మీద యుద్ధాన్ని ప్రకటించారు.

## తటస్థ విధానమా?

రూజ్వెల్టు తటస్థ విధానాన్ని అవలంబించాడా? ఎంత మాత్రమూ లేదు. 1939 వరకూ అతడు చాలా జాగ్రత్తతో సంచరించిన మాటమాత్రం వాస్తవం. రూజ్వెల్టు యుద్ధాన్ని ప్రత్యేకం కోరలేదు. కాని, యుద్ధం తీవ్రమై బ్రిటను, ఫ్రాన్సులు బాగా దెబ్బతినడంతో పరిస్థితి మారింది. అతడి ధోరణికూడా బాగా మారింది. 1941 లో రూజ్వెల్టు ప్రత్యేక ప్రతినిధిగా బ్రిటనుకు వెళ్ళిన హారీ హాప్కిన్సు తనతో ఇలా చెప్పాడని ప్రధానమంత్రి చర్చిల్ వ్రాశాడు: "మనం యుద్ధంలో గెలిచి తీరాలని ప్రెసిడెంటు దృఢ నిశ్చయుడై వున్నాడు. ఆ విషయంలో మీరు సందేహం ఏమీ పెట్టుకోవద్దు. ఏ మైనాసరే, ఏ చిక్కులు వచ్చినాసరే చివరివరకూ తాను మీపక్షాన్నే వుంటానని మీకు చెప్పడానికే ఆయన నన్ను ఇక్కడికి పంపించాడు."

దీనినిబట్టి రూజ్వెల్టు, యుద్ధం విషయంలో మొదటినుంచీ ఏ వుద్దేశంతో వున్నదీ స్పష్ట మౌతున్నది. అయితే, తన మనోభావాలను

అతడు స్పష్టంగా తన ప్రజలకు చెప్పలేదని అతడిని నిందించడానికి కారణం ఏర్పడుతున్నది. కాని, అతడు అలా చెయ్యక పోవడానికి తగిన కారణాలు కూడా వున్నాయి. ఆనాడు దేశంలో ప్రబలంగా యుద్ధంలో కలుగ జేసుకోకూడదనే భావం, ప్రచారం వ్యాపించి వున్నాయి. అలాటప్పుడు, ప్రజలను క్రమేపీ తనపట్ల త్రిప్పుకోవడంలో అతను జాగ్రత్త వహించ వలసి వచ్చింది. అలా జాగ్రత్తవహిస్తూ, అతడు స్వసంరక్షణకూ, యుద్ధాన్ని సక్రమంగా సాగించడానికీ తగిన చర్యలను అవలంబిస్తూనే వచ్చాడు. అలా అతడు మొదటినుంచీ జాగ్రత్త వహించకపోతే, అమెరి కాను యుద్ధ కార్యాలలో తయారుగావుంచక దేశాన్ని మోసంచేశాడనే శాశ్వతమైన నిందకు అతడు గురికావలసి వచ్చేది. పైగా, బ్రిటనును ఓడించి అక్షరాజ్యాలు గెలుపొంది నట్లయితే, బ్రిటనుకు సహాయం చెయ్యడంలో రూజ్వెల్టు కాలయాపన చేశాడని శాశ్వతమైన నింద పొందేవాడు.

అక్షరాజ్యాల ఉద్దేశాలను గురించీ, వాటి పన్నాగాలను గురించీ ఆనాడు రూజ్వెల్టుకు తెలిసినదానికంటె ఎక్కువ వివరాలు మనకీనాడు తెలుసు. న్యూయార్కు మీద బాంబులను వెయ్యడానికి విమాన దాడి పన్నాగాలను జర్మన్ విమాన దళాధికారులు 1938 లోనే తయారు చేశా రనీ, అట్లాంటిక్ తీరంనుంచీ, పసిఫిక్ తీరంనుంచీ యునైటెడ్ స్టేట్సు మీద నౌకా దాడి జరుపడానికి హిట్లరూ, జపాను ప్రధాని టోజో కలిసి పన్నాగం 1941 ఆరంభంలోనే తయారు చేశారనీ మనకు ఈ నాడు తెలుసు. అంచేత, యుద్ధ కృషి కార్యాలనూ, దేశరక్షణ చర్యలనూ రూజ్వెల్టు అమలు జరిపి వుండకపోతే, అతడు తన దేశానికి ద్రోహం చేసినట్లయేది.

రూజ్వెల్టు తగిన చర్య తీసుకొనే లోపల, ఒక సంవత్సరం తరువాత మరొక సంవత్సరం యూరప్‌లోని నియంతలు తమ యిష్టం వచ్చినట్లు ఆడారు. జపాను అమెరికాపై యుద్ధప్రకటన చేసిన తరువాత, అమెరికా పొందిన నష్టాలను కూడదీసుకోడానికి అమెరికా యుద్ధంలో దిగి తీరవలసి వచ్చిందనికూడా ఒక వాదం చెప్పవచ్చును.

1941 డిసెంబరు 7వ తేదీ మధ్యాహ్నం ఒంటి గంట 47 నిమిషాలకు హారీ హాప్కిన్సుతో కులాసాగా కబుర్లు చెబుతూ కూచున్నాడు రూజ్వెల్టు. అప్పుడే వారిద్దరూ భోజనం చేశారు. ఆరోజు అట్టే పని వుండదనీ, పోస్టు బిళ్ళలను అతికించుకోవడంతో ఆపూట గడపవచ్చుననీ రూజ్వెల్టు అనుకున్నాడు. అప్పుడు టెలిఫోను గంట మ్రోగింది. రూజ్వెల్టు టెలిఫోను అందుకున్నాడు. నౌకాశాఖ మంత్రి ఫ్రాంక్ నాక్స్ ప్రెసిడెంట్‌తో మాట్లాడ గోరుతున్నాడని టెలిఫోను ఆపరేటర్ చెప్పింది. "సరే" నన్నాడు ప్రెసిడెంట్. అవతలినుంచి ఫ్రాంక్ నాక్స్ పలికాడు. "ఫ్రాంక్, ఏమిటి విశేషం?" అని అడిగాడు ప్రెసిడెంటు.

"మిస్టర్ ప్రెసిడెంట్, జపానువాళ్ళు పెరల్ హార్బర్ మీద దాడి చేసినట్టు తెలుస్తోంది," అన్నాడు నాక్స్. "ఆఁ" అని ఆశ్చర్యాన్ని సూచించాడు రూజ్వెల్టు. తరువాత 18 నిమిషాల సేపు రూజ్వెల్టు ఏమీ చెయ్యలేదు. రెండు గంటల అయిదు నిమిషాలకు అతను విదేశశాఖా మంత్రి హల్‌తో ఫోనులో మాట్లాడాడు. అదే యుద్ధ ప్రారంభం.

## యుద్ధకాలపు ప్రెసిడెంట్

శాశ్వతంగా అధ్యక్షపదవిలో వుండిపోవాలనే కాంక్షవల్ల, యునైటెడ్ స్టేట్సును యుద్ధంలో దింపడానికి రూజ్వెల్టు చిరకాలం పన్నాగం వేశాడని రూజ్వెల్టు విద్వేషులు యీనాడు ప్రచారం చేస్తున్నారు.

యుద్ధంలో అమెరికాను దింపడానికి అతడు వేసిన ఇతర యెత్తులు ఏవీ ఫలించనందువల్ల అమెరికన్ నౌకాదళంలోని ముఖ్య నౌకలను పెరల్ హార్బరువద్ద కూడదీసి, జపానువారు వాటిని ముంచివేసేటట్టు చెయ్యడానికి రూజ్వెల్టు పన్నాగం పన్నాడని అతని విద్వేషులు ప్రచారం చేస్తున్నారు. ఈ విధమైన విపరీత ప్రచారానికి ఆధారం ఇసుమంతయినా లేదు. ఈ ప్రచారాన్ని విన్నట్లయితే, జపాను యుద్ధనాయకులుకూడా చాలా విస్తుపోయి వుండేవారు.

ఒక విశేషంమాత్రం ఏమిటంటే: ఈ నాడు అలాటి వింతప్రచారం చేస్తూవున్నవారే జర్మనీ, జపానులు యూరప్, ఆసియాలను మ్రింగివేస్తూ

వుంటే ఉలక్కుండా, పలక్కుండా వూరుకున్నారు. ప్రపంచమంతా ధ్వంసం అయినాసరే మనకేమిలే అని వారు వూరుకున్నారు. యుద్ధంలో అక్షరాజ్యాలు గెలిచినట్లయితే, యునైటెడ్ స్టేట్సు ఎక్కువకాలం నిలబడజాలదనే విషయాన్ని వారు గ్రహించినట్టే లేదు. అలాటివారు రూజ్వెల్టుకు మాత్రమే శత్రువులుకారు; అమెరికాకే శత్రువులు. ఈనాడు మనం గమనించవలసిన మరొక ముఖ్యాంశం ఏమిటంటే: ఆనాడు అమెరికా యుద్ధంలో దిగకూడదని తీవ్రంగా వాదించినవారే, యీ నాడు అమెరికా సోవియట్‌రష్యామీద యుద్ధానికి దిగాలని ప్రబలంగా ప్రచారం చేస్తున్నారు. దీనినిబట్టి ఎవరైనా అనుకోవలసింది ఏమిటంటే, ఆ తటస్థ విధానవాదులు ఆ రోజులలో ఫాసిస్టు అనుకూలురనీ, యీ నాడు వారు ఫాసిస్టులేననీ.

నిజానికి, అప్పుడు జపానుతో యుద్ధంలోకి దిగకుండా కొంతకాలం గడపాలని రూజ్వెల్టు ప్రయత్నించాడు. "ఇంకా కొన్ని మాసాలపాటు జపానును జోకొట్టగలనని ఆశిస్తున్నాను," అని రూజ్వెల్టు ఆ రోజులలో చర్చిల్‌కు వ్రాశాడు. అమెరికా రక్షణ కార్యకలాపాన్ని పూర్తిగా తయారులో పెట్టేవరకూ, అంటే 1942 వరకూ యుద్ధం రాకుండా వుండటమే అమెరికాకు చాలావరకు సదుపాయకారి.

1941 నవంబరు 7వ తేదీన, అంటే యుద్ధం ప్రారంభం కావడానికి ఒకనెలముందు, రూజ్వెల్టు తన మంత్రిమండలిని సమావేశపరచి జపాను వారు పసిఫిక్ సముద్రంలోని బ్రిటిషు దీవులపైనగాని, డచ్చి దీవులపైనగాని దాడి జరిపితే "మనం యుద్ధంలో దిగుదామా ?" అని అడిగాడట. దానికి మంత్రిమండలి సభ్యులందరూ కూడా సరేనన్నారట. అలాటి పరిస్థితులలో అమెరికా యుద్ధంలో దిగితే, దేశ ప్రజ అందరూకూడా ప్రభుత్వచర్యపట్ల ఆమోదాన్ని చూపుతారని కూడా మంత్రులు చెప్పారట. జపాను మలయా పైన దాడి జరిపినట్లయితే, అమెరికా యుద్ధంలో ప్రవేశించాలని నవంబరు 28వ తేదీన మంత్రిమండలి తీర్మానంకూడా చేసింది. అయినప్పటికీ రాయబారాలు జరిపి చూదామని రూజ్వెల్టు పట్టుపట్టాడు. స్వయంగా జపాను చక్రవర్తి హిరోహిటోకు ఒక విజ్ఞప్తిని కూడా చేశాడు.

యుద్ధం చెయ్యాలనే వ్యామోహంతో కొట్టుకు లాడుతూవున్న జపాను చిట్టచివరకు యుద్ధం ప్రకటించగానే, అమెరికా కర్తవ్యం స్పష్టమైపోయింది.

అయితే, యుద్ధం ప్రారంభమైనప్పుడు జపాను తనదాడిని హవాయీ దీవులమీదనూ, పెరల్ హార్బర్ రేవుమీదనూ జరుపుతుందని ఎవరూ అనుకోలేదు. అక్కడి రక్షణ సన్నాహాలు ఎంతమాత్రమూ బాగాలేవు. అంత హీనమైన రక్షణ ఏర్పాట్లతో హవాయీ దీవులను ఎందుకు వుంచారని ప్రభుత్వంమీద తీవ్రమైన నిందలు వచ్చాయి. ప్రభుత్వానికి అనుకూలంగానూ, ప్రతికూలంగానూ వాద ప్రతివాదాలను సాగిస్తూ కొన్ని లక్షల పదాలతో వ్యాసాలు ప్రకటింపబడినవి. పెరల్ హార్బర్ దగ్గర అమెరికా తిన్న ఓటమి, అమెరికా చరిత్రలోకల్లా అతి అవమానకరమైనది.

హవాయీ దీవుల రక్షణ విషయంలో సమగ్రమైన ఏర్పాట్లు లేనికపోవడానికి రెండు ముఖ్య కారణాలు కనుపడతవి. అవేమిటంటే: (1) జపానుతో రాయబారాలు 1941 డిసెంబరులో అంతిమదశకు వచ్చి జపాను యుద్ధానికి దిగుతుందనే సూచనలు బాగా కనుపించినా, అమెరికన్ యుద్ధనాయకులదృష్టి పూర్తిగా అట్లాంటిక్ వైపున వున్నది గాని, పసిఫిక్ వైపునకు తిరగలేదు. (2) జపానువారి శక్తి ఎంతో అమెరికా యుద్ధనాయకులు సరిగా అంచనా వేసుకోలేదు. జపాను యుద్ధంలోకి దిగినా, మలయాలోనో, డచ్చి ఈస్టిండీసులోనో యుద్ధం ప్రారంభిస్తుందనుకున్నారు గాని, కేవలం అమెరికా భూభాగంమీదనే దాడిచేసి, యుద్ధంలోకి తప్పనిసరిగా దిగేటట్టు అమెరికాను రెచ్చగొడుతుందని ఎవరూ అనుకోలేదు.

పెరల్ హార్బరు సంఘటనను గురించీ, అక్కడ అమెరికా అంత దారుణంగా దెబ్బతిన్న పరిస్థితులకు బాధ్యత ఎవరిదనే విషయాన్ని గురించీ మూడు విచారణలు ప్రసిద్ధుల అధ్వర్యంలో జరిగాయి. ఆ విచారణల ఫలితంగా తేలిన నాలుగు ముఖ్యాంశాలు ఏమిటంటే:

(1) జపానుతో యుద్ధం తెచ్చిపెట్టుకోకుండా వుండడానికి ప్రభుత్వం సర్వవిధాలా ప్రయత్నించింది. దాడి చెయ్యడంలో బాధ్యత పూర్తిగా జపానుదే. (2) వాషింగ్టన్‌నుంచి మామూలు హెచ్చరికలు ఎన్నివచ్చినా,

హవాయీ దీవులలోని ఆఫీసర్లు తగిన రక్షణచర్యలను తీసుకోలేదు. (3) హవాయీలోని ఆఫీసర్లు ఒకరితో ఒకరు సంబంధం పెట్టుకోక, తగిన చర్యలను అమలు జరపడంలో బాధ్యతారహితంగా ప్రవర్తించారు. (4) వాషింగ్టన్‌లో పెద్ద అధికారులు స్పష్టమైన ఉత్తరువులు ఇచ్చి, ఆ ఉత్తరువులు సరిగా అమలు జరిగినట్లు చూడవలసివుంది.

తరువాత, పెరల్ హార్బరును గురించి కాంగ్రెసు విచారణ జరిపింది. ఈ విచారణ అంతా చనిపోయిన రూజ్వెల్టు పేరుకు కళంకంతెచ్చే ధోరణిలో జరిగింది. కాని, రూజ్వెల్టు ప్రతిష్ఠకుమాత్రం ఏ మాత్రం భంగం కలుగలేదు.

రూజ్వెల్టును నిందించి, పెరల్ హార్బర్‌లో అమెరికాకు జరిగిన అవమానానికి కారకుడు రూజ్వెల్టేనని వాదించే వ్యక్తులు, ఫిలిప్పీన్స్‌లో మెకార్థరుకూడా ఏ విధమైన రక్షణ సన్నాహాలను చెయ్యకుండా జపాను వారి చేతిలో చాలా గట్టిదెబ్బ తిన్నాడనే విషయాన్ని మరిచిపోతున్నారు. మరిచిపోయి, రూజ్వెల్టును నిందించిన నోటితోనే మెకార్థర్‌కు స్తోత్ర పాఠాలు పాడుతున్నారు. వాషింగ్టన్‌లోని యుద్ధమంత్రివర్గంకన్న ఎక్కువగా మెకార్థర్‌కూడా ఆ కాలంలో జపాను దాడి చెయ్యదని భావించినట్టు కనపడుతోంది. 1942 ఏప్రిల్‌లోపల దాడి జరగదని జనరల్ మెకార్థర్ భావించాడని జనరల్ వెయిన్‌రైట్ చెప్పాడు.

## పెరల్ హార్బర్ : తదనంతరం

పెరల్ హార్బరుమీద దాడి జరిగిననాడు ఆ వార్తవిని రూజ్వెల్టు ఏ మాత్రం కలవరపడకుండా ధైర్యంతో ఎలా ప్రవర్తించినదీ పాఠకులు ఇదివరకే చదివారు. జపాను సైన్యాలు హవాయీ దీవులమీద దిగుతూ వున్నట్టు వార్తలు వస్తూవున్నప్పుడుకూడా ప్రెసిడెంటు ఏ మాత్రం ఆందోళన, కంగారు పడకుండా సమయోచితమైన నిర్ణయాలుచేస్తూ మహా నాయకునిలాగా ప్రవర్తించాడని సమ్నర్ వెల్స్ చెప్పాడు.

కాని, యుద్ధం ప్రారంభమైననాటిరాత్రి రూజ్వెల్టు ఎక్కువ బాధ పడ్డది దేనికంటే, ఒయహు దీవిమీద విమానాశ్రయంలో వున్న అమెరికన్ విమానాలమీద జపానువారు బాంబులనువేసి వాటిని ధ్వంసంచేయడం. పైకి

ఎగురుతూ యుద్ధ చర్యలలో కాకుండా నేలమీద వుండగానే విమానాలు ధ్వంసమైపోవడం అతనికి తీరని మనోవేదనను కలిగించింది.

బుకాయింపులో రూజ్వెల్టును మించినవా రెవరూ వుండరనడంలో అతిశయోక్తి లేదు. ఏమంటే, పెర్ల్ హార్బర్ సంఘటనజరిగి యుద్ధం సాగిన సంవత్సరందాకా, అమెరికాకు చెప్పుకోదగ్గ నౌకాదళం తయారు కాలేదు. కాని, ఆ సంగతి ఎవరికీ తెలియదు. నౌకాబలం విషయంలో అమెరికాశక్తి ఆ రోజులలో చాలా తక్కువ అన్నసంగతి జపానువారు గ్రహించలేక పోయారు.

పెర్ల్ హార్బరు సంఘటన తరువాత కొద్దిరోజులుమాత్రం రూజ్వెల్టు తనను కలుసుకోడానికి వచ్చినవారితో కులాసా కబుర్లు మానివేశాడు. ఎవరువచ్చినా సరే, ముక్తసరిగా వారు వచ్చిన పనినిగురించి మాత్రం మాట్లాడి పంపించివేశేవాడు. చాలా తక్కువమందికి మాత్రమే తనను చూడడానికి అవకాశం యిచ్చేవాడు. ఒక్క నిమిషంకూడా వృథా చెయ్యకుండా అతను యుద్ధకార్యాలలో నిమగ్నుడైపోయాడు.

## యుద్ధకార్య నిర్వహణ

యుద్ధకార్య నిర్వహణలో రూజ్వెల్టు చేసిన మొట్టమొదటిపని ఏమిటంటే, ఉత్తమశ్రేణికి చెందిన సైన్య, నౌకా, వైమానిక నాయకులను బాధ్యతగల పదవులలో నియమించి వారి పనులలో అతడు అనవసరజోక్యం కలిగించుకోకుండా యుద్ధకార్య నిర్వహణలో వారికి సంపూర్ణాధికారాలిచ్చాడు. అడ్మిరల్ లీహీ, జనరల్ మార్షల్, అడ్మిరల్ కింగ్, జనరల్ ఆర్నాల్డ్—ఈ నలుగురూ యుద్ధ నిర్వహణా నాయక చతుష్టయం అయారు. యుద్ధం పూర్తి అయినదాకా వీరు తమ పదవులలో వుండి తమ బాధ్యతలను నిర్వహించారు.

ఇతర దేశాలలో జరిగినట్లు, యుద్ధశాఖల నాయకులలో మార్పులేమీ అమెరికాలో జరుగలేదు. పైగా యుద్ధరంగాలలో యుద్ధాన్ని నడుపుతూవున్న సైన్యాధ్యక్షులతో, వాషింగ్టన్‌లోని ప్రభుత్వ వర్గాలకు పేచీలు ఎప్పుడూ రాలేదు.

యుద్ధరంగాలలో జరిగే మామూలు యుద్ధచర్యల విషయంలో గాని, సైన్య నాయకుల నిర్ణయాలలోగాని రూజ్వెల్టు ఎన్నడూ అనవసర జోక్యం కలిగించు కోవడంగాని, యుద్ధ చర్యలు ఫలానావిధంగా జరగాలని ఉత్తరువులు ఇవ్వడంగాని చెయ్యలేదు. అయితే, ఏ ఏ రంగాలలో యుద్ధ చర్యలు ఏ విధంగా జరుగుతూవున్నదీ అతడు ఎప్పటికప్పుడు వివరంగా తెలుసుకుంటూనే వుండేవాడు. సైన్యాధ్యక్షులను ములుకర్రతో పొడవడం తన పని కాదనీ, నిజంగా ఏ సైన్యాధ్యక్షుణ్ణయినా పొడవ వలసిన అవసరం వుంటే, తన దగ్గర ములుకర్ర తయారుగానే వుందనీ రూజ్వెల్టు ఒకసారి పత్రికా విలేఖరుల గోష్ఠిలో అన్నాడు.

సైన్యాధ్యక్షులతో అతడు ఎక్కువగా మాట్లాడేవాడు కూడా కాదు. జనరల్ బ్రాడ్లీ అంతటి ప్రముఖ సైన్యాధ్యక్షునితో యుద్ధం జరిగిన ఆరేళ్ళలోనూ రూజ్వెల్టు మాట్లాడినది ఒక్కసారే. అప్పుడు, ఇటలీపై దాడి ప్రారంభం కావడానికి ముందు, రూజ్వెల్టు, జనరల్ బ్రాడ్లీను చాటుకు తీసుకొని వెళ్ళి, యాటం అస్త్రాలను గురించి జర్మనులు చాలా పరిశోధనలు జరిపారనీ, హఠాత్తుగా యాటం అస్త్రాలను వారు ప్రయోగించడం సంభవించ వచ్చుననీ, అంచేత జాగ్రత్తగా వుండవలసిందనీ హెచ్చరించాడు.

సైన్యాధ్యక్షులకు తమ చర్యలను గురించిన నిర్ణయాలను చెయ్యడానికీ, తదనుగుణంగా యుద్ధ కార్యాలను సాగించడానికీ సంపూర్ణమైన స్వేచ్ఛను ఇచ్చినప్పటికీ, వారి చేతులలో కీలు బొమ్మగా మాత్రం రూజ్వెల్టు ఎప్పుడూ సంచరించలేదు. అమెరికాలో ప్రెసిడెంటే సర్వ సైన్యాధ్యక్షుడు. తన సర్వసైనాధ్యక్ష పదవిని రూజ్వెల్టు పూర్తిగా చెలాయించాడు. సైనాధ్యక్షులను చూసి అతడి కళ్ళు ఎప్పుడూ చెదరలేదు. అనవసరంగా సైన్యాధ్యక్షుల నిర్ణయాలను త్రోసి రాజనక పోయినా, తన అనుమతి లేనిదే సైన్యాధ్యక్షులు ఏ విధమైన నిర్ణయాన్ని తమ ఇష్టం వచ్చినట్లు చెయ్యకుండా తగిన కట్టుబాటులోనే వారందరినీ ఉంచాడు.

రెండు మూడు దేశాలు కలసి ఒకయుద్ధాన్ని సహకారంతో సాగించవలసి వచ్చినప్పుడు, యుద్ధ కార్యాల నిర్వహణలోనూ, సైన్యాధ్యక్షుల నియామకాలలోనూ అనేక సమస్యలు, పేచీలు వస్తాయి. అలాంటి పేచీ లన్నిటినీ సముదాయించడంలోనూ, మిత్ర రాజ్యాల మధ్య

తీవ్ర భేదాభిప్రాయాలు ఏవీ రాకుండానూ అతడు చాలా సమర్థుడైన మధ్యవర్తిగా ప్రవర్తించాడు. మిత్రమండలి సర్వ సైన్యాధ్యక్ష మండలిలోని సభ్యులంతా సహకారంతో పని చేస్తున్నారా అని 1913 లో ప్రశ్నించిన ఒక ప్రముఖుడికి, మరొక ప్రముఖుడు చెప్పిన జవాబు ఏమిటంటే, "మిత్రమండలి సర్వ సైన్యాధ్యక్ష మండలి అంటే మరెవరో కాదు రూజ్వెల్టే" అని.

యుద్ధతంత్రాన్ని నడపడంలో రూజ్వెల్టు అవలంబించిన విధానం చాలా సమర్థమైనది. మిత్రమండలి ముందుగా ఓడించవలసినది జపాను కాదనీ, జర్మనీ అనీ నిర్ణయాన్ని చేసినవాడు (చర్చిల్ తో కలసి) రూజ్వెల్టే. యూరప్‌లో యుద్ధ చర్యలు ప్రారంభించడానికిముందు ఉత్తర ఆఫ్రికాలోనుంచి అక్షరాజ్య సైనికులను తరిమి వెయ్యాలని, తన ముఖ్య సలహాదార్ల అభిప్రాయానికి వ్యతిరేకంగా, నిర్ణయించినవాడు రూజ్వెల్టే. జర్మన్ సైన్యాలతో పోరాడడానికి అమెరికన్ సైన్యాలను పంపించాలని గట్టిగా పట్టుపట్టినవాడు రూజ్వెల్టే. అంతేకాదు, ఫ్రాన్సులోకూడా అక్షరాజ్యాలపైన యుద్ధ చర్యలు జరపాలని చర్చిల్‌ను ఒత్తిడి చేసినవాడు రూజ్వెల్టే.

ఆరోజులలో రూజ్వెల్టు నిర్వహించిన బాధ్యతా, అతడు ఎదుర్కొని పరిష్కరించిన సమస్యలూ విపరీతమైనవి. దేశంలోని ప్రభుత్వ పరిపాలనా నిర్వహణాన్నే గాక, యుద్ధ కార్య నిర్వహణమునూడా అతడు చెయ్యవలసి వచ్చింది. ఏనాటి కానాడు పరిస్థితులను సంపూర్ణంగా తన కళ్ళయెదుట పెట్టుకొని, బాధ్యతాయుతంగా నిర్ణయాలను చెయ్యడం సాధారణమైన పనికాదు. యూరప్‌లో మిత్రమండలి సర్వసైన్యాధ్యక్ష పదవికి ఎవరిని నియమించాలనే విషయాన్నే కాదు, సైనికులకూ, నావికులకూ మధ్య ఫుట్‌బాల్ పందెపు ఆటలు నడపవచ్చునా, కూడదా అనే విషయాన్నికూడా అతడే నిర్ణయించాలి. రాజ్య పరిపాలనలోనూ, యుద్ధ నిర్వహణలోనూ కూడా ప్రతి నిర్ణయమూ ప్రెసిడెంట్ చెయ్యవలసిందే. సైన్యదళాల సంఖ్య ఎంత వుండాలనే విషయాన్ని అతడే నిర్ణయించాలి. అమెరికన్ సైన్య దళాలను విపరీతంగా పెంచినట్లయితే, దేశంలో ఉత్పత్తి అయే సైన్యసామగ్రి అంతా దేశంలోని సైన్యాల

వినియోగానికే సరిపోతుంది. సైన్య సామగ్రిని తక్కిన మిత్రరాజ్యాలకు అమెరికా సరఫరా చెయ్యజాలదు.

అమెరికాలో జరిగే యుద్ధ సామగ్రి ఉత్పత్తి మీదనే యుద్ధఫలితం సంపూర్ణంగా ఆధారపడి వుంటుందని రూజ్వెల్టుకు తెలుసు. అంచేతనే, యుద్ధ సామగ్రి ఉత్పత్తిని సంపూర్ణ కృషితో సాగించడానికి రూజ్వెల్టు మొదటినుంచీ శ్రద్ధ చూపాడు. 1942 లోనే అతడు అమెరికా 60,000 విమానాలనూ, 45,000 టాంకులనూ, 20,000 విమాన విధ్వంసక ఫిరంగులనూ, మొత్తం 80,00,000 టన్నుల బరువు మొయ్యగల నౌకలనూ నిర్మించాలనే కార్యక్రమాన్ని నిర్ణయించాడు. అంతటితో పూరుకోక 1943 నాటికి, యీ ఉత్పత్తి లక్ష్యాలను పెంచి, 1,00,000 విమానాలనూ, 75,000 టాంకులనూ, 35,000 విమాన విధ్వంసక ఫిరంగులనూ, మొత్తం 1,00,00,000 టన్నుల బరువు మొయ్యగల నౌకలనూ నిర్మించాలని నిర్ణయించాడు. యుద్ధం పూర్తి అయేలోపల, ఏ దేశంలోనూ ఎప్పుడూ జరగనంత ఎక్కువగా యుద్ధసామగ్రి ఉత్పత్తి జరిగింది. దానికి అయిన వ్యయమూ! 1943 లో యుద్ధ కార్యనిర్వహణకు గాను 1,00,000 కోట్ల డాలర్లను మంజూరు చెయ్యమని రూజ్వెల్టు కాంగ్రెసును అడిగాడు. ఆ సంవత్సరాంతానికి యుద్ధవ్యయం 22,500,00,00,000 డాలర్లు అయింది. అమెరికా స్వతంత్రరాజ్యమైనప్పటినుంచీ 1943 అంతందాకా అమెరికా పరిపాలనకు అయిన మొత్తం ప్రభుత్వవ్యయంకూడా అంత కాలేదు.

రూజ్వెల్టు ఉత్సాహమూ, యుద్ధంలో తప్పక గెలుస్తామనే అతడి గొప్పధైర్యమూ, దేశంలోని ప్రజలలో నిరుత్సాహం కలుగకుండా దేశాన్ని కాపాడాయి. ప్రపంచ యుద్ధంలో అమెరికా తప్పకుండా గెలుపు పొందేదే అని ఈనాడు ప్రజలు అనుకోవచ్చును గాని, 1942 లో సైన్య పరిస్థితులు చాలా ఆందోళనకరంగానూ, నిరాశాజనకంగానూ వున్నాయి. జర్మనులు, ఈజిప్టులోనికి ప్రవేశించబోతున్నారు; జపానువారు బర్మాను ఆక్రమించి ఇండియా పొలిమేరలో వున్నారు. జర్మనీ దెబ్బకు, రష్యా ఆట్టేకాలం తట్టుకోనేటట్టు కనపడడంలేదు. బ్రిటను ప్రాణాలన్నీ జర్మన్ యు-బోట్లు ముంచివేస్తున్న బ్రిటిషు నౌకలతోపాటు మునిగి పోతున్నవి. బ్రిటిషువారు లొంగిపోయినట్లయితే, మాస్కో, స్టాలిన్‌గ్రాడ్ నగరాలు

మరికొంతకాలం నిలబడి వుండక పోయినట్లయితే, జర్మనులు, జపానువారు ఆసియాలో ఎక్కడో ఒకచోట కలుసుకోగలిగినట్లయితే బహుశా రెండవ ప్రపంచయుద్ధం ఇంకా జరుగుతూనే వుండేదేమో! ఈ ప్రమాదా లన్నిటినీ రూజ్వెల్టు బాగా గ్రహించాడు. అయినప్పటికీ అతడు తన కర్తవ్యాన్ని నిర్వహించడంలో ఏమాత్రమూ జంకలేదు. అమెరికాలో యుద్ధసామగ్రి ఉత్పత్తి బ్రహ్మాండంగా సాగినమాట నిజమే. కాని, ఉత్పత్తి జోరుగా సాగడం ఆరంభం కావడానికి కొంతకాలం పట్టింది. ఏమంటే, విల్లోరన్ అనే ఫాక్టరీలో 1942 అక్టోబర్ వరకూ ఒక్క విమానంకూడా ఉత్పత్తి కాలేదు.

యుద్ధం జరుగుతూ వుండగానే, శాంతి స్థాపనలో అమెరికనుల ప్రమేయం ఎక్కువగా వుండేటట్టు చూడడానికి రూజ్వెల్టు బాగా శ్రద్ధ తీసుకున్నాడు. ఈనాడు మనం మెచ్చుకున్నా, మెచ్చుకోక పోయినా, యునైటెడ్ నేషన్సు ఒక స్థిర సంస్థగా వుంది. కాని, ఆనాడు ఈ సంస్థను స్థాపించడంలో రూజ్వెల్టు ఎంతో ఆలోచించవలసి వచ్చింది. నానాజాతి సమితిలో అమెరికా ప్రమేయాన్ని 1919 లో కాంగ్రెసు అంగీకరించలేదు. మళ్ళీ కాంగ్రెసు అదే ధోరణిని అవలంబించకుండా, రూజ్వెల్టు చాక చక్యంతో ప్రవర్తించవలసి వుంది. ఆనాడు నానాజాతి సమితిని కూల ద్రోసిన ముఠావారు యింకా మంచి బలంతోనే వున్నారు. అయితే, యునైటెడ్ నేషన్సు స్థాపన విషయంలో రూజ్వెల్టు ప్రతిపాదనలకు తీవ్రమైన ప్రతిఘటన ఏమీ రాలేదు.

శాంతిస్థాపన విషయంలో శాశ్వతమైన పునాదులు వెయ్యడమే తన జీవితపు ఘనకార్యాలలోకెల్లా గొప్పదిగా భావిస్తానని రూజ్వెల్టు ఒక మిత్రునితో చెప్పాడు. నిజానికి 1944 మధ్యనుంచీ, యుద్ధ కార్య నిర్వహణలకన్న శాంతి స్థాపన కార్యాల పట్లనే రూజ్వెల్టు ఎక్కువ శ్రద్ధచూపాడు. యుద్ధానంతరం ఏర్పడే సమస్యలను పరిష్కరించే మార్గాలను ఆలోచించడంలోనే రూజ్వెల్టు ఎక్కువ శ్రద్ధ చూపాడని, 1944 చివర అతడితో ఎక్కువ పరిచయం గలవారంతా చెప్పారు. యుద్ధం పూర్తిగా ముగియక పూర్వమే అతడు చనిపోయినప్పటికీ, శాంతిస్థాపనకు చెయ్యవలసిన ఏర్పాట్లన్నిటినీ అతడు చేసి వేశాడు.

రూజ్వెల్టు కొంతవరకు తీవ్రమైన విమర్శకు లోనైన ఉదంతం
అడ్మిరల్ డార్లాన్ ఉదంతం. అడ్మిరల్ డార్లాన్ జర్మనీకి లోబడి
ఫ్రాన్సులో పరిపాలన చేస్తున్న విషీప్రభుత్వపు ప్రతినిధి. అతడు ఉత్తర
ఆఫ్రికాలోని ఫ్రెంచి సామ్రాజ్యానికి పాలకుడుగా వున్నాడు. అమెరికన్
సైన్యాలు ఉత్తర ఆఫ్రికాలో ప్రవేశించినప్పుడు అడ్మిరల్ డార్లాన్
ఆధిపత్యంలో వున్న ఫ్రెంచి సేనలు అమెరికన్ సేనలను ఎదిరించాయి.
అమెరికన్ సేనలతో ఫ్రెంచి సేనలు యుద్ధం చెయ్యకుండా ఉత్తరువు
యివ్వవలసినవాడు అడ్మిరల్ డార్లాన్. అంచేత, జనరల్ ఐసెన్
హోవర్ అడ్మిరల్ డార్లాన్‌తో రాయబారాలు జరిపి, అతడిని మిత్ర
మండలి వైపు త్రిప్పాడు. కాని, డార్లాన్‌తో సంబంధాలు పెట్టు
కున్నందుకు, అమెరికన్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తూ, బ్రిటనులోను
అమెరికాలోను పెద్ద దుమారం రేగింది. ఇంతవరకూ మిత్రమండలివారు
విమర్శకు అతీతంగా న్యాయమైన మార్గంలో యుద్ధం సాగిస్తూ వున్నట్టూ,
డార్లాన్‌తో సంబంధం పెట్టుకోవడంతో, అవసరమైతే మిత్రమండలివారు
అంతవరకూ తమ శత్రుపక్షాన వున్న వారితోకూడా చేతులు కలపడానికి
సంకోచించనట్టూ స్పష్టమైందని నిశితమైన విమర్శలు బయలుదేరాయి.
స్వాతంత్ర్యంకోసం, నీతికోసం అమెరికా యుద్ధం చేస్తున్నదని విశ్వసించిన
నీతిపరులు, ప్రపంచంలోని అన్ని దేశాలవారూ, ఒక్కసారిగా ఖేద
పడ్డారు. "ఈ అప్రతిష్ఠను ఐసెన్‌హోవరు తన జన్మలో మాపుకో
జాలడు," అని హారీ హాప్కిన్సుకూడా అన్నాడు. పాపం, ఐసెన్
హోవరు ఇదంతా ఆలోచించలేదు. అమెరికన్ సైనికులు ఎక్కువమంది
చావకుండా ఉత్తరాఫ్రికాలో యుద్ధాన్ని ముగించుకుందామని అతడు
అనుకున్నాడు గాని, రాజకీయపు యెత్తులు వేద్దామనే ఆలోచనే అతడికి
లేదు. ఈ సంఘటనలో, రూజ్వెల్టు అసలు ప్రమేయమే పెట్టుకోలేదు.
అయినా, దాని బాధ్యతను పూర్తిగా అతడే వహించవలసి వచ్చింది. పైగా,
ఐసెన్‌హోవరు చేసిన పనిలో తప్పు ఏమీ అతడికి కనపడలేదు. ఆ
సందర్భాలలో, ఐసెన్‌హోవర్ చేసిన పని సబబేనని అతడికి అని
పించింది. అంచేత, అతడు పూర్తిగా ఐసెన్‌హోవరును సమర్థించాడు.
అయితే, డార్లాన్ నమ్మదగిన మనిషి కాడు గనుక, అతడితో చేసుకున్న

ఒప్పందాలన్నీ కేవలం తాత్కాలికమైనవే నని అతను స్పష్టపరచాడు. చిట్టచివరికు, డార్లాన్‌ను ఎవరో హత్య చెయ్యడంవల్ల, రూజ్వెల్టు పట్ల వచ్చిన తీవ్ర విమర్శ క్రమంగా చల్లారింది.

1943 లో ఆఫ్రికాలో యుద్ధచర్యలు ప్రారంభమైన తరువాత, రూజ్వెల్టు కాశాబ్లాంకాకు వెళ్ళారు. అంతకుపూర్వం అట్లాంటిక్ ప్రణాళిక సమావేశం కోసం తప్ప మరెప్పుడూ అమెరికా ప్రెసిడెంటు యుద్ధ సమయంలో అమెరికా దేశం విడిచి సమావేశాలకు బయటకు వెళ్ళడం జరుగలేదు. ఈ సమావేశంవల్ల కొన్ని సత్ఫలితాలు కలిగాయి. రూజ్వెల్టుకీ, చర్చిల్‌కూ గల దృఢస్నేహాన్ని ఆ సమావేశం వ్యక్తపరిచింది. సైనిక చర్యలలో మిత్రమండలి ఉద్ధృతంగా పని చెయ్యబోతున్నదని స్పష్టపడింది.

శత్రువులు ఏ షరతులూ లేకుండా లొంగిపోతేనే యుద్ధం చాలిస్తా మనే రూజ్వెల్టు ప్రకటన యీ సమావేశానంతరమే జరిగింది. అయితే రూజ్వెల్టు ఆ ప్రకటనచేసేవరకూ, రూజ్వెల్టు అలా ప్రకటన చేస్తాడని ఎవరికీ తెలియదు. రూజ్వెల్టు ఆ ప్రకటన చేసినదాకా తాను ఆ మాటలను అంతకుపూర్వం ఎవరినోటా వినలేదని చర్చిల్ కూడా ఒకసారి అన్నాడు. ఆ ప్రకటన చెయ్యడానికి ముందు తానుకూడా ఆ విషయాన్ని గురించి ఆలోచించలేదనీ, ఆ క్షణంలో తనకు అలాతోచి పత్రికా విలేఖరుల గోష్ఠిలో అలా ప్రకటన చేశాననీ రూజ్వెల్టుకూడా అన్నాడు. అయితే, తరువాత బయటపడిన సంగతులనుబట్టి రూజ్వెల్టూ, చర్చిలూ ఆ విషయాన్ని గురించి భోజనాలవేళ ముందుగా ఒకసారి చర్చించామని కామన్సుసభలో చర్చిల్ ప్రకటించాడు. అంతేకాక, ఇటలీని మినహాయించి తక్కిన శత్రు దేశాలను షరతులు ఏమీ లేకుండా లొంగిపోవాలని కోరబోతున్నామని బ్రిటిషు యుద్ధ మంత్రిమండలికి తెలియపరచానని కూడా చర్చిల్ అన్నాడు. కాని, అలాటి ప్రకటన చెయ్యబోతున్నామని తనకు చెప్పలేదనీ, చెప్పి నట్లయితే అలాటి ప్రకటనను తాను ఎంతమాత్రమూ అంగీకరించివుండే వాణ్ణి కాననీ బ్రిటిషు యుద్ధమంత్రిమండలి సభ్యులలో ఒకడైన బెవిన్ ప్రకటించాడు. ఏమైనా, ఆ ప్రకటన రూజ్వెల్టు తాను హఠాత్తుగా ఎవరితోనూ ఆలోచించకుండా చేసిందికాదని స్పష్టపడుతోంది. అలా టప్పుడు ఆ ప్రకటనకు తానే కారణభూతుడ ననే కథను రూజ్వెల్టు

ఎందుకు ప్రచారంచేశాడు. బ్రిటిషు మంత్రిమండలిలోని తక్కిన మంత్రు లతో చెప్పకుండా తనతో ఈ విషయంలో సంప్రదింపులు జరిపినందుకు చర్చిల్ నిందపడుతాడని రూజ్వెల్టు ఈ కథను అల్లినట్లా? లేక, రూజ్వెల్టు మీద అమెరికాలో తీవ్రమైన విమర్శలు వస్తాయని రూజ్వెల్టును కాపాడడం కోసం చర్చిల్ మరొకకథను అల్లినట్లా?

దీనిలోని అసలు నిజం ఏమిటో భగవంతుడికే తెలియాలి. కాని, రూజ్వెల్టు ఆ ప్రకటన చెయ్యడానికిమాత్రం కారణాలు చాలావున్నాయి. (1) రష్యాకు ఉత్సాహం కలిగించడం. అప్పటి కాలంలో రష్యా ఇక ఆట్టేకాలం జర్మనీ తాకిడికి తట్టుకోలేదేమో అనేభయం అమెరికా, ఇంగ్లండులకు వుండేది. యుద్ధాన్ని ఇక సాగించలేక జర్మనీతో ప్రత్యేకంగా సంధి చేసుకుంటుందేమో అనే అనుమానంవల్ల చివరదాకా శత్రువులు పూర్తిగా లొంగిపోయినదాకా పోరాడుతాము సుమా అని రష్యాకు ధైర్యం చెప్పడంకోసం ఆ ప్రకటన ఉద్దేశించబడింది. (2) ఇంగ్లండు, అమెరికాలు హిట్లరుతో విడిగా సంధిచేసుకో బోతున్నాయని కొంతమంది బుద్ధిహీనులు ఒక ప్రచారం సాగించారు. ఆ ప్రచారాన్ని అరికట్టడానికి ఆ ప్రకటన అవసరమైంది. (3) యుద్ధం చిరకాలం సాగబోతున్నదనీ, అంచేత యుద్ధకృషిలో ఏ మాత్రం ఏమరుపాటు పనికిరాదనీ తన దేశంలోని ప్రజలను హెచ్చరించడం అవసరమని రూజ్వెల్టు భావించాడు. (4) భవిష్యత్కాలంలో శాంతి స్థిరంగా నెలకొనాలంటే యుద్ధరంగంలో తాము పూర్తిగా ఓడిపోయామనే భావం జర్మనులకు స్పష్టంగా కలిగించడం అవసరమనీ, అంచేత ఏ విధమైన షరతులూ లేకుండా జర్మనులను పూర్తిగా ఓడించాలనీ రూజ్వెల్టు నిశ్చయించాడు. (5) ఫ్రాన్సులోను మిగతా యూరప్‌లోనూ హిట్లరు క్రౌర్యానికి చాలా దారుణంగా బలిఅయిన ప్రజలకు వారుపడ్డ బాధలకు తగిన ప్రతిఫలాన్ని జర్మనులు అనుభవించే టట్టు చేస్తాము సుమా అనిచెప్పి వారికి ధైర్యం కలిగించాలని రూజ్వెల్టు కోరాడు.

రూజ్వెల్టు, చర్చిల్, స్టాలిన్‌లు టెహరాన్‌లోని 1943 నవంబరులో సమావేశమయారు. ఈ ముగ్గురు కలిసి సమాలోచనలు చెయ్యడం, ఇదే మొదటిసారి.

# స్టాలిన్ - రూజ్వెల్టు

ప్రపంచంలో వున్న మానవులలోకెల్లా అత్యధికమైన అధికార బలం గలవ్యక్తి స్టాలిన్. పట్టుదల, దీక్ష, తదేకత్వం, స్టాలిన్ ప్రధాన గుణాలు. అతడికి భావోద్రేకాలు లేవు. అతడి నరాలు ఉక్కునరాలు.

చర్చిల్‌తో జరిపే మంతనాలను, చర్చిల్ స్టాలిన్‌లు ఇద్దరితోటీ కలవాలనీ, స్టాలిన్‌ను కలుసుకోవాలనీ ఎన్నో సంవత్సరాలుగా రూజ్వెల్టు కోరుతూ వుండేవాడు. రూజ్వెల్టును కలుసుకోవడానికి ఒప్పుకున్న తరువాత కూడా, అసలు కలుసుకోవడంలో స్టాలిన్ చాలా కాలయాపన చేశాడు. దానికి ప్రధాన కారణం, పశ్చిమ రాజ్యాలంటే అతడికివున్న అనుమానమూ; శత్రుభావమూ. పైగా, రష్యన్ సైన్యాలన్నిటికీ అతడే సర్వాధ్యక్షుడు కావడంవల్ల తీవ్రమైన ప్రమాదస్థితిలో మాస్కో నుంచి మరొకచోటికి వెళ్ళడానికి ఏ మాత్రం వ్యవధికూడా అతడికి కలుగ లేదు. టెహరాన్‌లో ఈ ముగ్గురు మహానాయకులూ కలుసుకోవడానికి ప్రాతిపదిక. అంతకుపూర్వం మాలటోవ్ వాషింగ్టన్ వచ్చినప్పుడూ, కార్డెల్ హల్ మాస్కో వెళ్ళినప్పుడూ సంభాషణలలో ఏర్పాటు చేయబడింది. అంతేకాక, రూజ్వెల్టూ, స్టాలినూ ఒకరికొకరు ఉత్తరాలు వ్రాసుకొని ఒకరి అభిప్రాయాలను మరొకరు అంతకు ముందుగానే తెలుసుకున్నారు.

ఈ ముగ్గురు నాయకులూ టెహరాన్‌లో కలుసుకొనేటప్పటికి ప్రపంచం ఇక ఘరివాలేదనుకున్నది. అమెరికా, రష్యా, బ్రిటనుల నాయకులు ముగ్గురూ యుద్ధకృషి, యుద్ధధ్యేయాలను గురించి సమాలోచనలు జరపడానికి సమావేశమయారంటే ప్రపంచం అంతకుపూర్వం కనివిని యెరుగని ఒక మహాశక్తి ఒక్కచోట కూడినట్లు ప్రపంచ ప్రజలందరికీ స్పష్టమైంది.

అంతకుపూర్వం అమెరికా ప్రెసిడెంటు ఎవరూకూడా అంత దూర ప్రయాణం చెయ్యలేదు. అంతేకాక, అంతకుపూర్వం ఎప్పుడూకూడా అమెరికా ప్రెసిడెంటు విదేశస్థలంలో నిద్రించలేదు. (టెహరాన్‌లో రూజ్వెల్టు రష్యన్ రాయబార కార్యాలయంలో నిద్రించాడు. దానికి

కారణం రక్షణ ఏర్పాట్లు అమెరికన్ రాయబార కార్యాలయంలోకంటె, రష్యన్ రాయబార కార్యాలయంలో బాగా వున్నాయని అతడి అంగరక్షకులు భావించారు. పైగా, స్టాలిన్ అతిథిగా రష్యన్ రాయబార కార్యాలయంలో బస చెయ్యడంవల్ల ప్రతిరోజూ సమాలోచనకు రూజ్వెల్టు అమెరికన్ రాయబార కార్యాలయంనుంచి రష్యన్ రాయబార కార్యాలయానికి ప్రయాణం చెయ్యవలసిన బాధ ఒకటి తప్పిపోయింది.)

అటువైపు స్టాలిన్ కూడా 30 సంవత్సరాల ఆ మధ్య రష్యాను విడిచి ఒక్కసారికూడా బైటికి వెళ్ళలేదట. అంతేగాక అతడు మొట్ట మొదటిసారి విమానప్రయాణం చేసినది టెహరాన్ సమావేశానికే అని కూడా అంటారు.

ఈ సమావేశంలో ఈ అగ్రరాజ్య నాయకులు ముగ్గురూ చాలా అన్యోన్యతను కనపరిచారు. స్టాలిన్‌గ్రాడ్‌లో రష్యనులు ప్రదర్శించిన వీరశౌర్యాలకు గౌరవచిహ్నంగా ఇంగ్లండురాజు స్టాలిన్‌కు పంపిన బహుమతి ఒక ఖడ్గాన్ని చర్చిల్ స్టాలిన్‌కు ఇచ్చాడు. అమెరికా సాధన సామగ్రిని పంపించి వుండకపోతే రష్యను సైన్యాలు తమ విజయాలను సాధించివుండగలిగేవి కావని రూజ్వెల్టును పొగిడాడు స్టాలిన్.

తాను అందరికన్న వయస్సులో పెద్దవాడు గనుకనూ, ముగ్గురి పేర్లలోనూ అకారాది వరుసలో తనపేరు ముందువస్తుంది గనుకనూ, ఆనాడు తన జన్మదినం గనుకనూ తాను విందుచేస్తాననీ, రూజ్వెల్టు స్టాలినులు తనకు అతిథులుగా వుండాలనీ ఒకనాడు చర్చిల్ పట్టుపట్టాడు.

స్టాలిన్‌ను చర్చిల్ అంతకు ముందు ఒకసారి కలుసుకున్నాడు గాని, రూజ్వెల్టు స్టాలిన్‌ను కలుసుకోవడం అదే ప్రథమం. అంచేత రష్యా అధిపతి సంపూర్ణ గౌరవాన్ని పొందడానికి రూజ్వెల్టు శాయశక్తులా ప్రయత్నించాడు. స్టాలిన్ చర్చిలులకన్న, తానూ స్టాలినూ వ్యక్తిగతంగా ఎక్కువ అన్యోన్యతను చూపుకో గలిగామని గ్రహించి, రూజ్వెల్టు మహదానందం పొందాడు.

ఈ నాయకత్రయపు ప్రవర్తనను చూసినవారు, రూజ్వెల్టు పట్ల స్టాలిన్ ఎక్కువ గౌరవాన్ని చూపినప్పటికీ, రూజ్వెల్టు ప్రవర్తనను

పూర్తిగా అర్థం చేసుకోలేక అయోమయ స్థితిలో పడ్డాడంటారు. చర్చిల్ ధోరణిని పూర్తిగా అర్థం చేసుకున్నందువల్ల, అతడితో ఎలా మెలగాలో స్టాలిన్‌కు చక్కగా అవగతమైంది. కాని తన చేతులో పట్టే కనిపిస్తూ, ఎప్పటి కప్పుడు బయటికి జారిపోతూ కలకలలాడే ముఖంతో, కమ్మని కబుర్లతో, ఎంతమాత్రం అంతు దొరకనియ్యని మనో భావాలతో, మూర్తీభవించిన ఉత్సాహంలాగ కనిపిస్తున్న అమెరికా ప్రెసిడెంటును అర్థం చేసుకోలేక స్టాలిన్ తికమక పడ్డాడట.

ఈ టెహరాన్ సమావేశాన్ని గురించీ, అక్కడి సమాలోచనలను గురించీ, ఆసందర్భపు గ్రంథం విస్తారంగా వ్రాయబడింది. కాని, నిజానికి ఈ సమావేశం ఒకే ఒక ప్రధాన ఆశయంతో జరిగింది. అదేమిటంటే: యుద్ధాన్ని జయప్రదంగా సాగించి, జర్మను సంస్యను పరిష్కరించి శాంతి స్థాపనకు పునాదులు వెయ్యడం. ఈ సందర్భంలో, సహజంగా మరుసటి సంవత్సరంలో మిత్రమండలి సైన్యాలు ఫ్రాన్సుమీద దాడిజరిపి అక్కడ జర్మనులతో పోరాటంలో రెండవ యుద్ధరంగాన్ని ప్రారంభించడానికి నిర్ణయం జరిగింది.

టెహరాన్ సమావేశంలో స్టాలిన్, రూజ్వెల్టును తన వ్రేలిచుట్టూ తిప్పి ఆడించి, జపానుతో యుద్ధానికి వెంటనే గాక తరువాత దిగుతానని చెప్పి దానికి రూజ్వెల్టును ఒప్పించాడని చాలామందికి పొరపాటు అభిప్రాయం వుంది. అది నిజంకాదు. ఆ రోజులలో, జపానుతో రష్యా త్వరగా యుద్ధంలో దిగకూడదనే అమెరికన్ సైన్య నాయకులు కోరారు. దానికి కారణం ఏమిటంటే, జర్మనీని ఓడించక పూర్వమే రష్యా జపానుతో కూడా యుద్ధంలోకి దిగినట్లయితే, అది రెండు శత్రువులతో పోరాడడంవల్ల జర్మనీకి సరైన ప్రతిఘటన చూపలేక పోతుందేమోనని. అలాటప్పుడు జర్మనీ జపానులు రెండూకలిసి రష్యాను పూర్తిగా పడగొట్టడంకూడా జరగవచ్చును. అలా జరిగినట్లయితే, మిత్రమండలికి పెద్దదెబ్బ. అందుచేత, జపానుతో రష్యా తొందరపడి యుద్ధంలో దిగకూడదనే, మిత్రమండలి నాయకులు పూర్తిగా వాంఛించారు.

# యుద్ధం : దేశీయ వ్యవహారాలు

యుద్ధ కార్యాలలో అంత ఎక్కువగా మునిగి తేలుతూ వున్న రూజ్వెల్టు, అనేక రకాల దేశీయ వ్యవహారాల పట్ల ఎక్కువ శ్రద్ధతో పని చెయ్యక తప్పలేదు. దేశంలో అనేక సమస్యలను అతడు ఎదుర్కొనవలసి వచ్చింది. ఆహార పదార్థాలనూ, పెట్రోలునూ రేషనింగులో పెట్టినందుకు ప్రజలు చాలా ఎక్కువగా విసుక్కోవడం ఆరంభించారు. జీవన వ్యయం విపరీతంగా పెరిగిపోయింది. ప్రభుత్వపు ఖర్చులను మంజూరు చెయ్యమని రూజ్వెల్టు అడిగిన డబ్బును, అడిగినంత మంజూరు చెయ్యక, కాంగ్రెసు చికాకులు పెడుతోంది. ప్రభుత్వాధికారులు ఒకరితో ఒకరు సహకారం చెయ్యక పోట్లాటలు పెట్టుకు కూచున్నారు. రైల్వేలు, సరఫరా చెయ్యవలసిన సామగ్రి నంతనూ సరఫరా చెయ్యలేక పోతున్నవి. ద్రవ్యోల్బణం హెచ్చిపోయే ప్రమాదం ఏర్పడింది. సరుకులు తగినంతగా మార్కెట్లలో దొరకడం లేదు.

1943 వెళ్ళి 1944 వచ్చేసరికి, రాచకార్యాల ఉన్నతి కూడా పెరిగి పోయింది. 1944 జూన్ 6 న అమెరికన్ సేనలు ఫ్రాన్సుమీద దాడికి దిగి, యూరప్‌లో రెండవ యుద్ధరంగాన్ని ప్రారంభించాయి. ఊపిరి సలపకుండా పనిచేసి, యుద్ధంలో విజయం శీఘ్రంగా సంపాదించవలసిన అవసరం ఏర్పడింది. రూజ్వెల్టుకు పనీ, శ్రమా ఎక్కువయాయి. చకచక పనిచెయ్యమని తన ఉద్యోగులను అతడు తొందర పెట్టవలసిన అగత్యం ఏర్పడింది.

# అస్తమయం

## నాల్గవ అధ్యక్షపదవి

కాలము, మార్పు; మార్పు, కాలము; ఈ రెండుకూడా నిర్దాక్షిణ్యంగా రూజ్వెల్టును నమిలి మ్రింగాయి. పదేళ్ళ నాటికన్న ఇప్పుడు రూజ్వెల్టు ముసలి వాడయాడు. అరవై ఏళ్ళ ముదిమి అతనిలో స్పష్టంగా కనిపిస్తున్నది. అతడి జుట్టు బాగా నెరసింది. మనిషి పలచబడ్డాడు. తత్వంలో కొంత చిరాకు వచ్చిపడింది. కాలం మనుష్యులను క్రమంగా జీర్ణింప చేస్తుంది. కాని, రూజ్వెల్టు పట్ల కాలం పరుగెత్తి, అతణ్ణి తనతో లాక్కుపోయింది. వయస్సు పైబడిన కొద్దీ, అతడు అధికారాన్ని బలంగా పట్టుకున్నాడు. పదవిలోనుంచి అతణ్ణి మరణంతప్ప మరేదీ తొలగించలేదన్నట్టు కనపడింది. అలాగే, మరణమే అతణ్ణి తొలగించింది.

## ఆఖరుదశ

ప్రతినాలుగేళ్ళకూ పంచాంగం ప్రకారం అమెరికాలో అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగి తీరవలసిందే. పరిస్థితులు ఎలావున్నాసరే, యుద్ధంగానీ, శాంతిగానీ, వరదలురానీ, కాటకంరానీ, నాలుగేళ్ళ కొకసారి అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగి తీరవలసిందే. ప్రతి లీపు సంవత్సరమూ, విధి ఆజ్ఞను అనుసరించినట్లుగా దేశంలోని ప్రజలు కొత్త అధ్యక్షుణ్ణి ఎన్నుకుంటారు. ఈ నిర్ణయాన్ని ఆపగలిగిన దేదీలేదు.

ఇంతకు పూర్వం ఒక్కసారిమాత్రం 1864 లో, అమెరికా దేశ చరిత్రలో. యుద్ధకాలంలో ఎన్నికలు జరిగాయి. మళ్ళీ 1944 లో ఎన్నికలు జరిగినప్పుడు, దేశం ప్రపంచ యుద్ధంలో పాల్గొంటూవున్నది. ఎలాటి యుద్ధంలోనయినా, ప్రజలు స్వేచ్ఛగా ఎన్నికలు జరుపుకో గలగడం, అమెరికా ప్రజారాజ్య విధానానికి ఒక ఘనమైన ప్రశంసే. ఎన్నికలంటే మాటలుకాదు. ఉద్రేకాలు, ఉత్సాహాలు ముమ్మరంగా చెలరేగి, దేశంలోని ప్రజలందరి దృష్టీ ఎన్నికలపైనే వున్నప్పటికీ, యుద్ధనిర్వహణ కృషికి ఏమాత్రంలోపం రాకపోవడంకూడా, అమెరికన్ ప్రజలకు ఒక ప్రశంసే. అయితే, యుద్ధ

కృషిలో నిరంతరమూ పాల్గొన వలసిన వ్యక్తుల ఉత్సాహశక్తులు, యీ ఎన్నికల కలాపంవల్ల మరొక మార్గాన్ని పట్టకపోలేదు. అంతమాత్రంచేత యుద్ధకృషిమాత్రం చెడిపోలేదు.

ఎంతదారుణమైన యుద్ధం జరుగుతూవున్నా, తమ సర్వ సైన్యాధ్యక్షుణ్ణి మార్చుకొనే అవకాశం ఎన్నికలద్వారా అమెరికన్ ప్రజలకు కలిగింది.

1944 లో నాల్గవసారి అధ్యక్షపదవికి పోటీచెయ్యడం రూజ్వెల్టుకు ఇష్టం లేదు. కాని, అతడికి తప్పలేదు. అతడు పోటీ చెయ్యకుండా వుండడానికి వీలులేక పోయింది. మూడవసారి అధ్యక్షపదవికి పోటీచేసినప్పుడు వచ్చిన విమర్శలలో శతాంశమైనా, నాల్గవసారి అతడు పోటీ చేసినప్పుడు రాలేదు. దానినిబట్టి, అతడు "నియంత" కాగోరుతున్నాడనే వాదం నిలవకుండా పోయింది. మూడవసారి అధ్యక్షపదవికి పోటీచేసి గెలిచినందువల్ల అతడు చెల్లించవలసిన అపరాధం నాల్గవసారి పోటీ చెయ్యడం. అది అతడు తప్పనిసరిగా చెల్లించవలసి వచ్చింది.

అయితే, రూజ్వెల్టు నాల్గవసారికూడా ఎందుకు పోటీచేశాడు? యుద్ధకృషి నిర్వహణ తను లేకపోతే సరిగా జరగదనే అహంభావం, కొంతవరకు కారణం కావచ్చును. అంతేకాక, తన అధ్యక్షపదవీ కాలంలో ఆరంభమైన యుద్ధాన్ని జయవంతంగా తుద ముట్టించవలసిన తన బాధ్యతను అతడు స్పష్టంగా గ్రహించాడు. మధ్యలో తన బాధ్యతనుంచి అతడు తప్పుకోగలడా? అయితే, అతడి ఆరోగ్యం మరొక నాల్గేళ్ళు అధ్యక్ష పదవిని నిర్వహించగల స్థితిలో లేదు. అలాటిస్థితిలో అతడిని పోటీ చెయ్యకుండా చూడవలసిన అవసరం ఎంతేనా వుంది. కాని, ఆ పని ఎవరు చెయ్యగలరు?

1940 లో లాగనే 1944 లో కూడా కొంతమంది డెమొక్రాటిక్ పార్టీ పెద్దలు, రూజ్వెల్టు అభ్యర్థిత్వాన్ని ప్రతిఘటించారు. డెమొక్రాటిక్ పార్టీ మహాసభ జరగడానికి కొంచెం ముందు, పార్టీ అభ్యర్థిగా జనరల్ మార్షల్ ను ప్రతిపాదించడానికి కొంతమంది ప్రయత్నంచేశారు. కాని అలాటి ప్రతిపాదనలకు వేటికీ తాను అంగీకరించ జాలనని మార్షల్ స్పష్టంగా చెప్పివేశాడు. మహాసభలో పార్టీ అభ్యర్థిగా రూజ్వెల్టును

1,096 ఓట్లు వచ్చాయి. సెనెటర్ బర్డ్‌కు 89 ఓట్లు వచ్చాయి; జేమ్స్ ఫార్లేకు ఒకే ఒక ఓటువచ్చింది.

ఆ మహాసభ ఎక్కువ శ్రద్ధ తీసుకున్నదల్లా వైస్-ప్రెసిడెంటు పదవికి ఎవరిని ఎన్నుకోనడమా అనే విషయంపట్ల. ఇది విని అంతగా హర్షించ తగిన కథ కాదు. 1940లో తన ఆరోగ్యం చాలా బాగా వున్నప్పటికీ, మనిషిని చావు ఎప్పుడూ వెన్నంటి వుంటుందనే విషయాన్ని గ్రహించి తనతోపాటు వైస్-ప్రెసిడెంట్ పదవికి పోటీచేసే వ్యక్తినిగురించి కొంత శ్రద్ధ తీసుకున్నాడు. అంచేతనే, ఆ రోజులలో తాను చాలా సమర్థుడని భావించిన హెన్రీ వాలెస్‌ను వైస్-ప్రెసిడెంట్ పదవికి అభ్యర్థిగా నిల బెట్టాలని రూజ్వెల్టు పట్టుపట్టాడు. కాని 1944 లో పన్నెండు సంవత్స రాల అధ్యక్షపదవీ భారంలోనూ, రెండు సంవత్సరాల యుద్ధనిర్వహణ భారంలోనూ, అరవయ్యేళ్ళ వయోభారంలోనూ క్రుంగి ఆరోగ్యం పూర్తిగా దెబ్బతినివున్న రూజ్వెల్టు వైస్ - ప్రెసిడెంట్ పదవికి అభ్యర్థిగా ఎవరిని నిలబెట్టాలనే విషయంలో ఏ మాత్రమూ శ్రద్ధ తీసుకోలేదు. ఇది చాలా చిత్రమే.

మహాసభ ప్రారంభమైంది. బర్న్స్‌ను వైస్ ప్రెసిడెంటు పదవికి అభ్యర్థిగా ఎవరూ అంగీకరించలేదు. వాలెస్ పట్ల చాలామంది అనుకూలంగా వున్నారు. కాని, పార్టీ నాయకులు మాత్రం అతడిని అంగీకరించలేదు. "ట్రూమన్‌ను గాని, బిల్ డగ్లస్‌ను గాని అభ్యర్థిగా ఎన్నుకొంటే బాగుంటుంది," అని రూజ్వెల్టు జూలై 19 న మహాసభ అధ్యక్షుడికి వ్రాశాడు. అసలు ఆ వుత్తరంలో "డగ్లస్ గాని, ట్రూమన్ గాని" అని రూజ్వెల్టు వ్రాశాడట. దానినిమార్చి "ట్రూమన్ గాని, డగ్లస్ గాని" అని వ్రాయమని రూజ్వెల్టు కూతురు అన్నా రూజ్వెల్టుకు నచ్చజెప్పిందట. దానికి కారణం ప్రెసిడెంటు ఎవరిపేరు ముందువ్రాస్తే అతడిని మహాసభ అంగీకరిస్తుందని ఆమె భావించడమే. అలాగే జరిగింది.

అంత విచిత్రంగా వైస్ ప్రెసిడెంట్ పదవిని తెచ్చుకున్న హారీ ట్రూమన్ రూజ్వెల్టు చనిపోగానే ప్రెసిడెంటు అయ్యాడు. అంతకంటె మరొక పెద్ద విచిత్రం ఏమిటంటే వైస్-ప్రెసిడెంట్ పదవికి డెమొ క్రాటిక్ పార్టీ అభ్యర్థిగా జేమ్స్ బర్న్స్‌ను ప్రతిపాదించాలని ట్రూమన్

అనుకున్నాడు. "పార్టీ అభ్యర్థి బర్న్సు కాదు, నువ్వే" అని ట్రూమన్‌కు పార్టీ మహాసభలో చెప్పినప్పుడు బర్న్సును ప్రతిపాదించడానికి తాను తయారుచేసిన ఉపన్యాసం ట్రూమన్ జేబులోనే వుంది.

సెనెటర్‌గా ట్రూమన్‌చేసిన పనిని రూజ్వెల్టు మెచ్చుకున్నప్పటికీ ట్రూమన్ రూజ్వెల్టులమధ్య ఎక్కువ ఆంతర్యం యెప్పుడూ పర్థిల్లలేదు. ట్రూమన్‌ను అభ్యర్థిగా నియమించినప్పటినుంచి ప్రెసిడెంటు రూజ్వెల్టు నాల్గవసారి పదవీస్వీకరణ చేసేలోపల ట్రూమన్‌ను ఒకే ఒకసారి కలుసుకున్నాడు. దానినిబట్టి రూజ్వెల్టు చివరిరోజులలో అందరికీ ఎంతదూరంగా వుండేవాడో స్పష్టమౌతున్నది.

ఎన్నికల పోరాటంమాత్రం చాలా తీవ్రంగా జరిగింది. వ్యక్తి దూషణలు నిందారోపణలు చాలా ఎక్కువగా జరిగాయి. ఎన్నికలలో, రూజ్వెల్టు ప్రత్యర్థిగా ప్రెసిడెంటు పదవికి పోటీ చేస్తున్న థామస్ డ్యూయీకి మూడు విషయాలలో సంకటాలు కలిగాయి. ఒకటి యుద్ధ నిర్వహణ సాగిస్తున్న రూజ్వెల్టుతో పోటీచెయ్యడం; రెండు, తాను అధ్యక్ష పదవికి అభ్యర్థిగా నియమింపబడక పూర్వం రూజ్వెల్టు అమలుజరిపిన నూతన ఆర్థిక విధానంపట్ల అనుకూలభావాలను ప్రదర్శించడం. దీనివల్ల, రూజ్వెల్టు విధానానికి అనుకూలుడైనవాడు రూజ్వెల్టుతో పోటీచెయ్యడం దేనికి అనేభావం ప్రజలలో కలిగింది. మూడు, అతడిని నిలబెట్టిన రిపబ్లికన్ పార్టీ బ్రిటనుకు అమెరికా సహాయంచెయ్యడానికి మూలకందమైన అరువు-కౌలు విధానానికి అంతకుపూర్వం వ్యతిరేకంగా ఓటుచేసివుండడం. డ్యూయీ కూడా అరువు-కౌలు విధానాన్ని విమర్శించి ఆ విధానంవల్ల అమెరికాలో ప్రజారాజ్య విధానమే నశిస్తుందని అన్నాడు.

## మనిషిలో మార్పు

అమెరికా రాయబారులలో ఒకడు, 1943 అంతంలో రూజ్వెల్టును కెయిరోలో, అక్కడికి జంగ్ కై షేక్‌ను కలుసుకోవడానికి రూజ్వెల్టు వెళ్ళినప్పుడు చూశాడు. 1941 డిసెంబరు తరువాత, ప్రెసిడెంటును ఆ రాయబారి మళ్ళీ చూడడం అప్పుడే. ఆ రెండేళ్లలోనూ, రూజ్వెల్టు ఎంత మారిపోయి వృద్ధాప్యం పొందినదీ చూసి, అతడు నివ్వెరపోయాడు. రూజ్వెల్టు

ఫోటో ఒకదానిమీద సంతకం పెట్టమని ఆ రాయబారి కోరాడు. అలా సంతకం పెట్టేటప్పుడు, రూజ్వెల్టు వ్రేళ్ళు వణికాయట. "మునుపు వున్నంత దృఢంగా లేవు," అని తన వ్రేళ్ళను చూసి రూజ్వెల్టు పెదవి విరిచాడట. కాని, ఆ తరువాత జరిగిన సంభాషణలో మాత్రం, రూజ్వెల్టు మునుపు వున్నంత తెలివిగానూ వున్నాడనీ, అతడి నిశిత మేధలో ఏమీ లోపం లేదనీ, ఆ రాయబారి చెప్పాడు. దీనిని బట్టి, రూజ్వెల్టు కొన్ని విధాల మునుపటిలాగే వున్నాడనీ స్పష్టమౌతున్నది. కొన్ని రోజులలో అతడి దార్ఢ్యం చాలా బాగా వుండేది. కొన్ని కొన్ని రోజులలో అతడు బహు నీరసంగా వుండేవాడు.

నాల్గవసారి ఎన్నికల ప్రచారం జరుగుతూవున్న రోజులలో, రూజ్వెల్టు ఆరోగ్యాన్ని గురించి అతడి శత్రువులు చాలా అసహ్యమైన ప్రచారం చేసేవారు. 56 మైళ్ళ దూరం, గజగజ వణకించే చలిలో, హోరున వాన కురుస్తూ వుండగా, కారుకు పైకప్పు లేకుండా ప్రయాణం చేసి, న్యూయార్కు చేరి అక్కడ బ్రహ్మాండమైన సభలో పెద్ద ఉపన్యాసం చెయ్యడం జబ్బు మనిషి ఎవడైనా చెయ్యగలడా! ప్రచారం చెయ్యడం అంటే రూజ్వెల్టుకు ఎప్పుడూ కూడా చాలా ఇష్టం. ఆ ప్రచారపు సంచారంలో అతడు కొంచెం ఒళ్ళు చేశాడు కూడాను. అయితే, అతడు బాగా విశ్రాంతి తీసుకోవలసిన అవసరం మాత్రం, అతడి అనుచరులందరికీ కనపడుతూనే వుంది. కాని, అమెరికా ప్రెసిడెంటును ఆజ్ఞాపించ గలవారెవరు ?

తన చివరి రోజులలో రూజ్వెల్టు చాలా ఒంటరితనాన్ని అనుభవించాడు. అతనికి ఆప్తులైనవారంతా అతడికి సమీపంలోనే వున్నారు. అయినా, అతడు ఒంటరితనాన్ని అనుభవించాడు. అతడి కూతురు వైట్ హౌసులోనే అతడితోపాటే నివసిస్తున్నది. యాల్టా సమావేశానికి అతడు వెళ్ళినప్పుడు, అతడితో కూడా ఆమె ప్రయాణం చేసింది. అది కొంతవరకు అతడికి ఆనందాన్ని కలిగించింది. హారీ హాప్కిన్స్, ప్రెసిడెంటుకు సమీపంలోనే వున్నాడు. కాని, జబ్బువల్ల అతడు కదలలేని స్థితిలో వున్నాడు. రోసెన్మన్, స్టీఫెన్ ఎర్లీ, మిస్ టుల్లీ మొదలైనవారంతా అతడిని వదలకుండా అంటి పెట్టుకొనే వున్నారు.

# యాల్టా

రూజ్వెల్టునుగురించి జరిగే వాదోపవాదాలలో అతి తీవ్రంగా జరిగే వాటిలో, యాల్టాలో అతడి ప్రవర్తనను గురించినది ఒకటి.

మళ్ళీ, మిత్రమండలి ప్రధాన నాయకులు ముగ్గురూ కలవాలని రూజ్వెల్టు చాలా రోజులగా ఏర్పాట్లు చేస్తూనే వచ్చాడు. చాలారోజులు మంతనాలు జరిగిన తరువాత ముగ్గురు నాయకులూ క్రైమియాలోని యాల్టా నగరంలో కలుసుకోవడానికి నిర్ణయం జరిగింది. స్టాలిన్, రష్యానువిడిచి బయటికి రావడానికి అంగీకరించనందున, యాల్టాలో ముగ్గురు కలియడానికి రూజ్వెల్టు అంగీకరించాడు. అది చర్చిల్‌కు ఇష్టంలేదు. 1945 జనవరి 22 న రూజ్వెల్టు క్విన్సీ అనే ఓడలో అమెరికానుంచి బయలుదేరి, మాల్టాలో చర్చిల్‌ను కలుసుకొని అక్కడినుంచి ఫిబ్రవరి 3 తేదీన చర్చిల్‌తో కలిసి యాల్టాకు 1400 మైళ్ళు విమానంలో ప్రయాణం చేశాడు. ఆ సమావేశం ఫిబ్రవరి 11 దాకా జరిగింది. తమ ప్రభుత్వాల విదేశ విధాన శాఖల అధిపతులతో, ముగ్గురు నాయకులూ కలుసుకోవడం ఇదే తొలిసారి.

యాల్టాలో, రష్యాకు అనుకూలంగా రూజ్వెల్టు ప్రవర్తించాడనీ, స్టాలిన్ అడిగినదంతా ఇచ్చేశాడనీ, రూజ్వెల్టు ఒక కమ్యూనిస్టు అనీ అమెరికాలో కొంత విపరీతవాదం వుంది. ఆ వాదం ఎంత విపరీతమైనదో, అంత అసత్యమైనది కూడా.

యాల్టా నిర్ణయాలకు రూజ్వెల్టు ఎంతవరకు బాధ్యుడో, చర్చిల్ కూడా అంతవరకు బాధ్యుడనే విషయాన్ని ఈ విపరీతవాదులు మరిచిపోతున్నారు. కాని, లండనులో ప్రపంచజ్ఞానం వున్నవా డెవడుకూడా, చర్చిల్ కమ్యూనిస్టు అని అనడు. చర్చిల్ యాల్టాలో ఒప్పుకున్న నిర్ణయాలలో ఏదీ తన దేశానికి ద్రోహం చెయ్యడం అని ఎవరూ అనరు. కాని, అదే నిర్ణయాలకు రూజ్వెల్టును నిందించేవారు అమెరికాలో లేకపోలేదు. కాని, రూజ్వెల్టును ద్వేషించి అతడిని గురించి అసహ్య ప్రచారం చేస్తున్నవారు, వారు చెప్పే కారణాలకు రూజ్వెల్టుతో సమాన బాధ్యతగల చర్చిల్‌ను ప్రశంసించడం మాత్రం చాలా చిత్రం.

యాల్టా సమావేశం ప్రధానంగా మిలిటరీ విషయాలను నిర్ణయించడానికి జరిగింది. ఆ సమావేశంలో చర్చించడానికి ముందుగా నిర్ణయింపబడిన విషయాలు మూడు. అవి: (1) జర్మనీని ఓడించడానికి ఆఖరుఏర్పాట్లు చెయ్యడం; (2) జపానుపైన రష్యాయుద్ధం ప్రకటించడానికి షరతులను నిర్ణయించడం; (3) పోలెండు సరిహద్దుల నిర్ణయం మొదలుకొని యునైటెడ్ నేషన్సు నిర్మాణం వరకూ శాంతిస్థాపనకు సంబంధించిన అన్నివిషయాలను గురించీ ఒక విధానాన్ని తయారుచెయ్యడం.

రూజ్వెల్టు తను చేస్తున్నపని ఫలితాలను గురించి ఎక్కువ ఆశ పెట్టుకోవడంలో కొంత పొరపాటు పడివుండవచ్చును. అలాటి పొరపాట్లు చాలామంది చేస్తారు; చేశారు. తన శక్తినిగురించి అతడికి అతిశయాభిప్రాయాలు వుండేవి. అతడు యాల్టా వెళ్ళబోయేముందు "స్టాలిన్ చాలా మొండికేసి బేరం సాగిస్తాడు జాగ్రత్తగా వుండండి," అని ఒక మిత్రుడు సలహాఇస్తే రూజ్వెల్టు ఇలా జవాబుచెప్పాడు. "రూజ్వెల్టు చాలా మొండికేసి బేరం సాగిస్తాడు. జాగ్రత్తగా వుండమని స్టాలిన్‌కు ఎవరైనా చెపితే బాగుండును. అందరూ నన్నుచూసి జాలిపడతారు గాని ఒక్కరైనా ఒక్కసారైనా చర్చిల్‌నూ, స్టాలిన్‌నూ చూసి జాలిపడరేమి? నాతో బేరం చెయ్యడం వాళ్ళకీ కష్టమే." దీనినిబట్టి తనశక్తిలో అతడికిగల అపారమైన నమ్మకం స్పష్టమౌతున్నది.

బహుశా, రూజ్వెల్టు ఇంకా కొంతకాలం బ్రతికివుండి తాను పునాదులు వేసిన శాంతి, స్థిరంగా నిలబడినదా లేదా అని చూడడానికి అతడికి అవకాశం వున్నట్లయితే, ఈనాడు ప్రపంచ రాజకీయాలు ఇప్పుడున్నంత అధ్వాన్నస్థితిలో వుండేవి కావేమో! ఏమయినా, ఒక్క విషయంమాత్రం నిజం. అతడు నిర్వహించిన బాధ్యతలనూ, అతడు ప్రదర్శించిన నాయకత్వాన్నీ మళ్ళీ ప్రపంచానికి యివ్వగలవ్యక్తి, అతడి అనంతరం ఇంతవరకు కనపడలేదు.

యాల్టా సమావేశానికి వచ్చిన రూజ్వెల్టును చూసి, స్టాలిన్ నిర్ఘాంతపోయాడు. టెహరాన్ సమావేశంనాటికీ, యాల్టా సమావేశం నాటికీ రూజ్వెల్టు చాలా పాలిపోయి, చిక్కి శల్యంగా వున్నాడు. రూజ్వెల్టు అంతనీరస స్థితిలో వున్నాడని తనకు తెలిస్తే, రష్యాను వదలి ఇంకొక చోటికి

రాననే నియమాన్ని వదలి, రూజ్వెల్టును కలుసుకోడానికి అమెరికాకు సమీపంలో మరెక్కడికైనా వచ్చేవాడినని స్టాలిన్ అన్నాడు.

“మన ఇద్దరమూ రాలిపోతే, ఏమవుతుంది,” అని రూజ్వెల్టు స్టాలిన్‌ను అడిగాడు. తన తరువాత, రష్యాలో రాజ్యతంత్రాన్ని సాగించడానికి మరొకడు సిద్ధంగా వున్నాడనీ, రష్యాకు తన అనంతరం నాయకుడు వుండడేమో అనే భయానికి అవకాశం లేదనీ స్టాలిన్ బదులు చెప్పాడు. ఎంచేతనోగాని, ఆ నాయకుడు ఎవరని, రూజ్వెల్టు అడగలేదు. అతడెవరో తెలుసుకుందామనే కుతూహలం, ఈ రోజు కూడా ప్రపంచంలో అందరికీ వుంది.

యాల్టా సమావేశంలో, అమెరికా, బ్రిటనులు రష్యాకు అపరిమితమైన ప్రత్యేక సదుపాయాలను ఇచ్చే నిర్ణయాలు చేశాయని ఒక నింద వుంది. కాని, రష్యాకూడా అమెరికా బ్రిటనులకు కొన్ని సదుపాయాలను ఇచ్చే నిర్ణయాలకు ఒప్పుకున్నదనే విషయాన్ని చాలామంది మరిచిపోతున్నారు. యాల్టా సమావేశ నిర్ణయాలు, రష్యాకు గొప్ప విజయమని రూజ్వెల్టు విరోధులు చెప్పే మాటలు నిజంకావు.

యునైటెడ్ నేషన్సులో రష్యాకు మూడు స్థానాలు—రష్యాకు ఒకటీ, యుక్రేనుకు ఒకటీ, బైలో రష్యాకు ఒకటీ ఇవ్వడంలో రూజ్వెల్టు చాలా పొరపాటు చేశాడని అతడిని కొంతమంది నిందిస్తున్నారు. అసలు రష్యనులు, రష్యాలోని పదహారు రాష్ట్రాలకూ ఒక్కొక్కటి చొప్పున, 16 స్థానాలు కావాలని అడిగారు. అప్పుడు రూజ్వెల్టు అమెరికాలోని 48 రాష్ట్రాలకూ తలా ఒక స్థానం చొప్పున అమెరికాకు 48 స్థానాలు ఇచ్చేటట్లయితే, రష్యాకు 16 స్థానాలను సంతోషంతో ఇస్తానని జవాబు చెప్పాడు. బ్రిటిషు సామ్రాజ్యంలోని వివిధ దేశాలకు ఇచ్చిన స్థానాల వల్ల, బ్రిటనుకు ఒకటి కంటె ఎక్కువ స్థానాలు వచ్చినందువల్ల, రష్యాకు మరొక రెండు స్థానాలను ఇవ్వడంలో రూజ్వెల్టు అభ్యంతరం చెప్పలేకపోయాడు. కాని, అందరికీ కోపంవచ్చే సంగతి ఏమిటంటే, ఎందుచేతనోగాని, రూజ్వెల్టు ఈ ఒప్పందాన్ని బయట పెట్టకుండా చాలా రహస్యంగా దాచి పెట్టాడు. రహస్యంగా దాచి పెట్టడం వల్ల, దానిలో ఏదో కాపట్యం వుండివుంటుందని అందరూ అనుమానించారు.

యాల్టాలో అతడుపడిన శ్రమకు ఫలితంగా రూజ్వెల్టు ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. స్వదేశానికి తిరిగి వస్తూవుండగా ఓడలోనే అతడి ఆరోగ్యం దెబ్బతిన్న సూచనలు కనిపించాయి. అతడుపడ్డ శ్రమఫలితంగా మనిషి చాలా నీరసించిపోయి అప్పుడప్పుడు సొమ్మసిలినట్లు పడుకొని వుండేవాడు. అలాటి స్థితిలో అతడిని ఎవరైనా ఏమైనా అడిగితే ఆ ప్రశ్నలకు అవ్యక్త సమాధానాలు కూడా చెప్పేవాడు.

## ఆఖరు రోజులు

రూజ్వెల్టు ఆఖరు రోజులలో అతడి ఆరోగ్యాన్ని గురించి, అమెరికాలోని పత్రికలు చాలా అసహ్యమైన అబద్ధాలు ప్రకటించాయి.

ఒకరోజున రూజ్వెల్టుకు గుండె జబ్బువల్ల స్పృహతప్పి పోయిందని ఒక పత్రిక ప్రకటించింది. కాని, ఆ రోజున కెనడా గవర్నర్ జనరల్ అతడి భార్యకూడా రూజ్వెల్టు అతిథులుగా వైట్ హౌసులో వున్నారు.

రూజ్వెల్టు చనిపోయినప్పుడు కలిగిన రక్తపుపోటు దెబ్బతప్ప, అంతకు పూర్వం ఎప్పుడూ అతడు రక్తపుపోటు దెబ్బవల్ల బాధపడలేదు. చివరిసారివచ్చిన ఆ దెబ్బకూడా, ఆకస్మికంగా వచ్చిందిగాని, అలా జరుగుతుందని అతడి ఇంటిలోని ఆప్తులుగాని, అతడి వైద్యులుగాని ఎవరూ అనుకోలేదు. మెదడులోని రక్తనాళాలు పగిలి, రక్తం చిమ్మినందున అతడు మరణించాడు. ఎక్కువ విశ్రాంతి తీసుకొని శ్రమను తగ్గించు కొన్నట్లయితే, ఇంకా ఎన్నో సంవత్సరాలు అతడు జీవించడానికి అవకాశం వుంది.

1945 ఏప్రిల్ 12 తేదీన రూజ్వెల్టు వార్మ్‌స్ప్రింగ్స్‌లో చనిపోయాడు. కాని 11 తేదీవరకు అతడు తన మామూలు కార్యక్రమాలను నిర్వహిస్తూనే వచ్చాడు.

జనవరి 3 తేదీన కాంగ్రెసుకు బడ్జెటు ఉపన్యాసాన్ని పంపించాడు. తరువాత యాల్టాకు వెళ్ళివచ్చాడు. శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగే యునైటెట్ నేషన్సు సమావేశానికి రమ్మని వివిధ దేశాలకు ఆహ్వానాలను ఫిబ్రవరి 12 న పంపించాడు. యాల్టా సమావేశ ఫలితాలనుగురించి మార్చి 1 న స్వయంగా కాంగ్రెసులో ఉపన్యసించాడు. కూర్చుని తన ఉపన్యాసాన్ని చదువుతూ, తన ఆరోగ్యం అంత బాగాలేదని అతడు

చెప్పాడు. బహిరంగంగా ఉపన్యాసాలలో తన అనారోగ్య స్థితినిగురించి అతడు ప్రస్తావించడం, అదే మొట్ట మొదటిసారి.

"కూచుని ఉపన్యాసాన్ని చదువుతున్నందుకు క్షమించండి. పది పౌనుల బరువుగల ఉక్కు దట్టీలు వెయ్యవలసిన అవసరం లేకుండా వుంటే, నాకు కొంత ప్రయాస తగ్గుతుంది," అని అతడు అన్నాడు.

అతడు ఆ వుపన్యాసాన్ని చదువుతూ వున్నప్పుడు అతడి కంఠ ధ్వనిలో మునుపటి గాంభీర్యం లేదు. బలహీనంగా ఆపి, ఆపి, అతడు ఆ వుపన్యాసాన్ని చదివాడు. చదవడంలో వ్రాసినదానిని వ్రాసినట్టుగాక 43 చోట్ల వేరే పదాలు వుపయోగించాడు. ముఖ్యమైన వుపన్యాసాన్ని చేసేటప్పుడు వ్రాసినదానిలో ఇంత ఎక్కువగా మార్పులు చెయ్యడం ఇదివరకు ఎప్పుడూ అతడు చెయ్యలేదు. ఇదంతా చూసినవారికి అతడి ఆరోగ్యాన్నిగురించి కలవరపాటు కలిగింది.

అయినా, అతడికి అత్యంత సమీపంలో హమేషా వుండేవారెవరూ అతడి ఆరోగ్యం ప్రమాదస్థితిలో వుందని అనుకోలేదు. అతడి మరణానికి కొద్ది రోజులపూర్వం అతడి ఆరోగ్యం బాగుందనీ, అతడి బరువుకూడా కొంచెం ఎక్కువ అయిందనీ ఎలియనార్ తనకొడుకు ఫ్రాంక్లిన్‌కు వ్రాసింది. యుద్ధరంగంలోవున్న ఫ్రాంక్లిన్‌కు ఆ వుత్తరం రూజ్వెల్టు చనిపోయిన కొద్దిరోజుల తరువాత అందింది.

అయితే, మరణానికిపూర్వం కొద్ది రోజులు ముందునుంచీ అతడు చాలా నీరసస్థితిలో వున్నమాటమాత్రం వాస్తవం. ఉత్తరాలు చదువు కుంటూ మధ్యలో అతడు హఠాత్తుగా నిద్రపోయేవాడట. ఎవరితోనైనా మాట్లాడుతూ వున్నప్పుడు మధ్యలో ఏ సంగతినిగురించి మాట్లాడుతూ వున్నదీ మరచిపోయి తెల్లమొగం పెట్టి ఎదుటివారిని చూడడం కొంతసేపటికి తెప్పరిల్లుకోవడం కూడా జరిగేదట. ఒక మాటకు మరొకమాట చెప్పడం, ఒక మనిషి పేరుకు మరొకపేరుతో అతడిని పిలవడంకూడా రెండు మూడు సార్లు సంభవించిందట.

ఒక రోజు మంచి హుషారుగా చాలా ఓపికతో కనిపించేవాడు; మరొక రోజు ఏ మాత్రం ఓపికలేక చాలా నీరసించినట్టు కనిపించేవాడు. యాల్టానుంచి తిరిగి అమెరికాకు వచ్చేటప్పుడు ఓడలో పా వాట్సన్

చనిపోవడం రూజ్వెల్టుకు ఒక గొడ్డలిపెట్టు అయింది. బాగా ఆరోగ్యంతోనే వున్నట్టు కనపడుతూవున్న చిరకాల మిత్రుడూ, సహకారీ అయిన వాట్సన్ హఠాత్తుగా మరణించేసరికి రూజ్వెల్టుగుండె చెదిరిపోయింది.

## కడపటి రోజు

రూజ్వెల్టు 1945 మార్చి 29 న వాషింగ్టన్‌నుంచి వాంస్ప్రింగ్స్‌కు వెళ్ళాడు. ఆ ప్రయాణం కేవలం మామూలుగా అతడు వాంస్ప్రింగ్స్‌కు వెళ్ళిన ధోరణిలోనే జరిగింది. ఆ ప్రయాణమే అతడి కడపటి ప్రయాణం అవుతుందని ఎవరూ అనుకోలేదు. ప్రయాణం చేసినప్పుడు అతడి ఆరోగ్యం కూడా మామూలుగానే వుంది. దానికి దాఖలా ఏమిటంటే, రూజ్వెల్టు ప్రధాన వైద్యుడుకూడా అతడితో వాంస్ప్రింగ్స్‌కు వెళ్ళలేదు. రూజ్వెల్టు సతి ఎలియనార్ కూడా భర్తతో ప్రయాణం చెయ్యలేదు.

వాంస్ప్రింగ్స్ చేరిన తరువాత రూజ్వెల్టు మామూలు ఆరోగ్యంతోనే వున్నాడు. ఏప్రిల్ 25 తేదీన తాను ప్రారంభించబోయే శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశానికి కార్యక్రమాన్ని తయారు చెయ్యడంలో నిమగ్నుడై వున్నాడు.

ఏప్రిల్ 11 తేదీన హెన్రి మోర్గెంతో ప్రెసిడెంటుగారి సాయంకాలానికి వాంస్ప్రింగ్స్‌కు వచ్చాడు. ఇద్దరూ ఆనాడు చాలా సేపు సరదాగా కబుర్లు చెప్పుకున్నారు. ఆ రోజు రాత్రి రూజ్వెల్టు మామూలు ప్రకారమే నిద్రపోయాడు.

మరునాడు ఏప్రిల్ 12 తేదీన ఉదయం రూజ్వెల్టు కొద్దిగా తలనొప్పిగా వుందన్నాడు. అది సాధారణమైన తలనొప్పేగాని మరేమీ కాదని అందరూ అనుకున్నారు. ఉదయం 9 30 గంటలకు డాక్టర్ బ్రుయెన్ రూజ్వెల్టును చూసి, అతడి ఆరోగ్యం మామూలు ప్రకారమే వుందని వాషింగ్టన్‌లోని అడ్మిరల్ మెకింటైర్‌కు టెలిఫోనులో చెప్పాడు. తరువాత రూజ్వెల్టు రాచకార్యాలకు సంబంధించిన పత్రాలను చదివి, వాటిమీద సంతకాలు పెట్టాడు. ప్రెసిడెంటు సంతకాన్ని అద్దుడు కాగితంతో అద్దడం సాంప్రదాయానికి విరుద్ధం. అందుచేత, అతను సంతకాలు

పెట్టిన కాగితాలను, సంతకం పెట్టిన సిరా ఆరడానికి గరిసిండా పరిచాడు అతడి గుమస్తా.

తరువాత రూజ్వెల్టు టెలిఫోనులో వాషింగ్టన్‌లోని ఫ్రాంక్ వాకర్‌తో మాట్లాడి, జరుగబోయే యునైటెడ్ నేషన్సుకు సంబంధించిన పోస్టు బిళ్ళలను తనకు సంపాదించి పెట్టమని అడిగాడు..

తరువాత అతడి చిత్రాన్ని వ్రాస్తున్న మాదాం షుమెటాఫ్ ప్రెసిడెంటు గదిలోకి వచ్చి, ప్రెసిడెంటు చిత్రాన్ని వ్రాస్తూవుంది. ఆమె చిత్రాన్ని వ్రాస్తూవుండగా, అతడు రాజకీయ పత్రాలను వేటినో చదువుతున్నాడు.

ఉన్నట్టువుండి, రూజ్వెల్టు హఠాత్తుగా మూలిగి, తన ఎడమచేతితో తన నుదుటిమీద రాసుకుంటూ, కణతలను నొక్కుకుంటూ, స్పృహతప్పి పడిపోయాడు. ఇదిచూసి, మదాం షుమెటాఫ్ కెవ్వున కేకవేసి బయటికి పరుగెత్తి అందరినీ పిలిచింది. రూజ్వెల్టు నౌకర్లు గబగబా లోపలికి వచ్చారు. "చాలా ఘోరమైన తలనొప్పిగా వుంది," అని అతడు హీనస్వరంతో అన్నాడట.. ఇద్దరు నౌకర్లు రూజ్వెల్టును పడకగదిలోకి తీసుకొని వెళ్ళి పడుకో బెట్టారు.

మరొక నౌకరు, వాంస్ప్రింగ్స్ జలకుండంలో స్నానం చేస్తున్న డాక్టర్ బ్రుయెన్‌ను పిలుచుకొని రావడానికి పరుగెత్తాడు. డాక్టర్ బ్రుయెన్ వచ్చేసరికి ప్రెసిడెంటుకు స్పృహలేదు. ఆ డాక్టరు తాను చెయ్యగలిగినదంతా చేశాడు. వాషింగ్టన్‌లో మెకింటైర్‌కు టెలిఫోనులో సమాచారం తెలియ చేశాడు.

రూజ్వెల్టుకు మెదడులోని రక్తనాళం బద్దలై, రక్తం చిమ్మి చనిపోయాడు. అతడు చనిపోయినప్పుడు మధ్యాహ్నం 3 గంటల 35 నిమిసాలు అయింది.

చనిపోయినా అతడి ముఖం ప్రశాంతంతో నిండివుంది. మరణ వేదనతో కొట్టుకున్న చిహ్నాలేవీ అతడి ముఖం మీద లేవు.

# మరణానంతరం

రూజ్వెల్టు శవాన్ని ఖననంచెయ్యడం పెద్ద కార్యకలాపం ఏమీ లేకుండా, వీలైనంత నిరాడంబరంగా జరిగిపోవాలని అతడి కుటుంబం నిశ్చయించింది.

రూజ్వెల్టు శవాన్ని వాంస్ప్రింగ్స్‌లో వుండగానే పేటికలో పెట్టి, వాషింగ్టన్‌కు తీసుకొని వచ్చి, అక్కడనుంచి హైడ్ పార్కుకు తీసుకొని వెళ్ళి అక్కడ ఖననం చెయ్యడం జరిగింది. ఈ మధ్యలో ఎక్కడా ఆ పేటిక మూతను తెరవడం జరగలేదు.

ఇదంతా చూసి, కొందరు బుద్ధిహీనులు కొన్ని అసత్య ప్రచారాలు సాగించారు. రూజ్వెల్టు తనను తానే రివాల్వరుతో ప్రేల్చుకొని ఆత్మహత్య చేసుకున్నాడనీ, ఒక కొండశిఖరం ఎక్కి అక్కడినుంచి క్రిందకు దూకి ఆత్మహత్య చేసుకున్నాడనీ, నిజంగా రూజ్వెల్టు మరణించలేదనీ, పిచ్చియెక్కినందున అతణ్ణి రహస్యంగా ఒక పిచ్చి ఆస్పత్రిలో పెట్టి అతడు చనిపోయినట్లు ప్రకటించారనీ రకరకాల అసత్య ప్రచారాలు జరిగాయి.

ఎక్కువ శ్రమపడవద్దని వైద్యులూ, ఆప్తులూ చెప్పినా సరకు చెయ్యక రూజ్వెల్టు రాచకార్యాల నిర్వహణంలో తనవయస్సుకూ, శక్తికీ మించిన శ్రమ పడి తన ప్రాణాలకు ముప్పు తెచ్చుకున్నాడు. ఆ రోజులలో అధమం మూడు నెలల పాటు సంపూర్ణమైన విశ్రాంతిని పొందినట్లయితే, రూజ్వెల్టు ప్రాణాలు దక్కేవని డాక్టర్లు చాలా మంది అభిప్రాయ పడ్డారు. ప్రపంచ యుద్ధపు నట్టనడుమ, అమెరికా ప్రెసిడెంటుకి మూడు నెలల విశ్రాంతి ఎలా దొరుకుతుంది !

రూజ్వెల్టు మరణ వార్త విని అమెరికా దేశమేగాక, ప్రపంచమంతా దుఃఖించింది.

అయితే, రూజ్వెల్టు మరణించినప్పటికీ, అతడు ప్రపంచానికి చేసిన సేవ మాత్రం ఎన్నటికీ మాసిపోదు. అతడు నిజంగా అమ[illegible]

 మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B151 |
| పుస్తకం పేరు | రూజ్వెల్ట్ |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 291 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 288 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |